ఓమ్.

# విశ్వకర్మబ్రాహ్మణ వంశాగమము





సంగ్రహీత,

వడ్డెపాటి నిరంజనశాస్త్రి.

ఓమ్.

# విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము.

సంగ్రహీత,

వడ్డెపాటి నిరంజన శాస్త్రి,

ఆంధ్రోపాధ్యాయుడు,

స్థానికసంఘోన్నతపాఠశాల, దుగ్గిరాల. (గుంటూరు జిల్లా).

ప్రథమ ముద్రణము ౨౦౦౦ ప్రతులు.

తెనాలి, రామకృష్ణ ముద్రాలయమున ముద్రితము.

1934



[మూల్యము 2—8—0





# కృతిసమర్పణమ్.

శ్లో॥ విశ్వానుచక్షు రుతదిగ్వృత విశ్వతోముఖో

యో రక్షితాఖిలజగ త్పరవిశ్వకృత్ప్రభుః,

తస్యామలాంఘ్రిసరసీరుహ రేణుసన్నిభా

వంశాగమాఖ్యకృతిరద్య సమర్పితామయా ॥

ఇత్థం సంగ్రహీతా.



ఓమ్.

విశ్వకర్మాదిశాం పతిస్సనః పశూన్ పాతుసోస్మాన్ పాతుతస్మైనమః

# ఉపోద్ఘాతము.



## గ్రంథోత్పాదనకుఁ గారణములు.

సకల జగన్నిర్మాతయు, సర్వప్రపంచ రక్షాపరాయణుఁడు నగు పరమేశ్వరుని లీల లవలీలలు, ఊహ లత్యూహములు, ఉద్దేశము లత్యుద్దేశ్యములు, అవతారము లపారములు. అభిధానము లపరిమితానుసంధానములు. ఆదేవతారాధ్య వివరింప నిగమము లగమము లంతనైనను గమింపఁ బ్రయత్నించుచునే యున్నయవి. ఋషులు వికలితద్విషులైనను నిశ్చయింప సాధ్యముగాక గుహలఁ గూరుకొనుచున్నారు. దేవతలు, యక్షులు, కిన్నరులు, కింపురుషులు, మున్నగు నిర్జరగణమునకైన ననిర్వాచ్యత సమకూరుచున్నది. ఈపరిస్థితిలో మానవగణ మెంతమాత్ర మియ్యకొనును? మతత్రియాంతర్గతులగు భారతీయులకు వేదములు పరమ ప్రమాణములు. తదనుసరణములగు స్మృతులు షడంగములును బ్రమాణీకృతములే. పరమేశ్వరనామము లనంతములని పూర్వగదితములైనను వానిలోఁ బ్రప్రధానము విశ్వకర్మవాచ్యతయని వేదములు వాదించుచున్నవి. నిరుక్తము నిర్వచించుచున్నది. భాష్యము భూష్య మొనర్చుచున్నయది. పురాణము లితిహాసములు చరిత్రలు గాథలు మున్నగునవెన్నియో యెన్నుచునే యున్నయవి. ఇటులయినను నేమిప్రయోజనము? ఆవేదగమ్యు ప్రధాననామము సుప్రసిద్ధివడయుట కేలొకో కొంకువాటిల్లినది. "సీహారేణ ప్రావృతాజల్ప్యాచ" అను వేదసూక్తిమంచుచేఁ గప్పఁబడినట్లున్నదనుట జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. జగత్కర్తయొక్క ప్రప్రధాననామ ముదాసీనింపఁబడియె. ఇతరనామములు ప్రాసిద్ధ్యమనుభవించె. ఇందుచేఁ దద్జ్ఞులకు మానసవ్యథ చేకూరుననుట నిర్వివాదాంశముకదా? ఆవిశ్వకర్మ పరమేశ్వరుచరిత్రము లుత్కటములై యనంతవాఙ్మయ సంచారములై విలసిల్లకపోయెను. అదియె యీగ్రంథోత్పాదనకుఁ బ్రథమకారణము.

మఱియుఁ బ్రపంచమంతయుఁ బావనశిల్పములచేఁ బ్రవర్తింపఁ బడుచున్నది. అయ్యది సృష్ట్యాదినుండియు నిర్వర్తింపఁబడుచుండెననుటలో నభ్యంతరము గానరాదు. జగత్కర్తకు సృష్టిశిల్పము నిత్యకార్యము. తదంతరాయసమయములయందును, దదభివృద్ధికాలములయందును, స్వాంశచే నవతరించుటయు, లోపముఁ బూరించుటయు

సహజసిద్ధము. స్వాంశావతీర్ణతచేతను స్వనిర్దిష్ట కర్మాచరణబద్ధతచేతను బ్రత్యేకజాతి సంఘము వెలయించుటయు నప్పరమేశునిచ్ఛావిశేషమే. అయ్యదియె విశ్వకర్మబ్రాహ్మణ్యము. అద్దానికె జగత్సృజనాపరాయణత. అందె విశ్వకర్మాంశభరులగు పురుషులుదయించుట. అవ్వారలె లోకములసృజించిరి. పత్తనముల నిర్మించిరి. యజ్ఞముల నిర్వహించిరి. క్రతూపకరణములఁ గై సేసిరి. యాగార్త్విక్కరణముల స్వీకరించిరి. అధ్వరరథంబుల నాపాదించిరి. దైవతసృష్టియొనర్చిరి. ఆస్తిక్య ముజ్జీవింపఁజేసిరి. యుద్ధోపకరణంబులగు శస్త్రాస్త్రకవచాదులు కల్పించిరి. ప్రాకార హర్మ్యసౌధసింహాసనమకుటాది ఘటనలచే రాజులకు రాజ్యస్థాపనమొనర్చిరి. ఆర్షసభల నధిపతులైరి. రాజసభల సన్మానితులైరి. అద్భుదసంఖ్యాక శిల్పశాస్త్రముల రచించిరి. ఆథర్వణవిద్య హస్తవాక్కుల నలంకరించిరి. ఇట్లూర్జితులయ్యుఁ గాలక్రమమున నవ్విశ్వకర్మబ్రాహ్మణవంశ్యుల యుత్కృష్టత వెనుకంజవైచెను. భారతీయ రాజ్యాంగముల ద్వైధీభావమేర్పడెను. శిల్పాంగమంత్రాంగముల కన్యోన్యవైషమ్యము హెచ్చయ్యెను. కరకళానిపుణులగు శిల్పవర్యుల మేధాశక్తి హస్తములయందె నెలకొనెను. శిల్పవాఙ్మయము సన్నగిల్లెను. మంత్రాంగమువారి మంత్రాలోచన మెండయ్యెను. ప్రక్షిప్తగ్రంథభాగంబులు ప్రసన్నతఁజెందెను. విశ్వబ్రాహ్మణుల నథఃపతన ప్రయత్న మొనర్చువీరులు విజయులైరి. కులనామ వ్యవహారముకంటె వృత్తినామవ్యవహారమునకుఁ బ్రసిద్ధి మొదవె. ఇయ్యది రెండవకారణము.

క్రమక్రమముగా నిట్టిదుస్థితి పిక్కటిల్లి పెచ్చురేగినది. జనసామాన్యమునకెగాక పండితులకుఁగూడఁ బౌరుషేయుల పూర్వస్థితి గానరాకుండెను. ఇందుల కుదాహరణములొక కొన్ని తలపుగొల్పినవి. టి. సుబ్బారాయశాస్త్రి అనువారు సుప్రసిద్ధులు; మైసూరు సంస్థానాస్థాన విద్వాంసులు. వారితరశాస్త్రములెగాక విమానాధికరణాది శిల్పశాస్త్రములు పెక్కులు చదివియున్నారు. వారు జీవించియుండు నొకప్పుడు శిల్పశాస్త్రాన్వేషణకై వారిని సందర్శింపఁదటస్థించె. శిల్పశాస్త్ర శిల్పిప్రశంసలు బహుకాలము ప్రస్తావింపఁ బడియె. ఆసందర్భములో సానగాదులు శిల్పులు గాని ఋషులుగారని నొక్కి వక్కాణించిరి. వేదపురాణ వచనములు ప్రత్యక్షీకరించిన తరువాత నెట్టకేలకు ఋషులని యంగీకరించిరి. మఱియొకతూరి బదునైదు వత్సరముల పూర్వము చెన్నపురి యున్నతన్యాయస్థానమున నొక వ్యాజ్యము విచారితమయ్యె. అందు విశ్వకర్మకులస్థులు ద్విజులా! యను సారాంశము ప్రశ్నీకృతమయ్యెను. అద్దానిలో మహామహోపాధ్యాయ లక్షణసూరి యను పండితుఁడు సాక్ష్యమీవచ్చెను. ఆ సూరి వేదములన్నిటిని సభాష్యములుగా జదివితినని ప్రగల్భత వెల్లడించె. విశ్వకర్మ

యన దేవశిల్పిగాని ఋషిగాఁడనియు, నందుచే మానవకూటస్థుఁడగుట తటస్థింపదని యు నుద్ఘోషించె. అనేక శుక్ల కృష్ణ యజుర్వాక్యములను, నిరుక్తప్రమాణములను జూపి ప్రశ్నింప నిర్విణ్ణతఁబొందె. తలవెడలిన విచక్షణులకె యిట్లు కన్నొంగిన గ్రంథస్థ విశ్వబ్రాహ్మణపరిస్థితు లేరికి గోచరించు? ఇది యొక కారణము.

ఇఁక నాంధ్రదేశ విశ్వబ్రాహ్మణులో తమ చరిత్రలఁ దాము దెలిసికొనుటకు సాధారణముగా నేమఱిల్లిరి. చదువుకొందమన్నను దమ చరిత్రల విశదీకరించు గ్రంథ ములు దెనుఁగులో నపురూపములయ్యె. సంస్కృతభాషాసాధ్యములగు వేదభాష్యా దులును బెక్కు పురాణములును నాగరలిపియందె ముద్రితములయ్యె. నాగరఖండ విశ్వకర్మోపాఖ్యానము, భూఖండ విశ్వకర్మోపాఖ్యానము, మూలస్తంభపురాణము, సంస్కృత విశ్వకర్మపురాణము, దెలుఁగు లిపిలో నముద్రితములయ్యె. ఆంధ్రి నాగర ఖండ విశ్వకర్మపురాణ రథకారాధికరణ విచారములు పునర్ముద్రితములుగాక యలభ్య ములయ్యె. విశ్వకర్మాగమ విశ్వవిద్యాభరణ గార్గేయాగమాదులును, అసంఖ్యాక శిల్పశాస్త్రములు నాంధ్రిభాషాముద్రణ విముఖములయ్యె. చరిత్రలెట్లు సాధ్యమగును? ప్రత్యేకచరిత్రరూపముల లేని యీగ్రంథభాగము లతిప్రయత్నమునఁగాని సాధ్యము లగునా? ఇంటిమూలల నున్న నేపదార్థమునైన నన్వేషింపక గానుపించునా? కావునఁ బూర్ణప్రయత్న పరిశీలనచేతఁగాని తదభిమానులకును బండితులకును సాధ్యపడవని వేఱబోధింప ననావశ్యముగదా? ఇది మఱియొక కారణము.

ఈకారణములె గాక, యసమర్థుల చెంగటఁ గుత్సితవాదములు చెలరేగె. పాక్షికప్రసంగములు పైకిఁ బ్రాఁకె. పత్రికాహేళనలొక కొంతసందుగొనిమె. న్యాయ స్థాన విచారణలందందతలసూపె, నివారణోపాయ మనన్యమై సవిమర్శక చరిత్రగ్రంథ రచనకుఁ బురికొల్పె.

### గ్రంథరచనా ప్రయత్నము.

ఈగ్రంథరచనా ప్రయత్నము ప్రబోధినీ పత్రికా ప్రకటనారంభమునుండి హృదయవీథిని రవులుకొనిమె. కాని సమర్థులగు పండితు లిక్కార్యము సాధింపఁగల రని వెనుకంజ గడంగితి. శిల్పశాస్త్ర సంపాదనకై యనేకపత్తన గ్రామముల పుస్తక భాండాగారముల మహాజనసభవారి ప్రేరణచే నన్వేషించితిని. అచ్చటచ్చట నీగ్రంథ రచనా విషయము ముచ్చటించుట తటస్థించినది. కాని పెక్కండ్రు పండితవర్యులు రచనకుఁ దామియ్యకొనక నన్నే ప్రేఱేచిరి; ధనాభావముచే గ్రంథశోధనకు నవ కాశము చిక్కదయ్యె. ఈవంశాగమ గ్రంథరచనావిశేషము పెక్కుచోట్లఁ బ్రశం సితముసేయుచునే గడపితిని. అందంద ప్రోత్సాహములు పెక్కండ్రు సలిపిరి. బ్రహ్మశ్రీ

బి. జి. శంకరయ్య ఎమ్ ఏ. గారి ప్రోత్సాహమున మైసూరుపుర విశ్వబ్రాహ్మణులును, కోలారుజిల్లా, ఉరిగం గ్రామ నివాసులు బ్రహ్మశ్రీ వీరప్పాచార్యులుగారును, తెనాలిపురనివాస విశ్వబ్రాహ్మణులును నొక కొంత ద్రవ్యరూపదోహదముగూడఁ బ్రిపథమమున నొసఁగి ప్రోత్సాహపరచిరి. అట్లయినను రచనావకాశము చాలినది గాదు.

సంశాగమ గ్రంథరచనా ప్రోత్సాహ సంఘము.

అనంతరమొక కొంతకాలమునకు నన్నుఁ బ్రోత్సహింపఁదలఁచి కొందఱు మహనీయులు పట్టువట్టిరి. అందుచే దదభిమానశీలురెల్లరు బందరుపురమున బ్రహ్మశ్రీ కొండిపర్తి వీరబ్రహ్మముగారి భవనమున (192వసం॥ జనవరి 2వ తారీఖున) బ్రహ్మశ్రీ కొండిపర్తి వీరభద్రాచార్యులవారి యాధిపత్యమున సమావేశమయిరి. విశ్వకర్మ బ్రాహ్మణవంశాగమ గ్రంథరచనా ప్రోత్సాహసంఘమునుపేరిట నొక సంఘమేర్పరచిరి. ఆసంఘమున కధ్యక్షులుగా బ్రహ్మశ్రీ కందుకూరు మల్లికార్జునాచార్యులు, బి. ఏ., డెప్యూటికలెక్టరుగారును, కార్యదర్శిగా బ్రహ్మశ్రీ కొండిపర్తి వీరబ్రహ్మముగారును నుండఁ బ్రార్థితులైరి. అం దిరువదిమంది సాంఘికులుండవలెననిరి. అందొక్కొ రొక్క రిరువదియైదు రూప్యము లొసఁగవలెననియుఁ దీర్మానించిరి. ఆధనము నప్పుడప్పుడు గ్రంథపరిశోధనకై దేశాటనమున కేగునప్పుడు ప్రయాణవ్యయమునకును, రచనావకాశమునకును, నాకొసంగ నిశ్చయించిరి. శ్రీమల్లికార్జునాచార్యులుగారి ప్రోత్సాహమువలనను, గ్రంథరచనయందున్న పూర్ణాభిమానమువలనను సాంఘికు లిరువదిమందికి, నిరువదియిద్ద తేర్పడిరి. ధనము వెనువెంట నిలువఁబెట్టిరి. పూర్ణప్రోత్సాహము నాకొసఁగ దొరకొనిరి.

అట్లయినను వెనువెంట గ్రంథరచనాపూర్తి కనవకాశములభించె. గ్రంథశోధనకు దేశాటనమొనర్ప నత్యావసరమయ్యె. ఉన్నతపాఠశాలయందలి నాకున్న యుపాధ్యాయవృత్తి విచ్చలవిడికిఁ బ్రతిబంధమయ్యె. అటుల లభించినను, అనుమానితములైనపుడెల్ల పూనా, చెన్నపురి, మైసూరు, మున్నగు దూరపట్టణముల పుస్తకభాండాగారముల వెదకివెదకి పరిశీలించితి. పురాతనగ్రంథములు కలవనుభ్రాంతిచే పెక్కుగ్రామములకుఁ బురములకుఁ బోయివచ్చితి. శిల్పశాస్త్రాదులందంద కానవచ్చినవి. కాని పెక్కులుత్రుటితములు. నాయొనర్చిన పర్యటనములో, పాలకొల్లు, రేలంగి, అత్తిలి, యేలూరుపురముల నాకొక కొంత ద్రవ్యరూప దోహదమొసంగి యందలి విశ్వబ్రాహ్మణసభ్యులు కృతకృత్యులైరి. వారందఱికి నాకృతజ్ఞత నాజన్మాంతమని విన్నవింపఁగలను.

## ముద్రాపణయత్నము.

గ్రంథరచనాప్రోత్సాహ సంఘమువారు నన్నెంతత్వరపెట్టినను బ్రారంభించిన యైదువత్సరములకుఁగాని పూర్తిగాదయ్యె. పూర్తియయినవెంటనే బందరులో జరిగిన శ్రీ. కృ. గుం. వి. మహాజనసభవారికి సమర్పించితి. వారేముద్రించవలెనని పెద్దయాలోచనచేసిరి. తుదకేనూఱురూప్యములు గ్రంథముద్రణానంతరమున బహుమానమొసఁగనిశ్చయించిరి. ఇఁకముద్రణమున కఖండప్రయత్నమొనర్పవలసివచ్చెను. పెక్కండ్రు నుదారుల నాశ్రయించితి. వారిలోఁగొందఱు మహోదారులొసంగ సమకట్టిరి. మూఁడువర్షములకుముందె ముద్రణమొనర్పఁ బ్రారంభించితి. కాలక్రమమున నార్థికస్థితిదైన్యమయ్యె. వాగ్దాతలనేకులు వెనుదీసిరి. అట్లయినను మహాదాతల యౌదార్యలక్ష్మిచే, నేఁటికిముగించితి. వారిభవ్యనామములు వేఱొకచో ముద్రితములయ్యె.

## కాలాతిక్రమణదోషము.

ఈగ్రంథసంగ్రహణమునకు నాయసమర్థత దీర్ఘకాలముగడపినది. అందుచే, "కాలఃపిబతిసంపదః" యనునటుల నపగతులు కొన్ని యెదురైనవి. వానిలో మొట్టమొదటిది గ్రంథరచనాప్రోత్సాహ సంఘకార్యదర్శిగానున్న కొండిపర్తి వీరబ్రహ్మముగారి స్వర్గమనము. మఱియు మన్మిత్రవరులగు వానపామల లక్ష్మీనారాయణగారి కీర్తిశేషత. వీరిరువురు సంఘసంస్కార ప్రియులు. ఉదార స్వభావులు. సంపూర్ణముద్రితవంశాగమ గ్రంథదర్శనమునకు నువ్విళ్లూరుచున్న సదభిమానులు. వీరితిరోధానమున మనము బెగ్గిలపాటు గావించుచుండె. ఇంతయెగాక, నాకొక కొంత భూదానమొసఁగిన త్యాగశీలుఁడు, గ్రంథపరిశీలనకై నా వెనువెంట పెక్కుప్రదేశములకుఁ బఱతెంచిన ప్రోత్సాహకర్త. తగు సమయముల ద్రవ్యసంపత్తి నొడఁగూర్చు సంసిద్ధపురుషుఁడు. మత్పరిసర మున్నంగిగ్రామ వాస్తవ్యుఁడు మేడూరు కోట్లింగాచార్యులుగారు. వీరు కొలఁదికాలముక్రిందటనే స్వర్గమధిరోహించిరి. వీరి స్వర్గయాత్ర మఱింత మనశ్చింతకు హేతువయ్యె. నా కాలయాపన నాయుత్సాహమునె ప్రతిరోధించె. అయిన నేమిసేయుదు వీరి యాత్మలకు శాంతులునెఱపఁ బరమేశ్వరు విశ్వకృత్తుఁ బ్రార్థించెద.

## ప్రామాణిక సంపాదనము.

ఈ గ్రంథమునందలి ప్రమాణముల సంపాదించుటకుఁ బెక్కు గ్రంథములఁ బరిశీలించితిననుట చర్వితచర్వణమయగు. వానిలోఁ బ్రథమమార్గదర్శి విశ్వబ్రహ్మకులోత్సాహ యను మహారాష్ట్రభాషాగ్రంథము. ఇయ్యది విమర్శకాగ్రేసరులగు బ్రహ్మశ్రీ పండిత క్షీరసాగర నారాయణశాస్త్రిగారిచే సంపాదకమైనది. వారి యనుజులగు

బ్రహ్మశ్రీ పండిత క్షీరసాగర బాలశాస్త్రిగారిచే ముద్రితమైనది. ఆ గ్రంథవిలోకనానంతరము మూలగ్రంథములలో నా ప్రమాణముల సరిజూచుటకు రెండు పర్యాయములు పూనాపట్టణమున కేగితిని. శ్రీ బాలశాస్త్రిగారి సహాయమునఁ దద్గ్రంథ ప్రమాణ నిదర్శనములగు గ్రంథములెగాక పెక్కు ప్రమాణముల నితర గ్రంథములనుండి సంగ్రహించితి. విశాలమగు వారి పుస్తకభాండాగారమునె గాక యితర పుస్తకభాండాగారములఁ గనుఁగొన నవకాశముగలిగె. ఈసందర్భములో శ్రీ బాలశాస్త్రిగారెంతయో సహాయ మొనర్చిరి. స్వర్గస్థులగు నారాయణశాస్త్రిగారు సర్వజ్ఞులనుటలో సందేహముండదు. వారి యనుజులును విమర్శనశక్తియందంతవారలె యనవచ్చును. పరమ పూజ్యులగు నా విచక్షణతల్లజుల ఛాయాపటముల నిందుఁ బొందుపరచి నా కృతజ్ఞత వెల్లడించితి.

కులోత్సాహ గ్రంథోదాహృత ప్రమాణముల నన్నిటి నిందుదహరింప ననావశ్యమయ్యె. ఇతర గ్రంథములనుండి సంగ్రహించిన ప్రమాణములు సమయోచితముగఁ బెక్కులు దాహృతములయ్యె. సంపాదితప్రమాణము నింకను గొన్ని విరమింపఁబడినవి. విశ్వకర్మ పూజానియమము, విశ్వకర్మ విశ్వబ్రహ్మశబ్దముల కేకార్థనిర్ణయము, విశ్వరూపాచార్యుల పూర్ణచరిత్రము, వృత్తిప్రవర్తనము, ఇంకయు మఱికొన్ని శాసనములును, గోత్రకాండము, చరిత్రకాండమును నిలుపఁబడియె. ప్రస్తుతార్థికస్థితి పూర్ణముగ మందగించుటచే గ్రంథవిస్తరభీతి పైకొనియె. ఇంతయెగాక గోత్రకాండ చరిత్రకాండ లింకను విపులములుగ సంగ్రహించుట నసర మేర్పడియె. కొలఁదికాలములో నీ రెండుభాగములు సంపూర్తిగఁ బ్రకటింప సాహసించితి.

## గ్రంథ పర్యవసానసారము.

ఇందు విభాగితములగు కాండములలో నుదాహృతములగు సర్వప్రమాణముల సారములను సామరస్యమొనర్చి కాండసారములను నామముల గ్రంథాంతమున బ్రకటింపఁదలఁచితి. ఆకారణముననె ప్రథమకాండమునఁ బ్రమాణసంఖ్య నెలకొల్పఁబడియె. ఆర్థికస్థితి కొఱవడినదగుటచే గ్రంథవిస్తరభీతి విరమితమొనర్చె. జగదీశ్వరత్వ ప్రపంచకర్తృత్వ ప్రతిపాదితుఁడగు విశ్వకర్మ పరమేశ్వరుని యనంతసృష్టిలీలామహిమ విశేషము లిం దుగ్గడింపఁ బడియె. ఆవేదవేద్య ప్రజాపతి బ్రహ్మర్ష్యాద్యవతార విభేదము లిందు వర్ణితములయ్యె. అయ్యాదిపురుషు ఋషిజనకత్వ ఋషిసామాజికాధిపత్యము లిందుఁ బ్రశంసితములయ్యె. ఆఋషిశరణ్యు వైదికబ్రహ్మర్షి జనకతచేఁ బురాణఋషి జననములు భేదితములయ్యె. ఆలోకజనకు శిల్పకర్త్రవతారభేదములు పెక్కు లుదాహృతములయ్యె. త్వష్టృ విశ్వరూపాచార్యాద్యనవద్య చరిత్రలు సంగ్ర

హీతములయ్యె. శిల్పప్రభావము, శిల్పోత్కర్షత, శిల్పపావనత, ప్రత్యక్షీకరింపఁ బడియె. శిల్పిపవిత్రత, శిల్ప్యుత్పత్తి, శిల్పిబ్రాహ్మణత్వాదికములు, పెక్కులు పరిమాణ వివృతములయ్యె. వైరుధ్యములఁ బ్రతిఘటించి రథకారబ్రాహ్మణ నిర్ధారణ కూలంకషముగాఁ జర్చితమొనర్పఁబడియె. విశ్వకర్మబ్రాహ్మణ విశ్వబ్రాహ్మణాది రూఢిశబ్దములు సార్థీకృతములయ్యె. శిలాశాసనములు, తామ్రశాసనములు, పండిత శాసనములు, ప్రభుశాసనములు నుదాహృతములయ్యె. పండితు లిద్దాని యథార్థ దృష్టితోఁ బరికింతురుగాత! సామాన్యప్రజలు మఱల మఱలఁ జదివి సత్యమవధరింతురు గాక! కులాభిమాను లతిశ్రద్ధఁ బఠించి కులౌన్నత్యము సాధింతురుగాత!

## కృతజ్ఞత.

సమయోచితముగ నాకు ధనసహాయము సేయుచు దగురీతిఁ బ్రోత్సాహ మొనర్చుచు, నాకెంతయో తోడ్పాటుసేయుచు, రచనాకార్యమును నెఱవేర్పఁజేసిన గ్రంథరచనా ప్రోత్సాహసంఘమువారికిని కాలక్రమమున నార్థికస్థితి యెంత వెనుకాడు చున్నను సదభిమానపూరితులై ముద్రాపణకార్యమునకు ధనసహాయమొనర్చి ముద్రిత కార్యము నెరవేర్చిన దానశీలురకును, తమకెంత కార్యధురంధరత చూపట్టుచున్నను నీగ్రంథమునుగాంచిన వెనువెంటనే తమ సదభిప్రాయము ననుగ్రహించిన శ్రీశ్రీశ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దరు జమీన్‌దారువారికిని, తదాస్థాన విద్వత్కవీశ్వరులును, విరాట్పురాణాది శతాధిక గ్రంథకర్తలు నగు బ్రహ్మశ్రీ కొత్తపల్లి సుందరరామయ్యగారికిని, రథకారశబ్దమునకుఁ బూర్ణచర్చగావించి తత్క్షణమ తమపరిష్కారోద్దేశ మొసంగిన శ్రీమాన్ ధన్నవాడ రాఘవాచార్యులవారికిని, సదభిమాన పురస్సరత దన్నుఁ బ్రేఁజేచ గ్రంథరచనోద్యమము నెంతయుఁ బ్రోత్సహించి భూపాత్ర యంబున స్వోద్దేశంబును వ్రాసిపంపిన ఆయుర్వేదభూషణ బ్రహ్మశ్రీ తలకాడు గోపాలకృష్ణాచార్యులుగారికిని, నా యీయుద్యమమున కన్ని విధముల సహాయసంపత్తొసంగిన యితర మహాశయులకును, నాకృతజ్ఞతాపూర్వక వందనములను సమర్పించు చున్నాను. మఱియు, రచనాకార్యమునందును, గ్రంథాన్వేషణ కార్యమునందును, నందంద తోడ్పడిన శ్రీ వడ్డెపాటి కోటయ్యశాస్త్రి, మేడూరు ప్రభాకరశర్మ, స్వర్ణ సుబ్రహ్మణ్యకవి ప్రభృతులకు నాకృతజ్ఞత ప్రకటించుచున్నాను.

ఇట్లు బుధజనవిధేయుఁడు,

వడ్డెపాటి నిరంజనశాస్త్రి,

సంగ్రహీత.

# పండితాభిప్రాయములు.

శ్రీశ్రీశ్రీ రాజామంత్రిప్రెగడ భుజంగరావు బహద్దరు జమీందారువారియభిప్రాయము.

బ్రహ్మశ్రీ వడ్డెపాటి నిరంజనశాస్త్రిగారికి—

మీవిశ్వకర్మబ్రాహ్మణవంశాగమమును బ్రీతితోఁజదివితిని. ఇందలి విషయములు సర్వజనపఠనీయములును, భారతదేశపూర్వోన్నత్యద్యోతకములు నై యున్నవి. కవిశేఖర పండిత బిరుదాంకులగు మీరు వంశమూలపురుషులపైఁ గలభక్తి, కులసేవపైఁగలరక్తి, పూర్వాచారమునందుఁ గలయాసక్తి, ఉభయభాషలలోఁ గలశక్తి, ద్యోతకమగుచున్నది.

వేదాదిపురాణపర్యంతము, శాసనాదివార్తాపత్రికాపర్యంతముఁగల సప్రమాణ వాక్యములు త్రికరణశ్రమతో సేకరించి యీప్రపంచార్థికదుస్థితిలో ముద్రించి వెల్లడించిన యీగ్రంథమును విశ్వబ్రాహ్మణ వంశజులెల్లరును బఠించి మననముచేసికొని పూర్వప్రఖ్యాతుల సంపాదించు నుద్దేశముగలవారై నేటి భారతదేశోన్నతకర్మకలాపములో స్వదేశవస్తునిర్మాణచాకచక్యమున సునిశితబుద్ధులై పూర్వాచార్యులకు మహోన్నతోద్దేశమగు కర్మయోగఫలసిద్ధిని భారతావనికంతకు నీయంగల సమర్థులుకాఁగలందుల కాధునికశిల్పిప్రకాండులను హెచ్చరించుచున్నాను.

గ్రంథసంగ్రహీత వడ్డెపాటి నిరంజనశాస్త్రిగారి శ్రమను సార్థకములోనికిఁదెచ్చి పౌరుషేయసంఘము నుతిభాజనమగుఁగాక!

ఏలూరు,
2—2—34. } రాజా మంత్రిప్రెగడ భుజంగరావు.

---

—♦ బ్రహ్మశ్రీ కొత్తపల్లి సుందరరామయ్యగారి యభిప్రాయము ♦—

చ॥ వరనిగమ ప్రమాణకృతి ♦ వర్యమవార్యముగాఁగ వ్రాసి బం
ధురకులగౌరవంబును బు ♦ ధుల్ గొనియాడఁగ నిల్పఁబొల్పుగా
స్థిరతరమై కరంబు విల ♦ సిల్లఁగ నచ్చునగుర్దిద్ది తద్దయు
ర్వరఁ బ్రకటించెనద్దిర! ♦ నిరంజనశాస్త్రి ప్రశస్తవైఖరిన్॥

కం॥ కవిశేఖర పండిత బిరు
దవిరాజితుఁ డన్నమాట ♦ ధర నిల్వఁగను
త్సవమున నీ యుద్గ్రంథముఁ
బ్రవిమల సద్గ్రంథముగను ♦ వ్రాసి నుతిఁగనెన్॥
కం॥ ఘనతర విరాట్పురాణ ర
చనఁగల మోదమ్ముకన్న ♦ శతగుణమోదం
బును విశ్వకర్మ సద్బ్రా
హ్మణ వంశాగమమునందు ♦ నందినవాఁడన్॥
కం॥ ఛందోబద్ధాగమ కృతి
సుందరి, రామయయి యెల్ల ♦ చోటుల వెలయన్
ఛందోబద్ధాగమ కృతి
సుందరరామయ్య వెలయఁ ♦ జొప్పడఁ జేసెన్॥

క్రొత్తపల్లి సుందరరామయ్య,
విరాట్పురాణాది శతాధిక గ్రంథకర్త,
లక్కవరాస్థాన విద్వాంసుఁడు.

ఏలూరు,
2—2—34.

---

బ్రహ్మశ్రీ తలకాడు గోపాలకృష్ణాచార్యులుగారి యభిప్రాయము.

ఓంనమో విశ్వకర్మణే స ఉ పాత్వస్మాన్.

"విశ్వకర్మబ్రాహ్మణవంశాగమ" మను గ్రంథమును సాంతముగాఁ బరిశీలించినాను. గ్రంథకర్తయొక్క మతాభిమానము, భగవన్మాహాత్మ్య విమర్శనము, నద్భుతముగానున్నవని యభిప్రాయపడుచున్నాను.

సకలవేదములుఁ, బురాణములు, నపూర్వ శిల్పశాస్త్రములు, నీగ్రంథరచనకాధారభూతములై యున్నవి. అగర్భవిద్యావంతునికైన నతని సంపూర్ణాయుః పరిమితిలోఁగూడ సాధ్యముకాని సాహసమీగ్రంథరచనమందుఁ జూపఁబడియున్నది. ఇందులకు వలయు విద్యావిజ్ఞానము జన్మాంతరములనుండి గ్రంథకర్త కనుసరించివచ్చియున్నదని గూఢమగు విచారమువలన గోచరమగుచున్నది.

ఇట్టి యపూర్వగ్రంథరచనా ప్రకటనమువలన గ్రంథకర్తయొక్క జీవితము పక్వమైనదనియు, నీగ్రంథరాజముయొక్క పాఠకులకు విశ్వకర్మబ్రాహ్మణ మతతత్వ

బోధయు, విశ్వకర్మసందర్శనభాగ్యమును జేకూరుననని తలంచుచున్నాను.

పురాణములన్నిటిలో స్కాందపురాణము సమస్త ధర్మములను, దైవికచిత్రములను, మాహాత్మ్యములను, జక్కఁగా వెల్లడించుటలో సమర్థముగ నున్నట్లీ గ్రంథము విశ్వకర్మ సిద్ధాంతమును, విశ్వకర్మవంశాగమ సిద్ధాంతమును, కరతలామలకముగ నివేదింపఁగలదు. విశ్వకర్మవంశీయుల యాదర్శప్రాయ గ్రంథములలో నిది ప్రప్రథమ గ్రంథమని గణింపఁబడనచ్చునని నాయభిప్రాయము. గ్రంథరచనాక్రమమందు బుక్కల భాష్యము ననుసరించి తేటతెనుఁగుభాషా వివరణ మాబాలగోపాలమునకు మహోపకారియై యుండును. విశ్వకర్మవంశోన్నతికి వలయు ప్రసిద్ధాంశములు వందలకొలఁది సంవత్సరములనుండి ప్రకటింపఁబడక యుండిన యుపాఖ్యాన ప్రచురములు కడు శ్రావ్యములై యున్నవి.

ఈ గ్రంథరాజ మశేష విశ్వకర్మవంశీయుల నిరంతర పఠనయోగ్య గ్రంథమనియుఁ, బండితవర్యుల ప్రమాణగ్రంథమనియు, బిరుదాంకితులగు విద్వద్వరేణ్యుల సమీచీనకావ్య నిరూపణమనియు, నూహించుట కవకాశము గల్పించియుండును. విశ్వకర్మావతార సిద్ధాంతము, గాయత్రీదేవివిశ్వకర్మావతారమనుట, వైశ్వకర్మణ హోమము సర్వపాపక్షయకరమనుట, శ్రీకృష్ణవిశ్వకర్మల కభేదప్రతిపాదనము, విశ్వకర్మకు హనుమద్ధ్వజప్రాప్తి కథనము, విశ్వకర్మవలన వివిధలింగప్రతిష్ఠాపనము, శిల్పజ్ఞానము లేనిదే స్వర్గజ్ఞానము కలుగదనుట, శిల్పవిద్యాప్రశంసము, శిల్పము త్రైవర్ణికులలో బ్రాహ్మణులకే ముఖ్యవిధియనుట, విశ్వకర్మబ్రాహ్మణ విశ్వబ్రాహ్మణ ప్రసిద్ధి విచారము, విశ్వేదేవతలు విశ్వకర్మవంశ్యులే యను నంశములు, బహుకాలమునుండి విమర్శితములుగాకయుండి ప్రకృతము సులభముగా గ్రాహ్యమగునట్లు వివరింపఁబడి యున్నవి.

గ్రంథకర్తలు తమ విజ్ఞాన సర్వస్వమును గ్రంథరూపమునఁ బ్రకటించుటలో మహదాశ్రయము సార్థక్యమును బొందవలసియుండును. కనుక గ్రంథకర్తలకును, మహదాశ్రయదాతలకును, బ్రోత్సాహకులకును, నా శ్రీవిశ్వకర్మభగవానులు సర్వ విధముల శ్రేయముల నొసఁగుగాక? యని విన్నవించు,

బుధజనవిధేయుఁడు.
ఆయుర్వేద వైద్యభూషణ,
తలకాడు గోపాలకృష్ణాచార్యులు
పౌరాణికుఁడు మఱియు హిందూపుర విశ్వబ్రహ్మ
పౌరుషేయ సమాజ ధర్మోపదేష్ట.

హిందూపురము
శ్రీముఖ సం॥ మాఘ శు ౭.
ఇందువారము.

## —♦ విశ్వకర్మబ్రాహ్మణ వంశాగమ రచనా ప్రోత్సాహసంఘము ♦—

ఒక్కొక్కరు రు. 25—0—0 ల చొప్పున ధనమొసంగిరి.

బ్రహ్మశ్రీ కందుకూరు మల్లికార్జునాచార్యులుగారు బి. ఏ., డిప్యూటికలెక్టరు బెజవాడ.
,, కొండిపర్తి వీరభద్రాచార్యులుగారు (వోలేరు)
,, చోడా కోటయ్యగారు (నరసారావుపేట)
,, శనగపాటి కోటయ్యగారు (బెజవాడ)
,, కొండిపర్తి వీరబ్రహ్మముగారు (బందరు)
,, వానపాముల లక్ష్మీనారాయణగారు (ఘంటసాల)
,, యువజనసంఘమువారు (బందరు)
,, ఉత్తమూరి ఆర్ముఖాచార్యులుగారు (బందరు)
,, ఆర్ముఖాచార్యులుగారి పనివారలు (బందరు)
,, కాకుమాను శ్రీరాములుగారు (బందరు)
,, శ్రీరాం పేర్లింగంగారు (బందరు)
,, శ్రీరాం సుబ్బయ్యగారు (బందరు)
,, కొండిపర్తి మనుబ్రహ్మచార్యులుగారు (పెడన)
,, మేడూరి పేర్లింగముగారు (బందరు)
,, వానపాముల సుందరరామయ్యగారు (బందరు)
,, కాకుమాను మల్లికార్జునుడుగారు (బందరు)
,, జగ్గాపాత్రుని పిచ్చయ్యగారు (బందరు)
,, వానపాముల వీరబ్రహ్మముగారు (తెన్నేరు)
,, దీవి సాంబమూర్తిగారు (అవనిగడ్డ)
,, పొతకమూరి సుబ్రహ్మణ్యముగారు (గుంటూరు)
,, కొమ్మూరు పరబ్రహ్మావధానులుగారు (గారపాడు)
,, వడ్డెపాటి కోటయ్యశాస్త్రిగారు (ప్రత్తిపాడు)

---

ఏతద్గ్రంథ ముద్రణ మొనర్చుటకు

## —♦ ద్రవ్యమొసంగిన కులాభిమానుల భవ్యనామములు ♦—

బ్రహ్మశ్రీ టి. యం. దైవశిఖామణిఆచార్యులుగారు
,, నుంగంబాకం దొరవేలాచార్యులుగారు
,, కల్లోజు గోపాలకృష్ణమాచార్యులుగారు

} మద్రాసు మహాశయులు 20 రీముల కాగితములొసంగిన దాతలు.

| | | |
|---|---|---|
| బ్రిహ్మశ్రీ | దోనేపూడి సూరాచార్యులుగారు (నదురుబాదా, తూ. గో. జిల్లా) | 100-0-0 |
| ,, | క్రాప రామబ్రహ్మాచార్యులుగారు (కొల్లూరు) | 100-0-0 |
| ,, | హరివరం నరసయ్యాచార్యులుగారు (హరివరం కర్నూల్ జిల్లా) | 100-0-0 |
| ,, | బండికట్ల వేంకటరత్నయ్యాచార్యులుగారు (ఇనమనమెళ్లూరు) | 90-0-0 |
| ,, | విప్పర్ల మల్లయాచార్యులుగారు (నంగవోలు) | 40-0-0 |
| ,, | కొండూరు కోటిలింగాచార్యులుగారు వారితమ్ములు<br>కొండూరు భ్రమరాచార్యులుగారు } (అంగలకుదురు) | 30-0-0 |
| ,, | కొల్లిపర విశ్వబ్రాహ్మణ ప్రముఖులు (కొల్లిపర) | 30-0-0 |
| ,, | పెదపూడి విశ్వబ్రాహ్మణ ప్రముఖులు (పెదపూడి) | 36-0-0 |
| ,, | అంగలకుదిటి సుబ్బారాయుడుగారు (గుంటూరు) | 25-0-0 |
| ,, | వడ్డెపాటి కోటయ్యశాస్త్రిగారు (ప్రత్తిపాడు) | 25-0-0 |
| ,, | వడ్డెపాటి లక్ష్మీకాంతంగారు (ప్రత్తిపాడు) | 25-0-0 |
| ,, | కానూరు వీరభద్రయ్యగారు (తోట్లనల్లూరు) | 20-0-0 |
| ,, | ఉత్తమూరి ఆర్ముఖాచార్యులుగారు (బందరు) | 20-0-0 |
| ,, | నూతక్కి విశ్వబ్రాహ్మణసభవారు (నూతక్కి) | 20-0-0 |
| ,, | పెందోట వేంకటరత్నాచార్యులు గారు (తెనాలి) | 20-0-0 |
| ,, | చోడవరపు యల్లమందాచార్యులుగారు (అద్దేపల్లి) | 20-0-0 |
| ,, | కందుకూరి సుబ్బయ్యాచార్యులుగారు (మాచవరం) | 20-0-0 |
| ,, | దరిశి వేంకట సుబ్బారావుగారిద్వారా (ప్రత్తిపాడు) | 20-0-0 |
| ,, | వడ్డెపాటి కృష్ణమూర్తిగారు (ప్రత్తిపాడు) | 10-0-0 |
| ,, | పెదపాడు, బెల్లంకొండ, వేల్పూరు గ్రామత్రయ విశ్వబ్రాహ్మణ సభ్యులు | 35-0-0 |
| ,, | కొణికి బ్రహ్మయ్యాచార్యులుగారు (మాదల) | 10-0-0 |
| ,, | కొండూరు విశ్వనాథాచార్యులుగారు (వల్లభాపురం) | 8-0-0 |
| ,, | గురిజాడ బసవయ్యగారు (తెనాలి) | 8-0-0 |



# విషయసూచిక.

---

## విశ్వకర్మకాండము.



## విశ్వకర్మకాండీయ త్వష్టూపకాండము.



## విశ్వకర్మకాండీయ విశ్వరూపోపకాండము.

## శిల్పకాండము.



## రథకారకాండము.

శాసనకాండము.





## ఓమ్

శ్రీమజ్జగదీశ్వరవిశ్వకర్మణేనమః.

# విశ్వకర్మబ్రాహ్మణవంశాగమము.

## విశ్వకర్మకాండము.

### ఇష్టదైవాది ప్రార్థనము.



స్వైవనిర్మలవిచిత్రపథస్సతాంయ
స్సంకల్పసత్యకరణైర్జగతాం విధాతా,
హోతానిజాత్మనిచితాఖిలలోకహోమే
తం విశ్వకర్మ పరమేశ్వరమానతోఽస్మి. ౧

శక్తిత్రయసదోపేతం గుణత్రయ విభాస్వరమ్
కార్యత్రయ సముత్సేకమ్మూర్తిత్రయ ముపాస్మహే. ౨

ఆలీకృతసురీపాలీం వ్యాలీం రిపుజడాఽత్మనామ్
కపాలమాలికారాలీం కాళీం ధ్యాయే నిరాకులీమ్. ౩

సమ్పన్నవాఙ్మయవిశాల విలాసభాసః
సంవర్ధయన్తియదపూర్వకటాక్షలేశైః,
నిర్భాగ్యజాడ్యవికలా న్పరిహృత్యలోకాః,
శ్వశ్రూ స్నుషేకలయతో వినతౌఘ మేతే. ౪

నివారయత్వన్తరాయ తామిస్రం విచలమ్మహత్,
వక్త్రితుణ్డశిరోమణ్డ నాబ్జఖణ్డస్య దణ్డనాత్. ౫

మన్వాదీన్పఙ్చధాత్మ్యాన్జగదవనపరాన్సానగాదీన్మహర్షీన్,
ఆదిత్యాదీన్ఖగాన్సచ్ఛత్రిదశపతిముఖాన్లోకపాలా న్పవిత్రాన్,
త్రేతాగ్నీన్సుప్రదీప్తాన్పరిగమితనిగమానైనగమానాగమాదీన్
సేవేనిత్యంయథార్థప్రవచనపటూన్భావ్యకర్తృన్పసిద్ధాన్. ౬

ఆగోమిషేణావతీర్యపౌరుషేయాన్య యేభవః
కూటస్థదేశికోభూత్తం కాళహస్తియతిమ్భజే. ౭

నమోహజ్కలయెచాద్య వేజ్కటాచార్య దేశికమ్
షడ్దర్శనస్థాపకాదిబిరుదైర్యోవిరాజతే. ౮
యస్యకీర్తిర్విశ్వవిద్యాభరణాదిభిరుద్ధతా
తంధ్యాయెబసవాచార్యం సర్వశాస్త్రవిశారదమ్. ౯
శూన్యోత్పత్తిందత్తమత్రైర్మహార్షైః
విశ్వాతీతం స్థాపితాధ్యాత్మవిద్యామ్,
గోవిన్దామ్బాముక్తికాన్తా సనాథ
ఞ్చాస్మత్తీర్థం వీరభోకేశ మీడే. ౧౦
మాతాపితృభ్యామ్మమ పావనాభ్యామ్
నమస్కరోమీశ్వరతత్వరాభ్యామ్,
సాకల్యసౌశీల్య గుణోత్తరాభ్యామ్
భద్రామ్బికాకోటయధీమణిభ్యామ్. ౧౧
ఉపనామ్నఋుతెసర్వవిద్యాభ్యః క్షీరసాగరమ్
చర్చాశిరోమణిం వన్దే నారాయణవిపశ్చిదమ్. ౧౨
స్వధర్మపాలనె దీక్షాభృతమ్ప్రాపయదీక్షితమ్,
నౌమిపిచ్చయయస్తారంద్రష్టారం వేదవిద్వశామ్. ౧౩
ఇత్థమిష్ట్వాయదేవాదీన్ నత్వాగ్రన్థసమాప్తయే
విశ్వకర్మబ్రాహ్మణానాం వంశాగమ ఉదాహృతః. ౧౪

---

## వి శ్వ క ర్మ ప రా త్ప ర త్వ ము.

విశ్వకర్మ శబ్దము బహువ్రీహి సమాసము. "అనేక మన్యపదార్థే" అను ౨. ౨. ౨౪ పాణిని సూత్రప్రకారము "విశ్వం కృత్స్నం కర్మ క్రియావ్యాపారో యస్యస విశ్వకర్మా" అని నిష్పన్నమయినది.

ఈ విశ్వకర్మనుగూర్చి ఋగ్వేదాష్టమాష్టక తృతీయాధ్యాయాంతమున ద్వితీయాదితృతీయ మంత్ర పర్యంతము, కృష్ణయజుర్వేద తైత్తిరీయసంహితయందుఁ జతుర్థకాండ షష్ఠ ప్రపాఠక ద్వితీయాను వాకమునం దాఱు మంత్రములను, శుక్ల యజుర్వేదమునందుఁ గించిద్భేదముగాను విశ్వకర్మ సూక్తము చెప్పఁబడినది. వానిలో యజుర్వేదీయ విశ్వకర్మ సూక్తము.

(1) య ఇమా విశ్వాభువనాని జుహ్వదృషిర్హోతా నిషసాద పితానః। స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః పరమచ్ఛదోవర ఆవివేశ। విశ్వకర్మామనసా యద్విహాయా ధాతా విధాతా పరమోతసన్దృక్। తేషా మిష్టాని సమిషామద న్తి యత్ర స ప్తర్షీన్ పరఏకమాహుః। యోనఃపితా జనితా యోవిధాతా యోనః సతో అభ్యాస జజాన॥ ౧ ॥

యోదేవానాం నామధా ఏక ఏవతగ్ం సంప్రశ్నంభువనా యన్త్యన్యా। త ఆయ జన్తద్రవిణగ్ం సమస్మా ఋషయఃపూర్వే జరితారో నభూనా। అసూ ర్తా సూర్తా రజసోవిమానే యేభూతాని సమకృణ్వన్నిమాని।నతం విదాథయ ఇదం జజానా న్యద్ యుష్మాక మంతరం భవాతి। నీహారేణ ప్రావృతాజల్ప్యాచాసుతృప ఉక్థశా సశ్చరంతి। పరోదివా పరఏనా॥ ౨ ॥

పృథివ్యాపరో దేవేభిర సురై ర్గుహాయత్। కగ్స్విద్గర్భం ప్రథమం దధ్ర ఆపో యత్రదేవాః సమగచ్ఛ న్తవిశ్వే। తమిద్గర్భం ప్రథమం దధ్రఆపోయత్రదేవాః సమగచ్ఛ న్తవిశ్వే। అజస్యనాభావధ్యేక మర్పితం యస్మిన్నిదం విశ్వం భువనమధి శ్రితం। విశ్వకర్మాహ్యజ నిష్ట దేవ ఆదిద్గన్ధర్వో అభవద్ద్వితీయః। తృతీయః పితా జనితౌషధీనాం॥ 3 ॥

అపాంగర్భం వ్యదధాత్ పురుత్రా। చక్షుషః పితామనసాహిధీరో ఘృతమే

నే అజనన్నన్నమానే । యదే దన్తా అదదృగ్ం హస్తపూర్వ ఆదిద్ద్యావాపృథివీ
అప్రథేతామ్। విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతో హస్త ఉతవిశ్వతస్పాత్ ।
సంబాహుభ్యాం నమతిసంపతత్రైర్ద్యావాపృథివీజనయన్ దేవ ఏకః। కిగ్గ్స్విదాసీ
దధిష్ఠానమారమ్భణం కతమత్స్విత్ కిమాసీత్ । యదీ భూమిం జనయన్ ॥౪॥

విశ్వకర్మావిద్యామార్ణోన్మహినా విశ్వచక్షుః। కిగ్గ్స్విద్వనంక ఉసవృక్ష ఆసీ
ద్యతోద్యావాపృథివీ నిష్టతక్షుః । మనీషిణో మనసాపృచ్ఛతేదు తద్ య దధ్యతి
ష్ఠ ద్భువనాసి ధారయన్ । యాతేధామాని పరమాణి యావమా యామధ్యమా
విశ్వకర్మన్నుతే మా। శిక్షా సఖిభ్యో హవిషిస్వధావః స్వయం యజస్వతనువం
జుషాణః । వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే॥౫॥

మనోయుజం వాజే అద్యాహువేమ। సనో నేదిష్ఠాహవనా నిజోషతే విశ్వశ
మ్భూరవసే సాధుకర్మా । విశ్వకర్మన్ హవిషావా వృధానః స్వయం యజస్వతను
వంజుషాణః । మహ్యంత్వన్యే అభితః సపత్నా ఇహాస్మాకం మఘవా సూరిరస్తు ।
విశ్వకర్మన్ హవిషావర్ధనేన త్రాతార మింద్రమకృణోరవధ్యం । తస్మై విశః సమ
నమన్తపూర్వీ రయ ముగ్రో విహవ్యో యథాసత్ । సముద్రాయ వయునాయ
సిన్ధూనాం పతయేనమః । నదీనాగ్ం సర్వాసాం పిత్రే జుహుతావిశ్వకర్మణే విశ్వా
హా మర్త్యగ్ం హవిః ॥ ౬ ॥

## ఇందులకు సాయణభాష్యము.

ప్రథమేనువాకే పరిషేచనాదికముక్తం। అథద్వితీయేనువాకే సూక్తాభ్యాం హోమా ఉచ్యంతే॥ కల్పః । షోడశగృహీతేన స్రుచంపూరయిత్వా వైశ్వకర్మ ణాని జుహోతి । య ఇమా విశ్వాభువనాని జుహ్వచ్చక్షుషః పితా మనసాహిధీర ఇతి నానాసూక్తాభ్యాం ద్వే ఆహుతీ జుహుత ఇతి।తత్ర ప్రథమసూక్తస్యప్రథమా మృచమాహ । య ఇమా.........ఆవివేశేతి॥ యో విశ్వకర్మా పరమేశ్వరః ఇమా విశ్వాభువనాని జుహ్వత్ । ప్రళయకాలే పృథివ్యాదీనిమాన్ సర్వాన్థాన్స్వ త్మన్యాహుతి ప్రక్షేపవత్ సంహరన్నృషిః అతీంద్రియద్రష్టా సర్వజ్ఞఃహోతా సం హారరూపస్య హోమస్య కర్తానోస్మాకం పితా జనకోనిషసాద స్వయం స్థితవాౕ ప్రళయకాలే ప్రాప్తేసతి సర్వాౕ లోకాన్థ్సం హృత్వాస్మాక మపి సంహర్తా పున స్స్రష్టాచ సర్వజ్ఞోయః పరమేశ్వరః స్వయమేకఏవాసీత్ । అత ఏవా ప్యుపనిషద ఏవాహుః । ఆత్మావా ఇద మేక ఏవాగ్రఆసీత్ । నాన్య త్కించన మిషత్ । సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్ । ఏకమేవాద్వితీయ మిత్యాద్యాః । తాదృశః పర మేశ్వరః ఆశిషా బహుస్యాం ప్రజాయేయేత్యేవం రూపయా పునః సిసృక్షయాౕ ద్రవిణమిచ్ఛమానః ధనోపలక్షణం జగత్ భోగమపేక్షమాణః పరమచ్ఛదఃపరమం స్వకీయమేవాద్వితీయం పారమార్థికరూపమావృణ్వాన్ వశేనస్వే సృష్టేశరీరమధ్య వర్తిని పుండరీకస్థానే ఆవివేశజీవరూపేణ ప్రవిష్టః । ఏతచ్చ సర్వముపనిషద్యా మ్నాతమ్ । సోకామయత । బహుస్యాం ........తదేవానుప్రావిశ దితి। ఏవ మన్యా ఉపనిషదఉదాహార్యాః । అథ ద్వితీయా మాహ । విశ్వకర్మా మనసా— పరఏకమాహురితి । విశ్వవిషయాణి సృష్టిస్థితిసంహారరూపాణి యస్యాసౌవిశ్వ కర్మా తస్య చ తేషు కర్మసుతఏవసాధనం సత్యసంకల్పాదయః మనస్సంకల్పమా త్రేణ విశ్వకర్మాతద్ధాతా విధాతా విహాయా ఇతి చోచ్యతే । ధాతోత్పాదకః విధాతాపోషకః విశేషేణ జహారపరిత్యజతీతివిహాయాః సంహర్తే త్యర్థః । ఉత అపిచ అత ఏవ పరమా సర్వేభ్య ఉత్కృష్టః । సందృక్ సర్వజ్ఞ ఇత్యర్థః యత్ర యస్మి న్నీశ్వరే సప్తర్షీ నేకమాహుః । యదృతే మరీచ్య త్రిముఖాః సప్తఋషయః వివిధాదృశ్యంతే సర్వే సృష్టేఃప్రాక్ పరస్మిన్నేకోభూతాఇతివేదాంతపారగాఆహుః సచపరమేశ్వరః తేషాం సప్తర్షిప్రభృతీనాం ఇష్టా న్యపేక్షితాని స్వేచ్ఛామాత్రేణ సంపాదయతితేనచ తే మహర్షయో మదంతి హృష్యంతి అథ ద్వితీయామాహ । యోనఃపితా- భువనాయంత్యన్యా ఇతి।యో విశ్వకర్మా నోఽస్మాకం పాలయితాన కేవలం పాలకః కింతు జనితా ఉత్పాదకోపి కిమనేనాస్మాకం ఉత్పాదక ఇతి సం కోచేన । యోవిధాతా సర్వస్య జగతః ఉత్పాదకః । యోవిశ్వకర్మానోస్మాక ము త్పన్నానాం సంవర్తమాన మిదంభోగ్యజాతం సతో జజాన సదేవ సోమ్యేద మితి

శ్రుత్యుక్తత్వాత్స్వరూపా దుత్పాదయామాస।యశ్చవిశ్వకర్మా దేవానాం నామధా
స్వయమేనసర్వదేవరూపేణావిర్భూ యేంద్రమిత్రాది దేవతా నామధారయతి। అ
ఏనాన్యత్రామ్నాతం । ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహు రథోదివ్యస్సుపర్ణో
గరుత్మాన్ । ఏకం సద్విప్రాబహుధావదంత్యగ్నిం యమం మాతరిశ్వానమాహు
రితి।అతఏవబహూనాందేవానాం।నామానిధారయ న్నపి వస్తుత స్త్వయమేకఏవ।తం
విశ్వకర్మాణం పరమేశ్వరమన్యా భువనాయ న్తీతి। తస్మా దన్యాని సృష్టాని సర్వా
ణి సంప్రశ్నే యథా భవతి తథా । యం ప్రతిప్రళయకాలఏకత్వం ప్రాప్నువంతి
ఏకీభావయుక్తే ప్రళయె ఈశ్వరః కానిభువనానీతి ఏవం ప్రశ్నః । సంప్రధారణం
ప్రవర్తతే । విభాగాభావేన శ్రుత్యనజ్ఞైః దాతుమశక్యత్వాత్ । అథ చతుర్థీమాహ
త ఆయజంత- సమకృణ్వన్నిమానీతి । పూర్వోదాహృతేన ప్రథమముత్పాదితా
విశ్వకర్మాణోయేస్రష్టారః ఇమాని భూతాని సర్వానేతాన్ప్రాణినః సమకృణ్వన్
సమ్యగుపపాదయన్తే పూర్వేస్రష్టారః యజంతే।ద్రవిణం ధనరూపం భోగ్యజాతం
సమాయజంత సమ్యక్సంపాదితవంతః కద్యృశాస్త్ర ఋషయః అతీంద్రియద్రష్టారః
తే సర్వజ్ఞాఇత్యర్థః । జరితారోనభూనా స్వకీయేన మహత్వేన నకదాచి దపి జీర్ణా
నశ్వరాభవంతి కీదృశాని అసూర్తా అసుభిః ప్రాణైరీరితాని ప్రాణయుక్తా
నీత్యర్థః । తథా రజసో విమానే సూర్తా రంజనాత్మకస్య మోగ్యవి
శేషేణ ప్రమితౌ స్వస్వకర్మభిః సుష్ఠుప్రేరితాని । అథ పంచమీమాహ । నతం
విదాథ-శాసశ్చరంతీతి! యేవిశ్వకర్తా ఇదం జగజ్జజాన ఉత్పాదితవాన్ తం విశ్వక
ర్మాణం నవిదాథ తేన సృష్టా హేజీవాయూయం నజానీథ దేవదత్త మిత్యేవం
సర్వేవయమాత్మానం విశ్వకర్మాణం నజానీమ । ఇతి యద్యుచ్యేత తదసత్ । న
హ్యాహం ప్రత్యయరూపమేవ విశ్వకర్మణః పరమేశ్వరస్య తత్వం కింతు యుష్మాకం
అహం ప్రత్యయగమ్యాదతిరిక్తం సర్వవేదాంతవేద్యమీశ్వరతత్వం భవాతివిద్యతే
జీవరూపవత్తదపి కుతో నవిద్మ ఇతిచేత్ । నీహారేణ ప్రావృతాః భవంతో నీహా
రసదృశే నాజ్ఞానే నావృతత్వా న్నజానీత । నీహారో నాత్యంతమసదం దృష్ట్యా
వారకత్వాన్నాపిసత్।కాష్ఠపాషాణాది రూపాంతరేణ సంబంధ మయోగ్యత్వాదేవ
మజ్ఞానమపి నాత్యంతమసత్ । ఈదృశ తత్వావారకత్వా న్నాపిసత్ బోధమాత్ర
నివృత్తత్వా దీదృశే నానిర్వచనీయే నాజ్ఞానేన భవంతి । సర్వేపి జీవాః ప్రావృ
తా న కేవలం కింతుజల్ప్యాచ దేవోహం మనుష్యోహం మమేదం క్షేత్ర మిత్యా
ద్యనృతజల్పనపరాశ్చ । కించ అసుతృపః అసూనితృప్యంత ఇత్యసుతృపః। కేనాపి
ప్రకారేణ ప్రాణాన్ రక్షిత్వాతావతైవ తృప్యంతి భవంతః నతు పరమేశ్వరత
త్వం విచారయితుం ప్రాపయితుం ప్రవర్తంతే । న కేవల మిహలోకమాత్ర భోగ
మాత్రతృప్తిః । కింతు, ఉక్థశాసః పరలోకేపి భోగసంపాదయితుం నానా

విధేషు యజ్ఞేషు ఉక్తాని శాస్త్రాణి శాసంతీత్యుక్థశాసః । తాదృశో భూత్వా భవంతశ్చరంతి । ఐహికాముష్మికభోగగర్వితాః ప్రవర్తంతే । తస్మాదజ్ఞాన మిథ్యాజ్ఞానపరాధీనానాం భవతాం నాస్తితత్వజ్ఞాన మిత్యర్థః । అథ షష్ఠీమాహ। పరోదివా—సమగచ్ఛంత విశ్వఇతి । యత్ పరత్వం గుహా హృదయపుండరీకే గూఢం దివాపరః ద్యులోకాదపి దూరే తిష్ఠతి। ఏనా పృథివ్యాపరః అస్యాః పృథివ్యాదూరేతిష్ఠతి । దేవేభిరసురైఃపరః దేవేభ్యోసురేభ్యశ్చ దూరేతిష్ఠతి । సకారాంత పరఃశబ్దో దూరవాచీదూరత్వం నామ విలక్షణత్వం సర్వజగద్విలక్షణత్వాద్గురుశాస్త్రవిముఖై ర్నజ్ఞాత ఇత్యర్థః । కించ । యత్ర యస్మాద్గర్భం విశ్వేసర్వేపి దేవా సమగచ్ఛంత సంగతాః । సంభూయ వర్తంతే కంస్విత్ గర్భంనామ ఆపః ప్రథమందధ్రే అద్భిః పూర్వధృతే గర్భే దేవమనుష్యాదయః సర్వేప్రాణినోవర్తంత ఇత్యేవం శాస్త్రవృత్తిః ప్రసిద్ధాసోపి గర్వ్యాః క ఇతి నజ్ఞాయతే యథా స్థూలోప్యయం జగదాధారో నజ్ఞాతస్తదానీ మత్యంతసూక్ష్మం నజ్ఞాత ఇతి కిము వక్తవ్యమిత్యభిప్రాయః । అథ సప్తమీమాహ॥ తమిద్గర్భం—మధిశ్రితమితి । ఇదానీం గురుశాస్త్రానుశాసనోపేతేషు పురుషేషు విద్యమాన స్తత్వనిర్ణయోభిధీయతే యత్ర యస్మిన్ బ్రహ్మాండే గర్భే విశ్వేదేవాః సమగచ్ఛంత తమిత్ తమేవ గర్భమాపః ప్రథమందధ్రే ధృతవత్యః । తద్ధారణప్రకారః ఏవం సృష్టిః క్రియతే । అజస్య జన్మరహితస్య పరమేశ్వరతత్వస్య నాభౌ నాభిస్వరూపస్థానీయ మధ్యే ఏకం కించిత్ బీజమధ్యర్పితం । అధికరణత్వేన స్థాపితం యస్మిన్బీజే ఇదం విశ్వం సర్వమపి విశ్వమధికరణత్వేన స్థాపితం తద్బీజమర్పితం తథాచస్మర్యతే । "అపఏవ ససర్జాదౌ తాసువీర్యమపాసృజత్ । తదండమభవద్ధేమం కోటిసూర్యసమప్రభ"మితి। అథాష్టమీమాహ॥విశ్వకర్మా—పురుత్రేతి । బ్రహ్మాండమధ్యగతానాముత్పత్తిరుచ్యతే । అండమధ్యేప్రథమం విశ్వకర్మాదేవతిర్యగాది విశ్వభేదస్య కర్తాసత్యలోకవాసీ చతుర్ముఖోదేవోజనిష్ఠ ఉత్పన్నః । ఆదిత్ అనంతరమేవ తదపేక్షయా ద్వితీయో గంధర్వోభవత్ ఉత్పన్నః । తత ఊర్ధ్వమోషధీనాం పితా పాలకః జనితాచోత్పాదకః సోమః పూర్వోక్తద్వితీయాపేక్షయా తృతీయోభవత్ । తదేవ మహాంగర్భం బ్రహ్మాండం పరమేశ్వరః పురుత్రావ్యదధాత్ బహుధా విభక్తం కృతవాన్ । ఇత్థమేకం సూక్తం సమాప్తం । అథ ద్వితీయసూక్తే ప్రథమామృచమాహ। చక్షుషః పితా—అప్రథేతామితి। చక్షుషః చక్షురాదేఃప్రాణసముదాయస్య పితా ఉత్పాదకః ధీరః ధైర్యవాన్ । మనసాస్వేచ్ఛయా ఘృతం ఘృతవత్ । ప్రాణినాముపభోగసాధనభూతే ఏనేద్యావాపృథివ్యౌ నన్నమానే పరస్పరానుకూల్యే ననమనోపేతే అజనత్ ఉత్పాదితవాన్ యదేత్ యదైవపూర్వే ప్రథమోత్పన్నాః అంతాః అననయుక్తాః చేష్టావంతః చరాదిప్రాణా అదదృగ్ం హంత

దృఢా అభవన్ ఆదిత్ అనంతరమేవ ద్యావాపృథివీ విస్తృతే అభూతాం । అ
ద్వితీయామాహ । విశ్వతశ్చక్షు—జనయ న్దేవ ఏక ఇతి । చక్షురాదిప్రాణానా
ద్యావాపృథివ్యోశ్చోత్పత్తే రూర్ధ్వం విశ్వరూపధరః పరమేశ్వరః ఏవం భాసతే
కథ మిత్యుచ్యతే । విశ్వతశ్చక్షుః విశ్వతస్సర్వతశ్చక్షూంషి యస్యాసౌ విశ్వచక్షు
పరమేశ్వరస్య సర్వప్రాణ్యాత్మకత్వా ద్యస్య ప్రాణినో యే చక్షుషీ తే తదుపా
కస్య పరమేశ్వరస్యైవేతి సర్వత్రాస్యచక్షూంషి సంపాద్యంతే ఏవం ముఖహ
పాదేష్వపి యోజితవ్యం । సతాదృశ ఏకోదేవో ద్యావాపృథివీ జనయన్
బాహుభ్యాం బాహుస్థానిభ్యాం ధర్మాధర్మాభ్యాంనిమిత్తకారణాభ్యాం సంనమ
జగత్సర్వం సమ్యగ్గాతం స్వాధీనం కరోతి । తథా పతత్రైః పతనశీలైః ఆనీ
ఉపాదానకారణైః సన్నమతిజగత్స్వాధీనం కరోతి । అథ తృతీయామాహ । కిగ్గ
స్విదాసీ దధిష్ఠానమారంభణం— మహినా విశ్వచక్షా ఇతి । లోకేహి ఘటంచికీర్షుః
కులాలోగృహాద్యదికం కించిత్స్థాన మధిష్ఠాయమృద్రూపేణ విచిత్రాదిరూపై రుపకర
ణైః ఘటం నిష్పాదయతి । ఈశ్వరస్య నిరపేక్షత్వా త్తత్సర్వమత్రాక్షిప్యతే ద్యా
వాపృథివ్యో రుత్పాదనవేళాయాం ఈశ్వరాధిష్ఠానం నివాసస్థానం కించిదాసీత్
కిన్నామభూతేన కించిదిత్యర్థః । తథా ఆరంభణంకతమగ్గ్ స్విదాసీత్ । ఆరభ్యతేనే
నేత్యారంభణ ముపాదానకారణం తదపి కతమద్భవేత్ నహి ద్యావాపృథివ్యౌ
జనయితుం సమర్థం కించి దుపాదానం సంభవతి తథాదండచక్రాదికం నిమిత్తమపి
కిమాసీత్ నకించిదపీత్యర్థః । విశ్వచక్షాః సర్వద్రష్టా విశ్వకర్మా యస్మిన్కాలేభూ
లోకం జనయన్ వర్తతే తస్మిన్కాలే మహినా సచ మహిమ్నా సాధనాంతరం
వినైవ విశేషేణ ఔర్ణోత్ ద్యావాపృథివ్యౌ ఆచ్ఛాదితవాన్ । అచింత్యశక్తిరయం
పరమేశ్వర ఇత్యర్థః । అథ చతుర్థీమాహ । కిగ్గ్స్విద్వనం- భువనాని ధారయ
న్నితి । లోకేహి ప్రౌఢం ప్రాసాదం నిర్మాతుం కస్మిం శ్చిత్ ప్రౌఢే వనే
కించి న్మహాంతం వృక్షంభిత్వా తక్షణాదినా తం సంపాదయతి । ఇహతు పర
మేశ్వరప్రేరితా జగత్సృష్టిః యతో యస్మా ద్వనా ద్యంవృక్షం ఆద్యా
వాపృథివీనిష్టతక్షుః తక్షణేన ద్యావాపృథివ్యౌ నిష్పాదితవంతః తద్వనం కింస్విత్
కింనామస్యాత్ కించిత్తాదృశం సంభవతి కథాకఉసవృక్షస్తాదృశః ప్రౌఢో వృక్షో
పి కస్స్యాత్ నకశ్చి త్సంభవతి. హే మనీషిణః విద్వాంసః మనసా స్వకీయేన
విచార్య పృచ్ఛతేత్ ఇదం సర్వం పృచ్ఛతైవ కించ ఈశ్వరో భువనానిధారయన్
యదధ్యతిష్ఠత్ యత్స్థాన మధిష్ఠితవాన్ తదపి స్థానం సర్వదా పృచ్ఛత ఏతస్య
ప్రశ్నస్య సర్వమపిఉత్తరం బ్రాహ్మణగ్రంథె సూక్తప్రపాఠకే బ్రహ్మవనంబ్రహ్మస
వృక్ష ఆసీ దిత్యేతస్యా మృచ్యామ్నాతం। స్వరూప వ్యతిరిక్తవనాది నిరపేక్షత్వామే
వాస్యోత్తరస్యాభిప్రాయః । అతోత్రాపి కింస్విద్వన మి త్యపేక్షా పరత్వే నైవ

యోజితం । పృచ్ఛతే త్యస్యాప్యయ మభిప్రాయః । భవద్భిః పృష్టేత్యభిజ్ఞా నిరపే
క్ష మేవ వదిష్యంతీతి । అథ పంచమీమాహ॥ యా తేధామాని—జుషాణ ఇతి ।
హే విశ్వకర్మన్ త్వదీయాని పరమాణి ఉత్కృష్టాని సంతి యాఅవమా యానిచావ
మాని యామధ్యమా యానిమధ్యమాని స్థానాని ఇమాతానీమాని సర్వాణి
స్థానాని సఖిభ్యస్సఖివత్ప్రియేభ్యః హవిషిహవిః ప్రధాననిమిత్తం శిక్ష ఉపదిశ ।
హే స్వధావః స్వధోపలక్షిత హవిర్లక్షణా న్నవన్ విశ్వకర్మన్ తనువం జుషాణః ।
యజమాన శరీరం సేవమానః స్వయంయజస్వ త్వదనుగ్రహమంతరేణ కోవాన్యో
యష్టుం శశక్త ఇత్యర్థః । అథ షష్ఠీమాహ । వాచస్పతిం విశ్వకర్మాణ—సాధు
కర్మేతి । విశ్వకర్మాణం పరమేశ్వరం అద్యాస్మిన్నేవ వాజీ అస్మి న్నిమిత్తీభూతే
సతి ఊతయేరక్షణాయ ఆహువేమ ఆహ్వాయామః । కీదృశం విశ్వకర్మాణం వాచ
స్పతిం మంత్రరూపాయావాచః పాలకం మనోయుజం కర్మణ్యస్మిన్మనసో యోజ
యితారసం విశ్వకర్మా నోఽస్మదీయాని నేదిష్ఠాని అత్యంతసమీపవర్తిని హవనా
నిహవీంషిభవనానివా జోషతేసేవతే కిమర్థం అవసే అస్మానవితుం రక్షితుం
కీదృశం సవిశ్వశంభూః సర్వస్మి న్జగతి శుభస్యభావయితా సాధుకర్మా అస్మ దను
కూలవ్యవహారవాన్ । అథ సప్తమీమాహ । విశ్వకర్మన్ హవిషావా—సూరిరస్త్వి
తి । హే విశ్వకర్మన్ అస్మదీయేన హవిషా వావృధానః అతిశయేన వర్ధమానః
తనువంజుషాణః శరీరం స్వీకుర్వాణః స్వయంయజస్వ । అస్మత్తోఽన్యే సపత్నా ఇహ
కర్మణి ముహ్యంతు భ్రాంతా భవంతు । మఘవా ధనయుక్తః సూరి ర్విద్వాన్
పుత్రోస్తు । అథాష్టమీమాహ । విశ్వకర్మన్ హవిషా—యథాస దితి । విశ్వకర్మన్
అస్మదీయేన హవిషాత్వం వర్ధమానేన యుక్త ఇమం యజమానం త్రాతారంఅన్యే
షాంరక్షక మింద్రంపరమైశ్వర్యోపేతం అవధ్యం కేనాపిహింసితు మశక్యమకృణోః
కురు । తస్మై యజమానాయ పూర్వం విశః పూర్వం వితత్యమానాః ప్రజాః
సమనంత సమ్యగ్ జ్ఞాతాః ఏతదధీనా భవంతు । అయం యజమానః ఉగ్రస్తీవ్ర
శక్తిస్సన్ కేనాప్యపరిభూతః విహవ్యో వివిధయాగయోగ్యో యథాసత్ యథా
భవతి తథా కురు॥ కల్పః॥ యద్యేసముద కే భీతిర్భిందే దుదకాంజలిమాదాయ
సముద్రాయవయునాయే త్యప్సుజుహుయాదిత్యయజ్ఞసంయుక్తః కల్పఇతి । పాఠస్తు
సముద్రాయ—మర్త్యగం హవిరితి । యో విశ్వకర్మా సముద్రరూపేణావతీర్యః
తస్మై సముద్రాయ నమోఽస్తు కీదృశాయ వయునాయ
కాంతాయ సింధూనాం పతయే స్యందమానానాం నదీనాం హర్త్రే సము
ద్రాకారేణ సర్వాసాం నదీనాం పిత్రోత్పాదకః తాదృశాయ విశ్వకర్మణే ఋత్వి
గ్యజమానాః విశ్వాఅహా సర్వాణ్యహాని నిరంతర మిత్యర్థః అమర్త్యమవినశ్వరం
హవిర్జుహుత ।

యో విశ్వకర్మా! యజమానుని శరీరమును బొందినవాఁడవై స్వయముగా యజ్ఞమును జేయుము. (నీయనుగ్రహమును విడచి యెవఁడు యజ్ఞమును జేయఁగలఁడు?) ఆపరమేశ్వరుఁడు మా సమీపమందున్న హవిస్సులను స్వీకరించుచున్నవాఁడును, సమస్తప్రపంచమునకు సుఖమునిచ్చువాఁడును, మమ్ము రక్షించుటకొఱకుయోగ్యమైన వ్యవహారములుగలవాఁడునునగును. కనుకనే మంత్రరూపములగు వాక్కులకుఁ బ్రభువగువాఁడును (బృహస్పతియగువాఁడును) మా మనస్సులతోఁ గూడు వాఁడు నగు నాపరమేశ్వరుఁడగు విశ్వకర్మను యజ్ఞమునందు రక్షణకొఱకు ధ్యానరూపకముగాఁ బిలుచుచున్నాము. ఓవిశ్వకర్మా! ఆజ్యాదిహవిస్సుచే మిక్కిలివృద్ధిఁ బొందుచున్నవాఁడవై స్వయముఁగా యజ్ఞమునుజేయుము. మాకంటె నితరులైన శత్రువులంతటను భ్రాంతిని బొందుదురుగాక! యజ్ఞములఁజేయువాఁడును విద్వాంసుఁడును నగు పుత్త్రుఁడుగలుగుఁగాక! ఓ విశ్వకర్మా! హవిస్సుచే వృద్ధితోఁగూడి కొన్నవాఁడవై నీవీ యజమానుని నన్యులకు రక్షకునిగను, బరమైశ్వర్య యుక్తునిగను, ఎవనిచేతను వధింపశక్యముగాని వానిగను జేయుము. ఆయజమానుని కొఱకుఁ బూర్వప్రజలు స్వాధీనమగుదురుగాక! ఈ యజమానుఁడు తీవ్రశక్తిగల వాఁడును వివిధయాగయోగ్యుఁడు నెట్లగునో యట్లుచేయుము. సముద్రస్వరూపుఁడును కాంతుఁడును (ప్రకాశకుఁడును) బ్రవహించుచున్న సమస్తనదులకు నాయకుఁడు నుత్పాదకుఁడు నగు విశ్వకర్మకొఱకు నమస్కారము. ఆవిశ్వకర్మకొఱకు సమస్తదినములు నక్షయముగా నాజ్యాదిహవిస్సులు హోమముఁ జేయుదురుగాక!

ఇట్లనుటచేఁ బరమేశ్వరుఁడగు విశ్వకర్మయే జగత్సృష్టిస్థితిలయములకుఁ గారణభూతుఁడయి యజ్ఞకర్తయు యజ్ఞభోక్తయుఁ దానయై వెలయుచున్నటులఁ గానవచ్చుచున్నది.

మఱియు,

(2) "విశ్వకర్మా దిశామ్పతి స్సనః పశూన్పాతు సోస్మాన్పాతు తస్మై నమః। ప్రజాపతీ రుద్రో వరుణోగ్ని ర్దిశాంమ్పతి స్సనః పశూ న్పాతు సోస్మాన్పాతు తస్మై నమః"

(యజుర్వేదము కాం ౫. ప్ర. ౫. అ. ౫.)

సా. భా. యోయం విశ్వకర్మా దిశామ్పాలకః సోఽస్మదీయా న్పశూనస్మాంశ్చ రక్షతుతస్మై విశ్వకర్మణే నమః। ప్రజాపతి రిత్యాదిభిః పదై శ్చత్వారో

మన్త్రాః ఉత్పన్నాః సర్వత్రాఽనుషంగాయ దిశాన్పతి రితిపునఃపాఠః.

తాత్పర్యము.

దిఙ్మయమగు ప్రపంచమున కధీశ్వరుఁడగు విశ్వకర్మ పరమేశ్వరుఁడు మా గోధనాదులను మమ్ములను రక్షించుగాక! అవ్విశ్వకర్మకొఱకు నమస్కారము. ప్రజాపతి రూపుఁడును, రుద్రరూపుఁడును వరుణరూపుఁడును అగ్నిరూపుఁడును దిఙ్మయప్రపంచాధీశ్వరుఁడును నగు నవ్విశ్వకర్మ మాపశువుల రక్షించుఁగాత! మమ్ములఁ గాపాడుఁగాత! అట్టిజగత్కర్తయగు పరమేశ్వరుని కొఱకుఁ (బౌనఃపున్యముగ) నమస్కారము. అనియున్నది.

మఱియుఁ బూర్వోక్త విశ్వకర్మ సూక్తమునందు ఋగ్వేదప్రతిపాదక మగు ౧. ౨. ౩. మంత్రములకు విద్యారణ్యులు భాష్యమిటుల వ్రాసిరి.

(౭) భాష్యమ్. (ఇతి ప్రశ్నోత్తరరూపాభ్యాం మంత్రాభ్యామపి పరమాత్మైవవిశ్వకర్మేతి కథ్యతే) [మంత్రార్థస్తు] యథా కులాలాదిః స్వశరీర మధిష్ఠాయమృజ్జలాదిక మాలంబ్య దండవ చ్చక్రచోలనాది పరికారేణ కుంభాదీన్ సృజతి। ఏవం జగజ్జనయితో విశ్వకర్మణః కింస్విత్ (కింను) అధిష్ఠానమాసీత్॥ ౧॥ తథా కింతు ఆరంభణం (ఆలంబనం) చాసీత్॥ ౨॥ కతమత్స్విత్కథా (కతమచ్చతత్కథాకీదృశశ్చ తజ్జనన ప్రకారః) ఆసీత్ ॥౩॥ యతః(యై రధిష్ఠానారంభణ ప్రకారైః) భూమిం ద్యాం(చ)జనయన్ విశ్వకర్మావి (విశేషేణ)తే భూమిదివౌమహినా(స్వమాహాత్మ్యేన) ఔర్ణోత్ (ఆచ్ఛాదితవాన్ వ్యాప్తవాన్) ఇత్యర్థః।కింభూతోవిశ్వకర్మా విశ్వంచష్టేపశ్యతీతి విశ్వచక్షాః (సర్వజ్ఞః) నహిసర్వజ్ఞంవినాఏతద్విచిత్రం జగద్బింబంరచయితుం శక్యమిత్యర్థః। అస్య ప్రశ్నత్రయోత్తరం విశ్వత ఇతి మంత్రే ణాహ పరం॥

పూర్వ ప్రశ్నోత్తరం సూచయతి। విశ్వత శ్చక్షురుతవిశ్వత స్పాత్ (సర్వతశ్చక్షుర్ముఖహస్తపాదాదిమాన్విశ్వరూపః) పరమాత్మా మహావృక్షః స్వగత పుష్పఫలశాఖా స్కంధప్రవాలాదీ నివ స్వ మేవ శరీరం విరాడాత్మక మధిష్ఠాయ కృత్స్నం చేతనం సర్వం సృజ తీతిపూర్వార్ధేన "కింస్విదాసీదధిష్ఠాన" మిత్యస్య ప్రశ్న స్యోత్తర ముక్తమ్॥౧॥

సంబాహుభ్యా మితి॥ విశ్వకర్మా బాహుభ్యాం (బహుకృత్యైః కర్మసంచయైః) సంధమతి సమ్యక్ధమతి విశ్వంనిర్మాతి ఇత్యర్థేనమంత్రాంతరాంతర్భావోదర్శ్యతి। శ్రుతిః॥బ్రహ్మణస్పతి రేతాసం కర్మారఇవాధమత్ దేవానాంపూర్వేయుగే అసతఃసదజాయతేతి। అస్యార్థః యథాకర్మారః సువర్ణకారాదిః మూర్త్యాదీనాం రూపం సంధమతి ధమనపూర్వకం నిర్మాతి ఏవంబ్రహ్మణస్పతిః దేవానాంపతా ఏతాని (జన్మానిరూపాణి) అతఏవ అసతః అసత్కల్పాదవ్యక్తాత్ కారణాత్ సత్

(వ్యక్తంకార్యం) అజాయత ఇతి మంత్రార్థః సంధమతీతి వ్యవహితేనా ప్యుప సర్గేణ క్రియాయాః సంబంధో భవతి చందాంసిపరేపి వ్యవహితాశ్చేతి స్మృతేః తథాచ సంబాహుభ్యాం తత్తత్ప్రాణికర్మాణి మృత్థానీయా న్యాలంబ్యతాని తాని శరీరాణి జనయతీతి ద్వితీయప్రశ్నస్యోత్తర ముక్తమ్॥ ౨॥

సంపతత్రైరితి శ్రుత్యర్థేన తృతీయస్యోత్తర మాహ॥ సంపతత్రైః అత్రస మిత్యుపసర్గావృత్యా తత్సంబంధో ధమతీతి క్రియాపదమనువర్తతే తేనపతత్రైః సంధమతీతి యోజనా పతత్రైః పక్షవద్భిః పక్షిసదృశై రింద్రియాదిభిరిత్యర్థః। యథావృక్షః స్వశరీమధిష్ఠాయ భోక్తృప్రాణికర్మప్రధానం మృజ్జలా ద్యంశైరా పూరితః పుష్పాదికం సృజతి ఏవంవిశ్వకర్మానామ ఏకోదేవః ద్యావాభూమీ జన యన్ జనయితుం కామః స్వమేవశరీరం సర్వతః పాణిపాదమధిష్ఠాయ తత్తత్ప్రా ణికర్మాణిమృత్థానీయాన్యాలంబ్య తత్తత్ప్రాణిసంబంధై రింద్రియాద్యంశై రాపూరి తస్సన్ అస్మదాది శరీరజాతం సృజతీతి తదేవ విశ్వకర్మపదార్థః పరమాత్మైవ గ మ్యతే ॥౩॥

తాత్పర్యము:— (ఒకఋషి. తన శిష్యునకు ప్రశ్నోత్తరరూపమున నీక్రిం దివిధముగ విశ్వకర్మమహిమను వక్కాణించెను). కులాలుఁడు తన శరీర మాధా రమొనర్చికొని మృత్తు జలము మొదలుగాగలవానిని సంగ్రహించి దండముచేఁ జక్రము (సారె) ద్రిప్పుట మొదలగువిధములుగాఁ గుంభముల నెటుల సృష్టిజేయు చున్నాఁడో,అటులనే జగన్నిర్మాణముఁజేయు విశ్వకర్మకు ముఖ్యాధారము (జగ త్సృష్టికి స్థానము) ఎయ్యది అనునది మొదటిప్రశ్న.అట్లెఆలంబనము(జగత్సృష్టికి బరికరము) ఎయ్యది? యనునది రెండవప్రశ్న. అవ్విశ్వకర్మయొక్క జగత్సృష్టి విధాన మెయ్యది యనునది మూఁడవప్రశ్న. ఏయధిష్ఠానారంభణప్రకారముచేత భూమ్యాకాశములను బుట్టించెనో ఆభూమ్యాకాశములను సర్వజ్ఞుఁడైన విశ్వకర్మ వ్యాపించెను.సర్వజ్ఞుఁడుకానిచోనిట్టి విచిత్రమైన జగద్బింబమునుసృజించుటకుసాధ్య ముకాదుగదా ! ఇట్టిప్రశ్నలకు "విశ్వత" యను మంత్రముచేత నుత్తరముఁ జెప్పఁబడినది.

విశ్వతశ్చక్షురను మంత్రమునకుఁ దాత్పర్యము:—సర్వత్ర నేత్ర ముఖ హస్త పాదాదులు గలిగి విశ్వస్వరూపుఁడైన విశ్వకర్మయను పరమాత్మ మహా వృ క్షము స్వగతములైన పుష్పములు ఫలములు కొమ్మలు చిగుళ్ళు మొదలగువానిని వలె విరాడాత్మకమైన తన శరీరమునే అధిష్ఠాన మొనర్చికొని (ఆధారముఁజేసి కొని)సమస్తములైన చేతనములను సృజించుచున్నాఁడు, (ఇది మొదటి ప్రశ్నకు నుత్తరము.)

విశ్వకర్మ బాహువులచేత (బహువిధములుగాఁ జేయబడిన కర్మసంతతుల

చేత) విశ్వమును నిర్మించుచున్నాఁడు. ధమతియను ధాతువునకు నిర్మాణపరమైన యర్థముఁ జెప్పుటకు భాష్యకర్త మఱియొకమంత్రము నీయర్థమె కలుగునది యుదాహరింపఁబూని బృహదారణ్యకమందలి "బ్రహ్మణస్పతిరేతాసం కర్మార ఇవాధమత్ । దేవానాంపూర్వ్యే యుగే అసతః సదజాయత" యను శ్రుతిని బ్రత్యక్షీకరించి స్వర్ణకారుఁడెట్లు విగ్రహాదులయొక్క రూపము ధమనరూపమున ఊదుటచే నిర్మించుచున్నాఁడో యట్లె బ్రహ్మణస్పతి (విశ్వకర్మ) దేవాదులయొక్క యీజన్మలను (రూపములను) సృజించు చున్నాఁడు. పూర్వకాలమునం దందువలననే అసత్తు(అసత్కల్పరూపమైన యవ్యక్తకారణము)వలన సత్తు(వ్యక్తకార్యము) కలిగెను. అను నర్థమును నిరూపించెను. అటులనే యాయాప్రాణికర్మలను నృత్థ్సానీయములను జేర్చుకొని యాయాశరీరములను బుట్టించుచుండెనని రెండవప్రశ్నకు నుత్తరము చెప్పఁబడినది.

"సంపతత్రైః" యని "స" మ్మను నుపసర్గతో "బతత్రైః" యనుటచే బక్షి సమానులైన కర్మవంతములగు నింద్రియాదులచేత సృష్టించుచున్నాఁడు. వృక్షము తనశరీరము నాధారముఁ జేసికొని యనుభవింపుచున్న పశు మనుష్య పక్షి కీటకాది ప్రాణులయొక్క కర్మలకుఁ బ్రధానమగునట్లు మృజ్జలాదులచేఁ బూర్ణీభవించిన దై పుష్పాదుల నెట్లుపుట్టించుచున్నదో యట్లె విశ్వకర్మయను ప్రధానదేవుఁడు భూమ్యాకాశములను సృజింపనిచ్చగలవాఁడై తనశరీరమునందంతటఁ బ్రాణులకాధారముఁ జేసికొని యాయాప్రాణులయొక్క కర్మలననుసరించి తత్తత్ప్రాణిసంబంధములైన యింద్రియాదులచే నిండినవాఁడై యస్మదాదిశరీరసముదాయమును సృష్టించుచున్నాఁడు. అని మూఁడవప్రశ్నకు నుత్తరము.

ఇందువలనఁగూడ విశ్వకర్మశబ్దము పరాత్పరత్వప్రతిపాద్యమగుచున్నది.

మఱియు,

(౭) శ్రు॥ ఏషదేవో విశ్వకర్మా మహాత్మా సదాజనానాం హృదయే సన్నివిష్టః
హృదా మనీషా మనసా ఽభిక్లిప్తో యఏత ద్విదు రమృతా స్తేభవన్తి॥
అను శ్వేతాశ్వతరోపనిషత్తునందలి,
చతుర్థాధ్యాయ మంత్రమునకు.

నిర్భేద సుఖైకతా నాత్మనో విశ్వకృత్త్వం తద్వ్యాపిత్వం సన్యాసిభిరాప్తవ్య మోక్షరూపం చాహ। ఏషఇతి। ఏషప్రకృతో దేవో ద్యోతనాత్మకో విశ్వకర్మా మహాదాది విశ్వంకర్మ క్రియతఇతికర్మ మాయావేశాద్విశ్వరూపం కార్య

తాత్పర్యము- ఏపరమేశ్వరుఁడగు విశ్వకర్మ ప్రళయకాలమునందు ఈ యనంతములగు బ్రహ్మాండములను దనయందాహుతివేసికొనునట్లు హరించి యతీంద్రియద్రష్టయై (జితేంద్రియుఁడై) మాకుఁ దండ్రియై తాను నిలిచియుండెనో అట్టి పరమేశ్వరుఁడగు విశ్వకర్మ ఆశీర్వాదరూపముచే (విస్తారమైన ప్రజోత్పత్తియగుఁగాక యను వాక్యములచే) జగద్రూపమైన ధనభోగము నపేక్షించినవాఁడై స్వకీయశరీరమధ్యంగతపుండరీకస్థానమునందు జీవస్వరూపుఁడై ప్రవేశించెను. ఆ విశ్వకర్మ (సమస్తమగు సృష్టిస్థితిసంహారరూపములైనకర్మలుగల) పరమేశ్వరుఁడుతనకు సత్యసంకల్పాదులే సాధనములుగనుక మనస్సంకల్పమాత్రముచేఁ బ్రపంచముల సంహరించెను. ఆప్రపంచములఁ గ్రమ్మఱసృజించుటకుఁ బోషించుటకుఁ గర్తయయి యంతటికంటె నధికుఁడై సర్వజ్ఞుఁడయ్యెను. ఏపరమేశ్వరతత్వమందు మరీచ్యత్రిముఖాదిసప్తర్షులు నేకీభావులని వేదాంతపారగులు చెప్పుదురో అట్టి విశ్వకర్మ యా మరీచిప్రభృతి మహర్షులకు నీప్సితముల నిచ్ఛామాత్రముగ సంపాదించెను. ఎవ్వఁడు తానొక్కఁడై (ఇంద్రమిత్రవరుణాది) సమస్తదేవతానామముల ధరించెనో అట్టి పరమేశ్వరుఁడగు విశ్వకర్మను సమస్తభువనములు ప్రశ్నించునట్లు ప్రళయకాలమునఁ బొందుచున్నవి. (ప్రళయకాలమునం దన్నిలోకములు విశ్వకర్మయందు లీనమగుచున్నవి.) ముందు నుత్పాదింపఁబడిన విశ్వకర్మలగు నేబ్రహ్మలు ధనరూపమయిన భోగ్యసముదాయమును జక్కఁగాసంపాదించిరో అతీంద్రియద్రష్టలును సర్వజ్ఞులును నగు నాఋషులు స్వకీయమైన మహత్త్వముచేత నొకప్పుడును నశ్వరులుగాక రంజనాత్మకమైన తమతమకర్మలచేఁ బ్రేరేపింపఁబడు నీసమస్తభూతములను బ్రాణయుక్తములగువానినిగా నుత్పాదింపఁజేసిరి. ఏ విశ్వకర్మ యీజగత్తును సృష్టించెనో యట్టి విశ్వకర్మను అతనిచే సృజింపఁబడిన యోజీవములారా ! మీరును మేమును దెలిసికొనకున్నాము. ప్రత్యయరూపమైన విశ్వకర్మ పరమేశ్వరతత్వము లేదనఁగూడదు. ఇఁక నేమనిన సర్వవేదాంతవేద్యమైన యీశ్వరతత్వమున్నది. జీవస్వరూపమైన యాతత్వ మేల తెలిసికొనకున్నామనిన జీవులందరు మంచువంటి యజ్ఞానముచేతఁ గప్పబడినవారలు. (మం చెప్పుడు నుదృష్టిని మిక్కిలిగా నిరోధింపఁజాలదు. బోధమాత్రసమీపస్థితి లభించిన నంతయు వెలువడును.) సర్వజీవులు నజ్ఞానముచేఁ గప్పఁబడినవారలెగాక (నేను దేవుఁడను నేను మనుష్యుఁడను ఈక్షేత్రము నాయది యీధనము నాయదియను) అబద్ధము లాడుచున్నారు. ఏపరిశారము చేతనైనఁ బ్రాణములను దృప్తిఁబొందించుచున్నారు. స్వర్గాపేక్షచే యజ్ఞాద్యుక్తకర్మలను చేయుచు సంచరించుచున్నారు. (ఐహికాముష్మికభోగగర్వితులై మెలఁగుచున్నారు.) అందుచే మిథ్యాజ్ఞానపరాధీనులరగు మీకు యథార్థ

తత్వజ్ఞానము లేదు. ఏపరతత్త్వము గుహావంటి హృదయపుండరీకమునందు గూఢమైనదో ఆతత్వము స్వర్లోకమునకంటె భూమికంటె దూరముననున్న విలక్షణమైనది. మఱియు దేవతలచేతను రాక్షసులచేతను బొందఁబడక దూరముననుండునది. (గురుశాస్త్రవిముఖులకుఁ బొంద శక్యముగానిది) ఏగర్భమునందు సమస్తదేవతలుగూడి ప్రవర్తించిరో ఆకంస్విన్నామక గర్భమును ఉదకములు ముందుగా ధరించినవి. ఏగర్భమునం దీసమస్తమగు ప్రపంచ మాశ్రయించియున్నదో యేకమగు నాబీజముజన్మరహితమగు పరమేశ్వరతత్వముయొక్క నాభియందుస్థాపింపఁబడినది. ఆబీజమువలన విశ్వకర్మ బ్రహ్మయైపుట్టెను. తరువాత రెండవవాఁడు గంధర్వుఁడయ్యెను. మూఁడవవాఁడు ఓషధీపాలకుఁడగు సోముఁడుపుట్టెను. తరువాతఁ బరమేశ్వరుఁడు బ్రహ్మాండమంతయు వేలువేలుగసృష్టించెను. చక్షురాది ప్రాణసముదాయమునకు నుత్పాదకుఁడు ధీరుఁడు నగు నవ్విశ్వకర్మ మనస్సంకల్పమాత్రముచేఁ బ్రాణ్యుపభోగసాధనములగు నీస్వర్గమర్త్యలోకములఁ బరస్పరానురాగము గలుగునట్లు సృష్టించెను. ఎప్పుడు ప్రథమోత్పన్నములై చేష్టావంతములైన చరాదిప్రాణములు దృఢవంతములైనవో వానివెంటనేస్వర్లోకభూలోకములు విస్తరించినవయ్యెను. సర్వత్రనేత్రములుగలిగినట్టియుసర్వముఖములుగలిగినట్టియు నంతటను బాహువులుగలిగినట్టియు నంతటను పాదములు గలిగినట్టియు స్వయంప్రకాశుఁడు నద్వితీయుఁడునగు విశ్వకర్మ స్వర్గమర్త్యలోకములను సృజించుచు నిమిత్తకారణములైన ధర్మాధర్మములను బాహువులచేఁ బతనశీలములగు నుపాదానకారణములతో జగత్తును స్వాధీనపఱచుకొనుచున్నాఁడు. సర్వద్రష్టయగు విశ్వకర్మ స్వర్లోక భూలోకములను సృష్టించుచున్నవాఁడగునేని (ఆవిశ్వకర్మకు) నివాసస్థానమేమి ? ఉపాదానకారణమేమి ? అను ప్రశ్నమునందు నీశ్వరుఁడు నిరపేక్షుఁడగుటవలన మఱియొకవస్తువువలన సృష్టించినవాఁడు గానేరఁడు. ఇఁక నేమనినఁ దనమహిమచేతనే స్వర్గమును భూమిని గప్పెను. (ఈపరమేశ్వరుఁడు యోజింపశక్యముగానివాఁడు.) అతని సాధనములకు వనమెక్కడ ? దాని పేరేమి ? అక్కడ శ్రేష్ఠవృక్షమేమి ?స్వర్లోకమర్త్యలోకము లెట్లు సృష్టింపఁబడినవి ? అను ప్రశ్నలను నోవిద్వాంసులారా! మీమనస్సుతో విచారించియఱిగితిరేని (ఆవిశ్వకర్మ) సమస్తభువనములను ధరించుచున్నవాఁడై యేస్థానమునధిష్టించెనో యదియె స్థానము. (అన్నిటికి నాధారభూతుఁడగు విరాట్పురుషుఁడుసంకల్పమాత్రముచేతనే సమస్తబ్రహ్మాండములను సృజించుచున్నాఁడని భావము.) ఓవిశ్వకర్మా! నీసంబంధములైన స్థానములలో నేవి యుత్కృష్టములో యేవి మధ్యమములో యేవియధమములో యీ మూఁడుస్థానములను నీప్రియులకొఱకు హవిర్దానవిషయమై యుపదేశింపుము. స్వధోపలక్షితములగు హవిర్లక్షణములు గల

మస్యేతి విశ్వకర్మా, మహాంశ్చాసావాత్మేతి మహాత్మా సర్వవ్యాపీత్యర్థః । సదా సర్వదా జనానామ్ హృదయే పరమే వ్యోమ్ని హృదయాకాశే జలాద్యుపాధిషు సూర్య ప్రతిబింబవ న్నివిష్టః । సమ్యక్ స్థిత ఇత్యేతత్ సఏవసాక్షిరూపేణ హృదా హృద్ధారణఇతి స్మరణా ద్ధరతీతి హృత్తేన హృదా నేతినేతీతి నిషేధోపదేశేన మనీషాఽయం పురుషార్థోఽయ మపురుషార్థోఽయ మాత్మాఽయ మనాత్మేత్యేతయా వివేకబుద్ధ్యా మనసా విచారసాధ్యైకత్వ జ్ఞానేన చాభిక్లృప్తః । ప్రకాశితోఽఖండైక రసత్వే నాభివ్యక్త ఇత్యేతత్, యేజనాః సాధనచతుష్టయ సంపన్నాః సన్న్యాసిన ఏత త్తత్వమస్యాది వాక్యప్రతిపాద్యైక రూప మఖండైకరస మి... యావద్విదు ర్బ్రహ్మాఽహ మస్మీ త్యపరోక్షీకుర్యు స్తేయథోక్త జ్ఞానినోఽమృతా భవ న్త్య మరధర్మాణః పునరావృత్త రహితా భవ న్తీత్యర్థః।

అను శంకరభాష్యమున ననుసరించి,

జగద్రూప మాయాసంసర్గమునఁ జతుర్దశభువన సృష్టికారుఁడై యెట్లయెదుటఁ బ్రకాశించు నీవిశ్వకర్మ పరమేశ్వరుఁడు సదాసకలజీవుల హృదయాకాశమునందును జలదర్పణాదులయందు సూర్యప్రతిబింబంబుపోలికఁ జక్కఁగానిలిచియుండెను. అతఁడే సాక్షిరూపుఁడై బరమాత్మ స్వరూపజ్ఞానసాధనంబులగు మనోబుద్ధిచిత్తంబులచే సచ్చిదానందస్వరూపమున నభివ్యక్తుఁ డయ్యెను. సాధనచతుష్టయసంపన్నులగు నేమునిజనంబు లీస్వరూపమును తత్త్వమస్యాది వాక్యప్రతిపాద్యైకరూపాఖండైకరస మనినేనుబ్రహ్మమైతి ననుప్రత్యక్ష జ్ఞానంబుచేఁ దెలియుచుండిరో అట్టిజ్ఞానసంపన్నులు పునరావృత్తి రహితంబగు బ్రహ్మపదంబుఁ బొందుచున్నారు. అనుతాత్పర్యముచే విశ్వకర్మకుఁ బరబ్రహ్మత్వము ప్రతిపాదింపఁ బడుచున్నది.

ఇవిగాక (ఖిల) శ్రుతులు పెక్కుఁలిటులనే వివరించుచున్నవి. వానిలోఁగొన్నిటిమాత్ర మీక్రింద నుదాహరింపఁబడినవి.

(4) "త్వష్టా విశ్వకర్మా జగద్ధేతుకర్తా సోయం దేవాధికః"

తా॥ ప్రపంచ కారణకర్తయగు త్వష్టృవిశ్వకర్మ దేవులయందఁటిలో నధికుఁడు.

(5) "నధాతా నవిష్ణు ర్నరుద్రో నదేవో విశ్వకర్మా సఏకోవిశ్వంప్రతితిష్ఠతి"

తా॥ బ్రహ్మవిష్ణురుద్ర దేవతలు లేనప్పుడు విశ్వకర్మ యొకఁడే ప్రపంచమును బ్రతిష్ఠించెను.

(6) "విరాడ్విశ్వరూపః పురుషః సదాశివో విశ్వకర్మా సఏతం లోకం సర్వమసృజనత్"

తా॥ విరాట్టును విశ్వరూపుఁడును పురుషుఁడును నిరతశుభంకరుడు నగు విశ్వకర్మ యీసమస్తలోకమును బుట్టించెను.

మఱియు నొక విశ్వకర్మోపనిషన్మధ్యమునందు,

(7) "యస్మా ద్విశ్వగ్ం సమస్తం క్రియతె। సమాం విశ్వకర్మాపాతు। విశ్వ సృష్టా విశ్వభర్తా విశ్వస్యాంతకః।.........

...విరాడ్విశ్వకర్మా। స్వరాడ్విశ్వకర్మా। సమ్రాడ్విశ్వకర్మా। బ్రహ్మావిష్ణు రుద్ర శతముఖాదయో దేవా జాయంతే। విశ్వేదేవా వసవః పితరో గంధర్వా ఇమే సర్వేలోకా శ్చేతివిశ్వకర్మణః।

తా॥ ఎవనివలన నీసమస్తప్రపంచముచేయఁబడినదో ఆవిశ్వకర్మ నన్ను రక్షింపవలెను. లోకమును సృష్టించుచుఁ బోషించుచు హరించుసట్టియు విరాట్టు స్వరాట్టు సమ్రాట్టులస్వరూపమునుబొందినట్టి విశ్వకర్మవలన బ్రహ్మావిష్ణురు ద్రేంద్రాదులును విశ్వేదేవులు వసువులు పితరులు గంధర్వులు ఈసర్వలోకములును బుట్టుచున్నవి.

ఇందున కనుకూలమగు పురాణవచనముల విచారించుదము.

(8) శ్లో॥ విశ్వకర్మ స్వరూపేణ ప్రభూతః పరమప్రభుః
తన్మూర్తి లక్షణం వక్ష్యే సుమనా శ్శృణుషణ్ముఖ॥
నమోస్తు విశ్వరూపాయ విశ్వాఖ్యానాయ తేనమః
నమోవిశ్వాత్మభూతాయ విశ్వకర్మ న్నమోస్తుతే॥
విశ్వమంగళ మాంగళ్య విశ్వవిద్యావినోదినే
విశ్వసంసార బీజాయ నమస్తే విశ్వకర్మణే॥
విశ్వాయ విశ్వరూపాయ నమస్తే విశ్వమూర్తయే
విశ్వమాతా పితారూప విశ్వకర్మ న్నమోస్తుతే॥

స్కంద పురాణము, నాగరఖండము విశ్వకర్మోపాఖ్యానము ప్రథమసర్గము.

తా॥ పరమేశ్వరుఁడు విశ్వకర్మస్వరూపముచేఁ బుట్టెను. ఆవిశ్వకర్మయొక్క స్వరూపలక్షణమును జెప్పెదను షణ్ముఖా! సావధానుఁడవై వినుము.

విశ్వస్వరూపుఁడును, విశ్వమునువివరించువాఁడును, విశ్వమునకు జీవస్వరూపుఁడునగునోవిశ్వకర్మా! నీకునమస్కారము. ప్రపంచశుభములే శుభములైనవాఁడును సమస్తలోకములందలివిద్యలను వినోదించువాఁడును విశ్వోత్పత్తికినంకురమైనవాఁడును నగు నోవిశ్వకర్మా నీకు నమస్కారము. విశ్వమైనవాఁడవును విశ్వమేస్వరూపమునుబొందినవాఁడవును విశ్వాకారముగలవాఁడవైన నీకు నమస్కారము. విశ్వమునకుఁదల్లిదండ్రివియైన యోవిశ్వకర్మా నీకు నమస్కారము.

సువ్రతఉవాచ.

(9) శ్లో॥ నమస్తే కాళహస్తీంద్ర కుమారేశేశ్వరోదితః
కోవదద్విశ్వకర్మేతి దేవో విశ్వాధినాయకః॥
వదస్వ కాళహస్తీంద్ర శ్రోతుమర్హో భవేదహం
తత్కథామృతపానేన క్షుధామాం నైవబాధతే॥

కాళహస్తిముని రువాచ.

శ్లో॥ యద్విశ్వకర్మణో రూప మవాఙ్మానసగోచరం
సువ్రతశ్రుణు వక్ష్యామి చేశ్వరోక్తేనవర్త్మనా॥ ౧౦
నబ్రహ్మనైవవిష్ణుశ్చ నరుద్రోనచదేవతా
ఏకఏవభవేద్విశ్వ కర్మావిశ్వాధిదేవతా॥ ౧౧
నిర్గుణంసగుణంచేతి ద్వివిధంవిశ్వకర్మణః
మూర్తిభేదంమహద్గూఢం సర్వేషాంసంశయావహం॥ ౧౨

సువ్రతఉవాచ.

శ్లో॥ యన్నిరాకారసాకార భేదంమేవిశ్వకర్మణః
కాళహస్తిమహాయోగిన్ క్రమాద్వదచవిస్తరాత్॥ ౧౩

కాళహస్తిమునిరువాచ.

శ్లో॥ నిర్గుణేపంచధాభేదా లీలాస్తావిశ్వకర్మణః
క్రమాచ్ఛృణుష్వరాజర్షే వేదమస్తకబోధితాః॥ ౧౪
ప్రథమస్తునిరాకార ఓంకారస్తదనంతరం
చిదానందఃపరంజ్యోతి ర్బ్రహ్మానందస్తుపంచమః॥ ౧౫
యన్నిరాకారభేదాస్తు అవాఙ్మానసగోచరాః
సగుణేతుతథాపంచ భేదాస్తేవిశ్వకర్మణః॥ ౧౬

సువ్రతఉవాచ.

శ్లో॥ నమస్తేకాళహస్తీంద్ర ప్రథమంవిశ్వకర్మణః
నిరాకారంపవిత్రంమే వదతత్కీదృశంగురో॥ ౧౭

కాళహస్తిమునిరువాచ.

శ్లో॥ నిరాకారంనిరాలంబం సర్వశూన్యమగోచరం
నిశ్శబ్దమస్పృశంరూప రసగంధవివర్జితం॥ ౧౮
నీరూపమాద్యమోంకారం బ్రహ్మబీజంపరాత్పరం
అక్లేదంనాశరహిత మనేకాంకురకారణం॥ ౧౯
ఆదిమధ్యాంతరహితం మిథోవ్యావృత్తివర్జితం
గుణయోనిగుణాతీతం సమస్తవ్యస్తకారణం॥ ౨౦

నాదబిందు కలాతీతం సర్వపూర్ణం నిరంజనం
ఇదం బ్రహ్మ స్వరూపంచ యత్తదోంకారమీరితం॥ ౨౧
క్వచిన్మహ త్క్వచిదణు క్వచిద్గురు క్వచిల్లఘు
క్వచిత్తమః క్వచిత్తేజః క్వచిత్స్ఫురతిలీయతే॥ ౨౨
క్వచిత్పతతి సమ్యాతి వాత్యస్తీతి నసంశయః
భావితం యత్రకుత్రైవ సచ్చిదానందముచ్యతే॥ ౨౩
సూర్యేచ వర్త తేజ్యోతి ర్యద్వత్తత్తే హుతాశనే
చంద్రేచ వర్తతేజ్యోతి ర్యచ్చ తారాగణేష్వపి॥ ౨౪
జీవరాశిషు మేఘేషు వేదాంతేషు చవిద్యతే
దేవతాంతర భేదేషు జ్యోతిర్య ద్విద్యతేపృధక్॥ ౨౫
యస్మిన్భూత్వాపున స్తస్మిన్ ప్రలీయంతే భవంతిచ
జ్యోతిషాం పరమంస్థానం తత్పరంజ్యోతి రిష్యతే॥ ౨౬
పుష్పమధ్యే యథాగంధో దారుమధ్యే యథానలః
దధిమధ్యేయథాసర్పి ర్బీజమధ్యే యథాంకురః॥ ౨౭
వ్యజనేచ యథావాయుః పృథ్వీమధ్యే యథాజలం
శంఖమధ్యే యథానాదో వృక్షమధ్యే యథారసః॥ ౨౮
తథాసర్వ శరీరేషు చాణురే ణ్వంతరేష్వపి
గత్వాభ్రమతియత్సర్వం తత్పరంబ్రహ్మఉచ్యతే॥ ౨౯
ఇతి విశ్వకర్మపురాణే ద్వితీయోధ్యాయః॥

సుప్రతఉవాచ.

శ్లో॥ సగుణేకతిభేదాస్తే సాకారావిశ్వకర్మణః
బ్రువతాంపురుషవ్యాఘ్ర కాళహస్తి మహామునే॥ ౧

కాళహస్తిమునిరువాచ.

శ్లో॥ విరాడ్రూపంవిశ్వరూప మేకరూపంపరంశివం
పంచమంవిశ్వకర్మాణ మిమానిసగుణౌతథా॥ ౨

సుప్రతఉవాచ.

శ్లో॥ విరాడాదిమమాచక్ష్వ పంచరూపాణిచాధునా
కాళహస్తినకృతార్థోస్మి త్వయాసుజ్ఞానబోధతః॥ ౩

కాళహస్తి మునిరువాచ.

విరాడ్రూపమసంకాశ మచింత్యంవాగగోచరం
అనంతకోటిసూర్యాభం నానారాగప్రభోజ్వలం॥ ౪
ఊర్ధ్వరేతంవిరూపాక్షం వ్యోమకేశందిగంబరం

రోమరంధ్రస్థితానేక కోటిబ్రహ్మాండజాలకం॥
స్వేదాంబుకణసంకాశ ప్రతీకస్థితసాగరే
నటనత్వరసంభూత జటాసందోహవైభవం॥
కపాలమాలికాక్రాంతం మాయాతీతంపరాత్పరం
వజ్రశూలగదాహస్తం భస్మోద్ధూళితవిగ్రహం॥
ఏవమక్షరమవ్యక్తం నాద్యంతంవిశ్వకర్మణః
ఇదంవిరాట్స్వరూపంచ దర్శితంతేమహీపతే॥
విశ్వకర్మపురాణే, తృతీయోధ్యాయః॥

తాత్పర్యము.

సువ్రతమహారాజిట్లడిగెను. ఓశ్రేష్ఠుఁడవైన కాళహస్తిమహర్షీ! నీకొఱకునమస్కారము. లోకాధినాయకుఁడగునీశ్వరుఁడు కుమారస్వామితోఁజెప్పినవిశ్వకర్మయను దేవుఁడెట్టివాఁడు? అనువిషయమునుజెప్పుము. ఓకాళహస్తిమహర్షీ! ఆకథామృతమును పానమునుజేయుటచేత క్షుధాదులు నన్ను బాధింపవు.

కాళహస్తిముని చెప్పుచున్నాఁడు.

ఓసువ్రతా! అవాఙ్మానసగోచరమైన యావిశ్వకర్మస్వరూపమును ఈశ్వరోక్తమైనమార్గముచేతఁ జెప్పుచున్నాను వినుము. బ్రహ్మవిష్ణురుద్రాదిదేవతలులేనప్పుడె లోకాధ్యక్షుఁడైన విశ్వకర్మయొక్కఁడె యుండెను. ఆవిశ్వకర్మయొక్క స్వరూపము నిర్గుణము సగుణమునని రెండువిధములు. ఈభేదము మహారహస్యము ఎల్లరకు సంశయము పుట్టించునది.

సువ్రతుఁడిట్లనియె.

నిర్గుణ సగుణములగు నావిశ్వకర్మయొక్క నిరాకార సాకారభేదములెట్లుండునో యోకాళహస్తిమహర్షీ! క్రమముగా విస్తరించి చెప్పుము.

కాళహస్తిమహర్షి యిట్లనియె.

ఉపనిషద్బోధితములగు నావిశ్వకర్మయొక్క నిర్గుణలీలలు నిరాకారము ఓంకారము, చిదానందము, పరంజ్యోతి, బ్రహ్మానందము అను నైదువిధములు. అవాఙ్మానసగోచరములైన నిరాకారభేదము లెట్టుల యైదుగనైనవియో యట్లనే సాకారభేదములుగూడ నైదైనవి.

తిరుగ సువ్రతుఁడిట్లడిగె.

ఓకాళహస్తిమహర్షీ నమస్కారము. పవిత్రమైన యావిశ్వకర్మయొక్క నిరాకారస్వరూపమును వివరముగాఁ దెలుపుము.

కాళహస్తిముని యిట్లువాక్రుచ్చె.

రూపములేనిదియు నామములేనిదియు సమస్తశూన్యమైనదియు గోచరింప

దియు శబ్దములేనిదియు ముట్టుకొనఁదగనిదియు రూపము రసము గంధములేనిది యు, మొదలైనదియుఁ బ్రణవస్వరూపముఁ బొందునదియు బ్రహ్మమె అంకురము గాఁగలదియుఁ బరవస్తువునకుఁ బరమైనదియు నెంచుటకు శక్యము,గానిదియు నా శనములేనిదియు సమస్తాంకురములకుఁ గారణమైనదియు నాదిమధ్యావసానములు లేనిదియుఁ బరస్పరభేదరహితమయినదియుఁ ద్రిగుణములకు గారణమైనదియు, ద్రిగుణములకు నతీతమయినదియు, సమస్తభేదములకుఁ గారణమైనదియు నాదబిందుకళల కతీతమయినదియు సమస్త మునిండినదియు దుఃఖరహితమైనదియునగు నీ బ్రహ్మస్వరూపము నోంకారరూప మున్నైనదిగాఁ జెప్పుదురు. ఒక్కచోఁగొప్పది యొక్కచో నణువయినది యు నొక్కచోబరువయినదియు నొక్కచోఁ దేలికయయినదియు నొక్కచోఁ జీఁ కటియైనదియు నొకచోఁ దేజస్సయినదియు నొకచోఁ బ్రకాశించునదియు నొక చో నడఁగునదియు నొకచోఁ బడుచున్నదియు నొక్కచోఁబోవునదియు నొక్క చోపీచునదియునగుపరవస్తువుగలదుసందేహములేదు. ఏదిసర్వత్రభావింపఁబడినదో యది చిదానందస్వరూపముగాఁ జెప్పఁబడినది. సూర్యునియందే తేజస్సుకలదో యటులనె యగ్నియందుఁ జంద్రునియందు నక్షత్రపంక్తియందు జీవకోటుల యందు మేఘములయందు నుపనిషత్తులయందు దేవతాభేదములయందు నా తేజస్సు గలదు. దేనియందుఁబుట్టి దానియందే యడఁగుచున్నదో దానిని తేజస్సు లకు ముఖ్యస్థానమయినదిగను నుత్కృష్ట తేజస్సయినదిగను జెప్పఁబడును.పూవుల లోని తావివలెను దారువులోని యగ్నివలెను పెరుగులోని నేయివలెను విత్తనము లోని మొలకవలెను దాళవృంతములోని వాయువువలెను భూమిలోని జలము వలెను శంఖములోని నాదమువలెను వృక్షములోని రసమువలెను సర్వశరీరముల యందు నణురేణువులయొక్క మధ్యయందునుబొంది యెయ్యది తిరుగునో యది బ్రహ్మపదార్థముగాఁ జెప్పుదురు.

సువ్రతుఁ డిట్లనియెను.

ఓకాళహస్తిమహర్షీ! విశ్వకర్మయొక్క సగుణస్వరూపము లెన్ని విధ ములోఁ జెప్పుము.

కాళహస్తిముని యిట్లు వివరించెను.

మొదటిది విరాట్స్వరూపము రెండవది విశ్వస్వరూపము మూడవదియ ద్వితీయ స్వరూపము నాల్గవది శివస్వరూపము ఐదవది విశ్వకర్మ స్వరూపము అట్లై యీయైదు భేదములు.

సువ్రతుఁ డిట్లడిగెను.

ఓకాళహస్తి మహర్షీ! నీసుజ్ఞానబోధవలనఁ గృతార్థుఁడ నయితిని.విరాట్టు

మొదలుగాఁగల యాపంచరూపము లిప్పుడు వివరింపుము.

కాళహస్తిముని చెప్పెను.

విరాట్స్వరూపము సామాన్య రహితమయినదియుఁ దలఁచుటకుఁ జెప్పుటకుఁజూచుటకు శక్యముగానిదియు ననంతకోటిసూర్యులవలెఁ బ్రకాశించునదియు నెల్ల రంగులకాంతులలోఁ బ్రకాశించునదియు నూర్ధ్వరేతస్సుకలదియు విరూప నయనములు గలదియు నాకాశలేశములుగలదియు దిక్కులే వసనములుగలదియు రోమరంధ్రములయందుండిన యనేక కోటి బ్రహ్మాండములుగలదియుఁ జెమ్మట బొట్టులవలె నున్న దేహమందున్న సాగరమునందు నటించుటకుఁద్వరపడుచున్న జడలయొక్క పంక్తులవైభవము గలిగినదియుఁ గపాలమాలికలచే నాక్రమింపఁబడి నదియుమాయ నతిక్రమింపబడినదియు పరునకుఁ బరమైనదియు వజ్రశూల గదాదులగు భయంకరాయుధముల హస్తమందు ధరించినట్టిదియు భస్మముచేఁ బూయఁబడిన యాకారముగలదియునగు విశ్వకర్మయొక్క విరాట్స్వరూపము నోరాజా చూపఁబడినదని విశ్వకర్మ పరత్వము నిరూపించెను.

## నిరుక్తవిశ్వకర్మ.

ఇఁక ఋగ్వేదమందలి విశ్వకర్మ సూక్తమునకు నిరుక్త కర్త వ్రాక్రుచ్చిన విధమును విచారించుదము.

(10) ఋగ్వేద. అ౮ । ౩ । ౧౬ । ౨. (విశ్వకర్మ సూక్తఋక్)

విశ్వకర్మా విమనా ఆద్విహాయా ధాతా విధాతా పరమోత సన్దృక్ తేషా మిష్టాని సమిషామదన్తీయత్ర సప్తఋషీ న్పరఏక మాహుః॥

నిరుక్తఉత్తరషట్క అధ్యాయ ౧౦ పా ౩ ఋక్ ౨౬. విశ్వకర్మా విభూతమనా వ్యాప్తా ధాతాచ విధాతాచపరమశ్చ సంద్రష్టా।భూతానాం తేషామిష్టాని వాకాంతానివా క్రాంతానివా గతానివా మతానివానతానివాద్భిః సహసమ్మోదంతే యత్రైతాని సప్తఋషీణాని జ్యోతీంషి తేభ్యః పరఆదిత్య స్తాన్యేతాస్మిన్నేకంభవ న్తీత్యధిదైవత మథాధ్యాత్మం విశ్వకర్మా విభూతమనావ్యాప్తా ధాతాచ విధాతాచ పరమశ్చ సన్దర్శయి తేన్ద్రియాణా మేషామిష్టాని వాకాన్తాని వాక్రాన్తాని వా గతానివా మతాని వానతాని వాన్నేన సహసమ్మోదన్తే యత్రేమాని సప్తఋషీణా నీంద్రియాణ్యేభ్యః పరఆత్మా తా న్యేతస్మిన్నేకం భవ న్తీత్యాత్మగతి మాచష్టే, తత్రేతిహాస మాచక్షతే,విశ్వకర్మా భౌవనః సర్వమేధే సర్వాణి భూతాని జుహవాఞ్చకార సఆత్మాన మప్యన్తతో జుహవాఞ్

చకార తదభివాది న్యేషర్గ్భవతి । యఇమా విశ్వా భువనాని జుహ్వాదితి తస్యోత్త్
రా భూయసే నిర్వచనాయ ॥ ౨. (౨౬)

ఇందులకు భగవద్దుర్గాచార్య విరచిత వ్యాఖ్యానానుసరణభావార్థమును విచారింపఁగా:— భౌవన విశ్వకర్మ మంత్రమునకుఁ బ్రజాపతి ఋషియనియు, అగ్నియందు వైశ్యకర్మణ సూక్తముల రెంటిచేతను షోడశగృహీతములు గా హోమములు చేయుట వినియోగ మనియు విశ్వకర్మ యన్నిచోటుల నప్రతిహతమైన ప్రజ్ఞానము గలవాఁ డనియు, నట్టి యప్రతిహత ప్రజ్ఞానుఁడే గాక సర్వ విధములఁ దనంతటఁ దానే గొప్పవాఁడనియు నిట్లు సర్వవిధముల నేహేతువుచే గొప్పవాఁడో యందువలననే సర్వభూతములను బుట్టించువాఁడనియు, నట్లు బుట్టించి పోషించువాఁడనియుఁ బ్రవర్తించుచున్న సకలకార్యములను జక్కఁగాఁ జూచువాఁడనియు మున్నగు విషయములు పూర్వోక్తవిధముగా నక్కాణించుచు "విశ్వకర్మా భౌవనః సర్వమేధే" అను నిరుక్తకారు నివచనమునకు "విశ్వకర్మా హభౌవనః యథోదితమిదం వైదికం" అని వ్యాఖ్యాత వివరించెను. అనఁగా భౌవనుఁడగు విశ్వకర్మ సర్వమును హోమమును జేసెను. ఇది వేదమునందుఁ జెప్పఁబడినది యనెను. పరమాత్మ విశ్వకర్మ భౌవనావతారమున నావిర్భవించినటుల నిందుచేఁ దెలియుచున్నది. ఇందులకు వేదవచనమేమియని విచారించితిమేని.

—✻ భౌవనవిశ్వకర్మావతారము. ✻—

(11) శ్రు॥ ఏతేనహవా ఐంద్రేణ మహాభిషేకేణ కశ్యపో విశ్వకర్మాణంభౌవన మభిషిషేచ। తస్మాదు విశ్వకర్మా భౌవనః సమస్తం సర్వతః పృథివీం జయన్ పరియాశ్వై రుచమేధ్యై రీజే ॥

ఐతరేయబ్రాహ్మణపంచికా౮ఖం ౨౧-౪౮

భాష్యమ్, ఐంద్రేణ ఇంద్రియతీతీంద్రః ఇది పరమైశ్వర్య ఇతిధాతోః నిష్పన్న ఇంద్రః సర్వోత్కృష్ట ఇత్యర్థఃతస్యఇంద్రస్య సంబంధినా ఐంద్రేణఏతేన పూర్వోక్తేణ మహాభిషేకేణ మహాన్స్వాసావభిషేకశ్చ మహాభిషేకః ఏతేన మహాభిషేకేణ ఏవప్రసిద్ధార్థే పదాభిషేకేణైవ కశ్యపః కశ్యపోనామఋషిః భౌవనః భువనస్యాపత్యం భౌవనః తంభౌవన విశ్వకర్మాణం అభిషేచహ అభిషేచనంకృతవాన్ ఖలు। తస్మాత్సామ్రాజ్యాభిషేకా దేవ భౌవనోవిశ్వకర్మా పృథివీమ్ భూమిం సమంతం చతుస్సాగరపర్యంతం సర్వతః సమంతాత్ జయన్ విజయంకుర్వన్ పరియాయ పరిపాలనం కృతవాన్ కించ మేధ్యేన పవిత్రేణ అశ్వేన ఈజే. అశ్వమేధ

యజ్ఞం చకారే త్యర్థః అపరేతు సంక్షేపేణ భౌవనం (భువనస్యపుత్త్రిం) ఉ (నిశ్చి తం) సమంతం (పరితః) సర్వతః [కృత్స్నం] పరియాయ (పరాక్రాంతవాన్) ఈజే (ఇష్టవాన్).

ఇందలి తాత్పర్యము సుగమమే:-అనఁగాఁ గశ్యపుఁడను మహర్షి భువనపు త్త్రిఁడగు విశ్వకర్మకు సర్వోత్కృష్టమగు సార్వభౌమపట్టాభిషేకముఁ జేసెను. ఆ సామ్రాజ్యాభిషేకమువలన భౌవనవిశ్వకర్మ చతుస్సముద్రముద్రితమైన భూవల యమునంతయు జయించి పరిపాలన మొనర్చెను. మఱియు నశ్వమేధయజ్ఞమును జేసెను. (మఱికొందఱు) భువనపుత్త్రిఁడగువిశ్వకర్మనే నిశ్చయించి యభిషేక మొనర్చెను. అతఁ డఖిలభూభాగమును బరాక్రమించెను. యజ్ఞాదు లొనర్చెన నియుఁ జెప్పుదురు.

ఇందలి కశ్యపుఁ డెవ్వఁడని విచారింపవలసియున్నది. "కశ్యపోయాస్వింద్రః" అను యజుర్మంత్రమునకు హరదత్తాచార్యులు భాష్యము వ్రాయుచు "కశ్యప ఇ త్యాదిత్య స్యాభిధానం, పశ్యతి సర్వమితి పశ్యః పశ్యఏవపశ్యకః, తత్రాద్యంత విపర్యయేణ కశ్యపో భవతి. కించ దృశ్యతే చారణ్యకేచ కశ్యపః పశ్యకో భవతి యత్సర్వం పరిపశ్యతీతి" అని వివరించిరి. అనఁగా సర్వముఁ జూచువాఁడు పశ్యుఁడనియు పశ్యుఁడే పశ్యకుఁడనియు, ఆద్యంతవిపర్యయమువలనఁ గశ్య పుఁ డయ్యె ననియు యజురారణ్యకమునందుఁ గూడఁ గశ్యపుఁడు పశ్యకుఁడని చెప్పియున్నదనియు నుదాహరించిరి. కావునఁ గశ్యపుఁ డనజగద్ద్రి ష్టయగు పరమేశ్వరుఁడు (సూర్యుఁడు) నగు. మఱియొకచో భాష్యాంతరమున "శ్రుతేః ప్రామాణ్యావబోధక విరాట్స్వరూపం కశ్యపో నామ పరబ్రహ్మ సమ స్తభూర్భువాదిలోకనిర్మాణం చికీర్షన్ తదపేక్షాయ స్వయమేవరూపాంతరః సన్ విశ్వ కర్మాభిధేయ మవధార్య తత్ప్రభావజన్యవిశ్వకర్మాకథమిత్యపేక్షాయాహేతి" అనగా వేదచోదితుఁడును విరాట్స్వరూపుఁడునగు కశ్యపనామపరబ్రహ్మసమస్తలోకనిర్మా ణమును జేయనిచ్ఛించినవాఁడై స్వయముగారూపాంతరము నవలంబించి "విశ్వ కర్మ'యనుపేరటఁ దత్ప్రభావమువలనఁ బుట్టిన విశ్వకర్మ యెట్లనియపేక్షించి చెప్పెనని తెలియుచున్నది.

మఱియు, రుద్రయామళ విశ్వసారోద్ధారతంత్రమునందుఁ "గశ్యపో విరా ట్స్వరూప" మనియు స్కందపురాణనాగరఖండ విశ్వకర్మోపాఖ్యాన మందలిచతు ర్థాధ్యాయమున౨౮వ శ్లోకమున "కశ్యపో విశ్వకర్మాచ విశ్వలోకపితామహః విజ్ఞేయ దేవబృందైశ్చ జననం కథ్యతేశ్శృణు" అనియుఁ జెప్పుచుండుటవలనఁ గశ్యపునకు విశ్వకర్మకు నభేదాధ్యవసాయ మని సూచితపరచుచున్నది. కశ్యపుఁడన సూర్యుఁ డనునర్థమే యయినను "విశ్వకర్మా సహస్రాంశొ మునిభిర్దేవశిల్పి

నో॥"అనుమేదినీకోశోక్తివలన విశ్వకర్మయన సూర్యపర్యాయ మర్థమిచ్చుచుండు టచే విరోధముగానరాదు. ఏదిమెట్లున్నను కశ్యపుఁడన సర్వలోకద్రష్టయగు పర మేశ్వరుఁడు. అతఁడు నిజావతారుఁ డగుభౌవనవిశ్వకర్మకు లోకసృష్టిస్థితుల పేక్షించి సార్వభౌమ పట్టాభిషేకమొనర్చెను.

ఈభౌవన విశ్వకర్మ జగత్పాలనకర్త్రయు యజ్ఞకర్త్రయు నగుటయే గాక యశేషసృష్టికర్త్రయు నగునటుల నీక్రిందిభారతోక్తి వక్కాణించుచున్నది.

(12) శ్లో॥ పృశంస స్యభినందర్క స్తాం స్వార్థా నక్షుపరాజితా౯
అర్జునస్య రథేబ్రూహి కథమశ్వాః కథంధ్వజాః॥

సంజయః॥

శ్లో॥ భో విశ్వకర్మా మనసా బహుచిత్రం విశాంపతే
రూపాణి కల్పయామాస త్వష్టా ధాతా మహోత్తరః॥
ధ్వజే హి తస్మిన్రూపాణి శక్యంతే దేవమాయయా
మహాధనాని దీనాని మహాన్తి చలఘూనిచ॥
భీమసే నానురోధాయ హనుమా న్మారుతాత్మజః
ఆత్మప్రతికృతిం తస్యధ్వజఆరోపయిష్యతి॥

సర్వాదిశో యోజనమాత్రమంతరం, సతిర్యగూర్ధ్వం సరురోధవై ధ్వజః। సజ్జత్యసౌ తరుభి స్సంవృతోపి, తథాహి మాయా విహితాభావనేన॥ యథాకాశే శక్రధనుః ప్రకాశతే, నచైనవర్ణం నచవిద్మ కిన్నుతత్ । తథాధ్వజోవిహితో భా వనేన, బహ్వాకారం దృశ్యతే రూపమస్య॥ యథాగ్నిధూమో దివమేతిరుధ్వా, వ ర్ణా౯ బిభ్రత్తేజసాంశ్చిత్రరూపా౯। తథాధ్వజో విహితో భావనేన,నచేద్భావో భ వితానోపరోధః॥ శ్వేతా స్తస్మి న్వాతవేగా స్సదశ్వా, దివ్యాయుక్తా శ్చిత్రరథేన దత్తాః॥

భారతోద్యోగ పర్వము (౫౬) అధ్యాయము.

తా॥ పాండవులుజూదంబున సర్వస్వముంగోలుపోయిరనినీవుసంతసించుచుం బలెక్కడవు. అర్జునునిరథంబున నశ్వంబు లెట్లుగల్గె? ధ్వజంబులు నెట్లుగల్గెనని దుర్యోధనుండడుగ సంజయుండిట్లనియె. ఓరాజా! విశ్వకర్మ తనమనస్సుచేఁ జిత్రం బుగరూపంబులుగల్పించె. ఆత్వష్టృప్రజాపతియె ఆధ్వజంబున రూపంబులుగల్పించె. దైవమాయచేత దీనులు ధనికులగుటయు లఘువులు మహత్తరంబులగుటయు శక్యంబెగదా ? వాయుపుత్త్రుఁ డగుహనుమంతుఁడు భీమసేనానుమతంబుగోరి య తని ధ్వజంబునఁ దనరూపము నారోపించెను. ఆధ్వజము సకలదిక్కుల యోజన మాత్ర ప్రమాణంబుగఁ దిర్యగూర్ధ్వంబుల నావరించెఁ గాననయ్యది తరుపరివృతం బయినను దృష్టిగోచరంబగు చున్నది. అట్లె యాభౌవనవిశ్వకర్మచే మాయకల్పి

తమయ్యె. వస్తు రూపములఁ దెలియక యాకసంబున నింద్రధనుస్సు ప్రకాశించు చున్నటుల భువనపుత్త్రుం డగువిశ్వకర్మ యాధ్వజంబును గల్పించె. దానిరూపము బహ్వాకారముగఁ గనఁబడుచున్నయది. ధూమంబు తేజస్సంబంధ మగుచిత్రరూపంబు దాల్చి యాకాశమున వ్యాపించినటుల భువనపుత్త్రుం డట్టిధ్వజంబుగల్పించె. ఇష్టములేనియెడల దాని కుపరోధంబును లేదు. ఆరథంబునం గట్టి యతివేగంబునఁ బరుగిడు నట్టిశ్రేష్టంబులగు వెల్లగుఱ్ఱములు చిత్రరథునిచే నియ్యఁబడియె. అని చెప్పఁబడి యుండుటచేతను, మఱియు,

(13) యత్వాహోతారంమనసాభిసంవిదుస్త్రయోదశభౌవనాః॥

అధర్వణవేదము. ౧ కాండము.

భా॥ శ్రు॥ విశ్వకర్మా భౌవనాః స్వాత్మని జుహవాం చకార॥ నిరుక్తం॥ ౧౦ ౨౹౬॥ ఇత్యాది శ్రుత్యంతర ప్రసిద్ధా భువనాఖ్యస్య మహర్షేః పుత్రా విశ్వకర్మప్రభృతయః త్రయోదశసంఖ్యాకాః॥

తా॥ ఇతరశ్రుతులచేతను బ్రసిద్ధులగు భువనుఁ డనుపేరుగల మహర్షి యొక్క పుత్త్రులు విశ్వకర్మ మొదలగు పదుమువ్వురు గలరు. ఇందుల కనుకూలముగనే,

(14) శ్లో॥ భువనో నామ యోదేవో విశ్వకర్మాథ తత్సుతః
ప్రసిద్ధో యస్సశాస్త్రేషు భౌవనః సురవర్ధకీ
విశ్వకర్మా స్వయం తత్ర చిత్రాన్ లోకాన్ వినిర్మమే
ప్రాసాదాశ్చ విమానాని వాప్యుద్యానా న్యలంకృతీః
వస్త్ర వాద్యాది వస్తూని విచిత్రాణి పృథక్పృథక్॥

విష్ణురహస్యము. ౩౫ అధ్యాయము.

తా॥ భువనుఁ డనుపేరుగల దేవునికి శాస్త్రప్రసిద్ధుఁడును విశ్వకర్మనాముఁడునైన కుమారుఁడు గలఁడు. భౌవనుఁ డగు నాదేవవర్ధకి స్వయముగాఁ జిత్రమైన లోకములను సృజించెను. ఇంక నా విశ్వకర్మ ప్రాసాదములు విమానములు బావు లుద్యానములు భూషణములు విచిత్రము లగువస్త్రములు వాద్యములు మున్నగు వస్తువు లనేకములు విచిత్రములుగ వేరు వేరుగ సృజించెను. ఇట్లు భౌవనవిశేషణముతో విశ్వకర్మ పెక్కుచోటుల వర్ణింపఁబడియె. కావునఁ బరమేశ్వర విశ్వకర్మ యొక్క యవతారము భౌవన విశ్వకర్మ యవధరించి లోకపాలన లోకసృష్టికర్తృత్వముల నవలంబించినటుల విస్పష్ట మగుచున్నది.

ఇఁక భువనుఁ డెవ్వఁడనిన:—

(15) శ్లో॥ భువనో భౌవన శ్చైవ సుజన్యస్సుజన స్తథా;
శుచిః క్రతుశ్చ మూర్ధాచ త్యాజ్యశ్చవసుధ స్తథా॥
ప్రభవ శ్చాత్యయ శ్చైవ దక్షోథ ద్వాదశ స్తథా
ఇత్యేతే భృగవో నామదేవా ద్వాదశ కీర్తితాః॥

మత్స్యపురాణము. ౨౦౩ అధ్యాయము

భృగువంశమునందుఁ బుట్టిన పన్నిద్దఱు దేవతలలో భువనుఁడు ప్రథముఁడని యీపై మత్స్యపురాణోక్తివలనఁ దెలియుచున్నది.

మఱియు నాశ్వలాయన సర్వానుక్రమణికా వ్యాఖ్యాతచే రచింపఁబడిన షడ్గురు భాష్యనామ గ్రంథమునందష్టమాష్టకమండలి యష్టమాధ్యాయమునందు "భువనోనామఆప్తిపుత్ర"యనిచెప్పుటచే భువనపుత్త్రుఁడు విశ్వకర్మయగుటచే విశ్వకర్మకునాంగిరసవంశజత్వముఋషిగోత్రిత్వములభించినదనికొందఱుచెప్పుచున్నారు. ఎట్లయినను భృగ్వంగిరో వంశమునందే విశ్వకర్మ యుద్భవించినటులఁ దేలినది.

—*విశ్వకర్మ కశ్యపునకు భూదానమొసఁగుట.*—

పంచమవేదమని ప్రసిద్ధివడసిన భారతేతిహాసమ్మందలి యరణ్య పర్వమున:—

(16) శ్లో॥ ఏతత్స్వయంభువో రాజన్ వనందివ్యంప్రకాశతే
య త్రాయజత రాజేంద్ర విశ్వకర్మా ప్రతాపవాన్
యస్మిన్ యజ్ఞేహి భూర్దత్తా కశ్యపాయ మహాత్మనే
సపర్వత వనోద్దేశా దక్షిణార్థే స్వయంభువా
అవాసీ దచ్చ కౌంతేయ దత్తమాత్రా మహీ తదా
ఉవాచ చాపి కుపితా లోకేశ్వర మిదంప్రభుం
నమాంమర్త్యాయ భగవన్ కస్మైచి ద్దాతు మర్హసి
ప్రదానం మోఘమేతత్తే యాస్యామ్యేషారసాతలం
విషీదంతీంతు తాందృష్ట్వా కశ్యపో భగవానృషిః
ప్రసాదయాంబభూ వాథ తతో భూమింవిశాంపతే
తతః ప్రసన్నా పృథివీ తపసా తస్యపాండవ
పునరున్నహ్యా సలిలా ద్వేదీరూపా స్థితా బభౌ
సైషా ప్రకాశతే రాజన్ వేదీసంస్థానలక్షణా
ఆరుహ్యాఽత్ర మహారాజ వీర్యవాన్ వై భవిష్యసి॥

తా॥ ఒక మహర్షి చెప్పుచున్నాఁడు. ఓధర్మరాజా స్వయంభూసంబంధమైనదియు, దివ్యమైనదియు నగు నీవనము ప్రకాశించుచున్నది. ఈ వనమందుఁ బ్రతాపవంతుఁడైన విశ్వకర్మ యజ్ఞమొనర్చెను. ఆయజ్ఞమునందు మహాత్ముఁడైన

కశ్యపున కవ్విశ్వకర్మ దక్షిణార్థమైన భూభాగమును పర్వతవనములతోఁ గూడినదానిని యజ్ఞ దక్షిణకొఱకు దానమొసఁగెను. ఇచ్చిన మాత్రముననే భూమి కోపించినదై లోకేశ్వరుఁడైన యవ్విశ్వకర్మ ప్రభువును గూర్చి యిట్లువలికెను. "ఓభగవానుఁడా! ఒకానొక మనుష్యుని కొఱకు నన్నియ్యఁదగదు. నీదానము మిక్కిలి తగనిది. నేనుండక రసాతలమున కేగఁగల"నని రసాతలమున కేగుచున్న భూమిని జూచి భగవంతుఁడైన కశ్యపమహర్షి భూమియనుగ్రహించునట్లు తపస్సొనర్చెను. అంతటఁ దపస్సుచేఁ బ్రసన్నయయి జలమునుండి పైకెగసి వేదికారూపమున నిలిచి ప్రకాశించెను. ఇయ్యదదియె వేదీసంస్థాన లక్షణమునఁ బ్రకాశించుచున్నది.దీనినెక్కి నిలిచిన నోమహారాజా ! నీవు తేజోవంతుఁడవు కాఁగలవు. అనియుండుటచే స్వయంభువైన విశ్వకర్మ ప్రతాపశీలుఁడయి లోకము లేలి మహాయజ్ఞములొనర్చి ఋత్విగ్వరుఁడైన కశ్యపమహర్షికి భూదానము లొనర్చినటులఁ దెలియుటచే నితఁడు భౌవన విశ్వకర్మయని తోఁచకమానదు. ఇచటఁ గశ్యపబ్రహ్మర్షియొక్క మహిమ దెలియకపోవుట భూమియొక్క జడత్వముగాని వేఱుకాదు.

—* విశ్వకర్మకుఁ బ్రజాపతిత్వము. *—

విశ్వకర్మ భౌవనావతారుఁడగుటయెకాక ప్రజాపత్యాఖ్య వహించినటుల,

(17) శ్రు॥ మాతేవ పుత్త్రంపృథివీ పురీష్య మగ్నిగ్గ్ స్వే యోనావభారు
ఖా।తాంవిశ్వైర్దేవైర్ఋతుభి స్సంవిదానః ప్రజాపతి ర్విశ్వకర్మా విముంచతు.

కణ్వసంహిత అ ౧౩. అను ౪

భా॥ యథాలోకే మాతా పుత్రంబిభర్తి తథాపృథివీరూపేయమ్ముఖా స్వేయోనౌ స్వకీయగర్భస్థానే పురీష్యమేతమగ్నింఅభాఽఅభాషీత్ ధారితవతీ డృభృఞ్ఃప్రథమా పురుష స్వరూపంబిభర్తి తామ్ముఖాం ప్రజాపతిర్విముంచతు శిక్యపాశా న్ముక్తాం కరోతు కీదృశఃప్రజాపతి ర్విశ్వైర్దేవై ఋతుభిశ్చ సంవిదాన ఐకమత్యంగతః విశ్వసృష్టిరూపం కర్మయస్యాసౌ విశ్వకర్మా.

తా॥ లోకమునందుఁ దల్లి కుమారుని మోయుచున్నది. అట్లె పృథివీరూపయగు నీముఖయును స్వకీయగర్భస్థానమునందు నీయగ్నిని ధరించుచున్నది. అనఁగాఁ బురుష రూపమును ధరించుచున్నది. ఆముఖను శిక్యపాశముల నుండి (ఉట్టిచేరులనుండి) ప్రజాపతి విడిపించుఁగాక ! ఆప్రజాపతి యెట్టివాఁడన:—విశ్వేదేవతలతోడను ఋతువులతోడను గూడుకొనినవాఁడును జగత్సృష్టిరూపమగు కర్మగల (విశ్వకర్మయను) వాఁడునగును.

నుతియు.

17 శ్రు॥ ప్రజాపతి ర్విశ్వకర్మా మనోగంధర్వ స్తస్య ఋక్సామాన్యప్సరసో

వహ్నాయః॥

యజుర్వేదము, అ 3 ప ర అ ౭.

భా॥ ప్రజానాంపాలకః ప్రజాపతిః విశ్వంకర్మకరణీయంయస్యాసౌ విశ్వకర్మా తాదృశో మనోనామకః కశ్చిద్గంధర్వః తస్యచఋక్సామదేవతాః భార్యాః తాశ్చసౌందర్యంవహంతీతివహ్నాయఇత్యుచ్యంతే.

తా॥ ప్రజలఁబాలించు ప్రజాపతియు విశ్వకర్మయునైన మనోనామకుఁడగు గంధర్వుఁడొకఁడు కలఁడు. అతనికి ఋక్సామదేవతలను సౌందర్యవతులగు భార్యలు కలరు. అనఁగా:——"విశ్వకర్మాహ్యజనిష్ఠదేవాఆదిద్గంధర్వో అభవద్వితీయః" అను యజుస్సంహితోక్తివలనఁ బరమేశ్వరుఁడు విశ్వకర్మయై యవతరించి యనంతర మావిశ్వకర్మాపేక్ష చేతనే గంధర్వుఁడై యవతరించెనని చెప్పఁబడుటచే విశ్వకర్మ గంధర్వుఁడై ప్రజాపతిత్వ మవలంబించె నని తెలియుచున్నది. ఇచటఁ బ్రసిద్ధజగద్ధాతయు బ్రజాపతియు, సర్వశిల్పయజ్ఞకర్తయు నగువిశ్వకర్మకు ఋక్సామనామకలు సహచారిణులగుట సహజసిద్ధమేకదా? ఏలన:—ఆఋక్సామనామక లిరువురు యజ్ఞకార్యముల హౌత్రోద్గాతములనుద్ధరించు వాగ్ధురీణలగుటయె గాక శిల్పస్థానని యోక్తలగునటుల "ఋక్సామయోఃశిల్పేస్థః" యను యజుఃప్రథమకాండ వచనమునకు "ఋక్సామయోఃశిల్పేస్థ ఇత్యాహఋక్సామె ఏవావరున్ధే" అనుయజుర్బ్రాహ్మణవచనము గూడఁబ్రతిపాదింపఁబడినది.

ఇందునకనుకూలముగనే తైత్తిరీయబ్రాహ్మణ ద్వితీయాష్టకమునందు (19)"ప్రజాపతి ర్విశ్వకర్మా తస్యమనోదేవం యజ్ఞేనరాధ్యాసం" అనియుఁజెప్పఁబడియెను.

ఇంతయెకాక,

(20) శ్రుతిః॥ విశ్వకర్మాభవ త్ప్రజాపతిః ప్రజాస్సృష్ట్వా విశ్వకర్మాభవత్సంవత్సరో విశ్వకర్మేంద్రమేవ తదాత్మానం ప్రజాపతిం సంవత్సరం విశ్వకర్మాణ మాబ్రువంతీంద్ర ఏవతదాత్మని ప్రజాపతౌ సంవత్సరే విశ్వకర్మ ణ్యాంతతః ప్రతితిష్ఠంతి ప్రతితిష్ఠంతి యఏవంవేద యఏవంవేద॥

ఐతరేయబ్రాహ్మణము పం ౪ ఖం ౨౨ అ౪

తా॥ విశ్వకర్మ ప్రజలసృష్టించి ప్రజాపతి యయ్యెను. ఆవిశ్వకర్మయె సంవత్సర (యజ్ఞ) స్వరూపుఁడయ్యెను. ఐశ్వర్యస్వరూపుఁ డగుతన్నె ప్రజాపతిగను

సంవత్సరు (యజ్ఞరూపు) నిగను విశ్వకర్మను జెప్పుదురు. అంతమునందు ఐశ్వర స్వరూపుడును ప్రజాపతి స్వరూపుడును సంవత్సర (యజ్ఞ) స్వరూపుడు నగు విశ్వకర్మయందు (సర్వము) ప్రతిష్ఠించుచున్నారు.

ఇట్లనుటయె కాక పెక్కుచోటుల నవతరించిన పుడును బ్రశంసించినప్పుడు నవ్విశ్వకర్మ యీక్రిందిరీతుల వక్కాణింపఁబడియె,

—✽ విశ్వకర్మావతారభేదములు. ✽—

21 శ్లో॥ బృహస్పతేస్తు భగినీ వరస్త్రీబ్రహ్మచారిణీ
యోగసిద్ధా జగత్కృత్స్న మసక్తా చరతేసదా॥ ౧౫
ప్రభాసస్యతు సాభార్యా వసూనా మష్టమస్యతు
విశ్వకర్మా సుత స్తస్యాం జాతః శిల్పిప్రజాపతిః॥ ౧౬
త్వష్టా విరాజో రూపాణాం ధర్మపౌత్ర ఉదారధీః
కర్తా శిల్పసహస్రాణాం త్రిదశానాంచ వాస్తుకృత్॥ ౧౭
య స్సర్వేషాం విమానాని దేవతానాం చకారహ
మానుషా శ్చోపజీవంతి యస్యశిల్పం మహాత్మనః॥ ౧౮
దేవాచార్యస్య మహతో ధీమతో విశ్వకర్మణః
విశ్వకర్మాత్మజ శ్చైవవిశ్వకర్మా మనుస్స్మృతః॥ ౧౯
సరేణురితి విఖ్యాతా స్వసాతస్యయవీయసీ
త్వాష్ట్రీ) సాసవితుర్భార్యా పునః సంజ్ఞేతి విశ్రుతా॥ ౨౦

వాయుపురాణము ఉత్తరభాగము అధ్యాయము ౨౨

తా॥ బృహస్పతియొక్క తోఁబుట్టువును స్త్రీలోకములో శ్రేష్ఠయు బ్రహ్మచారిణియునగు యోగసిద్ధయను నామెజగమున కతికష్టమగు వైరాగ్యమందుఁజాలకాలము సంచరించెను. వసువులలో నెనిమిదవవాఁడగు ప్రభాసునకు నామె భార్యయయ్యెను. ఆమెయందు శిల్పి ప్రజాపతియగు విశ్వకర్మ కుమారుఁడుగాఁ బుట్టెను. అతఁడు సృష్టికర్తయు శిల్పములలోఁ బ్రకాశించువాఁడును యముఁడు (ధర్మము) పౌత్రుడుగా గలవాఁడును విశాలహృదయుఁడును, అనంతశిల్పములు చేయువాఁడును దేవతాగృహములు నిర్మించువాఁడును సమస్తదేవతలకు విమానములఁజేయువాఁడు నయ్యెను. మహాత్ముఁడగు నతని శిల్పమువలన మనుష్యులెల్లరు జీవించుచున్నారు. అతఁడు దేవతలకాచార్యుఁడు మహాత్ముఁడును ధీమంతుఁడు నగును. విశ్వకర్మయొక్క కుమారుఁడు విశ్వకర్మయు, మనువు నగుదురు. ఆ ద్వితీయ విశ్వకర్మకుఁ దోఁబుట్టువును జెల్లెలు నగు సరేణువను నామె ప్రసిద్ధికెక్కెను. ఆత్వష్టృవిశ్వకర్మ యొక్క కూఁతురు సంజ్ఞయను నామె సూర్యునకు భార్యయయ్యెను.

విశ్వకర్మ ప్రజాపతి యైనటుల నిచ్చటనేగాక యీక్రింది పురాణములం బ్ర శంసింపఁబడియె.

(22) శ్లో॥ త్వష్టా ప్రజాపతీ హ్యాసీ ద్దేవశ్రేష్ఠో మహాతపాః॥
మహాభారతము. ఉద్యోగపర్వము.

(23) శ్లో॥ విశ్వకర్మా ప్రభాసస్య పుత్త్రిః శిల్పిప్రజాపతిః
ప్రాసాద భవనోద్యాన ప్రతిమా భూషణాదిషు
తడా గారామ కూపేషు స్మృతఃసోఽమరవర్ధకీ.
మత్స్యపురాణము ౫ అధ్యాయము.

(24) శ్లో॥ భూషణాని విచిత్రాణి విశ్వకర్మా ప్రజాపతిః
హారం సరస్వతీ పద్మమజో నాగాశ్చ కుండలే॥ ౧౫
శ్రీమద్భాగవతము స్కంధము ౮ అధ్యా.

(25) శ్లో॥ ప్రభావసోస్తు భార్యాయాం వసూనా మష్టమస్యహ
విశ్వకర్మా మహాభాగ జజ్ఞే శిల్పిప్రజాపతిః॥
మనుష్యా శ్చోపజీవంతి యస్య శిల్పం మహాత్మనః
పూజయంతిచ యంనిత్యం విశ్వకర్మాణ మవ్యయం॥
మహాభారతము. ఆదిపర్వము ౬౭ అధ్యాయము.

(26) శ్లో॥ విశ్వకర్మాభవ త్పూర్వం బ్రహ్మణ స్త్వపరాతనుః
త్వష్టుః ప్రజాపతేః పుత్త్రో నిపుణ స్సర్వకర్మసు.
స్కందపురాణము. కాశీఖండము ౭౬ అధ్యాయము.

ఇటుల విశ్వకర్మ ప్రజాపతిత్వమునందుటయేగాక మహాతపశ్శాలియని భారతోద్యోగపర్వమునందును, ప్రాసాదముల యందు మహాగృహములయందు ఉద్యాననిర్మాణములయందునుబ్రతిమాభూషణాదులు నిర్మించుటయందును దటాకములు వనములు కూపములు మున్నగునవిరచించుటయందును విశ్వకర్మస్మరింపఁబడుచుండు నని మత్స్యపురాణము నందును, లక్ష్మీదేవికి, విచిత్రభూషణములు విశ్వకర్మ ప్రజాపతి యొసఁగెనని భాగవతము నందును, అష్టమవసువగు ప్రభావసువునకుఁ గుమారుఁడుగ శిల్పిప్రజాపతి యగు విశ్వకర్మ పుట్టెననియు నమ్మహాత్ముని శిల్పమునలన మనుష్యులెల్లరు బ్రతుకుచుందు రట్టి నిత్యుఁడు నవ్యయుఁడు నగు విశ్వకర్మను బూజించుచున్నారని మహాభారతాది పర్వమునందును, త్వష్టృప్రజాపతికి బ్రహ్మకు రెండవదేహ మగు విశ్వకర్మ గలిగెను; అతఁడు సమస్త సృష్టికర్మలయందు నేర్పరి యని కాశీఖండమునందును వివరింపఁబడినది.

మఱియు విశ్వకర్మ యవతరించుటనుగూర్చి,

(27) శ్లో॥ అథ నామ్నానురూపేతి మరీచిదుహితా శుభా

పత్నీ త్వంగిరసః సాతు జననీతు బృహస్పతేః॥
బృహస్పతేస్తు భగినీ విశ్రుతా బ్రహ్మవాదినీ
ప్రభాసస్యతు సాపత్నీ వసూనా మష్టమస్యతు॥
ప్రసూతా విశ్వకర్మాణం సర్వశిల్పవతాం వరం
సఏవ నామ్నాతు పునః స్రష్టాత్రిదశవర్ధకీ॥
దేవాచార్యస్య తస్యైవ దుహితా విశ్వకర్మణః
సరేణురితి విఖ్యాతా త్రిషులోకేషు భామినీ।

స్కాందపురాణాంతర్గత ప్రభాసఖండము.

తా॥ మరీచికూఁతురు అనురూపయనునామె కలదు. ఆమె కంగీరస్సువలన బృహస్పతి జనియించెను. బృహస్పతి చెల్లెలు బ్రహ్మవాదిని యని పేరందినది. ఆపె ప్రభాసునకుఁ బత్నియై సర్వ శిల్ప కర్తలకు మేటియగు విశ్వకర్మను గాంచెను. అమ్మహామహుఁడె దేవశిల్పియై రెండవబ్రహ్మయని పేరుగాంచెను. సురాచార్యుఁడగు నవ్విశ్వకర్మకుఁ గూఁతురు సరేణువని లోకప్రసిద్ధి వడసినది.

(28) శ్లో॥ వస్తో రంగిరసఃపుత్రో విశ్వకర్మాఽకృతీపతిః
తతో మను శ్చాక్షుషోఽ భూ ద్విశ్వేసాధ్యా మనోస్సుతాః ॥

శ్రీమద్భాగవతము. ౬ స్కంధము. ౬ అధ్యాయము.

తా॥ అంగిరస్సంబంధుఁడైన వస్తువునకు శిల్పాచార్యుఁడగు విశ్వకర్మ పుత్త్రుఁడయ్యెను. అతనివలనఁ జాక్షుషమనువు పుట్టెను. ఆమనువునకు విశ్వేదేవతలు సాధ్యులు పుట్టిరి. ఇక్కడ "నాకృతీపతి" యనుచోట శిల్పాచార్యుఁడని శ్రీధరాచార్యులు భాష్యీకరించిరి.

మఱియు శ్రీమద్భాగవతాంతర్గత పంచమస్కంధ ప్రథమాధ్యాయమునందు,

29 గద్య. అథ సదుహితరం ప్రజాపతే ర్విశ్వకర్మణ ఉపయేమే, బర్హిష్మతీం నామ, తస్యా ముహావా వాత్మజా నాత్మనస్సమాన గుణశీల కర్మరూపవీర్యోదారాన్ దశసంభావయాంబభూవ,కన్యాంచ యవీయసీమూర్జస్వతీంనామ॥

అని స్వాయంభువమను పుత్త్రుఁడగు ప్రియవ్రతుఁడను రాజర్షి విశ్వకర్మ ప్రజాపతికిఁ గూఁతురగు బర్హిష్మతియను నామెను బరిణయమై యామెయందు గుణశీల కర్మ రూపవీర్యోదారముల యందుఁ దనకు సమానులగు కుమారులఁ బదుగురను నూర్జస్వతియను పేరిటఁ గనిష్ఠయగు కూఁతు నొక్కర్తను గాంచెనని చెప్పియుండుటచే విశ్వకర్మకుఁ బ్రజాపతిత్వ ముండుటయే కాక స్వాయంభువ మనువంశముతోడి సంబంధముగూడఁ గనవ్పట్టుచున్నది. విశ్వకర్మ దౌహిత్రియగు నూర్జస్వతిని శుక్రాచార్యుఁడు పరిణయమొనర్చెనని "దుహితరంచోర్జస్వతీంనా మోశనసీ ప్రాయచ్ఛత్" అను భాగవతోక్తిచేఁ గానవచ్చుచున్నది.

### విశ్వకర్మకు ఋషిత్వము.

ఇఁక విశ్వకర్మ పరమేశ్వరుఁడు ఋషిరూపమున నవతరించినటులఁగూడ నీక్రింది శ్రుతినిఁ జెప్పఁబడియున్నది.

యఇమేతి సప్తర్చం త్రయోదశంసూక్తం భువనపుత్రస్య విశ్వకర్మణ ఆర్షం త్రైష్టుభం విశ్వకర్మదైవత్యం తథాచానుక్రాంతం, యఇమావిశ్వకర్మా భౌవనో విశ్వకర్మాణంత్వితి గతసూక్తవినియోగః. అత్రవాజసనేయికం బ్రహ్మవై స్వయంభూ స్తపోతప్యత తదైక్షతనవై తపస్యానన్త్య మస్తి హంతాహం శ్రుతేష్వాత్మానం జుహవాని శ్రుతానిచాత్మనీతి. తత్సర్వేషు శ్రుతేష్వాత్మానం హుత్వేత్యాది.

(29) యఇమా విశ్వా భువనాని జుహ్వదృషిర్హోతా న్యసీదత్పితా నః। స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః ప్రథమచ్ఛదవరా ఆవివేశ॥

ఋక్. ౮, ౩, ౧౬, ౧.

అత్రనిరుక్తం॥ విశ్వకర్మాభౌవనః సర్వమేధేసర్వాణిశ్రుతానిజుహవాంచకార సఆత్మానమప్యంతతోజుహవాంచకార. తదభివాదిన్యేషర్గ్భవతి. యఇమావిశ్వా భువనానిజుహ్వదితీతి॥ యోవిశ్వకర్మా ఏతన్నామకఋషిః భువనపుత్రోహోతా హోమనిష్పాదకస్సన్ విశ్వాసర్వాణి భువనాని సర్వాణి జుహ్వత్ హోమంకుర్వన్ ప్రథమం సర్వంజగద్ధుత్వేత్యర్థః పశ్చాదగ్నౌ న్యసీదత్ పితాజనకః ఆత్మకృతేన కర్మణా దేహోత్పత్తేః నచైకస్య జన్యజనకభావో విరుధ్యతె తపోబలేన, శరీరద్వయస్వీకారాత్ సఏకదాభవతీత్యాదిశ్రుతేః ఆశిషా ఆశీఃప్రతిపాదకేన సూక్తవాకాదినా ద్రవిణం ధనం స్వర్గాఖ్య మిచ్ఛమానః కామయమానః ప్రథమచ్ఛత్, ప్రథమ మగ్నేర్భువనై రాచ్ఛాదితాఅవరాన్ విప్రకృష్టాన్ భూతాన్ స్వాత్మనా హుతాన్ ఆవివేశ ఆవిష్టవా నగ్నిమిత్యర్థఏవ పునర్విశేషే ణోక్తః ఏవముత్తరత్రాపి యజ్ఞపరతయా యోజ్యం అథాధ్యాత్మ ప్రసిద్ధోచ్యతే.

తా॥ "యఇమా"యను పదుమూఁడవ సూక్తమునకు భువనపుత్రుఁడగు విశ్వకర్మఋషి, త్రిష్టుప్ఛందస్సు, విశ్వకర్మదేవత, సూక్తవినియోగ మిదివరకే చెప్పఁబడినది. ఇక్కడ వాజసనేయిక సంహితయందు స్వయంభు వగుబ్రహ్మయె తపస్సనరించి ప్రపంచమును వీక్షించితనయందె హోమమొనరించెనని చెప్పఁబడినది.

నిరుక్తమందుఁగూడ భౌవనవిశ్వకర్మ సర్వమును దనయందుహోమమును జేసెనని చెప్పియున్నది.

భువనపుత్రుఁడగు విశ్వకర్మయను పేరుగల ఋషి హోమనిష్పాదకుఁ
సమస్తభువనములను దనయందే ముందుగా హోమమును జేయుచు మాకుఁదం
యగు నతఁడగ్నియందు మఱలఁబుట్టించెను. తనచేఁ జేయఁబడిన కర్మచేదేహ
త్పత్తిగల యమ్మహర్షి కొక్కనికె జన్యజనక భావముగలుగుటకు "సపకదాభవ
యను మొదలగుశ్రుతివలన దపోబలముచే శరీరద్వయస్వీకారము విరుద్ధముగా
రదు. ఆవిశ్వకర్మ మహర్షియాశీర్వచనప్రతిపాదకమయిన సూక్తవాకాదిచే స్వ
నామకమగు ధనమును గోరుచు ముందుగా నగ్నిపై భువనములను గప్పి
యాత్మచే హుతములైన భూతములయందుఁ దానుబ్రవేశించెను. ఇది యజ్ఞ
మైన యర్థము. ఆధ్యాత్మికపరమైన యర్థము మిగిలియున్నది.

ఇట్లు శ్రుత్యర్థమును బ్రతిపాదించుటచే విశ్వకర్మకు ఋషిత్వము ప్రత్య
కరింపఁబడినది.

విశ్వకర్మ ఋష్యవతారము నందుటయటుండ మరీచ్యాది సప్తఋ
లకుఁ బరత్వమునందించినటులను వారికోర్కెలఁ దీర్చినటులను,

(౩౦) శ్రు॥ తేషామిష్టాని సమిషామదంతి యత్రసప్తఋషీన్పరఏకమాహుః
పూర్వోక్త-యజుఃకాం. ౪ ప్ర ౬ అ

అను శ్రుతివచనమున "నేపరమేశ్వరతత్వమందు మరీచ్యత్రిముఖాది స
ర్షులు నేకీభావులని వేదాంతపారగులు చెప్పుదురో అట్టి విశ్వకర్మ యామరీచి
భృతి మహర్షులకు నీప్సితముల నిచ్ఛామాత్రముగ సంపాదించెను." అని చెప్ప
చే స్పష్టపడుచున్నది. ఇంతయెకాక,

(౩౧) శ్రు॥ విశ్వకర్మా మాసప్తఋషిభి రుదీచ్యాదిశః పాతు తస్మిన్క్రమేత
స్మింఛ్రయేతాంపురంప్రైమి॥ అథర్వవేదకాం ౧౯.౨. ౧

సా॥ భా॥ విశ్వకర్మా విశ్వంసర్వం కర్మకార్యంసృజ్యం యస్మాద్భ
సవిశ్వకర్మా విశ్వజగత్కారణభూతః పరమాత్మా సప్తఋషిభిః స్వమనః సృ
సప్తసంఖ్యా ఋషిభిః సహమామాముదీచ్యా ఉత్తరస్యా దిశః పాతు.

తా॥ సమస్తసృష్టికర్మ యెవనివలన నగుచున్నదో యతఁడు విశ్వకర
అట్టి సమస్తజగత్తులకుఁ గారణభూతుఁడయిన పరమేశ్వరుఁడు తన మనస్సుచే
ష్టింపఁబడిన సప్తఋషులతోఁ గూడ నన్నుత్తరదిక్కునుండి రక్షించుఁగాత.

అని చెప్పుటచే విశ్వకర్మపరమేశ్వరుఁడు సప్తఋషుల సృజించినటుల ని
త మగుచున్నది. మఱియు,

(32) శ్రు॥ విశ్వకర్మాణం తేసప్త ఋషివంతమృచ్ఛంతు॥

అధర్వవేదకాం ౧౯।౨. ౧.

సా॥ భా॥ సప్త ఋషివన్తమ్ సప్తసంఖ్యాకాః ఋషయః సృజ్యత్వేన యస్య సన్తి ఇతినతుప్తం విశ్వకర్మాణం తేశత్రవః మృచ్ఛంతుమరణార్థం ప్రాప్నువంతు.

తా॥ మరీచ్యాది సప్తఋషులను సృజించిన విశ్వకర్మ నాశత్రువులు మరణార్థము పొందవలెను.

అని చెప్పియుండుటచే విశ్వకర్మ సప్తఋషుల సృష్టించినటుల విస్పష్టమగుచున్నది. ఇంక ఋషియగుటను విచారించుదము.

(33) శ్రు॥ శాక్వరరైవతాభ్యాం విశ్వకర్మఋషిః।

యజుః కాం ౪. ౩. ౫.

అని విశ్వకర్మ ఋషియగునటులఁ దెలియవచ్చుచున్నది. మఱియు,

(34) శ్రు॥ విశ్వకర్మాతేఋషిః । యజుః కాం ౪. ౩. ౬.

సా॥ భా॥ హేఇష్టకే విశ్వకర్మాప్రజాపతి రేవ తవఋషిర్ద్రిష్టా.

తా॥ ఓ యిష్టకమా! విశ్వకర్మ ప్రజాపతియె నీకుఋషి. (చూచువాఁడు.) అందుచే నిష్టకకర్తృత్వద్రష్టృత్వములు విశ్వకర్మఋషియం దారోపింపబఁడినవి. ఇంకను,

(35) శ్రు॥ యాః ప్రాచీస్తాభిర్వసిష్ఠ ఆర్ధోన్నిదాన్య దక్షిణాతాభి ర్భరద్వాజో యాః ప్రతీచీ స్తాభిర్విశ్వామిత్రో యాఉదీచీ స్తాభిర్జమదగ్నిరాన్య ఊర్ధ్వా స్తాభిర్విశ్వకర్మా॥

యజుః కాం ౫, ౨, ౧౦, ౫.

భాష్యవచనము. "తత్తా దృగ్విశిష్ట ఇష్టకాస్తత్తన్మంత్రా గతా న్వశిష్ఠాదీఋషీఁ ప్రస్తౌతి" అను భాష్యానుకరణమువలన వశిష్ఠాది ఋషులతోఁ గూడ విశ్వకర్మఋషి యాహ్వానింపఁ బడియెను. ఇట్లుకాక,

(36) శ్రు॥ యోదేవానాం ప్రథమం పురస్తా ద్విశ్వాధిపో రుద్రో మహర్షి। హిరణ్యగర్భం పశ్యతజాయమానగ్ సనోదేవః శుభయస్మృత్యా సంయునక్తు। జ్ఞాత్వా శివం సర్వభూతేషుగూఢం విశ్వస్యైకం పరివేష్టితారం। జ్ఞాత్వాదేవం ముచ్యతే సర్వపాపై రేవదేవో విశ్వకర్మా మహాత్మా॥

తైత్తిరీయైతరేయశ్వేతాశ్వతరోపనిషత్.

అని మహాత్ముఁడగు విశ్వకర్మ విశ్వాధిపుఁడును రుద్రుఁడును మహర్షియ
నగునటులఁ దెలుపుచున్నది. పైనఁజెప్పఁబడిన "యత్రసప్తఋషీన్ పరఏ
మాహుః" అను యాజుషోక్తి ననుసరించియె కాఁబోలు వైవస్వతమనుపురాణ
మున నీక్రిందివిధముగఁ జెప్పఁబడియె.

విశ్వకర్మ సప్తర్షుల యిచ్ఛదీర్చుట.

(37) కృష్ణభీమసంవాదే॥ అస్మాకం దీయతాం శీఘ్రం భగవన్యజ్ఞశీలతామ్॥

శ్లో॥ యజనం యాజనం చైవాధ్యయనాధ్యాపనానిచ
దానం ప్రతిగ్రహశ్చేతి షట్కర్మాణి మహావిభో॥ ౮
భాషితంతు మయస్తేషాం శ్రుత్వాతద్రోమహర్షణః
దాస్యామీతి వచో దత్వా శక్యంకర్తుం నచానృతం॥ ౯
ఇత్యుక్త్వా సదదా తేషాం షట్కర్మాణి మహావిభుః
తేషాం తత్సమయెదత్వా దుష్కృతా మృషికోటినామ్॥ ౧౦
కోపేన మహతావిష్టః శశాప ఋషిసప్తకమ్
విఫలం భవతామేత ద్బ్రాహ్మణ్యం మమశాపతః॥ ౧౧
శాప దగ్ధాత్మనా యూయ మపూజ్యా భవతాత్సదా
ఇత్యుక్త్వా క్రోధతామ్రాక్షః సలిలంతు విసృష్టవాన్॥ ౧౨
తత స్తేనైవ శాపేన మునయ స్సప్తపీడితాః
దుఃఖిత స్తేసమాగచ్ఛన్ బ్రహ్మాణ మిదమబ్రవీత్॥

ఋషయ ఊచుః॥ బ్రహ్మన్ మయస్య శాపేనపీడితా వయమాగతాః ౧౩
తస్మా న్నోఽత్యభయం దేవ దాతుమర్హసిసువ్రత॥ ౧౪

బ్రహ్మోవాచ॥ కిమర్థం భవతాం శాపో దత్తస్తేన మహాత్మనా
శ్రుత్వేతి చర్షయః సర్వే బ్రహ్మాణమిదమబ్రువన్॥ ౧౫
షట్కర్మాణి గృహిత్వా హివయం దత్వాదయాన్వితః
దాస్యామీతి సదత్వాతు పునశ్శాపమవోచహ॥ ౧౬
ఇతి శ్రుత్వాతతో బ్రహ్మ తాన్ ఋషీన్ పునరబ్రవీత్
దోషోస్తి భవతాం మధ్యేతస్మాచ్ఛాపం సదత్తవాన్॥ ౧౭
అత శ్శాపవిముక్త్యర్థం గచ్ఛధ్వ మృషిసత్తమాః
విశ్వకర్మాణ మేవాత్ర గతింసచ విదాస్యతి॥ ౧౮
ఇత్యుక్తే ఋషయ స్తేనబ్రహ్మణా శాపపీడితాః
తదాసమేత్య సర్వేచ విశ్వకర్మాణ మగ్రతః॥ ౧౯

ఋషయ ఊచుః॥ శిల్పాచార్యాయ దేవాయ నమస్తే విశ్వకర్మణే
మనవే మయాయ త్వష్ట్రేచ శిల్పినే దైవజ్ఞ తేనమః॥ ౨౦

భక్తితో విశ్వకర్మాణం స్తుతి మద్వాక్యమబ్రవీత్
సర్వోత్తమో బ్రహ్మదేవ స్తథాచ ఋషి సంయుతః॥ ౨౧
నమస్కృత్వాతు చక్రే తత్ప్రభూతాం స్తుతిమాదరాత్
బ్రహ్మోవాచ॥ విశ్వకర్మన్ మహాదేవ దేవదేవ మహాప్రభో॥ ౨౨
త్వమేవ సర్వలోకానా మీశ్వరః ప్రభురేవచ
త్వమేవ సాక్షాజ్జనకో భూతానాం దేవసత్తమః॥ ౨౩
సృష్టిసంహార కర్తాచ లోకానాం సర్వకామదః
విశ్వకర్మా పరబ్రహ్మ విశ్వకర్మా హరోహరిః॥ ౨౪
విశ్వాత్మా విశ్వకర్మాచ సర్వకర్మ నివారకః
త్వంతురూపా ణ్యనేకాని రజస్తమో యుతానిచ॥ ౨౫
కృత్వా సృజసి లోకాన్ త్రీన్ జగచ్చ సచరాచరమ్
తస్మా ద్విశ్వపతే రక్షత్వాన్మృషీన్ శాపవీక్షితాన్॥ ౨౬
త్వంవినాఽన్యగతిం దేవనపశ్యామి జగత్త్రయే
ఇతి శ్రుత్వా మహాదేవో విశ్వకర్మా జగత్ప్రభుః॥ ౨౭
మత్ప్రసాదాత్తు మునయః పూజాభవితు మర్హథ
ఇత్యుక్త్వా ఋషయ స్తేనకృపయా విశ్వకర్మణా॥ ౨౮
శాపా ద్విమోచితా స్తేతంనమశ్చక్రుః పునఃపునః
విశ్వకర్మ న్నమస్తేఽస్తు జగద్రక్షాపరాయణ॥ ౨౯
ప్రకృతేః పుంస్వరూపాయ సర్వప్రాకృత మూర్తయే
అమంగళ వినాశాయ సర్వమంగళదాయినే॥ ౩౦
సర్వలోక వినిర్మాత్రే సాక్షిణే జగతాంనమః॥ ౩౧
నమోనమో విశ్వకర్మ న్నమస్తేఽస్తు తపోధన
తవప్రసాదా న్మహతా శాపేనతు విమోచితాః॥ ౩౨
శుద్ధా వయంతు భవతః కృపయా దేవసత్తమ
అతశ్శీఘ్రంహిగచ్ఛామో నిజమార్గం జగత్ప్రభో॥ ౩౩
ఇత్యుక్త్వా ఋషయ స్తస్మై నమస్కృత్వా పునఃపునః
ప్రదక్షిణ మకుర్వన్ స్తే బ్రహ్మణే విశ్వకర్మణే॥ ౩౪
ముహుర్ముహు ర్నమస్కృత్వా స్తువంతో మునిసత్తమాః
యయు స్తతఉదీచీంతు దిశం సమసిపేవతాన్॥ ౩౫
శ్రీకృష్ణఉవాచ॥
తస్మా ద్భారతయో విప్రో విశ్వకర్మాణ మేవచ
సంస్తుతే ర్విశ్వకర్తారం సుఖాభీష్ట మవాప్నుయాత్॥ ౩౬

భక్త్యా యుతో నరోయస్తు విశ్వకర్మాణ మర్చయేత్
సంతతి స్తస్యలోకేఽత్ర పూజ్యాభవతి భారత॥ 37
ఇత్థంశ్రుత్వాతు కౌంతేయః కృష్ణేన వినయాన్వితః
గదాం గృహిత్వాన యయౌ యుద్ధాయసమితింజయః॥ 38
శ్రుణోతి యఇదం దివ్యంరహస్య మృషిభిఃకృతమ్
సనిష్పాపో విశుద్ధాత్మా విశ్వకర్మ ప్రసాదతః॥ 39
పుత్రపౌత్రాభివృద్ధిస్స్యా త్ససుఖీచ భవేత్సుఖమ్,
దేహాంతే విశ్వకర్మణ్యాం సాయుజ్య పదమాప్నుయాత్॥ 40

ఇతి శ్రీమహాపురాణే వైవస్వతే ఉత్తరార్థే కృష్ణభీమసంవాదే మయకృత శాపవిమోక్షణ కథాయాంవిశ్వకర్మ స్తోత్రంనామ షణ్ణవతితమోఽధ్యాయః॥౯౬॥

తాత్పర్యము॥ ఒకానొకప్పుడు మయస్వరూపుఁడగు విశ్వకర్మను గూర్చి మరిచ్యాది సప్తర్షులు "ఓమహాప్రభూ! భగవానుఁడా! మాకు యజ్ఞాధికారము గల యజన యాజనాధ్యయనాధ్యాపక దాన ప్రతిగ్రహములను షట్కర్మలనొసఁగవలయు" ననిన నట్లే యిచ్చెదనని యమ్మహామహుఁడొసఁగెను. అనంతర మా సప్తఋషులతోఁగూడ ఋషిసముదాయమంతయు దురాశాపూరితులై యాజనాధ్యాపన ప్రతిగ్రహాదులయం దత్యంత దుష్కృతులగుటచే నవ్విశ్వకర్మ కోపించి "మీకున్న బ్రాహ్మణ్యముపోయి యపూజ్యులగుదురుగాక!" యని శపించెను. జల విస్మృష్టమగు నా శాపముచే సప్తఋషులు వీడింపఁబడి పరమేష్ఠియొద్దకుఁ బోయి "స్వామీ! మయవిశ్వకర్మ శాపముచే బాధితులమై వచ్చితిమి. అభయమిచ్చి రక్షింపు"డని వేఁడుకొనిరి. అంత విధాత "ఏల మీకిట్టి శాపమొసఁగె" ననిన ఋషులు "మే మేపాపము నెఱుంగము. మొదట షట్కర్మల నొసంగి కొంతకాలమున కీశాపము గూడ నొసంగె" ననిరి. ఇట్లనిన విరించియు "మీరెయ్యదియో దోషము చేసియేయుందురు; కాదేని యమ్మహానీయుఁడుశాపమీనోపఁ"డని ఋషులతోఁగూడ విశ్వకర్మ సమీపమున కేగెను. అమ్మహాత్ము నగ్రభాగమున ఋషులు "శిల్పాచార్యుఁడైన విశ్వకర్మదేవుని కొరకు నమస్కారము. మనుమయత్వష్టృశిల్పిదైవజ్ఞస్వరూపుఁడవగు నీకొరకు నమస్కారము." అని యుగ్గడించిరి. తరువాత ఋషులతోఁ గలసిన పరమేష్ఠి యిట్లు స్తుతించెను. "దేవదేవుఁ డవును మహాదేవుఁడవు నగు నో విశ్వకర్మ మహాప్రభూ! నీవ సర్వలోకముల కీశ్వరుండవు. నీ వప్రభువవు. నీవ సమస్తభూతములకుఁ బ్రత్యక్ష జనకుఁడవు. నీవ జగములసృష్టించెదవు. నీవయడంచెదవునీవ లోకములకు సర్వాభీష్టముల నొసంగెదవు. నీవ విశ్వకర్మవు. నీవ పరబ్రహ్మవు. నీవహరుఁడవు. నీవహరివి. సమస్తలోకముల కాత్మవు నీవ. సర్వకర్మలు నీయంద

కలుగు. సర్వకర్మలు నీయందయడంగు. నీవరజస్తమోగుణయుతములైన యా కృతులను సృష్టించి ముల్లోకములను జరాచరయుతమయిన ప్రపంచమునంతను సృష్టించితివి. అందువలన శాపపీడితులయిన ఋషుల ననుగ్రహింపవే! నీవయన న్యగతివి" యని వేఁడుకొనిన నాజగత్ప్రభువగు విశ్వకర్మ కరుణించి "నాయనుగ్రహమువలన ఋషులెల్లరు శాపమోచితు లగుదురు గాక!'' యని ఋషులనందఱ శాపమోక్షులఁజేసెను. అంత ఋషు లెల్లరు సంతుష్ఠినంది యవ్విశ్వకర్మ పరమేశ్వరుని గూర్చి తిరిగి తిరిగి నమస్కారము లొనర్చుచు "జగత్తులనెల్ల రక్షించు నో విశ్వకర్మ దేవా! నీకు నమస్కారము. ప్రకృతివలనఁ బురుషస్వరూపము నొందినట్టియు సమస్త ప్రాకృతస్వరూపము నందినట్టియునశుభముల నడంచునట్టియు సమస్తశుభముల నిచ్చునట్టియు సమస్తజగత్తుల సృష్టించునట్టియు సమస్త జగములకు సాక్షియగునట్టియుఁ దపోధనుఁడవగునట్టియు నీకొఱకు నమస్కారము. నీ యనుగ్రహమువలన గొప్పశాపమునుండి విడువఁబడితిమి. పరిశుద్ధులమైతిమి. ఓ జగత్ప్రభూ! మాత్రోవను మేము పోయెదము. దయ యుంచుఁ"డని యుత్తరదిశాభిముఖులై పునః పునః నమస్కారము లొనర్చుచుఁబోయిరి. కావున నో భీమసేనా! విశ్వకర్మనుగూర్చి నమస్కరించిన సకలసౌఖ్యము లబ్బును. ఏమనుష్యుఁడు భక్తిపూర్వకముగాఁబూజించునో యాతని వంశమెల్ల లోకమునందుఁ బూజింపఁదగినదగును. ఇట్లుశ్రీకృష్ణునిచే భీమసేనుఁడు విని గదను గైకొని యుద్ధమున కేగి జయశీలుఁడయ్యెను. ఎవ్వఁడీ ఋషి శాపమోక్షకథను వినునో యాతఁడు పాపరహితుఁడై పరిశుద్ధత నంది పుత్రపౌత్రాది సౌఖ్యములఁ గైకొని యంతమున విశ్వకర్మ సాయుజ్యమును బొందును.

అని చెప్పఁబడియుండుటచే విశ్వకర్మ ప్రసాదమువలన సప్తర్షులకు బ్రాహ్మణ్యముగలిగి పారిశుద్ధ్యము సంపాదించుటలోఁ బైశ్రుతుల బలపఱచుచున్నది.

## వసురుద్రాదిత్యులు విశ్వకర్మచే సృజింపఁబడుట.

(౩౮) శ్రు॥ ఆపోవా ఇదమగ్రే సలిలమాసీత్తస్మిన్ ప్రజాపతిర్వాయుర్భూత్వాచరత్స ఇమామపశ్యత్తాంవరాహో భూత్వా హరత్తాం విశ్వకర్మాభూత్వా వ్యమార్ట్సాప్రథత సాపృథివ్యభవత్తత్పృథివ్యైపృథివిత్వం తస్యామశ్రామ్యత్ప్రజాపతిస్సదేవానసృజత వసూన్ రుద్రానాదిత్యాన్ తేదేవాః ప్రజాపతి మబ్రువన్ప్రజా

యామహా ఇతి సోఽబ్రవీత్॥ ౧॥ యథాహం యుష్మాగ్ం స్తపసాసృక్ష్యేవం తపసి
ప్రజననమిచ్ఛధ్వమితి తేభ్యోగ్ని మాయతనం ప్రాయచ్ఛత్.

యజుఃకాం ౭ ప్ర ౧ అ. ౫

సా॥ భా॥ ఇదమి తీదానీం దృశ్యమానం గిరినదీసముద్రాదికం జగత్సృష్టి
వ్యుత్పత్తేః పూర్వం సలిల మాసీత్ తస్మిన్నేవ సలిలే కేవలా ఆపఏవనతుభూ
తాంతరం తత్కార్యంవా కించిదపినాఽఽసీత్. । తదానీం ప్రజాపతిర్విశ్వకర్మస్వ
శరీరస్యావస్థాతుం స్థానాభావాద్వాయు రూపో భూత్వాతస్మిన్సలిలే సర్వత్రాఽ
చరత్। చరిత్వాచ సలిలే నిమగ్నాం భూమిందృష్ట్వాస్వయం వరాహో భూత్వా
దంష్ట్రాగ్రేణతాం భూమింజలస్యో పర్యాహరత్ । ఆహృత్యచ వరాహరూపము
త్సృజ్య విశ్వకర్మా భూత్వా విశేషేణమార్జనంకృత్వా తత్రత్యం ద్రవముపనీయం
తాం విస్తారితవాన్ । తతఇయం దృశ్యమానా సర్వప్రాణ్యాధారభూతా పృథివ్య
భవత్ । ప్రథనాదేవ పృథివీనామ సంపన్నం తస్యాంభూమౌ సప్రజాపతిః స్వేనై
వశరీరేణా వస్థాయ సిసృక్షురశ్రామ్య త్తపః కృతవాన్ । తస్మాచ్చ తపస్సామ
ర్థ్యాత్ త్రీన్ వస్వాదిదేవగణాన సృజత । తేచవస్వాదయఃప్రజాపతిం ప్రజోత్పాద
నోపాయం పప్రచ్ఛుః । సచప్రజాపతిః మద్వత్తపసి కృతేసతి పశ్చాద్యూయ
ముత్పాద సమిచ్ఛతే త్యుక్త్వా హోమాఖ్యస్య తపస ఆధార భూతమగ్నిం దత్వా
తేనాగ్నినా హోమలక్షణం తపఃకురుతేత్యుక్తవాన్॥

తా॥ ఈచక్షుర్గోచరములగు గిరి నదీసముద్రాదికములు జగత్సృష్టికిం
బూర్వము జలరూపముననుండెను. ఆజలభూతమునందుఁ బ్రజాపతి స్వశరీరము
వసింపఁజేయ నవకాశములేమి వాయురూపుఁడై సలిలమందంతటఁజనించె. అటుల
జనించి జలనిమగ్నయగు భూమింగాంచి వరాహమూర్తియై దంష్ట్రాగ్రమున
భూదేవతనుద్ధరించి వారాహరూపంబుజ్జగించి విశ్వకర్మరూపంబవధరించి భూదేవ
తాదేహమునంగల జలంబులఁదుడిచి విస్తరింపఁజేసెను. ఇదపదృశ్యమానయగు
భూమి సర్వప్రాణ్యాధారమగు పృథివియయ్యె. జలంబులనుండి చీలదీయుటచే భూమి
కిఁ బృథివీనామముపపన్నమయ్యెను. విశ్వకర్మప్రజాపతి పృథివీభూతమందధివసించి
తపశ్చరణమొనర్చి వసురుద్రాదిత్యదేవతాగణమును సృజించెను. అంత నా వసు
రుద్రాదిత్యులు మహానుభావా! ప్రజాసృష్టికౌశలం బుపదేశింపుఁడన నా విశ్వ
కర్మభగవానుఁడు నే నెవ్విధంబునఁ దపస్సామర్థ్యంబుచే మిమ్మందఱ సృష్టిగావిం
చితినో యటువలె మీరును దపోబలంబుచేఁ బ్రజాసర్గం బొనర్పుఁడని తపోవ్రతం
బున కాధారమగు నగ్నిహోత్రమునొసంగి హోమలక్షణంబగు తపంబుసేయుఁడని

వసురుద్రాదిత్యులకు నియమించెను. ఇటుల నుడివియుండుటచేఁ బ్రపంచమున బ్రాహ్మణవర్గముల కంఁటకును బితృపితామహ ప్రపితామహ రూపముల నవధరించు వసురుద్రాదిత్యులను విశ్వకర్మ ప్రజాపతియె స్వకీయ తపశ్చరణముచే సృష్టించి ప్రజాసర్గమొనర్ప వారలకుఁ దపోమార్గ ముపదేశించి శిష్యసత్తములగు నా వసురుద్రాదిత్యులచే లోకసృష్టిఁ జేయించినటులఁ బ్రకటితమగుచున్నది.

## బ్రహ్మకు విశ్వకర్మకు మూర్తిభేదము.

(39) శ్రుతిః॥ సపరమేష్ఠీ ప్రజాపతి మబ్రవీదు పత్వాయా నీతి నేహాలోకోస్తీత్య బ్రవీత్స విశ్వకర్మాణంచ యజ్ఞంచా బ్రవీదుపవా మాయనీతి నేహాలోకోస్తీత్య బ్రూతాగ్ం సపతాంతృతీయాంచితి మపశ్యత్తాముపాధత్తతదసావభవత్.

సా॥ భా॥ ప్రజాపతి ర్విశ్వకర్మా పరమేష్ఠీ త్యేతేత్రయోప్యేకస్యైవ మూర్తిభేదాః । తత్రపరమేష్ఠినా ప్రార్థితః ప్రజాపతిర్భూమా వవకాశమదత్వా పరిజహార। విశ్వకర్మా యజ్ఞశ్చేత్యేతావప్యంతరిక్షేదిక్షుచావకాశమదత్వాపరిజహ్రతుః । తతః పరమేష్ఠీవిచార్య తృతీయాంచితిం దృష్ట్వోపాధత్త సాపిచితిర్ద్యౌరభవత్ । తత్రాయం పరమేష్ఠీస్వయమవస్థితః॥

తా॥ ప్రజాపతియు, విశ్వకర్మయుఁ, బరమేష్ఠియు, ముగ్గురు నొక్కరే మూర్తిభేదములు మాత్ర మగును. పరమేష్ఠిచేఁ బ్రార్థింపఁబడిన ప్రజాపతిభూమియం దవకాశమియ్యక నిలిచి విడిచెను. విశ్వకర్మయు యజ్ఞుఁడును వీరిద్దరు నంతరిక్షమునందు దిక్కులనెల్ల నవకాశమియ్యక నిలిచియుండిరి. అంతటఁ బరమేష్ఠి (బ్రహ్మ) విచారించి మూడవచితిని (అగ్నిని) నిలిపియుం దుండెను. ఆయగ్నిదివమునం దుండెను.

అని చెప్పుటచే విశ్వకర్మకు బ్రహ్మకు మూర్తిభేదములని తెలియుచున్నది. ఇందుల కనుకూలముగ,

(40) శ్లో॥ దృష్ట్వాచవిశ్వకర్మాణం వ్యాదిదేశపితామహః
సృజ్యతాం ప్రార్థనీయైకా ప్రమదేతి మహాతపాః॥. ౧
త్రిలోకేషుచ యత్కించిద్భూతం స్థావరజంగమమ్
సమాన యద్దర్శనీయం తత్తదత్ర సవిశ్వజిత్. ౨
కోటిశశ్చైవ రత్నాని తస్యాగాత్రే న్యవేదయత్
తాంరత్నసంఘాతమయీం ప్రసృజ్యద్దేవరూపిణీం. ౩

సాప్రయత్నేన మహతానిర్మితా విశ్వకర్మణా
త్రిషులోకేషునారీణాం రూపేణాప్రతిమాభవత్. ౪
నతస్యాఃసూక్ష్మమప్యస్తి యద్గాత్రేరూపసంపదా
నియక్తాయత్రవాదృష్టిర్నసజ్జతినిరీక్షతామ్. ౫
సావిగ్రహవతీ వశ్రీః కామరూపావపుష్మతీ
జహారసర్వభూతానాం చక్షూంషిచ మనాంసిచ. ౬
తిలంతిలం సమానీయ రత్నానాం యద్వినిర్మితా
తిలోత్తమేతి తత్తస్యా నామచక్రేపితామహః. ౭
భారతేతిహాసాదిపర్వము అ. ౨౧౧.

తా॥ పితామహుఁడగు బ్రహ్మ విశ్వకర్మనుగూర్చి తపశ్శాలివగు విశ్వకర్మా నేనుగోరినటుల నొకకాంతను సృష్టింపుము. అనిన ముల్లోకములలోని స్థావరజంగములలోని దర్శనీయమగు వస్తుజాలమును కోట్లకొలంది రత్నములనుగూర్చి దేవరూపిణియగు నొకనారిని సృజించెను. విశ్వకర్మచే నిర్మింపఁబడిన యాకాంత స్త్రీలోకములోనంతకు నప్రతిమానరూపమును బొందెను. సర్వరత్నములలోని తిలతిల ప్రమాణమగు సౌందర్యముగల దగుటచే నాకాంతకుఁ బితామహుఁడు తిలోత్తమయని పేరుపెట్టెను.

ఇట్లు పితామహ విశ్వకర్మలకు మూర్తిభేదములని తెలియుచుండినను,

(41) శ్రుతిః॥ విశ్వకర్మా హ్యజనిష్ట దేవా ఆదిద్గం ధర్వో అభవద్ద్వితీయః తృతీయః పితాజనితౌ షధీనా మపాంగర్భం వ్యదధాత్పురుత్రా॥

యజుః కాం ౪. ౬. ౨.

సా. భా. బ్రహ్మాండ మధ్యగతానా ముత్పత్తిరుచ్యతే । అండమధ్యే ప్రథమం విశ్వకర్మా [దేవతిర్యగాది విశ్వభేదకర్తా] సత్యలోకవాసీ చతుర్ముఖో దేవః అజనిష్ఠ [ఉత్పన్నః] ఆదిత్ అనంతరమేవ తదపేక్షయా ద్వితీయః గంధర్వః అభవత్ తతఊర్ధ్వమ్ ఓషధీనాం పితాపాలకః జనితాఉత్పాదకః సోమః పూర్వోక్త ద్వితీయాపేక్షయా తృతీయః అభవత్॥ తదేవం అపాగర్భం బ్రహ్మాండం పరమేశ్వరః పురుత్రావ్యదధాద్ [బహుధావ్యక్తంకృతవాన్]

తా॥ బ్రహ్మాండ మధ్యంగతులయొక్క యుత్పత్తిచెప్పఁ బడుచున్నది. అండమధ్యమునందు ముందుగా విశ్వకర్మ [దేవతిర్యగాదులచే విశ్వభేదములఁ జేయువాఁడు] సత్యలోకమునందున్న చతుర్ముఖుఁడగు దేవుఁడు పుట్టెను.

తరువాత రెండవవాడు గంధర్వుఁడయ్యెను. తరువాత నోషధీపాలకుఁడగు సోముఁడు పుట్టెను. ఇట్లు పరమేశ్వరుఁడు బ్రహ్మాండమును వేలువేలుగాఁ జేసెను.

ఇట్లు విశ్వకర్మ శబ్దమునకు సాయణ మాధవాచార్యులు "సత్యలోకవాసీ చతుర్ముఖో దేవః" అని యన్వయించి వ్రాసిరి. మఱియొకచో ప్రజాపతి ర్విశ్వకర్మా పరమేష్ఠీ త్యేతే త్రయోప్యేకస్యైవమూర్తి భేదాః" ప్రజాపతియు విశ్వకర్మయుఁ బరమేష్ఠియు నొక్కరే మూర్తిభేదములనందిరని వ్రాసిరి. "చతుర్ముఖో దేవః" యనివ్రాయుటలో నాయనువాకమునందె "విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖః" యని యెల్లదెసలఁ గన్నులుగలవాఁడును ఎల్లదెసల ముఖములుగలవాఁడు నని చెప్పియున్నది. చతుర్ముఖుఁడయిన విశ్వతోముఖుఁడగుటకు నాకింత సందేహము గన్పట్టుచున్నది. విశ్వతోముఖుఁడయిన నూర్ధ్వముఖముండవలెను. బ్రహ్మకు నూర్ధ్వముఖముండినటులను అయ్యది యాశ్వరునిచేఁ గోలుపోయినటులను నొక పురాణోక్తిగలదు. అది యట్లుండినను విశ్వకర్మకుఁ బంచముఖములు గలిగినటుల,

(42) శివఉవాచ. శ్లో॥ చింతయే ద్విశ్వకర్మాణం శివేవటతరోరథః
దివ్య సింహాసనాసీనం మునిబృంద నిషేవితమ్॥
ఉపాస్యమాన మమరైః స్తూయమానం మహర్షిభిః
పంచవక్త్రం దశభుజం బ్రహ్మచారి వ్రతేస్థితమ్॥
లక్ష్మీసరస్వతీభ్యాంచ సంక్షాళిత పదద్వయమ్
వక్షస్థలేచ బిభ్రాణం బ్రహ్మవిద్యా మమాతనుమ్॥
హార కేయూర కటక కుండలాద్యైస్సుశోభితమ్
భస్మాంగరాగం దేవేశం వరదం సుస్మితాననమ్॥
కుద్దాలకరణీ వాస్యామనియంత్రం కమండలుమ్
బిభ్రాణం దక్షిణేర్హస్తైరవరోహ క్రమాత్ప్రభుం॥
మేరుంటంకం స్వనం భూషాం వహ్నించ దధతంకరైః
అవరోహక్రమేణైవ వామైర్వామవిలోచనే॥
ఏవంధ్యాయే న్మహాదేవి విశ్వకర్మాణమవ్యయం॥
వాయుపురాణభూఖండము. విశ్వకర్మోపాఖ్యానము.

తా॥ పార్వతినిగూర్చి శివుఁడు చెప్పుట. ఓపార్వతీ వటవృక్షముక్రింద దివ్య సింహాసనమునందుఁ గూర్చుండి మహర్షి సముదాయముచే సేవింపఁబడుచు దేవతలచే నుపాసింపఁబడినవాఁడై యైదుమోములును బదిబాహువులు గలిగి లక్ష్మీసరస్వతులచేఁ గడుగఁబడుచున్న పాదద్వంద్వముగలవాఁడగుచు నురమున

నుమారూపమందిన బ్రహ్మవిద్యను దాల్చి రత్నమాలలు బాహుపురులు కంకణ
ములు కర్ణభూషణములు వీనిచేఁ బ్రకాశించుచు నొడలెల్ల భసితంపుఁబూఁత
బూసి మొగములఁ జిఱునగవు మొలకరింపఁ గుద్దాలమును గరణిని వాస్యను
ఘటికాపాత్రను గమండలువును, మేరువును, టంకమును, స్వనమును, భూషను,
వహ్నిని వరుసగా దక్షిణవామభాగహస్తపంక్తులతో పైనుండి క్రిందికిఁ గ్రింద
నుండి పైకిధరియించి యెంతయు, బ్రకాశింపుచున్న విశ్వకర్మను ధ్యానించుము.
అనియుండుటచే విశ్వకర్మకు నైదుముఖములుగలుగుట స్పష్టీకరించుచున్నది.
మాధవాచార్యుల వాక్యమునందుఁ గొంచెము పరస్పర విరోధముండినను
బ్రహ్మకు విశ్వకర్మకు మూర్తిభేదము స్థిరపరుపవచ్చును. భారత వచనముగూడ
దానినే బలపఱచుచున్నది. మఱియొకచో,

(43) శ్లో॥ విశ్వకర్మా భవత్పూర్వం బ్రహ్మణస్త్వ పరాతనుః
త్వష్టుఃప్రజాపతేః పుత్రోనిపుణస్సర్వకర్మసు॥
స్కాందపురాణకాశీఖండము. అ. ౯౬.

అని త్వష్టృప్రజాపతికుమారుఁడు విశ్వకర్మ బ్రహ్మకు రెండవదేహమయ్యె
నని చెప్పియున్నది. అందుచేతను విశ్వకర్మ బ్రహ్మకు రెండవవాఁడయ్యెను.

పంచ వైశ్వకర్మణహోమ సూక్తము.

(44) శ్రు॥ యజ్ఞపతి మృషయ ఏనసా॥ ౧॥ ఆహుః ప్రజానిర్భక్తా అను
తప్యమానామధవ్యాన్స్తోకా వపతౌరరాధ।సన్నస్తాభ్యాగ్ సృజతు విశ్వకర్మా ఘోరా
ఋషయోనమో అస్త్వేభ్యః। చక్షుషఏషాం మనసశ్చ సంధౌ బృహస్పతయే
మహిషద్యుమన్నమః। నమో విశ్వకర్మణే సఉపాత్వస్మాన సన్యాన్ త్సోమపాన
మన్యమానః। ప్రాణస్య విద్వాన్ సమరేనధీర ఏనశ్చకృవాన్ మహి బద్ధ ఏషాంత
విశ్వకర్మన్॥ ౨॥ ప్రముంచాస్వస్తయే యేభక్షయంతోనవసూన్యాన్రుహుః। యాన
గ్నయోఽన్వతప్య న్తధిష్ణియా ఇయస్తేషామవ యాదురిష్టై స్విష్టిన్నస్తాంకృణోతు

విశ్వకర్మానమః పితృభ్యో అభియేనో అఖ్యాన్ యజ్ఞకృతో యజ్ఞకామాః సుదేవా అకామావో దక్షిణాన్నసీని మమాన స్తస్మాదేనసః పాపయిష్ట। యావన్తావైసదస్యా స్తేసర్వేదక్షిణ్యాస్తేభ్యోయోదక్షిణాంనః॥౩॥ నమైదేభ్యో వృశ్చేత యద్వైవిశ్వకర్మ ణానిజుహోతిసదస్యానేవ తత్రీణాత్యస్మై దేవాసోవపుపే. చికిత్సతయమా శిరా దప్పతీవాహమశ్నుతః॥

కృష్ణయజుః కాం ౩ ప్ర ౨ అ౮.

సాయణభాష్యమ్॥ కల్పః॥ "యజ్ఞపతి మృషయఏనసాఽ హురిత్యగ్నీధ్రే యే పంచవైశ్వ కర్మణాని హృత్వాఇతి" తత్రప్రథమామృచమాహ॥ "యజ్ఞపతి మృషయ...........విశ్వకర్మా" ఇతి, యదాసర్వాః ప్రజాః నిర్భక్తాః అన్నర హితాః అను తప్యమానా భవంతి తదానీం యజ్ఞపతిం ఏనసాసంయుక్త మృష యః సర్వేప్యాహుః యజ్ఞపత్య పరాధాదేవ వృష్ట్యా ద్యభావే సత్యన్నా భావే ప్రజానామనుతాపే జాయతే, కోయం యజ్ఞపతే రపరాధ ఇతి తదుచ్యతే। మ ధుర్వసంతర్తుః। తత్సం బంధినా చైత్ర వైశాఖమాసౌ, స్తోకా జ్యోతిష్టో మానుష్ఠా నేనస్తోతుం యోగ్యౌ। తాదృశయోః మాసయోః, అనుష్ఠాన మకృత్వా తౌమాసౌ ప్రత్యహంయజ్ఞపతిరపరరాధ। అనే నాపరాధేన పాపీ యజమానః। ఇత్యృషయ ఆహుః॥ అతోయం విశ్వకర్మానో అస్మాన్ యజ్ఞపతీన్ తాభ్యాం మాసా భ్యాం మాంసృజతు యథాత యోర్మాసయోః జ్యోతిష్టోమ మనుతిష్ఠామ తథాప్రే రయతు ఇత్యర్థః। అథద్వితీయా మాహ "ఘోరాఋషయో......... ఉపా త్వస్మాన్". ఇతిపూర్వోక్తా ఋషయస్తేఘోరా ఉగ్రాః అస్మ ద పరాధమన్విష్య పాపీయా నయఇతి జనానామగ్రేనిందకత్వా దతఏవ ఋషిభ్యో నమోఽస్తు నమస్కారేణ శాంతాస్సంతః అస్మాన్ మానిందంతు।ఏషాంఋషీణాంకుతోఽస్మా కం మనసశ్చ సంధినా సంధాననిమిత్తం బృహస్పతయే నమోఽస్తు।ఋషయోయ థాస్మాన్ సమనుగ్రహేణ కటాక్షేణ వీక్షంతేనయంచ యథాకర్మానుష్ఠానే నాప రాధరహితాస్సంతోమనసా భక్తింకుర్మః తథాయం బృహస్పతి రనుగృహ్ణాతుమ హిషద్యుమదిత్యేతాని త్రీణి నమశ్శబ్ద స్య విశేషణాని నమస్కారోఽయ మష్టాంగో పేతత్వాన్మహాన్ తదనుగ్రహ పర్యంత ముత్పాద నాభావాదయం నమస్కారః। సోదతీతిసత్। భక్తిరసేనా త్యంతమా విర్భూతత్వాద్ద్యుమత్ ॥ విశ్వవిషయం కర్మ

సృష్ట్యాది రూపం యస్యాసౌ విశ్వకర్మా ప్రజాపతిః తస్మైనమోస్తు। సఉసో విశ్వకర్మాఽస్మాననుష్ఠాన ప్రవర్తనేనపాతు। అథతృతీయామాహ। "అనన్యాన్ సోమపాన్ మన్యమానః ప్రాణస్య విద్వాన్థ్సమరేన ధీర ఏనశ్చకృవా ........ ................స్వస్తయే" ఇతి। హేవిశ్వకర్మన్ అనన్యాన్ త్వద్వ్యతిరేకేణా త్యం తరరహితాన్ అస్మాన్ సోమపాన్ మన్యమానః అసోమపానేఽప్యేతేసోమపా ఇత్యేవానుగ్రహం కుర్వన్ పాతుమర్హతీతిశేషః। తత్రదృష్టాంతః ప్రాణస్య విద్వాన్ సమరేనధీరఇతి। యథాలోకే ధీరః పురుషః పరోయస్య ప్రాణస్యాఽపదం విద్వాన్ సమరేనయుద్ధే ఇవకరుణయాతం పాతితద్వత్।అయంయజమానః ప్రమాదాలస్యాదికారణాత్తమోగుణేన వృతస్సన్నేషాం ఋషీనాం ఏనోమహిచకృవాన్ మహాంతమపరాధం కృతవాన్ తమపరాధినం ప్రముంచతస్మాదపరాధాత్ ప్రకర్షేణమోచయ కిమర్థంస్వస్తయే వినాశరాహిత్యాయ అథచతుర్థీమాహ "యేభక్షయ .........విశ్వకర్మా" యేయష్టారః భక్షయంతః నసోమంభక్షయంతః విభక్షయంత ఇవవసూని ధనాని యాన్నృహుః పూజితవంతః యజ్ఞభిక్షారూపేణ ధనం ఆర్జయిత్వా యజ్ఞమకృత్వైవ భోగార్థం సంగృహీత వంత ఇత్యర్థః। ధిష్ణ్యనివాసినోఽగ్న యోఽయానన్వతప్యంత। అహోశోచ్యాఏతౌ ఇతితద్విషయేఖేదంకృతవంతః తేషాంయష్టౄణాంయాదు రిష్టిర్దుష్టోయాగోయా గాభావః తద్ధేతుకేనశ్చ తస్యావయవావినాశయిత్రీయేయ మిష్టిర్యాగః తామిష్టింనోస్మాకం విశ్వకర్మస్విష్టింకరోతు। అథపంచమీమాహ। "నమః ... ... ... ... పాపయిష్ట" ఇతిఏనోఽస్మాన్ అభ్యక్ష్యన్ అభీముఖ్యేనాపశ్యన్ తేయజ్ఞస్యకారయితారః అస్మాకంయజ్ఞం కామయమానాః సుదేవాఃసుష్ఠుద్యోతమానాః తాదృశాఃహేపితరః వయంప్రిమాదాలస్యాది భిరకామయజ్ఞంకర్తు మిచ్ఛారహితాః స్సంతోవోయుష్మభ్యం దక్షిణాందక్షిణోపలక్షితం యజ్ఞంనీనిమనైవనీతవంతః తస్మాదేవనమోఽస్మాన్ మాపాపయిష్టతేన పాపేనాస్మాన్ పాపిష్ఠాన్ మాకురు। తైరేతైర్మంత్రైఃహోమం విధత్తే. "యావంతా ... ... తత్ప్రీణాతీతి" యజ్ఞసభాయాంద్రష్టు మాగత్యావస్థితా యేబ్రాహ్మణాస్తేసర్వే దక్షిణార్హాః తేషామదానేనయత్పాపంతన్నివారణాయయథోక్తాని వైశ్వకర్మణాని జుహుయాత్। అయంచహోమఋత్విగ్దక్షిణానంతరంభావీతి॥

తాత్పర్యము. కల్పమునందు "యజ్ఞపతిమృషయ ఏనసాఽహుః" అను మంత్రములచే నాగ్నీధ్రుఁడైదు వైశ్వకర్మణ హోమములను జేయవలెనని చెప్పియున్నది.

ఎప్పుడు ప్రజలందఱు నన్నములేక సంతాపముచేఁ గుందుచున్నారో

అప్పుడు ఋషులందఱు యజ్ఞపతిని పాపముతోఁ గూడియున్నాఁడని చెప్పుచు న్నారు. అనగా యజ్ఞపతియొక్క యపరాధమువలననే వర్షాదులులేక యన్నా దులు లభింపక ప్రజలు మిక్కిలి దుఃఖించుచున్నారు. యజ్ఞపత్యపరాధమేమనఁగా వసంతర్తు సంబంధములైన చైత్రి వైశాఖ మాసములు జ్యోతిష్టోమానుష్ఠానము చేతఁ గొనియాడఁదగినవి. అట్టి మాసములయందు జ్యోతిష్టోమాదు లనుష్ఠింపకపోవు టయే యజ్ఞపతి యపరాధము; ఈయపరాధముచేతనే పాపియయ్యెనని యజమానుని ఋషులుచెప్పుచున్నారు. అందువలననే యీవిశ్వకర్మ యజ్ఞపతులమైన మమ్ములను ఈమాసద్వయమునందు జ్యోతిష్టోమాదు లొనర్చునట్లు చేయుఁగాక! మమ్మపరా ధులమని చెప్పు భయంకరులైన ఋషులకొఱకు నమస్కారము. మా నమస్కార మందుకొని వారు శాంతులై మమ్ముల నిందింప కుందురుగాత! ఈ ఋషులకు మాకును మానస సంధానము చేయుటకొఱకు బృహస్పతికొఱకు నమస్కారము. ఋషులెట్లు మమ్ముల ననుగ్రహించి కటాక్షవీక్షణములతోఁ జూచెదరో మే మెట్లు కర్మానుష్ఠాన పరులమై యపరాధవంతులము గాకుండ మానసభక్తిఁ జూపగలమో అట్లే బృహస్పతి యనుగ్రహించుఁ గాత! "మహిషద్యుమత్ర" నుమూడువిశేషములు నమశ్శబ్దమునకుండుటచే నీనమస్కార మష్టాంగములతోఁ గూడినదియు గొప్పదియునగును. వారియనుగ్రహపర్యంతము నిల్లై నమస్కరించు చుందుమని యుద్దేశము. సమస్తలోకవిషయికమగు సృష్ట్యాదిరూపకర్మ లెవ్వనికో యట్టి విశ్వకర్మయను ప్రజాప్రతికొఱకు నమస్కారము. ఆవిశ్వకర్మయు మమ్ముల ననుష్ఠానముచేత రక్షించుఁగాత! ఓవిశ్వకర్మా! నీవుగాక వేఱెగతిలేని మమ్ములను సోమపానులఁగా ననుగ్రహించుటకు నీవయర్హుఁడవు. ఎట్లు లోకమునందు ధీరుఁడై న పురుషుఁడితరునియొక్క ప్రాణాపత్తును దెలిసికొనిన విద్వాంసుఁడయి యుద్ధము నందువలె నాపద్బారుని రక్షించునో యట్లె మమ్ము రక్షింపుము. ఈయజమానుఁడు ప్రమాదాలస్యాది కారణములవలనఁ దమోగుణ భూయిష్ఠుండై వ్రతహీనుఁడై పాప మొనర్చి గొప్పయపరాధ మొనర్చెను. అట్టి యపరాధమునుండి యీయప రాధిని వినాశరాహిత్యముకొఱకుఁ జక్కగా విడిపింపుము. ఏయజ్వలు యజ్ఞభిక్షా రూపముచేత ధనమార్జించి యజ్ఞముచేయక భోగముకొఱకు ధనముఁదాఁచిపెట్టె దరో అగ్నులెవ్వరికూర్చి పరితపించుచున్నవో ఆయజ్వలయొక్క దుష్టయాగ ములన్నియు విశ్వకర్మ యోగ్యయజ్ఞములుగాఁ జేయుఁగాత! మమ్ములనెదుర్కొని మాయజ్ఞములను జక్కఁగానెఱవేర్పఁదలంచి జూచుచున్న యోషితరులారా! మేము ప్రమాదాలస్యాదులచే యజ్ఞముచేయుట కిచ్చలేక మీవలన దక్షిణనుదీసికొంటిమి అందువలన మమ్ములఁ బాపులఁగాఁ జేయకుఁడు. యజ్ఞసభయందుఁ జూచుటకు వచ్చి

యున్న బ్రాహ్మణులెల్లరు దక్షిణచే బూజింపఁదగినవారు, వారికి దక్షిణనియ్య లేనిదోషము వైశ్వకర్మణహోమముచే నివృత్తియగును.

ఇట్లీయర్థము ప్రతిపాదించుచున్నది. దీనిలోమనము కొంత యోజింపవలసి యున్నది. జగత్సృష్టికర్తయుఁ బ్రజాపతియనగు విశ్వకర్మనుధ్యానించి యజమానుఁడపరాధమునుండి నివృత్తుఁడగుట న్యాయమే. కాని యజ్ఞదర్శనార్థమేగు దెంచిన సదస్యులకు దక్షిణనొసంగని దోషమీవైశ్వకర్మణ హోమములచేఁ బాప విమోచకుఁడగుటలో సదస్యులెవరు? విశ్వకర్మస్తోత్రమువలన సదస్యులేల తృప్తి నందెదరు? అని దీర్ఘదృష్టిచే విచారింపవలసివచ్చినది. అచ్చటిసదస్యులు సర్వ శిల్పజ్ఞులగు నుపద్రష్టలు. వారు హిరణ్యేష్టకాదులచే వేదికలనిర్మించియు యజ్ఞ పాత్రలఁగల్పించియు వైదికరథాదుల సృష్టించియు నానావిధ యజ్ఞోపకరణముల నొసంగియు సభయందాసీనులయియుండిరి. అట్టి శిల్పివరేణ్యులకు దక్షిణాదుల నొసంగి సంతృప్తిచేయనిదోషమును యజమానుఁడీ వైశ్వకర్మణహోమముచే విడిపించుకొనుచున్నాఁడు. ఏలన నీవిశ్వకర్మ జగచ్ఛిల్పకర్త. సదస్యులో తత్ప్రతి బింబమూర్తులగు శిల్పిబ్రాహ్మణులు. ఉభయుల కవినాభావమేర్పడియున్నది. ఇతరసదస్యులయిన నిట్టిసంబంధమేర్పడియుండదు. కావున భాష్యకర్త "సదస్యా నేవ తత్ప్రీణాతి" యనుమూలమునకు "యజ్ఞసభాయాంద్రష్టు మాగత్యావస్థితాయే బ్రాహ్మణాస్తే సర్వేదక్షిణార్హాః" అని వ్రాయుటకు "యజ్ఞసభాయాంకర్తు మాగత్యావస్థితాయే శిల్పిబ్రాహ్మణాస్తే సర్వేదక్షిణార్హాః" అని వ్రాసినఁ జక్కని సందర్భము గుదిరియుండును. ఈసందర్భమిట్లుంచుఁడు. ప్రస్తుతమాలోచింతము. విశ్వకర్మ జగదీశ్వరుఁడగుటయేకాక జగత్సృష్టి సంత్రాణతత్పరుఁడై యజ్వుల యపరాధములను బ్రార్థనలచే మన్నించుచు లోకాభీష్టములనొసంగ దక్షుఁడైన టులఁ గానఁబడుచున్నది.

గాయత్త్రికి విశ్వకర్మనామము.

(45) శ్రుతిః॥ దేవాసురాః సంయత్తా ఆసఁ తేషాంగాయ త్త్ర్యోజోబల మిన్ద్రియం వీర్యం ప్రజాంపశూన్త్సం గృహ్యాదాయా పక్రమ్యాతిష్ఠత్ తేఽ మన్య న్తయతరాఁ వా ఇయముపావర్త్స్యతి త ఇదంభవిష్య న్తీతి తాంవ్యహ్వయన్త విశ్వకర్మ న్నితి దేవాదా భీత్యసురాః॥ యజుః కాం ౨ప్ర ౩అ ౩.

సాయణమాధవీయభాష్యానుసార తాత్పర్యము:— దేవాసురులు యుద్ధ సన్నద్ధులైరి. చర్మరక్త మాంసాది ధాతువులలో నెనిమిదవ ధాతువు నోజస్సని చెప్పుదురు; అట్టి యోజస్సు శరీరశక్తియగు బలము దృష్ట్యాది పాటవమగు నింద్రియము, ఉత్సాహమైన వీర్యము, పుత్రాదికులగు ప్రజలు, గవాదికములగుపశువులు నగు నీయాఱు పదార్థములను దేవాసురులనుండి సంగ్రహించిగాయత్రియీయుభయములకుఁ గానరాక తొలఁగిపోయి దూరముననుండెను. అట్టి గాయత్రినిఁ జూచి యుభయవర్గములవారును మమ్మనుగ్రహించు మమ్మనుగ్రహించుమనియు నెవ్వరి ననుగ్రహించునో వారికి సర్వైశ్వర్యములు లభించుననియుఁ దలంచి విలక్షణమగు శబ్దముచేతఁ బిలుచుటలో దేవతలు "విశ్వకర్మా" యనియు నసురులు "దాభీ" యనియుఁ బిలిచిరి. ఇట్లనుటవలన గాయత్రీ మహాదేవి విశ్వకర్మ నామత్వ మందినటుల బోధపడక మానదు.

ఈ పై వేదవాక్యము ననుసరించియే,

(46) శ్లో॥ ఓంకారస్తు పరబ్రహ్మ విశ్వకర్మాపరశ్శివః ।
పరాత్పర తరోంకారః పరాదూర్ధ్వం పరాత్పరః ॥ ౧౧
అగ్నిస్తు విశ్వకర్మైవ తదర్థం వహ్నిదైవతమ్ ।
తస్యబ్రహ్మఋషిశ్చైవ గాయత్రీ ఛందఉచ్యతే ॥ ౧౨
స్వరూపం పరమాత్మాచ ప్రణవస్యైవతస్యహి ।
లోకమాతాచ సావిత్రీత్ర్యక్షరం బ్రహ్మసమ్మితమ్ ॥ ౧౩
వేదశ్చలోకమాతాస్యాద్గాయిత్రీవేదమాతృకా ।
జాతాసౌ దేవతానామ్నా విశ్వకర్మేతికీర్తితా ॥ ౧౪
ఇతిస్కందపురాణే, నాగరఖండే, విశ్వకర్మోపాఖ్యానే,
బ్రాహ్మణ్యగాయిత్రీనిర్ణయోనామ చతుర్థోఽధ్యాయః.

తా॥ పరశివుఁడును బరబ్రహ్మయు విశ్వకర్మయు నోంకారమేయగును. సమస్తపరస్వరూపమునకు నూర్ధ్వమున్నదయ్యదియె. అగ్నియు విశ్వకర్మయె. అందువలననె యయ్యది వహ్ని దైవతము గలదయ్యెను. ఆప్రణవమునకు (ప్రణవస్వరూపము నందిన గాయత్రికి) బ్రహ్మఋషియు గాయత్రిఛందస్సు పరమాత్మస్వరూపము. లోకమాతయగు సావిత్రి మూఁడక్షరములు గలదియు బ్రహ్మముతోఁ గూడికొన్నదియునగును. వేదము లోకమాతయే. అట్టి వేదమునకు మాత గాయత్రి. ఆ గాయత్రీదేవత విశ్వకర్మ నామముతోఁ బరిగణింపఁబడినది.

ఇట్లు వక్కాణింపఁబడుటచే గాయత్రీ విశ్వకర్మలకు స్త్రీత్వ పురుషత్వ లింగభేదములొకింత గానిపించుచున్నవిగాని నామమూర్తి భేదములు గానుపించ

కున్నవి. అందువలననే గాయత్రి విశ్వకర్మలకుఁ బంచముఖములు, దశ భుజములు గలిగియుండి రూపసామాన్యత లోక ప్రసిద్ధిపడసియున్నది. మఱియు గాయత్రీ మంత్రమునకు విశ్వకర్మ పర్యాయముగ భాష్యము రచియింపఁబడి యున్నది. ఇందుచేత, బరాత్పర విశ్వకర్మ గాయత్రి యవతారమును బూని నట్టుల బోధపడుచున్నది.

విశ్వకర్మ శిల్పి బ్రాహ్మణులకుఁ గూటస్థుఁడగుట.

జగత్సర్జనా లోలుఁడగు విశ్వకర్మ పరమేశ్వరుఁడు శిల్పివరులకే కూటస్థుఁడగుటకుఁ గారణమేమనిన:—

పైన వ్రాసిన “ యఇమా విశ్వాభువనాని ” యను సూక్తమునకుఁ బరన ప్రయోజనమును వక్కాణించుచు స్వకంఠోక్తిగ విద్యారణ్య చరణు లీక్రిందివాక్యముల వ్రాసిరి.

(46) “ఇంద్రోవృత్రం మహాంతం వజ్రేణ ప్రద్రుతవాన్ తథావజ్రప్రద్రుతః అసురమాయయా సహషోడశప్రకారాణిశరీరాణి స్వీచకార। స్వీకృత్యచశబ్దాభిధైస్తైస్సర్వకారణ శరీరైస్తమింద్రం హస్తపాదాద్యవయవేషుబబంధ। తదానీంసఇంద్రః ఏనాంవిచార్యలసీకేన సైన్యేనయుక్తాయాగ్నయేపతావగ్నిస్తిగ్మేనేతిమంత్రద్వయేనసాధ్యమాహుతింద్రష్ట్వాహుతవాన్। తతస్సోగ్నిస్తృప్తోవృత్రస్యషోడశసర్వాకారాణిశరీరాణ్యాహరత్। తతఊర్ధ్వంయఇమావిశ్వేతిసూక్తద్వయ సాధ్యేన వైశ్వకర్మణ హోమేనవృత్రవధ జన్యాత్ పాప్మనోనిర్ముక్తః.................................
కిమ యం వైశ్వకర్మణహోమః ప్రతిమంత్రం పృథక్కార్యః కింవాసూక్తద్వయం సముచ్చార్య అపోస్విదేకైక ముచ్చార్యానుష్ఠేయః ? ఇతి తత్రాద్యపక్షద్వయం శాఖాంతరగతత్వేనాంగీకరోతి। యంకామయేతచిరంపాప్మనోనిర్ముచ్యేత్ ...ఏకైక హోమేన శనైశ్శనైః పాపనిర్ముక్తోభవతి సర్వానుచ్చార్యైక హోమేనతు తదానీమేవ పాపనిర్మోకః పృథక్సూక్తద్వయేపి సామర్థ్యం పృథక్సంపాదితం భవతి। అపిచసూక్తద్విత్వం యజమానస్య ప్రతిష్ఠాయై సంపద్యతే తస్మాదయమేవ పక్షశ్శ్రేయానిత్యర్థః।

తాత్పర్యము. ఇంద్రుఁడు వృత్రునిఁజంపెను. ఇంద్రవజ్రిముచేఁ జంపఁబడిన వృత్రుఁడసుర మాయచేఁ బదియాఱు విధములగు శరీరముల ధరించి యింద్రుని హస్త పాదాద్యవయవముల బంధించెను. అప్పు డింద్రుఁడీవిధమునంతయు విచారించి “ అగ్నిస్తిగ్మేన ” అను మంత్రద్వయము నాహుతులుగ నగ్నిహోత్రుని కొసంగెను. అంత నయ్యగ్ని సంతోషించి సర్వాకారములగు వృత్రుని పదియాఱు శరీరములను హరించెను. అటుమీఁదట “ యఇమావిశ్వా ” అను సూక్త

ద్వయముచే సాధించిన వైశ్వకర్మణ హోమముచే వృత్ర వధవలన లభించిన పాపమువలన విడిచిపెట్టఁబడెను.

............ఈ వైశ్వకర్మణ హోమము ప్రతి మంత్రము వేఱువేఱుగఁ జేయవలసినదా? సూక్తద్వయముఁజెప్పి యొక్కొ-కపర్యాయ మనుష్ఠింపఁదగినదా? అని ప్రశ్నించుటలో నిచ్చటి మొదటి పక్షద్వయమె శాఖాంతరగత మగుటచే నంగీకార మగుచున్నది. ఏది కోరఁబడుచున్నదో అట్టి చిరకాల పాపమువలన విడిచిపెట్టఁబడును.

ఒక్కొ-క హోమమువలన మెల్లమెల్లగఁ బాప నిర్ముక్తుఁ డగుచున్నాఁడు. అన్ని మంత్రములనుజెప్పిన యొక్క-హోమముఁ జేసినప్పుడే పాప నిర్ముక్తుఁడగు చున్నాఁడు. వేఱుగ సూక్తద్వయముచే సమర్థించిన వేఱువేఱుగ సంపాదింపఁబడు చున్నది. అయినను రెండు సూక్తములు యజమానునియొక్క- ప్రతిష్ఠకొఱకు సంపాదింపఁబడినవి. అందువలన(నీ రెండు సూక్తములు పఠించి హోమముచేయు) పక్షమే శ్రేయస్కరము." అని యిట్లు నుడువఁబడియుండుటచే సృష్టికర్తృత్వము బోధించు విశ్వకర్మ నామమునందొక్క- పరాత్పరత్వమే ప్రతిపాదించుటగాక, తన్నామస్మరణ మాత్రమున బ్రహ్మహత్యాది సమస్తపాపములు నశింపఁగలవని తెలియుచున్నది. భగవన్నామ స్మరణజేయుటచేఁ బాపక్షయమగుననుట యొక యబ్బురముగాదుగదా? కాని సూక్తపఠనమింద్రుఁడు తన పాపమును వారించు కొనఁజేసెననుట కొంత విచారింపఁదగియున్నది. ఇంద్రుఁడు త్వష్ట్రుపుత్రుఁడగు విశ్వరూపాచార్యునిఁజంపి గురుహత్య నొడిఁగట్టుకొనుటచేఁ ద్వష్టయింద్రునొంప వృత్తునిఁ గల్పించి పంపెననియు నింద్రుఁడు విశ్వకర్మానుగ్రహముచే లబ్ధమైన వజ్రాయుధముచే వృత్రుశిరశ్ఛేదన మొనర్చెననియు శ్రుతులు గొన్ని పలుకు చున్నవి. ఆవృత్ర శిరశ్ఛేదన పాపమే యిందుని బాధింప నతఁడు వైశ్వకర్మణ హోమముచేఁ బాపనిర్మోకుఁడయ్యెఁగదా? వృత్రునిఁ జంపిన పాపము విశ్వకర్మ సంబంధమైన హోమముచేఁబోవుటకుఁ గతమెయ్యది?అను సంశయమూహింపఁ దగియున్నది.

విశ్వకర్మ జగదీశ్వరుఁడయ్యును, సర్వప్రపంచ కర్తయయ్యును, స్వకీయ తేజః ప్రతిబింబమూర్తిని, లోక సర్జనాకళాతిశేకుని, త్వష్ట్రునామకునిఁ బ్రత్యేక పుత్రునిరూపముగ వ్యక్తీకరించెను. అందువలననే "విశ్వకర్మణ స్సమవర్తతాధి తస్యత్వష్టా విదధద్రూపమేతి॥" అను యజురారణ్యక వచనమువలన జగత్కర్త యగు విశ్వకర్మవలన సమస్తప్రప[illegible]యొక్క-

రూపమును బొందుచుఁ ద్వష్టప్రవర్తించుచున్నాఁడని తెలియుచున్నది. వెండియు
బరమేశ్వరుఁడగు విశ్వకర్మ పుత్రోద్యుత్పాదక కారణుఁ డగుటకె ప్రజాపతిత్వ
ఋషిత్వము నవధరించి ప్రకాశించుట. విశ్వకర్మతేజ స్సంభూతుఁడగు త్వ
యపరబ్రహ్మమై ప్రథమపుత్త్రిని విశ్వరూపుని, ద్వితీయపుత్త్రిని విశ్వకర్మ నా
కుని గాంచినటుల వేద పురాణవచనములు గాన్పించుచున్నవి. ఈ త్వష్ట్ర వి
కర్మ విశ్వరూపాదులు కేవల దేవత్వము నందుటయెగాక మర్త్యభేదమగు బ్ర
హ్మణ వాచ్యత నవధరించినటుల వక్ష్యమాణశ్రుతి పురాణవచనములు పెకు
లు గనఁబడుచున్నవి. త్వష్టృప్రజాపతి తన కుమారుఁడగు విశ్వరూపుని జంపి
హేతువుచే నిందునిని సాధింప వృత్రునిఁ గల్పించుటయు, నా వృత్రివధను గో
యిందుఁడు ప్రార్థింపఁ దిరిగి వజ్రాయుధమునకుఁ బదును వెట్టియిచ్చి వృత్రి
నన మొనర్పించుటయు, నా వృత్రిహనన మహాపాపమును బరమేశ్వర విశ్వకర
ధ్యానముచే నివృత్తి యొనర్పించుటయుఁ జూడఁ బరమేశ్వర విశ్వకర్మనుండి పర
పరాగతికులై త్వష్ట్ర విశ్వరూప విశ్వకర్మాదులును దదితర శిల్ప కళాతిరేక బ్ర
హ్మణ వంశకూటస్థులును బ్రభవించిరనుట విస్పష్టమగుచున్నది. ఇయ్యది నార
యణుని నాభికమలమునుండి బ్రహ్మయు, మనస్సునుండి మన్మథుఁడును బుట్టిర
పురాణవచనముల కన్న బలవత్తరముగనె యున్నది. విశ్వసృష్టి క్రియాప్రవర్త
పేక్షకుఁడగు విశ్వకర్మ మహర్షి లోకక్రియాధురీణులఁ బెక్కండ్రి విశ్వకర్మర్షు
సృష్టించినటులఁ బూర్వోదాహృతమైన యజుర్మంత్రములయందలి "తఆయజం
ద్రవిణగ్ం సమస్మాఋషయః పూర్వేజరితారో నభూనా" అను వాక్యమువల
విస్పష్టమగుచున్నది. ఇంకను నీ విశ్వకర్మ వంశపరంపర ముందటి శిల్పకాండమ
నందును రథకారకాండమునందును సంపూర్ణముగా వివరింపఁబడినది.

## విశ్వకర్మజగత్సృష్టి.

పద్మపురాణే భూఖండే మహాదేవఉవాచ:—

(47)శ్లో॥ ఉక్తం కృష్ణస్య మాహాత్మ్యం రక్ష్యేథో విశ్వకర్మణః
పురీచయా దృశీతేన నిర్మితేత్యేత దప్యుత॥
కృష్ణశ్చ విశ్వకర్మాచ నభిద్యేతే పరస్పరమ్
నహి కృష్ణ మృతేకశ్చి చ్చిత్రిం రచయితుం క్షమః॥
యదా నభూర్మఖం నాగ్ని ర్నవాయుర్నాపిచోదకం
తదైవ ఏక కృష్ణో భూన్నిర్గుణో నిష్కలోదయః॥

తేన మాయాసహాయేన నిర్మితం భూతపంచకం
వ్యోమవాయు స్తథాజ్యోతి రాపో భూమిశ్చపంచమీ॥ ౪
శబ్దైకగుణమాకాశం శబ్దస్పర్శ యుతోఽనిలః
శబ్దస్పర్శం చరూపంచ జ్యోతిషోఽమీ గుణాస్త్రయః॥ ౫
శబ్దస్పర్శౌరూపరసౌ చత్వారోపాం గుణాః స్మృతాః
శబ్దస్పర్శౌరూపరసౌ గంధశ్చేతి భువోగుణాః॥ ౬
వ్యోమతో నిర్మమేశ్రోత్ర మింద్రియంశబ్దగామితత్
వాయో స్త్వగింద్రియం జాతంస్పర్శస్యగ్రహణేక్షమం॥ ౭
రూపగ్రహక్షమంచాభూద్ జ్యోతిష శ్చక్షురింద్రియం
రసగ్రిహక్షమం తద్వదద్భ్య భూద్రసనేంద్రియం॥ ౮
భూమేర్ఘ్రాణేంద్రి యమభూత్సర్వ గంధగ్రహక్షమం
సర్వేషా మపి భూతానాం మాత్రాభ్యః షష్ఠమింద్రియమ్॥ ౯
అంతఃకరణసజ్ఞం తత్సర్వసాధారణంహ్యభూత్
తస్యవృత్తిప్రభేదాస్తు మతాః కార్యవశాచ్ఛివే॥ ౧౦
మనోబుద్ధి రహంకారశ్చిత్తం చేతి చతుర్విధాః
సంశయో మనసోరూపం బుద్ధేరూపంతు నిశ్చయః॥ ౧౧
దర్పోఽహంకారరూపంస్యా చ్చిత్తరూపం త్విహస్మృతిః ౧౨
తాంస్మృతిం సమాశ్రిత్య పూర్వవచ్చైవగోచరాం
మిశ్రీచకార భూతాని పంచధా పంచభాగశః॥ ౧౩
స్వేతరేషాం చతుర్ణాంహి భూతానామష్టమాంశకైః
చతుర్భిరర్ధమర్ధంస్వం భూతే భూతే వ్యవచ్ఛితమ్॥ ౧౪
పంచీకృతాని భూతాని స్థూలాన్యేతాని పార్వతి
బాహ్యేంద్రియైః ప్రగృహ్యంతే సూక్ష్మాని మనసైవహి॥ ౧౫
జలేన మిశ్రితా మృత్స్నాకులాలేన ప్రయోజితా
యథాశైలేంద్రదుహితే యోగ్యాస్యాద్ ఘటసృష్టయే॥ ౧౬
ఏవంపంచీకృతాః ఖాద్యాః పిండబ్రహ్మాండ సృష్టయే।
ప్రభవంతి మహాదేవిప్రయుక్తా విశ్వకర్మణా॥ ౧౭
విభజ్యమూర్తిరూపేణ తత్తద్గర్భాంకురాదికమ్।
అదృశ్యే నైవరూపేణ విశ్వకర్మా సృజత్యయం॥ ౧౮
అమూర్తే నైవరూపేణ భూతానిసస్రుజేహరిః।
అస్యదృశ్యాని రూపాణి సర్వేశిల్పవతాం వరాః॥ ౧౯

తానావిశ్వత్యసౌ సర్వంచిత్రం సృజతిపార్వతి।
దివిభువ్యంతరిక్షేవాపాతాళేవాపి సర్వశః॥ ౨౦
గృహంయత్రం రథోభూషా ప్రతిమావసనాదికమ్॥
యత్కించిద్దృశ్యతే చిత్రం తత్సర్వం విశ్వకర్మజం॥ ౨౧

తా॥ భవుండు భవానితో నిట్లుపలికెను. శ్రీకృష్ణ మహాత్మ్యమిదివఱకుఁ చెప్పఁబడినది. ఎట్టిపత్తనమావిశ్వకర్మచే సృష్టింపఁబడినదో యద్దానినిఁక వాక్రుచ్చెదఁగలను. శ్రీకృష్ణునకు విశ్వకర్మకు భేదమేమాత్రము గానిపింపదు. శ్రీకృష్ణుఁడుగాక యెవ్వండీచిత్ర ప్రపంచమును గల్పింపఁగలఁడు. ఎప్పుడు భూమ్యాకాశము లగ్ని వాయూదకములు లేకుండెనో యప్పుడు నిర్గుణము నిష్కలోదయమునగు నొక్కకృష్ణస్వరూపమే నిలిచియుండెను. మాయాసహాయుఁడగు నతనిచే శబ్దైకగుణకమగు నాకాశము, శబ్దస్పర్శగుణములుగలవాయువు, శబ్దస్పర్శరూపగుణములుగల యగ్నియు, శబ్దస్పర్శ రూప రసగుణములుగల యుదకము, శబ్దస్పర్శ రూప రస గంధగుణములుగల భూమియు నను భూతపంచకము సృజింపఁబడియె. మఱియు నాకాశమువలన శబ్దగామియగు కర్ణేంద్రియమును, వాయువువలన స్పర్శజ్ఞానముగల త్వగింద్రియమును, అగ్నివలన రూపముగ్రహించు నేత్రేంద్రియమును, ఉదకమువలన రసగ్రహణశక్తిగల జిహ్వేంద్రియమును, పృథివి వలన సర్వగంధగ్రహణ శక్తిగల నాసికేంద్రియమును సృష్టింపఁబడియెను. ఇంకను బంచభూతముల సూక్ష్మాంశములవలన నంతఃకరణమేర్పరుపఁబడి వృత్తి భేదమువలన మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము నను నాలుగువిధములుగ నిశ్చయింపఁబడియె. అది సంశయోపేతమైన మనస్సనియు, నిశ్చయమైనపుడు బుద్ధియనియు, గర్వితమైన నహంకారమనియుఁ దలఁపుగలిగినఁ జిత్తమనియు విభాగింపఁబడియెను. పూర్వమువలెగోచరించు స్మృతి ననుసరించి భూతములనైదింటిని నైదైదు భాగములొనర్చి నిత్యవ్యాపకత్వముగలయాకాశభూతమేకత్వమగుటచేఁదదితరభూతచతుష్టయమునర్ధమర్ధముగావిడదీసి భూతముల యష్టమాంశకములతోఁ బ్రతిభూతమున నర్ధభాగమునిలిపి స్థూల పంచీకరణముచే నోపార్వతీ! బాహ్యేంద్రియ వికారములగు స్థూలశరీరముల సృజించి యావిశ్వకర్మ మనోబుద్ధ్యాది సూక్ష్మేంద్రియములనుగూడ వానిలోఁగూర్చి విడిచెను. ఇట్లుపంచీకరింపఁబడిన యాకాశాదిభూతములు మృజ్జలాదులు మిశ్రమొనర్చి కులాలుఁడు ఘటములు సృజించినటులఁ బిండబ్రహ్మాండసృష్టికొఱకు నోమహాదేవి! విశ్వకర్మచేఁ బ్రయోగింపఁబడుచున్నవి. మఱియు నదృశ్యరూపముచే నాయాగర్భాంకురాదికములను భాగమొనర్చి మూర్తిరూపములుగా నీ విశ్వ

కర్మ సృజించుచున్నాఁడు. నిరాకారమైన రూపముచేతనే యాహారిభూతములను సృజించెను. మఱియు సాక్షాద్ధరిరూపము వహించిన యవ్విశ్వకర్మ శిల్పవంతులలో శ్రేష్ఠులగు వారిహృదయములలోఁ బ్రవేశించి సర్వచిత్రములగు శిల్పములను సృష్టించుచున్నాఁడు. స్వర్గమునందు, భూమియందు, నాకాశమునందుఁ, బాతాళమునందు, నన్నియెడలను, గృహము, యంత్రము, రథము, భూషణము, విగ్రహము, వస్త్రాదికము.వీనిలో నేదైననొక కొంచెమైనను జిత్రము (శిల్పము) గనఁబడుచున్నదో నదంతయు విశ్వకర్మవలనఁబుట్టినదే. అని పార్వతికి శివుఁడు చెప్పెను. దీనిచే సర్వములగు నండ, పిండ, బ్రహ్మాండములు విశ్వకర్మచే సృజింపఁబడుటయెగాక ప్రపంచమునందలి సర్వచిత్ర శిల్పములు విశ్వకర్మాంశ భాగులే సృజించునటులఁ గానఁబడుచున్నది.

—✻ విశ్వకర్మయొక్క సర్వశిల్పాధిపత్యము. ✻—

"విశ్వకర్మ"

(48) నిరుక్తభాష్యమ్॥ త్వష్టావిశ్వకర్మా ఇత్యధి భూతప్రధానః పురాణవిదః॥ తథాపికలా కౌశల్యాది సర్వజ్ఞానహేతుకో నామప్రతిలంభ ఇత్యవిప్రతిషిద్ధం ఏవంసర్వాసు దేవతాసు.

విశ్వకర్మయన నధిభూతప్రధానుఁడని పురాణవిదులందురు. అట్లయినను సర్వదేవతలయందుఁకలాకౌశల్యముమున్నగునను సృజ్ఞానములకు హేతుభూతుఁడగుచున్నాఁడు. అనియుండుటచే సమస్త శిల్పకలలకు నతఁడే హేతువయినవాడును నధికారియు నగును.

అందువలననే విశ్వకర్మయె హోమకుండ శస్త్రాస్త్ర దేవరథ దేవమూర్త్యాదుల నిర్మాణమొనర్చెను. వానికి నీ క్రింది యుదాహరణముల నుదాహరింపఁబడినవి.

శ్రుతిః॥ త్వష్టాస్మైవజ్రం స్వర్యం తతక్ష॥

ఋగ్వే ౧.౨. ౩౬.౨

భాష్యమ్॥ త్వష్టావిశ్వకర్మా అస్మైఇంద్రాయ స్వర్యం స్వర్గాయహితం వజ్రం తతక్ష తీక్ష్ణీకృతవాన్॥

శ్రుతిః॥ అస్మా ఇదు త్వష్టా తక్షద్వజ్రం॥

ఋగ్వే. ౧.౪.౨౧.౧.

అతక్షత్ నిర్మితవాన్.

శ్రుతి॥ వజ్రో వై రథః। వజ్రేణైవది శాభిజయతి॥

తై॥ బ్రా॥ ౧. ౩. ౬.

శ్రుతి॥ అనవస్తే రథమశ్వాయతక్షన్ త్వష్టావజ్రంపురుహూతంద్యుమంతమ్

ఋగ్వే॥ ౪. ౧. ౩౧.

ఇటులఁ బెక్కులగు శ్రుతుల యుదాహరణమువలన "విశ్వకర్మ యీ యింద్రునికొఱకు స్వర్గహితముగోరి వజ్రమునుబదునువెట్టి యిచ్చె" ననియు "ఈ యింద్రునికొఱకు విశ్వకర్మ వజ్రమును జేసియిచ్చె" ననియు "వజ్రమేరథమ" ని తైత్తిరీయ బ్రాహ్మణవచనమును, ఋభువులు రథ మొనర్చిరనియు విశ్వకర్మవజ్రా యుధమును తేజోవంతముగాఁ జేసియిచ్చెననియుఁ దెలియవచ్చు చున్నది. ఈ పైశ్రుతులలోఁ ద్వష్టృశబ్దమునకు విశ్వకర్మ పరముగ భాష్యకర్త లర్థీకరించి యున్నారు.

మఱియు,

(49) శ్రుతి॥ ధ్రువాసిధరుణాఽ స్తృతావిశ్వకర్మణా సుకృతా॥

యజుః కాం ౪ ప్ర౦ అ౯

మా. భాష్యమ్. హే స్వయమాతృణ్ణే! త్వంధ్రువాస్థిరా ఽ సి. కీదృశీధరుణా ధారయిత్రీఅతఏవాఽస్తృతా కేనా ఽ ప్యహింసితా. విశ్వకర్మణా జగత్కర్త్రాసుకృతా సుష్టునిర్మితా॥

తా॥ ఓస్వయమాతృణ్ణా! నీవుస్థిరమైనదానవు, ధరించుచున్నదానవు నగుదువు. అందువలననే యెవ్వనిచేతను హింసింపఁబడుదానవుకావు. మఱియుజగత్కర్తయగు విశ్వకర్మచేఁ జక్కగానిర్మింపఁ బడినదానవగుదువు. ఇందుచేఁ బాత్రనిర్మాణము విశ్వకర్మచే రచియింపఁబడినటులఁ దెలియుచున్నది.

ఇందుల కనుకూలముగ:—

శ్లో॥ అథేంద్రోవజ్రముద్యమ్య నిర్మితం విశ్వకర్మణా॥

భాగవత స్కంథ ౬. అ౧

విశ్వకర్మచే నిర్మితమగు వజ్రాయుధమును ఇంద్రుఁ డుద్యమించెను. అని భాగవత వచనము.

(50) శ్లో॥ నిర్మలో విశ్వకర్మాతు నిర్మమే శస్త్రసంహితమ్
బ్రహ్మణేకంశికాంచక్రం విష్ణవేదైత్యశత్రవే
త్రిణేత్రాయ త్రిశూలంచ వజ్రమింద్రాయవహ్నయే
పరశుం (తోమరం) ధర్మరాజాయ దండాయుధముదార్చిషమ్.
స్కందపురాణ నాగరఖండే విశ్వకర్మోపాఖ్యానే.

నిర్మలుఁడగు విశ్వకర్మ శస్త్రసంహితమను శాస్త్రమును సృజించెను. బ్రహ్మకొఱకుఁ గంశికయను నాయుధమును, విష్ణువుకొఱకుఁ జక్రమును, త్రిణేత్రుఁడగు శివునికొఱకుఁ దిశూలమును, ఇందునికొఱకు వజ్రాయుధమును అగ్నిదేవునికొఱకుఁ దోమరమును యమునికొఱకు దండాయుధమును నిర్మించెను అనియును,

(51) శ్లో॥ యథైవసుసమిద్ధస్య పావకస్యాత్మమండలమ్
విశ్వకర్మకృతా చాస్య దివ్యమాలాహిరణ్యయీ॥
భారతవనపర్వే అ ౨౨౯

విశ్వకర్మచేఁ జేయఁబడిన స్వర్ణమయమగు దివ్యమాల సమిధలతోఁ బ్రజ్వలించు నగ్నిహోత్రునివలెఁ బ్రకాశించుచున్నది. మూర్తి నిర్మాణమునుగూర్చి,

శ్లో॥ శ్రుత్వైతద్వచనంతస్యవిశ్వకర్మా సుకర్మకృత్
తత్క్షణాత్కారయామాస ప్రతిమా శ్శుభలక్షణాః॥
బ్రహ్మపురాణే పురుషోత్తమ క్షేత్రవర్ణనే అ ౭౫.

పావనములగు శిల్పములొనర్చు విశ్వకర్మ దేవతావాక్యమును విని తత్క్షణముననే శుభలక్షణములగు ప్రతిమలఁ జేయించి పురుషోత్తమ క్షేత్రమునఁ బ్రతిష్ఠించెను.

విశ్వకర్మవలన లింగ ప్రతిష్ఠాపనము.

శ్లో॥ తస్మాచ్చ పూర్వదిగ్భాగే కించిదాగ్నేయ సంస్థితమ్
లింగద్వయం మహాపుణ్యం విశ్వకర్మ ప్రతిష్ఠితమ్॥
స్కందపురాణ ప్రభాసఖండే ఉన్నతస్థాన మాహాత్మ్యే
లింగద్వయ మాహాత్మ్యవర్ణనే అ॥ ౩౨౦.

ఆలింగమునకుఁ బూర్వదిగ్భాగమునఁ గొంచెమాగ్నేయభాగముగా మహాపుణ్యవంతమైన లింగద్వయము విశ్వకర్మచేఁ బ్రతిష్ఠింపఁబడెను. ఇంతయెగాక,

(52) శ్లో॥ ఇత్యుక్త్వాచతదాదేవాః ప్రణిపత్యహరిం స్వయం
లింగాని ప్రార్థయామాసుః సర్వకామాప్తయే నృణామ్॥

హరిరపితథా బ్రహ్మ విశ్వకర్మాణమబ్రవీత్
లింగాని చత్వయాదేవ కల్పయిత్వాశుభానిచ॥
దేయాని సర్వదేవేభ్యోనచనాన్యమసత్తమ
లింగాని కల్పయిత్వైవం చాధికారానురూపతః॥
విశ్వకర్మాదదాతేభ్యః నియోగాద్బ్రహ్మణః ప్రభోః
తదేవకథయామ్యద్య శ్రూయతామృషిసత్తమాః॥
పద్మరాగమయం శక్రో హైమం విశ్రవసస్సుతః
పీతం మణిమయం ధర్మో వరుణః శ్యామలంశివం॥
ఇంద్రనీలమయం విష్ణుర్బ్రహ్మా హేమమయం తథా
విశ్వేదేవాస్తథారౌప్యం వసవశ్చతథైవచ॥
ఆరకూటమయం వాయురశ్వినౌపార్థివంతథా
లక్ష్మీశ్చస్ఫటికందేవీ ఆదిత్యాస్తామ్ర నిర్మితమ్॥
మౌక్తికం సోమరాజోవై వజ్రలింగం విభావసుః
మృణ్మయంచైవ విప్రేంద్రా విప్రపత్న్యస్తథైవచ॥
దైత్యాశ్చ గోమయంలింగం రాక్షసాశ్చమహాబలాః
లోహాత్మకంతథాలింగం పిశాచాః పూజయంతిహి॥
శివాదేవీ సదాపూజ్యా నవనీతవినిర్మితం
దారుజం నిఋృతిర్భక్త్యాయోగీభస్మమయం తథా॥
ఛాయాపిష్టమయంచైవ బ్రహ్మణీరత్న సంభవమ్
దధిమయం తథాయక్షాః పూజయంతి నిరంతరమ్॥
ఏవంవిధాని లింగాని దత్తాని విశ్వకర్మణా
తేపూజయంతి సర్వేవై దేవాఋషిగణాస్తథా॥
బ్రహ్మచైవతథా విష్ణురన్యేదేవాశ్చయేపునః
పూజయంతి సదాదేవం నిత్యసిద్ధి సమీహయా।
తథాదత్వాచలింగాని దేవానాంహితకామ్యయా
పూజావిధిం సమాచఖ్యౌ బ్రహ్మణేఽనంతశక్తయే॥
తచ్ఛ్రుత్వావచనం తస్యబ్రహ్మదేవగణైస్సహ॥
ఆజగామస్వకంధామ హర్ష నిర్భరమానసః
విష్ణుశ్చాంతర్హిత స్తత్ర చోపవిశ్యయథావిధి॥

శివపురాణే, అధ్యాయః ౨౭...

ఇటులఁజెప్పి దేవతలప్పుడు విష్ణువునుగూర్చి నమస్కరించి మనుష్యులకెల్ల కోరికెలదీర్ప లింగములను బ్రార్థించిరి. అంత విష్ణువు బ్రహ్మయు విశ్వకర్మను గూర్చి యిటులఁబలికిరి. ఓదేవోత్తమా! పావనమైన లింగములను రచియించి వారివారి యధికారములకుఁ దగినటుల నెల్లరకొసఁగవలెను. అనునంత బ్రహ్మ నియోగమువలన వారికందఱకు లింగములనుగల్పించి యిచ్చెను. ఇచ్చిన యీ విధమును జెప్పెదను. ఇంద్రుఁడు పద్మరాగముతోఁ జేసినలింగమును, కుబేరుఁడు స్వర్ణలింగమును, యముఁడు పచ్చతోఁజేసిన లింగమును, వరుణుఁడు శ్యామల వర్ణలింగమును, విష్ణు వింద్రనీలమణిలింగమును, బ్రహ్మ సువర్ణమయ లింగమును, విశ్వేదేవతలు వసువులు రజతలింగమును, వాయు విత్తడిలింగమును, అశ్వినీదేవతలు పార్థివలింగమును, లక్ష్మీదేవి స్ఫటికలింగమును, ఆదిత్యులు తామ్రలింగమును, చంద్రుఁడు మౌక్తికలింగమును, సూర్యుఁడు వజ్రలింగమును, బ్రాహ్మణులెల్లరు మృణ్మయలింగమును, బ్రాహ్మణస్త్రీలునట్లె మృత్తికాలింగమును, దైత్యులు రాక్షసులు గోమయలింగమును, పిశాచము లయోమయలింగమును, పూజ్యురాలగు భవానీదేవి నవనీతముతోఁజేసిన లింగమును, నిఋఋతి దారుమయలింగమును, ఛాయాదేవి పిండితోఁజేసినలింగమును, సరస్వతీదేవి రత్నముతోఁజేసినలింగమును, యక్షులు దధిమయలింగమును నిరంతరమును బూజింపఁదొడఁగిరి. ఈలింగములెల్లయు విశ్వకర్మచే నిర్మింపఁబడిన వే, బ్రహ్మవిష్ణువులును నన్యదేవతలును నిటుల మహాదేవుని నిత్య సంసిద్ధిఁగోరి పూజించుచున్నారు. ఇట్లు విశ్వకర్మ యనంతశక్తిసంపన్నుఁడగు బ్రహ్మకొఱకు లింగము లొసఁగి పూజావిధినిగూడఁ జెప్పెను. అంతట బ్రహ్మదేవుఁడు సంతోషముతో స్వకీయనివాసమున కేతెంచెను. విష్ణువు నంతర్హితుఁ డయ్యెను.

—:—

ఇట్లు నుడివియుండుటచే విశ్వకర్మయే సర్వదేవతలకు లింగము లొసఁగి భక్తిమార్గములు బోధించి యెల్లరఁ గృతార్థులఁజేసి తన దేవాచార్యత్వము నిలిపికొనినటులఁ దెలియవచ్చు చున్నది. మఱియు యాజ్ఞికసాహిత్యము లొసఁగినటుల:—

(౫౩) దేవాఊచుః॥ శ్లో॥ యేనయచ్చాత్రకర్తవ్యం తచ్ఛీఘ్రం వదపద్మజ
యజ్ఞేతవమహాభాగ యజ్ఞకర్మ ప్రసిద్ధయే ॥

బ్రహ్మోవాచ॥ విశ్వకర్మన్ ద్రుతంగచ్ఛ యజ్ఞమండపసిద్ధయే
పత్నీశాలా సదశ్చైవ యజ్ఞవేదీస్తథైవచ
కుండానిచైవసర్వాణి యథాస్థానేషు కారయ

యజ్ఞపాత్రాణి సర్వాణిగ్రహాశ్చ చమసాస్తథా
యూపశ్చమత్ప్రమాణేన కర్తవ్యస్సచపాలకః
శయనార్థంతథా గర్తాకర్తవ్యా మత్ప్రమాణతః
ఇష్టకానాం సహస్రాణి దశచాష్ట శతానిచ
కర్తవ్యానిత్వయాశీఘ్రం చయనానీతిసత్వరం
తథా హిరణ్మయశ్చాపి పురుషః కార్యఏవహి
తథేత్యుక్త్వాతతస్త్వష్టాశీఘ్రాచ్ఛీఘ్రతరం యయౌ॥
స్కాందపురాణే, నాగరఖండే అధ్యాయః ౧౭౯.

ఓ మహాభాగా ! నీయజ్ఞమునందేది యెటుల యజ్ఞప్రసిద్ధికొఱకుఁ జేయ వలెనో యదంతయు శీఘ్రముగాఁ జెప్పుమని దేవతలడిగిన బ్రహ్మ విశ్వకర్మతో నిటుల వాక్రుచ్చెను. ఓ విశ్వకర్మా ! నీవు శీఘ్రముగాఁ బొమ్ము! యజ్ఞమండ మందలి కావలసిన పరికరములగు పత్నీశాలయు, సభ్యశాలయు, యజ్ఞవేదియు, యజ్ఞకుండములును, దగిన స్థానముల నిర్మింపుము. సమస్త యజ్ఞపాత్రలను చమసపాత్రలను నాప్రమాణమునకుఁ దగిన యూపమును, వాని రక్షించు పాల కుని నిర్మింపుము, నేను శయసించుటకుఁ దగిన గర్తమును నిర్మింపుము. చయన ములుగూడ శీఘ్రముగా రచియింపుము. అట్లె సువర్ణమయ పురుషునిగూడ నిర్మింపుము. ఇట్లు చెప్పిన వెనువెంటనే యట్లేయని విశ్వకర్మ యేగెను.

ఇటుల యజ్ఞోపకరణము లన్నియు విశ్వకర్మ నిర్మితములే యిఁక యేల విశ్వ కర్మ రచనములేక యజ్ఞభాగములో నొక కొంచెమైన నెఱవేరునది గానిపించదు. అందువలననే “ విశ్వకర్మాతే ఋషిః'' అనియు, “ విశ్వకర్మాత్వాసాదయత్వంత రిక్షస్యపృష్ఠే” అనియు యజ్ఞమండపములయందుత్తమస్థానముల నావాహితుఁడగు టకుఁ గారణమని తెలియుచున్నది. ఇట్లె మఱియొకచో:—

(54) శ్లో॥ తత్రయోజన పర్యంతం యజ్ఞయూపాన్శ్చమండపాన్
విశ్వకర్మాచకారాశు కుండాని వివిధానిచ।
సహస్రసంఖ్యయాతత్ర కుండానాం మండపావధి
తత్రతే బ్రాహ్మణాస్సర్వే ప్రతిష్ఠాయజ్ఞకోవిదాః॥
స్కాందపురాణ ప్రభాసఖండే
సోమేశ్వర ప్రతిష్ఠామాహాత్మ్యవర్ణనే అ. ౨౩.

అచ్చట యోజన పర్యంతము యజ్ఞయూపములు మండపములు వివిధము లగు కుండములు వేల సంఖ్యలుగా విశ్వకర్మ శీఘ్రముగా నిర్మించి యిచ్చెను. యజ్ఞకోవిదులగు బ్రాహ్మణు లందునిలిచిరి. ఇట్లె యింకొకచోట.

(55) విశ్వకర్మాణం ప్రతిబ్రహ్మోక్తిః ।
శ్లో॥ భౌమాఃస్వర్గ్యాయథా పూర్వంమాయయాకురుతథైవచ
ఉద్యానానివిమానాని భవనాని దివౌకహమ్॥
యంత్రదుర్గాణి వాప్యశ్చ కవచాన్యాయుధానిచ
వాజికర్మాణి వాసాంసిచిత్రాణి వివిధానిచ॥
మృదశ్చహేమ రౌప్యాదిధాతూనాం విక్రియాః క్రియాః
యచ్చాన్యదపివిద్యాస్మిన్ స్తత్కురుష్వమహామతే॥

విశ్వంభరవాస్తుశాస్త్రే॥

స్వర్గమునందు భూమియందును వ్యాపకములగు సర్వ శిల్పములు రచింపుము. దేవతలకు ఉద్యానములు విమానములు భవనములు, యంత్రములు దుర్గములు తావులు కవచములు అశ్వక్రియలు వివిధములగు చిత్రములగు వస్త్రములు మృద్వికారములు బంగారు మున్నగు ధాతువులయొక్క వికారములు వానిక్రియలు ఇంకయు నితర విద్యలు వాని నన్నియు మహామతివగునో విశ్వకర్మా! నీవు చేయుము. ఇందుల కనుకూలమగునటుల,

శ్లో॥ బ్రహ్మణోర్థేకృతం దివ్యం దివియద్విశ్వకర్మణా
విమానం పుష్పకం నామ సర్వరత్న విభూషితమ్॥ ౯.౧

వాల్మీకీ రామాయణే సుందరకాండే సర్గః౯॥

బ్రహ్మదేవుని కోరికవలన సమస్త రత్నములచే నలంకరింపఁబడిన పుష్పక విమానము విశ్వకర్మచే నిర్మింపఁబడెను.

ఈ విమాన వర్ణనమునుగూర్చి యారామాయణ సుందరకాండమునంట్లుది నుడువఁబడినది.

(56) శ్లో॥ ఈహామృగసమాయుక్తైః కార్తస్వరహిరణ్మయైః
సుకృతైః రాజితం స్తంభైః ప్రదీప్తమివచశ్రియా॥
మేరుమందర సంకాశై రుల్లిఖద్భిరివాంబరమ్
కూటాగారైశ్శుభాగారైః సర్వతః సమలంకృతమ్॥
జ్వలనార్కప్రతీకాశైః సుకృతం విశ్వకర్మణా
జాలవాతాయనైర్యుక్తం కాంచనైః స్ఫటికై రపి॥
హేమసోపానయుక్తంచ చారుప్రవరవేదికమ్
విద్రుమేణ విచిత్రేణ మణిభిశ్చ మహాధనైః॥
నిస్తులాభిశ్చ ముక్తాభిస్తలే నాభివిరాజితమ్
చందనేనచర క్తేన తపనీయ నిభేనచ॥

సుపుష్యగంధినా యుక్తమాదిత్య తరుణోపమమ్
ఇంద్రనీలమహానీల మణిప్రవర వేదికమ్॥
విమానం పుష్పకం దివ్యమారురోహమహాకపిః ॥

కార్తస్వరమను పైడితోఁ జేయఁబడిన తోడేళ్ళవంటి ప్రతిమలతోడను, చక్కగాఁ జేయఁబడిన స్తంభములతోడను శోభతోఁ బ్రకాశించుచున్నదోయను నటుల సొగసుగానుండెను. మఱియు నా స్తంభములు మేరుమందర పర్వతములతో సమానముగా నాకాశము నొరయుచున్నవో యనునట్లుండెను. ఇంక రహస్యగృహములు విహారమందిరములు నంతట వెలయుచుండెను. ఇయ్యవి యగ్ని సూర్యుల వలెఁ బ్రకాశింపుచుండెను. బంగరుచేతను స్ఫటికపు రాలచేతను నిర్మించిన గవాక్ష లెక్కువ చక్కగా నుండెను. బంగారుతోఁ జేయఁబడిన సోపానములతో వన్నెకెక్కుచున్న సుందరమగు వేదికలు ఇంద్రనీల మహానీలమణులతోఁ బ్రకాశించుచుండెను. విచిత్రములైన పగడములతోడను, గొప్ప విలువగల రత్నములచేతను నసమానమగు ముత్తెములచేతను, బ్రకాశించుచున్న కుట్టిమస్థలముతో వాసి కెక్కుచుండెను. బంగరుతో సమానమగు రక్త చందనముతోడను, సూర్యునితో సమానముగఁ బ్రకాశించుచున్న పుష్యరాగ మణులతోడను వెలయుచుండెను. అట్టి విమానము విశ్వకర్మచేఁ జేయఁబడినది. అట్టి పుష్పక విమానమును మహాకపియగు హనుమంతుఁడెక్కి పరీక్షించెను. అని పుష్పకవిమానముయొక్క చక్కదన మెక్కువగా నొక్కి వక్కాణింపఁబడియె.

ఇఁకఁబుర నిర్మాణ కలా నైపుణ్యమున ద్వారకానగరముగూడ నిటుల వర్ణింపఁబడియె.

(57) శ్లో॥ అన్తస్సముద్రే నగరం కృత్స్నాద్భుత మచీకరత్
దృశ్యతేయత్ర హి త్వాష్ట్రిం విజ్ఞానం శిల్పనైపుణమ్॥
రథ్యాచత్వరవీధీభిర్యథా వాస్తువినిర్మితమ్
సురద్రుమలతోద్యాన విచిత్రోపవనాన్వితమ్॥
హేమశృంగై ర్దివిస్పృగ్భిస్స్ఫాటికాట్టాల గోపురైః
రాజతారకుటైర్జుష్టం హేమకుంభై స్వలంకృతైః॥
రత్నకూటైర్గృహై ర్హేమై ర్మహామరకతస్థలైః
వాస్తోష్పతీనాంచ గృహై ర్వలభీభిశ్చనిర్మితమ్॥
చాతుర్వర్ణ్యం జనాకీర్ణం యదుదేవగృహోల్లసత్॥
శ్రీమద్భాగవత దశమస్కంధేఅధ్యాయః ౫౦

శ్రీకృష్ణుఁడు జరాసంధాది శత్రువీరుల దాడికిఁ దాళునటుల సముద్రమధ్యమున నగరమొకటి సృజింపుమని విశ్వకర్మను బ్రార్థించెను. అంతట నవ్విశ్వకర్మ సృజించి యా నగరమునకు ద్వారకయని పేరిడెను. ఆ విశ్వకర్మయొక్క శిల్పవిజ్ఞాన నైపుణ్యము మిక్కిలి జూడఁదగియుండెను. రాజవీధులు తీర్చి ముంగిళ్ళచే నలంకరింపఁబడి వాస్తుశాస్త్రోక్తముగా గేహములు నిర్మింపబడియుండెను. కల్పలతలతోడ నుద్యానములు విచిత్రములగు నుపవనములు శోభిల్లుచుండెను. చలువరాలతో రచితములైన కోటబురుజుల గోపురములు బంగరు శిఖరములతో దివి నొరయుచుండెను. వెండిచేత నిత్తడిచేతఁ గూడ నిర్మింపఁబడిన యన్నశాలాశ్వశాలాదులు బంగరు కలశములచేఁ బ్రకాశింపుచుండెను. నగర గృహద్వారము నొద్ద దేవతాగృహములచేతను పద్మరాగాది మణులచేతను మహామరకతములచేత వెలయు గృహములచేతను బ్రాహ్మణ క్షత్రియవైశ్య శూద్రులాలయు శ్రీకృష్ణ మందిరముచేతను వెలయుచుండెను. ఇయ్యది త్వాష్ట్రవిజ్ఞాన నైపుణ్యమున కుదాహరింపబడియె.గాని సర్వజగన్నిర్మాణ కర్తయగు విశ్వకర్మ మహర్షి కియ్యది యొక తృణప్రాయముగదా?

ద్వారకానగర ప్రమాణ ప్రశంసలెక్కువగ వాయుపురాణ భూఖండ విశ్వకర్మ మాహాత్మ్యమునందు వ్రాయఁబడియున్నది. స్థలాంతరమునఁ గొంత విశదీకరింపఁబడును.

## —✻ విశ్వకర్మయె వాస్తుపదస్థాపకుఁడు. ✻—

వాస్తుపదోత్పత్తికథనే, విష్ణుంప్రతిబ్రహ్మోక్తిః।

(58) శ్లో॥ అనేనతవవాక్యస్య ప్రోక్తంవాక్య హరేఃపరం॥
వాసవేతదితి యస్మాత్తస్మా ద్వాస్తుభవిష్యతి
ఏవముక్త్వా హృషీకేశం ప్రాహూయవిశ్వకర్మణే॥
విధానం కథయామాసపూజార్థం విస్తరాన్వితమ్
ఏతస్మిన్నంతరే ప్రాహయాజ్ఞవల్క్య సుతస్సుధీః॥
విశ్వకర్మాణ మాహూయప్రథమంద్విజసత్తమ
హాటకేశ్వరజే క్షేత్రే మమాశ్రమ పదంకురు॥
విశ్వకర్మా పితత్రేత్య తస్మిన్ క్షేత్రేస్థితోఽభవత్ (వాస్తుపదంజాతం)
అస్మిన్ దృష్టేనరః పాపాత్సద్య ప్రేముచ్యేతకర్మణః॥
తథానప్రాప్నుయా ద్దోషం గృహజాతం కథంచన
శిల్పోక్తంకుపదోత్థంచ కువాస్తుజమథాపివా॥

వైశాఖస్య తృతీయాయాంశుక్లాయాం రోహిణీషుచ
తత్పదంనిహితంతత్రివాస్తో స్తేనమహాత్మనా॥
తస్మిన్ క్షేత్రేమహాపూజాం తేనైనవిధినానరః
తస్యయఃకురుతే సమ్యక్ సభూపత్వమవాప్నుయాత్॥
* స్కాందపురాణే నాగరఖండే, తృతీయ పరిచ్ఛేదే,
అధ్యాయే ౧౩౧.

బ్రహ్మ హారితో నీవుచెప్పినది చక్కగానున్నది. ఇంద్రుడుకూడ నిందుల కంగీకరించెను. అందువలన వాస్తుపదముకాఁగలదు, అని విశ్వకర్మనుపిలిచి వాస్తుపూజా కథావిధానము సవిస్తరముగా వివరించెను. అంతలో యాజ్ఞవల్క్య తనూభవుఁడు విశ్వకర్మనుబిలిచి, బ్రాహ్మణశ్రేష్ఠుండవగు నోవిశ్వకర్మా! హాట కేశ్వర క్షేత్రమందు నా కాశ్రమమును ముందుగాఁగల్పింపుము. విశ్వకర్మయు నక్కడకువచ్చి నిలిచెను. అయ్యది వాస్తుస్థానమయ్యెను. ఆస్థానమును జూచినను ముట్టుకొనినను మనుష్యుని పాపములనెల్ల వీడును. అటులనే గృహములవలనఁ బుట్టినదోషములన్నియు, బోవును. ఇంకయుశిల్పదోషములును గుపదదోషములును గుత్సితవాస్తుదోషములునుబోవును. అచటనామహాత్ముఁడైనవిశ్వకర్మచేత వైశాఖశు క్లతృతీయారోహిణీనక్షత్రసమయమందు వాస్తుస్థాన మేర్పరచి పూజచేయఁబడెను. ఆక్షేత్రమందు నీపూర్వోక్తవిధానముగ నేమనుష్యుఁడు పూజజేయునో యాతఁడు సాక్షాద్భూపాలకుఁడగును. ఇటులఁజెప్పుటచే వాస్తుపద మేర్పరచు కర్త బ్రాహ్మణశ్రేష్ఠుఁడగు విశ్వకర్మయయ్యెను. అందులచే నాస్థానము మిక్కిలి పావనమై వాస్తుశాస్త్రజ్ఞాన మెఱుంగనివారు చేయుదోషములుఁబోగొట్ట సమకట్టుచున్నది.

ఇటులనె మఱియొకచోట,

(59) శ్లో॥ విశ్వకర్మా పితత్రేత్యవాస్తు పూజాంయథోదితామ్
చకారబ్రహ్మణాప్రోక్తాం యాదృశీం సకలాంతతః॥ ౩౪
స్కాందపురాణే నాగరఖండే ౧౩౨ అధ్యాయే.

విశ్వకర్మయు నాప్రదేశమునకువచ్చి బ్రహ్మచేఁ జెప్పఁబడిన శాస్త్రానుసారముగా వాస్తుపూజ యొనరించెను.

---

* ఈగ్రంథము పూనానాడిస్ట్రిక్టు యష్టేగ్రామమందలి వ్యంకటుండ కవీశ్వరుని పుస్తక భాండాగారమునఁగలదు.

ఇందుల కనుకూలముగ మఱియొక చోట,

బ్రహ్మయజ్ఞసమారంభే బ్రహ్మగాయత్రీ వివాహకథాయామ్.

శ్లో॥ విశ్వకర్మాసమాగత్య తతోమస్తకమండనం।
చకారబ్రాహ్మణశ్రేష్ఠో నాగరాణాం మతేస్థితః ॥
ఏతస్మిన్నంతరే తత్ర కేశనిర్వపణే విధేః।
విశ్వకర్మామఖానాంచ గాయత్ర్యాస్తదనంతరమ్ ॥

స్కందపురాణే నాగరఖండే అధ్యాయే ౧౭౦.

బ్రాహ్మణశ్రేష్ఠుఁడగు విశ్వకర్మ యచటకువచ్చి నగరవాసులకు సమ్మతుఁడై నిలిచి మస్తకమండనమును (శిరోభూషణమును) జేసెను. ఇంతలో కేశనిర్వపణ విధియందును మస్తకమండనమును జేసెను. తరువాత గాయత్రికిని శిరోభూషణ మును జేసెను. అనియు నుండుటచేతను విశ్వకర్మ బ్రాహ్మణావతారమును వహించి సర్వయజ్ఞకర్మలు సర్వశిల్పకర్మలు సర్వనిర్మాణకర్మలుఁ జేయుచు లోక సృష్టి మొదలుకొని లోకోపకరణ సృష్టివరకు నంతరాంతరభేదములుగ నవతారభేద ములుగను బ్రచరించునటులఁ దోఁచకమానదు.

—* దేవతాతపనపౌరోహిత్యాగ్రజత్వములు *—

(60) అద్భ్యః సంభూతఃపృథివ్యైరసాచ్చవిశ్వకర్మణః సమవర్తతాధి। తస్యత్వష్టా విదధద్రూపమేతి తత్పురుషస్య విశ్వమాజానమగ్రే ॥౧॥

వేదాహమేతం పురుషం మహాంతం। ఆదిత్యవర్ణంతమసః పరస్తాత్ । తమే వం విద్వానమృత ఇహభవతి। నాన్యఃపంథావిద్య తేఽయనాయ ॥౨ ॥

ప్రజాపతిశ్చరతి గర్భేఅంతః। అజాయమానో బహుధావిజాయతే। తస్య ధీరాః పరిజానంతియోనిం। మరీచీనాం పదమిచ్ఛంతి వేధసః ॥3॥

యోదేవేభ్యఆతపతి, యోదేవానాం పురోహితః। పూర్వోయోదేవేభ్యో జాతః। నమోరుచాయబ్రాహ్మయే ॥౪॥

తైత్తిరీయారణ్యకప్రశ్న 3 అ ౧3 దశక ౧.

భా॥ య స్త్వష్టా దేవేభ్యః ఆతపతి (దేవాన్ అభివ్యాప్యతపతి) దేవా ఆదిత్యాః మనుష్యాదీన్ భూచరానేవతపతి తేషాం తే జోహరంతి । త్వష్టాతు దేవానామపి తేజో హరతీత్యర్థః । తథాచ మంత్రాంతరం,

త్వష్టా దుహిత్రే వహతుం కృణోతీతీదం విశ్వం భువనం సమేతి । యమస్య మాతా పర్యుహ్యమానా మహో జాయా వివస్వతో ననాశ ॥౧॥

భా॥ త్వష్టా (విశ్వకర్మా) దుహిత్రే (దుహితుః ప్రియార్థే) వహతుం (వహతి అహోరాత్రాణి నిర్వహతీతి వహతుః సూర్యస్తం) కృణోతి (హిన స్తిదారువత్ శాతయతి కృశంకరోతీత్యర్థః) ఇతి (అనేనప్రకారేణ) ఇదం(సూర్యస్యత్వష్ట్రా శాతనం కర్మ) విశ్వం భువనం (సర్వోలోకః) సమేతి (సమ్యక్ జానాతి) కదా ఇదమభూదిత్యాకాంక్షాయామాహ యస్మిన్ కాలే వివస్వతః(సూర్యస్య) జాయా సైవ యమస్య మాతా (సంజ్ఞానామ్నీ) ననాశ (అదర్శనంగతవతీ) తదా కృణోతీతి భూతేఽర్థే లట్, కృహింసాయామిత్యస్యరూపం, కుతో ననాశేత్యత ఆహ పరీత:—వివస్వత ఇతి పునః సంబధ్యతే। కీదృశీ యమస్య మాతా వివస్వతో (భానోః) మహో (మహాతేజః) పర్యుహ్యమానా (పరిత్యాజ్యయంతీ) హేతౌ శానచ్ లట్ సార్వధాతుకత్వాచ్చాస్యానుదాత్తత్వం ఏవం హి పురాణేషు ప్రఖ్యాయతే । సౌరం తేజోఽసహమానా సంజ్ఞా స్వప్రతికృతి సవర్ణాఖ్యాం యోగబలేన నిర్మితాం సూర్యసమీపం స్థాపయిత్వా, ఉత్తరేషు కురుషు స్వయం బడబా రూపేణ సంచచార । సవర్ణాతు సంజ్ఞా పుత్రే కస్మింశ్చిన్నిమిత్తం శశాప తద్దృష్ట్వా సూర్య ఇయం యమస్య మాతా సభవతీతి విజ్ఞాయ, త్వష్టృగృహం గత్వా తం సంజ్ఞామపృచ్ఛత్ । సచ తేనోక్తస్త్వత్తేజోఽసహమానా సా ఉత్తరేషు కురుషు బడబా రూపేణ సంచరతి త్వం చ మయా శాతిత తేజః సన్ తామనుసరేతి । సతథేత్యుక్త్వా శ్వశురేణ శాతితః సన్నశ్వరూపేణ తాం గత్వా ఉపయేమే । తస్యామశ్వినౌ జనయామాసేతి.

తథాచోక్తం విష్ణుపురాణే॥

శ్లో॥ శాతితం తేజసో మేఽద్య క్రియతామితి భాస్కరః
తం చాహ విశ్వకర్మాణం సంజ్ఞాయాః పితరం ద్విజ॥ ౧
సంవత్సరభ్రమామాత్రస్య విశ్వకర్మా రవేస్తతః
తేజసః శాతనం చక్రే స్తూయమానస్య దైవతైః॥ ౨

యోదేవేభ్య ఆతపతి... సూర్యవదితరేషామపి తేజో హీనస్త్విత దర్శయతి। దేవేభ్య ఇతి బహువచనేన। యోదేవానాంపురోహితః దేవానాంపురోహితో బృహస్పతిర్విశ్వకర్మైవ తథాచ మంత్రాంతరం.

వాచస్పతిం విశ్వకర్మాణమూతయే। వాచస్పతిర్విశ్వకర్మా ఽభూదితి బ్రహ్మణస్పతిరేతా సంకర్మార ఇవాఽధమదితిచ.

బ్రహ్మణః వాచః వాగేవబ్రహ్మతస్యా ఏవపతిస్తమాహుర్బ్రహ్మణస్పతిరితి బృహదారణ్యకదర్శనాత్ అతఏవతత్పుత్రస్యాపి దేవపురోహితత్వంశ్రూయతే తైత్తిరీయకే...విశ్వరూపోవై త్వాష్ట్రః పురోహితో దేవానామాసీత్.

(...విశ్వాని బహూనిరూపాణియస్యాసౌ) విశ్వరూపః త్రిభిశ్శిరోభిరుపేతత్వాత్ విశ్వరూపత్వం, విశ్వరూపనామకః త్వాష్ట్రః (త్వష్టుః పుత్రః) స దేవానాంపురోహితః ఆసీత్ తస్మాత్ సిద్ధమస్తి విశ్వకర్మానామ పరమేశ్వరరూపభేదో రామకృష్ణాదివ దనంతైశ్వర్యసంపన్నః సర్వశిల్పకరస్త్వష్టా బృహస్పతిరిత్యాదేశాద్వైవేదేషుగీయమానః సర్వేషాం దేవానామాచార్య ఇతి.

కించ పూర్వోయోదేవేభ్యోజాతః యోవిశ్వకర్మా దేవేభ్యః త్రిదశేభ్యః పూర్వః ప్రథమభావీజాతః ఉత్పన్నః విశ్వకర్మాహ్యజనిష్ఠదేవ ఇతి యాజుషవచనాదపి దేవేభ్యః ప్రథమం విశ్వకర్మైవాఽజనీతస్పష్టీక్రియతే ఇతి భాష్యకారః.

తా॥ విశ్వకర్మ సర్వదేవతామధ్యమమున నత్యంత తేజస్వియని చెప్పఁబడెను. సమస్త దేవతలయొక్క తేజస్సునుహరించుచున్నాడనికూడఁ దెలియుచున్నది. ఎట్లన "యోదేవేభ్య ఆతపతి" యను తైత్తిరీయారణ్యకవచనమున "ఆతపతి" యను క్రియావచనమునకు "దేవాన్ అభివ్యాప్యతపతి" దేవతలనంతటనువ్యాపించి సంతపింపఁజేసెనని యర్థమొనర్చి దేవతలన నాదిత్యులువారు మనుష్యాదులగు భూచరులనే తపింపఁజేయుదురు. త్వష్టృవిశ్వకర్మయో దేవతలయొక్క తేజస్సునుహరించెనని వివరించి యిందులకు "త్వష్టాదుహిత్రే" యను ఋఙ్మంత్రము నుదాహరించెను. అందలి తాత్పర్యమిట్లున్నది.

## విశ్వకర్మకు సూర్యుఁడల్లుఁడగుట; సూర్యశాతనము.

త్వష్టృవిశ్వకర్మ తనకూఁతు ప్రియముకొఱకు నహోరాత్రములు వహించు సూర్యుని దారువును బోలెఁ గృసింపఁజేసెను. ఇట్లు త్వష్టచేఁ జేయఁబడిన

శాతనకర్మ (కార్శ్యకార్యము) లోకమందెల్లెడఁ దెలియును. ఇదేకాలమందసిన; సూర్యునికళత్రమును, యమునితల్లియు, నగు సంజ్ఞయను పేరిటి గృహిణి భర్తయగు వివస్వంతుని మహాతేజస్సు నోర్వలేక కనఁబడకపోయినప్పుడని తెలుపఁబడెను.

ఇందునకుఁ బురాణగాధ నీక్రిందవిధముగ వివరణమొనర్పఁబడియె.

ఒకప్పుడు భర్తయగు సూర్యతేజస్సును సహింపఁజాలని సంజ్ఞాదేవి తన ప్రతిబింబమును సవర్ణ (ఛాయ) యనుపేరిట యోగబలముచేసృజించి భర్తృసమీపమున నునిచి తానుత్తర కురుభూములయందు బడబా (ఆఁడుగుఱ్ఱపు) రూపమున సంచరించెను. సవర్ణ (ఛాయ) యుఁ గొండొకకారణంబున సంజ్ఞాపుత్త్రుని శపింపనద్దానిఁ గాంచి యీపె జమునితల్లికాదని తెలిసికొని మార్తాండుఁడు త్వష్టృగృహంబున కేగి సంజ్ఞాదేవినడుగ నవ్విశ్వకర్మ "యత్యంత తీవ్రమగు నీతేజస్సు నోర్వఁజాలక యుత్తరకురుభూములయందు సంచరించుచున్నది. నీవును నాచేఁ దగ్గింపఁబడిన తేజస్సుగలవాఁడవై యామె ననుసరింపు"మన, నాతండు నట్లెయని మామగారిచేఁ దగ్గింపఁబడిన ప్రకాశముగలవాఁడై యశ్వరూపమున నాసంజ్ఞఁ గలిసికొని యశ్వనీదేవతల నిరువురఁ గల్పించెను.

అట్లె విష్ణుపురాణోక్తియందును, భాస్కరుఁడు నాతేజమును దగ్గింపుమని సంజ్ఞాజనకుఁడును, బ్రాహ్మణుండు, నగు నవ్విశ్వకర్మనడుగ నంత విశ్వకర్మ సంవత్సర చక్రమువలన దేవతలచేఁ గొనియాడఁబడు సూర్యుని తేజస్సును దగ్గించెనని తెలియఁబడుచున్నది. మఱియు మూలమున "దేవేభ్య" యను బహువచన ముక్తమగుటచే సూర్యునిఁబోలె నితరుల తేజస్సునుగూడఁ దగ్గించుచున్నాఁడని స్పష్టమగుచున్నది.

మఱియు నీసందర్భమునే వివరించుచు మత్స్యపురాణమున,

శ్లో॥ తథేత్యుక్తస్సరవిణా భ్రమమారోప్య దివాకరమ్ ॥ ౨౮
పృథక్చకార తత్తేజశ్చక్రం విష్ణోః ప్రకల్పయత్ ।
త్రిశూలంచాపి రుద్రస్య వజ్రమింద్రస్య చాధికమ్ ॥ ౨౯
దైత్యదానవసంహర్తు స్సహస్రకిరణాత్మకమ్ ।
రూపం చాప్రతిమంచక్రే త్వష్టా తేజో హృతంమహత్ ॥ 30
ఇతి శ్రీమత్స్యపురాణే మత్స్యమనుసంవాదే సూర్య
వంశ వర్ణనం నామైకాదశోధ్యాయః.

తా॥ అట్లైయని సూర్యునిచే నొప్పుకొనఁబడిన త్వష్టభ్రమమునందు సూర్యుని నిలిపి తేజస్సును వేఱుచేసెను. ఆవేఱుచేయఁబడిన తేజస్సులను విష్ణువునకుఁ జక్రమును, రుద్రునికిఁ త్రిశూలమును, ఇంద్రునకు గొప్పవజ్రమను నాయుధమును జేసి యిచ్చెను. దైత్యదానవసంహారుఁడగు మార్తాండుని బింబమునకు వేయి కిరణము లుండునటుల నిలిపి యప్రతిమానరూపుని గను నిర్మల తేజోవంతునిగను జేసెను.

## విశ్వకర్మకు దేవాచార్యత్వము.

"యో దేవానాం పురోహితః" అను శ్రుతికర్థమును వివరించునపుడు దేవతా పురోహితుఁడగు బృహస్పతి విశ్వకర్మయనియె వివక్షితమగుచున్నది. ఎట్లన:—"వాచస్పతిర్విశ్వకర్మాఽభూ" త్తనునారణ్యక వచనము వలనను, "వాచస్పతిం విశ్వకర్మాణనూతయే" యను యజుర్వేద (౪. ౫. ౨. ౫) వచనమువలనను, "వాచస్పతిం విశ్వకర్మాణమూతయే" యను ఋగ్వేదవిశ్వకర్మసూక్త (౮. 3. 3. ౬) వచనమువలనను, "బ్రహ్మణస్పతి రేతాసంకర్మార ఇవాధమ" త్తను ఋగ్వేద (౮. 3. ౧. ౨) వచనము వలన బ్రహ్మయనవాక్కే యావాక్కునకుఁ బతి బ్రహ్మణస్పతియని బృహదారణ్యకమునఁ జూపట్టుటవలనను, ద్వష్టకు విశ్వకర్మకు నభేదముగఁ గొన్నిశ్రుతులు నిర్ణయించుటచే "విశ్వరూపో వై త్వాష్ట్రః పురోహితో దేవానామాసీ" త్తనుశ్రుతివలనఁ ద్వష్ట్రకుమారుఁడగు విశ్వరూపుఁడు దేవతలకు బురోహితుఁడయ్యెనని తెలియుటవలనను, విష్ణువు రామకృష్ణాద్యవతారభేదములఁ జూపట్టినటు విశ్వకర్మయను పరమేశ్వరుఁడు త్వష్ట్రబృహస్పత్యాది రూపభేదముల నవతరించినట్లు తెలియుచున్నది. ఇందుచే దేవపురోహితుఁడు విశ్వకర్మయనుట నిస్సంశయమయ్యెను. మఱియు "దేవాచార్యస్య మహతో ధీమతో విశ్వకర్మణః" అను పూర్వోక్త వాయుపురాణవచనముఁగూడ విశ్వకర్మకు దేవాచార్యత్వము స్థిరీకరించుచున్నది.

## విశ్వకర్మయె సర్వదేవాగ్రజుఁడు.

"యో దేవేభ్యోజాతః" అను శ్రుతివాక్యమును వివక్షించుటలో నందఱు దేవతలకంటె మునుమున్న విశ్వకర్మయె యావిర్భవించినటుల వివరించుచు "విశ్వకర్మాహ్యజనిష్ఠదేవ" యను పూర్వోక్తయాజుషశ్రుతి నుదాహరించి దేవతలలోఁ బ్రథమోత్పత్తి నిరూపించెను. కావున "యో దేవేభ్యఆతపతి- యో దేవానాం పురోహితః పూర్వోయో దేవేభ్యోజాతః" అనుశ్రుతివాక్యములకు దేవతల సంతసింపఁ

జేయువాఁడును, దేవతలకుఁ బురోహితుఁడును, దేవతలలోఁ బ్రథమజాతుఁడును, విశ్వకర్మయనియె భాష్యకారుఁడు నిర్ణయించెను.

విశ్వకర్మ జగద్గురువు.

విశ్వకర్మ దేవాచార్యుఁడగుటయేకాక పెక్కువాక్యములు జగద్గురుఁ (ప్రపంచమునకంతకునాచార్యుఁ) డని తెలుపుచున్నవి. వానిలో:—

శ్లో॥ శ్రుతిస్మృత్యర్థజాతేషు విశ్వకర్మానిగద్యతే
విశ్వంచకారయత్తస్మా ద్విశ్వకర్మాజగద్గురుః ॥ ౨౮
మూలస్తంభపురాణము ద్వితీయాధ్యాయము.

తా॥ వేదశాస్త్రములయొక్క యర్థసముదాయమునందు విశ్వకర్మ చెప్పఁబడెను. ఏకారణమువలన విశ్వమొనర్చెనోయందువలననే విశ్వకర్మజగద్గురుండయ్యెను.

శ్లో॥ పితాచసర్వదేవానాం సర్వలోకపితామహః
సర్వలోక గురుశ్చైవ విశ్వకర్మా పరశ్శివః ॥ ౫౨
మూలస్తంభపురాణము దశమాధ్యాయము.

తా॥ సమస్తదేవతలకుఁదండ్రియు, సర్వలోకములకు దాతయు, సమస్తజగములకు గురువు, నైనవిశ్వకర్మయె పరశివుఁడు.

శ్లో॥ పుణ్యవానసి రాజర్షేయతోమాం పరిపృచ్ఛసి
విశ్వకర్మకథా నృణా మైహికాముష్మికప్రదా॥ ౨
విశ్వగర్భో మహాతేజా విశ్వోత్పాదనకౌతుకః
దధౌస పురుషాకారం త్రిజగద్గురురవ్యయః ॥ 3
... ... ... ... ... ...
... ... ... ... ... ...
భూత్వాఽథ పురుషాకారో విశ్వకర్మాదిపూరుషః
ప్రతీకే వ్యసృజద్దేవాన్ విశ్వోత్పత్తి చికీర్షయా॥ ౨
విశ్వకర్మ పురాణము పంచమాధ్యాయము.

తా॥ కాళహస్తిమహర్షి సుతవతునితో నోరాజర్షి ! నీవడిగిన యావిశ్వకర్మ వృత్తాంతము మనుష్యుల కైహికాముష్మిక ఫలప్రదమగును. ప్రపంచమంతయు గర్భమునందు గలిగినట్టియు, నధికతేజస్సుగలిగినట్టియు, జగత్త్రియమునకుగురువైనట్టియు, నాశనరహితుఁడైనట్టియు, నవ్విశ్వకర్మ విశ్వమునుగల్పింపనభిలాషతోఁ

బుగుసాకారమును ధరించెను. పురుషాకారుఁడై యాదిపూరుషుఁడైన విశ్వకర్మ జగములొనర్పనిచ్చచేఁ దనయవయవములందు దేవతలను సృజించెను.

శ్లో॥ ధర్మార్థ కామమోక్షాణా । మాచార్యో వేదపారగః
ఏతత్కర్మామహామూర్తి । ర్విశ్వకర్మాజగద్గురుః ॥౨౮॥
స్కాందపురాణ నాగరఖండము విశ్వకర్మోపాఖ్యాన షష్ఠాధ్యాయము—

తా॥ ధర్మార్థకామమోక్షములకు వేదపారగుఁ డగు నాచార్యుఁ డగును. వానిని సృజించిన మహామూర్తియగు విశ్వకర్మ జగద్గురువయగును_ అను నీ వాక్యములవలననే జగద్గురుత్వమున వ్యాహతముగ విశ్వకర్మ యవతరించినటుల విశదపడుచున్నది. తక్కిన వాక్యములు గ్రంథవిస్తరభీతిచే విరమింపఁబడియె.

—* విశ్వకర్మ వివిధావతారములు. *—

శ్లో॥ విశ్వకర్మా పరబ్రహ్మ విశ్వ కర్మాజగద్భరః
విశ్వకర్మా పరంజ్యోతి ర్విశ్వకర్మామునీశ్వరః ॥
స్థపతిర్విశ్వకర్మావై విశ్వకర్మామనుశ్శివః
విశ్వకర్మామహావిష్ణు ర్విశ్వకర్మాప్రజాపతిః ॥
విశ్వకర్మైవసూర్యస్స్యా ద్విశ్వకర్మేతి శిల్పికః
దేవాచార్యో విశ్వకర్మా విశ్వకర్మైవ దేశికః ॥
యజ్ఞాకారో విశ్వకర్మా విశ్వకర్మావిచక్షణః
సురశ్రేష్ఠోవిశ్వకర్మా విశ్వకర్మాజగద్గురుః ॥
విశ్వకర్మా జగన్నాథో విశ్వకర్మాచకశ్యపః
విశ్వజ్ఞో విశ్వకర్మాచ విశ్వనిర్మాణబంధురః ॥
పంచభూతమయోదేవః సర్వజీవదయాపరః
దేవదేవమహాదేవ విశ్వకర్మన్నమోఽస్తుతే ॥

—• వైశ్వకర్మణ శిల్పసారనామ శిల్పశాస్త్రము •—

తా॥ గ్రంథాదినుండియు శ్రుతిస్మృతిపురాణేతిహాసాదులచేఁ బేర్కొనఁబడిన విశ్వకర్మవిశేషణరత్నములన్నియు నీశిల్పశాస్త్రసూత్రమున నొక్క యెడఁగూర్పఁబడినవి. ఎట్లన:— పరబ్రహ్మయు, జగద్భరుఁడును, బరంజ్యోతియు, మునీశ్వరుఁడును,

స్థపతియు, మనురూపుఁడైన శివుఁడును, మయరూపుఁడైన విష్ణువును, ప్రజాపతియు, సూర్యుఁడును, శిల్పియు, దేవాచార్యుండును, దేశికుఁడును, యజ్ఞకర్తయు, బండితుండును, జగద్గురువును, లోకనాయకుఁడును, గర్వ్యపుఁడును, విశ్వమంతయుఁ దెలిసినవాఁడును, విశ్వకల్పనయందు నిపుణుఁడును, బంచభూతస్వరూపుఁడును, సమస్తజీవులయందు దయగలవాఁడును, విశ్వకర్మయె యగును. దేవదేవుఁడవును, మహాదేవుఁడవును, విశ్వకర్మవు, నగు నీకొఱకు నమస్కారము. ఇట్లు నుడువఁబడియుండుటచే శిల్పశాస్త్రకర్తవేదాదుల నన్నిఁటిని గరతలామలకముగఁ బరీక్షించెననుట నిస్సందేహమయగును. జగత్సర్గానుకూలతకు విశ్వకర్మపరమేశ్వరుఁడు వివిధావతారముల నవతరించి లోకసృష్టి నభివృద్ధి గావించె ననుటలో నతిశయోక్తి యిసుమంతయుఁ గానరాదు.

—♦ విశ్వకర్మకు హనుమద్ధ్వజప్రాప్తి ♦—

శ్లో॥ పురాకృతయుగే కేచి దృషయో నియతవ్రతాః
పప్రచ్ఛు షణ్ముఖం వీర మీశ్వరస్యసుతం విభుం ॥ ౧॥
దేవదేవత్వమాచక్ష్వ మహాత్మో విశ్వకర్మణః
కథం కపిధ్వజం ప్రాప్తం హనుమాన్ కేన హేతునా ॥ ౨॥
పతాకశిఖరే తస్య స్థితో వాయుసుతోఽభవత్
ఏతదాచక్ష్వ నస్సర్వం విస్తరేణేశ్వరాత్మజ ॥ ౩॥
ఇతిపృష్టో మహాతేజాః షణ్ముఖశ్చేత్థమబ్రవీత్
శ్రుణుధ్వమృషయస్సర్వే ప్రభావం విశ్వకర్మణః ॥ ౪॥
ఆసీద్దీర్ఘతమః పూర్వం గౌతమో భగవాన్ మునిః
అహల్యా తస్య భార్యాసీ త్సతీనాముత్తమోత్తమా॥ ౫॥
తస్యాజజ్ఞేఽ జనానామ్నా కన్యారూపసమన్వితా
యాపూర్వకారణాదంధా సాసీద్వాయోః కుటుంబినీ ॥ ౬॥
తాం దృష్ట్వా వ్యాకులో వాయు రచింతయదమన్యుకః
అహంతుజగతాం ప్రాణ స్సర్వాధారస్సురాధికః ॥ ౭॥
బలవాన్ బలినాం తేజో హరణేపటువిక్రమః
ఏవం విధస్య మే భార్యా జాత్యంధా దైవయోగతః ॥ ౮॥
ఇతిదుఃఖాకులాత్మాసా వుపాయం మనసాస్మరన్
మంత్రశాస్త్రంవిచార్యాశు జాత్యంధపరిహారకం ॥ ౯॥

ఉపదిశ్యతు తన్మంత్ర మనుజ్ఞాం ప్రదదౌపతిః
సానుజ్ఞాంప్రాప్యభర్తారం నత్వా పుణ్యఫలాత్మనా ॥ ౧౦॥
న్యగ్రోధమూలేదృష్ట్వర్థం చచారతపసిస్థిరా
ఏతస్మిన్నంతరే శంభుః కైలాసశిఖరే స్థితః ॥ ౧౧॥
దిదృక్షయాహిలోకానాం గగనాంతరమాగతః
దృష్ట్వామర్కటసంయోగం తద్ధేతోస్స్ఖలితేంద్రియః ॥ ౧౨॥
ముమోచవీర్యం దేవస్తదంజనాంజలిమావిశత్
సావాయుదత్త ఆహార ఇతిబుద్ధ్వాహ్యభక్షయత్ ॥ ౧౩॥
యద్వీర్య మంజనాకుక్షి మాశ్రితంతత్తదేవహి
ప్రాప్తాసాచక్షుషోర్జ్ఞానం చరాచర విమర్శకం ॥ ౧౪॥
నవభిర్ఘటికాభిశ్చ తద్గర్భోఽభూత్ప్రవర్ధితః
తద్గర్భభారాత్క్లాంతాంగీ సస్మారపవనంపతిం ॥ ౧౫
పవనస్తత్క్షణాద్గత్వా భార్యాసంస్మరితప్రియః
దేవానాహూతవాన్వాయు ర్బ్రహ్మవిష్ణు మహేశ్వరాన్ ॥ ౧౬॥
తేఽపి శీఘ్రంసమాజగ్ముః కింకారణమితిస్మృతాః
దృష్ట్వానత్వాచ భక్త్యాతా నర్ఘ్యపాద్యాదిభిర్యుతాన్ ॥ ౧౭॥
గర్భభార పరిక్లాంతాం భార్యాంతేషాం నివేద్యచ
బ్రహ్మవిష్ణుమహేశాది దేవాన్ ప్రార్థితవాన్తదా ॥ ౧౮॥
తథావిధాంచ దృష్ట్వాతే దయాశ్చర్య సమన్వితాః
తస్యాగర్భస్థితం సూనుం పప్రచ్ఛురమరోత్తమాః ॥ ౧౯॥
కోభవాన్ త్వంకుతోహేతో బాధసే మాతరంశిశో
నిర్గచ్ఛ శీఘ్రమేతస్యా గర్భాద్భారం విమోచయ ॥ ౨౦॥
మాంకంచిత్పురుషం విత్థ ప్రాణీమానప్రియస్సదా
మానసంరక్షణంతస్మా ద్గర్భస్థస్యాత్రమేప్రియం ॥ ౨౧॥
దేయం సౌవర్ణకౌపీనం బ్రహ్మసూత్రం కమండలుం
దాతుమర్హాథమేయూయం నిర్గచ్ఛామినసంశయః ॥ ౨౨॥
ఇత్యుక్త్వాశిశునాదేవా మంత్రయాంచక్రిరేమిథః
నవయం దాతుమేతాని విశ్వకర్మాసమర్థకః ॥ ౨౩॥
అస్తిసామర్థ్యమేతేషాం దానేతస్యమహాత్మనః
ఇతినిశ్చిత్యమనసా స్మరణంతస్యచక్రిరే ॥ ౨౪॥

స్మరణాద్విశ్వకర్మాతు మేఘవాహనమాశ్రితః
పంచవక్త్రస్త్రినేత్రోఽసౌ దశభిర్బాహుభిర్యుతః ॥ ౨౫॥
ప్రాదురాసీన్మహాతేజాః లోకకృజ్జగతీపతిః
దృష్ట్వైవబ్రహ్మరుద్రాద్యా నత్వాతేవిశ్వకర్మణే ॥ ౨౬॥
వృత్తాంతం సర్వమాచఖ్యు స్తచ్ఛ్రుత్వా విస్మయంగతః
ఉవాచవచనంగర్భే విశిష్టంపురుషంతతః ॥ ౨౭॥
సౌవర్ణకటిసూత్రంచ కౌపీనం బ్రహ్మసూత్రకం
గర్భస్థితాయతే హేమ్నా రచితేశ్రుతికుండలే ॥ ౨౮॥
కర్తుందాతుం మహాకష్టం ప్రదాస్యామి తథాప్యహం
ఇత్యుక్తస్సోఽపి గర్భస్థః ప్రహృష్టో విశ్వకర్మణః ॥ ౨౯
ప్రాహగంభీరయావాచా సంస్తువన్ లోకపూజితం
మదభీష్టానిసర్వాణి చేద్దాస్యసిజగద్గురో ॥ 30॥
గురుత్వేత్తవసర్వజ్ఞ త్వదాజ్ఞాభరితోఽస్మ్యహం
దాతాసమస్త దేవానాం త్వంవినానాస్తికశ్చిత్ ॥ 3౧॥
కరోమిశాసనంతేఽద్య ఆజ్ఞాపయజగద్గురో
ఏవముక్తో విశ్వకర్మా గర్భస్థేనోక్తవాన్ మహాన్ ॥ 3౨॥
ధ్వజేమదీయే సంస్థిత్వా సదాప్రకటితోభవ
ఇతిపృష్ట స్సపురుషో విశ్వకర్మాణమబ్రవీత్ ॥ 33॥
ధ్వజేవసామితేదేవ శాసనాద్భిరుదాంకితే
ఇత్యుక్తః పురుషేణాథ విశ్వకర్మామహామతిః ॥ 3౪॥
సస్మారమనసాసర్వం తథైవ హిబభూవతత్
సర్వతః కాంచనమయం కౌపీనంబ్రహ్మసూత్రకం ॥ 3౫॥
ఆదాయకపిరూపేణ సౌవర్ణే కర్ణకుండలే
నిర్గమాత్తస్య పుత్త్రస్య పితరౌమోదమాయతాం ॥ 3౬॥
హనుమానిత్యభిఖ్యాంచ కృత్వాతస్యమహాత్మనః
తత్రదేవామహేంద్రాద్యాః సంతుష్టావిశ్వకర్మణ ॥ 3౭
భేజుస్తే విశ్వకర్తారం సృష్టిస్థిత్యంత కారణం
హనుమానపిసంతుష్టో ధ్వజారూఢస్థితోఽభవత్ ॥ 3౮॥
ఇదంసర్వంమయాప్రోక్తం శృత్వతమిత్థముమాపతేః

ఇతిస్కాందె నాగరఖండే విశ్వకర్మోఖ్యానే విశ్వకర్మణః
కపిధ్వజప్రాప్తిర్నామఏకాదశోఽధ్యాయః.

తా॥ పూర్వము కృతయుగమునందుఁ గొందఱుమహర్షులు నియతవ్రతులై యుండి శూరుఁడును, ఈశ్వరకుమారుఁడు, నగు కుమారస్వామి నిట్లడిగిరి. దేవదేవుఁడవగునోస్వామీ! సురజ్యేష్ఠుఁడగు విశ్వకర్మ కపిధ్వజమెట్లుధరించెను? అమ్మహాత్ముని పతాకశిఖరమున వాయుసుతుఁడగు హనుమంతుఁడేకారణముచేనిలిచెను? ఈవృత్తాంతము సర్వమును మాకువివరింపవలెనవిన మహాతేజుఁడగుషణ్ముఖుఁడు మహర్షులందఱుఁ జక్కఁగావినవలయునని యిట్లునుడివెను. పూర్వకాలమున దీర్ఘతముఁడును, భగవంతుఁడునగు గౌతమమునికలఁడు. అమ్మహర్షికి బతివ్రతలలోనుత్తమోత్తమయగు నహల్యయను భార్యకలదు. ఆమెయందుఁజక్కదనమునకిక్కయగునంజనయను కన్నియజనించెను. ఆయువతిపురాకృతవిశేషమువలననంధురాలయ్యువాయుదేవునకిల్లాలయ్యెను. సమీరుఁడామెనుజూచినేనుజగత్ప్రాణుఁడను, సమస్తభూతములకాధారుడను, దేవతాశ్రేష్ఠుఁడను, మిక్కిలిబలవంతుఁడను, బలవత్తేజములహరింపశక్తుడను నైననునాకీజాత్యంధగృహిణిదైవయోగమునలభించెనేమిసేయఁగల"ననిచింతాకులాత్ముఁడై కొండొకయుపాయమును మనసున దలంచి మంత్రశాస్త్రమును విచారణమొనర్చి జాత్యంధపరిహారకమైన యొకమంత్రము నుపదేశించి తపమొనర్పఁ గళత్రమున కాజ్ఞయొసంగెను. తదనుజ్ఞచే నాసాధ్విప్రాణభర్తకు నమస్కరించి పుణ్యఫలబుద్ధిచేతను, దృష్ట్యభిలాషచేతను, వటవృక్షమూలమున స్థిరచిత్తయై తపమొనర్చుచుండ నింతలో గైలాసముననున్న శంకరుఁడు లోకవృత్తమీక్షింప నిచ్ఛించి యాకసంబున నేతెంచుతఱిఁ గపిమిథునమొక్కచో గ్రామ్యధర్మమొనర్చుటగాంచి స్ఖలితేంద్రియుఁడై వీర్యమువిడిచి యెందేనికేగెను. అనంతతేజోవంతమైన యవ్వీర్యమంజనాంజలియందుఁ బడ నయ్యది సమీరదత్తాహారమని నిశ్చితమనస్కయగు నాతపస్విని కృతభక్షణయగుడుఁ బ్రాప్తగర్భయై క్షణంబునఁ జరాచరవస్తువిమర్శకంబగు ననూనదృష్టిసంపద సంపాదించుకొనియె. ఘటికానవకమాత్రమున నాగర్భమత్యభివృద్ధిచే విస్తరిల్ల గర్భభారముచేఁ గడుడస్సి యయ్యాపన్న సత్వమహాసత్వుఁడగు ప్రాణభర్తఁదలంచె. వెంటనే యాప్రేయసీనాథుఁడరుదెంచి బ్రహ్మవిష్ణ్వీశ్వరులఁ బిలువ వారేయ్యది కారణమంచుఁ దలంచుచు నరుదేరుడు జగత్ప్రాణుండు వారల కర్ఘ్యపాద్యాదు లొసంగి భక్తిమై నమస్కరించి గర్భభారాలసయగు తన ప్రియురాలిని నివేదించెను. ఆవిధానమునుగాంచిన యమరోత్తములును నాశ్చర్యహృదయులై గర్భస్థశిశువును నీవెవ్వఁడ వేకారణంబునఁ దల్లినిట్లుబాధించెదవు? చెచ్చెఱ నుదరంబునుండి వెడలి భారంబువిడిపింపుమన నాకడుపుఁగందునే నొక్కపురుషుండఁ బ్రాణిలోకమెల్లెడ మానప్రియమగుట సుప్రసిద్ధమకదా? గర్భస్థుండనగు నాకును

మానసంరక్షణమునం దెక్కుడు (పేమఁగున్నయది. కావున హేమకౌపీనము, (బహ్మసూత్రము, గమండలువు, నియ్యఁగలరేని నేను బయలు వెడలెదననుటయు, నవ్విబుధులాలోచన మొనర్చి మనమీశిశువర్థించిన యర్థంబులనీయ నసమర్థుల మియ్యవెల్ల నిచ్చుటకు సర్వసమర్థుండగు విశ్వకర్మయర్హుండు. కావున నమ్మహాత్ము నర్థించెదమని యల్లె చింతించిరి. వారు తలంచినంత నె యాలోకకర్త మేఘవాహనమెక్కి యైదుమోములు మూఁడుకన్నులు పదిబుజలు గలిగి మహాతేజుఁడై వేల్పుల మోలఁ (బత్యక్షమగుడు; (బహ్మరుద్రాదు లజ్జగతీపతికి నమస్కరించి గుర్విణీగర్భస్థ శిశువృత్తాంతమును నివేదించిరి. అదివిని విస్మయంగతుఁడగు విశ్వకర్త గర్భస్థశిశువుతో నిట్లువలికె. ఓగర్భాంతఃపురుషా! బంగరుమొలనూలు, కౌపీనము, యజ్ఞసూత్రము, కాంచనకర్ణకుండలములు, గర్భస్థుఁడవగు నీకుఁ జేసియిచ్చుట దుస్తరకార్యమయినను నల్లేయిచ్చెదననఁడు; గర్భస్థుఁడు మిక్కిలి సంతసించి యాలోకపూజితుఁ గంభీరవాక్కులఁ గొనియాడుచు నాకోరికలెల్లఁ దీర్చితివేని, ఓజగద్గురూ! సర్వజ్ఞ! యెల్లవేళ నీయెడగౌరవ మునిచి భవదాజ్ఞ శిరసావహింతును. ఎల్లవేల్పులలో నీవదాతవు; మఱియొకఁడెవ్వఁడు నిన్నుఁబోలనేర్చునే? భవచ్ఛాసనమెయ్యదియో యద్దాని నైళంబయాజ్ఞాపింపుమన విశ్వకర్మయు మదీయ ధ్వజముననుండి యెల్లకాలముఁ (బకాశింపుమన నాశిశువల్లెయని వా(కుచ్చె. అంత మహామతియగు విశ్వకర్మ నెమ్మనమ్మునసంతయుఁ దలంప నల్లే గర్భస్థపురుషుఁడు కాంచనకౌపీనము, (బహ్మసూత్రము, హేమకర్ణకుండలములు దాల్చి బహిర్గతుఁడయ్యె. నయ్యది గాంచి పితలెంతయో సంతసించిరి. వానికి హనుమంతుఁడను నామకరణమొనర్చి దేవతలెల్లరు సం(పాప్తకుతూహలురై సృష్టిస్థితి సంహారకారుఁడగు విశ్వకర్మ మహాత్ము సేవించిరి. ఆంజనేయుఁడును ధ్వజారూఢుఁడై నిచ్చలువెలసె. ఇట్లు తండ్రియగు సుమేశ్వరునివలన వినినదంతయుఁ జెప్పితినని ఋషులతోఁ కుమారుండు విశదీకరించెను. ఇయ్యదియె విశ్వకర్మకుఁ గపిధ్వజము లభించిన వృత్తాంతము.

పఠనోపయుక్తమగు విశ్వకర్మస్తోత్రము.

అస్యశ్రీ విశ్వకర్మస్తోత్ర మహామంత్రస్య (బహ్మర్షిభిః శ్రీ విశ్వకర్మదేవతా అనుష్టుప్ఛందః సర్వాభీష్టసిద్ధ్యర్థం శ్రీ విశ్వకర్మ (పీత్యర్థం ధ్యానేవినియోగః

ధ్యానం॥ పంచాననో దశభుజో(వతబంధదీక్షః
కేయూరహార మణికుండల చండ తేజాః॥
భస్మాంకితో మణిమయాసన సంస్థితోఽసౌ
సర్వేశ్వరో వసతుమేహృది విశ్వకర్మా ॥

ఓం నమః పరమార్థాయ పురుషాయమహాత్మనే
శుద్ధసత్వస్వరూపాయ మాయినే విశ్వకర్మణే ॥
వశంతంతు మయం శిక్యం శిక్యే బ్రహ్మాండమద్భుతం
నిహితంచోభయంయేన విశ్వకర్మాసపాతునః ॥
దివిభువ్యుదరేకాష్ఠ పాషాణాదౌచయేవిభుః
చతుర్థవ్యభజజ్జ్యోతి శ్చతుర్విధఫలాప్తయే ॥
వాతరజ్జ్వాధృతం దివ్యం జ్యోతిః కాలస్య కారణం
బిభ్రమిత్యనిశంయేన ప్రవర్తంతే క్రతుక్రియాః ॥
భీమమాకారజంజ్యోతిః స్వర్ణాయః పారదాదికం
నానాకార్యకరం లోకే భూషాయుధరసాయనైః ॥
యోఽసౌవైశ్వానరోవహ్నిః ప్రాణినాం దేహమాశ్రితః
చతుర్విధంపచత్యన్నం తదుదర్యం మహత్స్మృతం ॥
దృఢాఘూతేన కాష్ఠాదే ర్యత్తేజోజాయతే మహత్
జ్వలనోనామతల్లోకే శ్రౌతంస్మార్తంహవిః పచేత్ ॥
యఃకాలం దక్షిణాంచైవ యజమానంహవీంషిచ
ధారయన్యఃపరశివో విశ్వకర్మాసపాతునః ॥
నయత్యనేకరసతాం మధునైకరసం జలం
యస్తత్తద్బీజయోగేన మహాశిల్పీ సపాతునః ॥
భౌమాన్యనేక రూపాణి యస్యశిల్పాని మానవాః
ఉపజీవంతి తం విశ్వం విశ్వకర్మాణమీమహి ॥
దిక్కాలైస్సూర్యచంద్రాభ్యాం గోవిప్రాభ్యాం హవిర్మనూ
నిర్మాయనిర్మమే యజ్ఞంతస్మైయజ్ఞాత్మనేనమః ॥
దివిభువ్యంతరిక్షేవా పాతాలేవాపి సర్వశః
యత్కించిచ్ఛిల్పినాం శిల్పం తత్ప్రవర్తక తేనమః ॥
ఇత్యుక్త్వావిష్ణురుద్రౌతౌ విశ్వకర్మాణమూచతుః
ఆవాభ్యాం యత్తవస్తోత్రం కృతంతద్యః పఠేత్సదా ॥
సంపదస్తస్యవర్ధంతి నసపశ్యతి చాపదః
శ్రీవిశ్వకర్మణస్తోత్రం పఠేన్నిత్యం సమాహితః ॥
ఇతి శ్రీవాయుపురాణే భూఖండే విశ్వకర్మోపాఖ్యానే
శ్రీవిశ్వకర్మస్తోత్రం సంపూర్ణమ్.

* ఈ స్తోత్రమునకుఁ దాత్పర్యము శిల్పకాండమున వ్రాయఁబడియున్నది.

శ్రీవిశ్వకర్మ కాండాంతమున శ్రీవిశ్వకర్మోపనిషద్వాచనము
సమస్తశ్రేయోదాయకముగదా!

## —• అథ శ్రీ విశ్వకర్మోపనిషత్ •—

శ్రీగురుభ్యోనమః హరిఃఓమ్॥ సహనావవతు సహనౌభునక్తు సహవీర్యం కరవావహై। తేజస్వినావధీతమస్తుమా విద్విషావహై। ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః॥ ఓం విశ్వకర్మా దిశాంపతిస్సనః పశూన్పాతు సోస్మాన్పాతుతస్మైనమః। ప్రజాపతీ రుద్రోవరుణోగ్నిర్దిశాప్పతి స్సనః పశూన్పాతు సోస్మాన్పాతు తస్మైనమః॥ అథపురుషోహ వై విశ్వకర్మణోఽకామయత ప్రజాస్సృజేయేతి। విశ్వకర్మణః ప్రాణో జాయతే। మనస్సర్వేన్ద్రియాణిచ। ఖంవాయుర్జ్యోతిరాపః పృథివీవిశ్వస్యధారిణీ। విశ్వకర్మణో బ్రహ్మాజాయతే। విశ్వకర్మణో రుద్రోజాయతే। విశ్వకర్మణో నారాయణోజాయతే, విశ్వకర్మణః ప్రజాపతయః ప్రజాయన్తే। విశ్వకర్మణో ద్వాదశాదిత్యా రుద్రావసవస్సర్వే దేవతాస్సర్వేఋుషయస్సర్వాణి ఛన్దాగ్ంసి సర్వాణి భూతానివా సముత్పద్యన్తే। విశ్వకర్మణి ప్రవర్ధన్తే। విశ్వకర్మణి ప్రలీయన్తే। ఓమ్ అథనిత్యోదేవ ఏకోవిశ్వకర్మా। యోదేవానాం నామధాఏక ఏవవిశ్వకర్మా। విరాడ్విశ్వకర్మా। స్వరాడ్విశ్వకర్మా। సమ్రాడ్విశ్వకర్మా। అథరుద్రో విశ్వకర్మా, బ్రహ్మవిశ్వకర్మా। శివశ్చవిశ్వకర్మా। విష్ణుశ్చవిశ్వకర్మా। శక్రశ్చ విశ్వకర్మా। ద్యావాపృథివ్యాచ విశ్వకర్మా। కాలశ్చవిశ్వకర్మా। దిశశ్చవిశ్వకర్మా। దిగన్తశ్చ విశ్వకర్మా। అగ్నిశ్చ విశ్వకర్మా। ఊర్ధ్వశ్చవిశ్వకర్మా। అథశ్చ విశ్వకర్మా। అవాన్తరశ్చ విశ్వకర్మా। అన్తర్బహిశ్చ విశ్వకర్మా। విశ్వకర్మణో నిరాకృతిః। విశ్వకర్మణ ఏవేదగ్ం సర్వమ్। యద్భూతంయచ్చభవ్యమ్॥ నిష్క-

శంకో నిరంజనో నిర్వికల్పో నిరాఖ్యాతశ్శుద్ధాఽ. ద్వైన్వైకోవిశ్వకర్మా సద్వితీయోఽ స్తికశ్చిత్ । యఏవం వేద । సవిశ్వకర్మాఽరేభవతి సవిశ్వకర్మాఽరేభవతి । ఓమిత్యగ్రే వ్యాహరేత్ । నమఇతి పశ్చాత్ । విశ్వకర్మణ ఇత్యుపరిష్టాత్ । ఓమిత్యేకాక్షరమ్ । నమఇతిద్వే అక్షరే । విశ్వకర్మణ ఇతి పఞ్చాక్షరాణి । ఓమ్ విశ్వకర్మణ ఇతి షడక్షరాణి । ఓం నమో విశ్వకర్మణ ఇత్యష్టాక్షరంపదమ్ ॥ యోహవై విశ్వకర్మణ ఇత్యష్టాక్షరమ్పదమధ్యేతి, అనుపబ్రువన్ త్సర్వమాయురేతి । విన్దతే ప్రాజాపత్యమ్ । రాయస్పోషం గౌపత్యమ్ । తతోఽమృతత్వమశ్నుతే తతోఽమృతత్వమశ్నుతఇతి । యఏవంవేద । ప్రత్యగానన్దమ్బ్రహ్మ పురుషమ్ప్రణవస్వరూపమ్ । అకార ఉకారో మకారఇతి, తానేకధాసమభరత్తదేతదోమితి, యముక్త్వాముచ్యతే యోగీజన్మ సంసారబన్ధనాత్ । ఓం నమోవిశ్వకర్మణ ఇతిమన్త్రోపాసకః । సాయుజ్యంగమిష్యతి తదిదమ్పరమ్పుణ్డరీకం విజ్ఞానఘనమ్, తస్మాత్తది దావన్మాత్రమ్ । బ్రహ్మణ్యో విశ్వకర్మోమ్, సర్వభూతస్థమేకం విశ్వకర్మాణమ్, కారణరూపమకారపరవిశ్వ బ్రహ్మోమ్ । పదంవిష్ణ్వాఖ్యమితితేసి విశ్వకర్మణ్యోపనిషదమ్, యోహవై విశ్వకర్మణ్యోపనిషద మధీతే, సర్వేభ్యో పాపేభ్యో విముక్తో భవతి । ససర్వేభ్యో విముక్తస్సర్వాన్కామా నవాప్నోతి - బ్రహ్మత్వఞ్చ గచ్ఛతి । ఇత్యుపనిషత్ ॥ ఓం సహనా.....వహై ॥

శ్రీవిశ్వకర్మ బ్రాహ్మణ్యవంశాగమ కృతావితి ।
కాండోఽయం ప్రథమోవిశ్వకర్మణః ప్రతిపాదితః ॥

ఓం తత్సత్ ॥



ఓమ్.
శ్రీత్వష్ట్రవిశ్వకర్మణేనమః.

# విశ్వకర్మబ్రాహ్మణవంశాగమము.

## విశ్వకర్మకాండీయ త్వష్టృపకాండము.

### --- త్వష్టృవిశ్వకర్మ ---

(:)

త్వష్టృశబ్దము ఋకారాంతపుంలింగము "త్విషదీప్తౌ" అనుధాత్వర్థముచేఁ బ్రకాశించువాఁడని యర్థము. ఇందుచే నాదిత్యవిశేషుఁడనికూడఁ దెలియుచున్నది. శ్రీమహాభారతమున ద్వాదశాదిత్యులను జెప్పునప్పుడు "ఏకాదశ స్తథా త్వష్టా ద్వాదశో విష్ణురుచ్యతే" అని పదునొకండవ యాదిత్యుఁడు త్వష్టృనామకుండని వివరింపఁబడెను. అయిన నియ్యది చాక్షుషమన్వంతరకాలమున ననికూడఁ దెలుపఁబడినది. ఇచట నాదిత్యులలో విష్ణువెటులఁ బ్రకాశించెనో, యటులనే త్వష్టకూడఁ బ్రకాశించెనని తెలియవచ్చెడిని. "విశ్వకర్మణ్యపిత్వష్టా" యను కోశవాక్యమువలనఁ ద్వష్టృశబ్దము విశ్వకర్మయందును నన్వయించునని చెప్పుటచేఁ ద్వష్టకు విశ్వకర్మ (శిల్పి) త్వమంగీకరింపఁబడియున్నది. అందువలననే "త్వక్ష్ణోతి తనూకరోతీతిత్వష్టా" యను వ్యుత్పత్త్యర్థముచేఁ ద్వష్టయనగా లోకసృష్టిని జేయువాఁడని యర్థము విశదీకరింపఁబడుచున్నది. నిగమాగమము లీత్వష్టనే పెక్కుచోటుల నుడువుచున్నవి. వానిలోఁ గొన్నింటి నీక్రిందివాక్యములఁ జూడనగు.

త్వష్టారూపాణామధిపతిః ,, యజుఃకాం కాం 3. ౪. ౫. ౧

త్వష్టారూపాణి పింశతు ,, ఋగ్వేద ౮. ౮. ౪౨. ౧

త్వష్టారూపాణిహి ప్రభుః ,, ఋగ్వేద ౨. ౫. ౯. ౪

త్వష్టారూపాణి వికరోతి ,, యజుః కాం ౨. ౬. ౧౦. 3

త్వష్టావై రేతసస్సిక్తస్యరూపాణి వికరోతి ,, యజుఃకాం ౬. ౬. ౬. ౨

త్వష్టారగ్ం రూపాణి వికుర్వన్తం విపశ్చిం ,, ఆరణ్యకప్ర 3.౧౧.౨.౧౦

తా॥ మాధవీయ భాష్యానుసారముగ నీవాక్యముల కర్థమును విలోకించితిమేని త్వష్టరూపము (శిల్పము) లకు నాయకుఁడనియు; ద్వష్టహస్తపాదాదిరూపములను బ్రకాశవంతములగు వానినిఁగాఁ జేయవలెననియుఁ; ద్వష్ట రూపములకు

ప్రభువనియుఁ; ద్వష్ట యవయవాదిరూపములఁ జేయుచున్నాఁడనియుఁ; ద్వష్టయే సేచితమైన రేతస్సుయొక్క రూపభేదములఁ జేయుచున్నాఁడనియుఁ; ద్వష్టను రూపనిర్మాణమునందుఁ బండితునిగాఁ దలంచుకొనుచుందురనియుఁ; దెలియుచున్నది.

—♦ త్వష్టయే వధూవరనిర్మాత. ♦—

(2) శ్రుతిః॥ త్వష్టా జాయామజనయత్త్వష్టాస్యై త్వాం పతిమ్

త్వష్టా సహస్రమాయూగ్ంషి దీర్ఘమాయుః కృణోతు వామ్ ॥

ఏకాగ్నికాండ మంత్రప్రశ్నే అష్టమఖండే.

హరదత్తవిరచిత భాష్యమ్ ॥ త్వష్టా, యావచ్ఛో వై రేతసః సిక్తస్య త్వష్టా రూపాణి వికరోతి, త్వష్టారూపాణిపిగ్ంశత్వితిచరూపనిర్మాణే కర్తృత్వేన శ్రుతో య స్త్వష్టా సత్వష్టా, ఇమాం జాయాం అజనయత్ తథా అస్యై అస్యాః త్వాం పతించ త్వష్టైవాజనయత్ హేమదీయాంతరాత్మన్ సఏవత్వష్టా వాంయువయో రంతరాత్మనో స్సహస్రమాయూగ్ంషి బహూనిధనాని దీర్ఘమాయుశ్చ కృణోతు కరోతు—

తా॥ "సేచనము చేయఁబడిన రేతస్సునకుఁ ద్వష్టరూపములను జేయుచున్నాఁడు. త్వష్టరూపములను బ్రకాశించునట్లు సేయుచున్నాఁడు." అను శ్రుతివచనార్థములచే నేత్వష్ట చెప్పఁబడెనో యాత్వష్ట యీభార్యను సృజించెను; ఈ భార్యకు నిన్ను భర్తగా నాత్వష్టయె సృజించెను. ఓనాయంతరాత్మా! ఆత్వష్టయె మీ యిరువుర యంతరాత్మలకు బహుళమైన ధనములను, దీర్ఘమైన యాయుష్యమును గలిగించవలెను.

ఇట్లు వచించియుండుటచే జాయాపతుల గల్పించి వారలకు నాయురైశ్వర్యముల నొసంగుటకుఁ ద్వష్టృవిశ్వకర్మయె యధికారిగఁ గనిపించుచుండెను. మఱియు,

—♦ త్వష్టయె పుత్త్రోత్పాదకుఁడు. ♦—

(3) శ్రుతిః॥ త్వష్టా వీరం దేవకామంజజాన । త్వష్టురర్వా జాయత ఆశురశ్వః ।

త్వష్టేదం విశ్వంభువనంజజాన బహోః కర్తారమిహయక్షి హోతః ॥ ౧

యజుః కాం ౫-౧-౧౧-౩.

భా॥ త్వష్టాత్వష్టృనామకో దేవః, దేవకామం (దేవాన్ కామయమానం) వీరం (కర్మశూరం) పుత్రింజజాన (ఉత్పాదయామాస) సః త్వష్టుస్సకాశాత్ అర్వా (గమనకుశలః) ఆశుః (శీఘ్రగామీ) అశ్వః జజాన (జనయామాస) హే హోతః బహోః (బహులస్యజగతః) కర్తారం (స్రష్టారం) ఇహ (అస్మిన్ కర్మణి) యక్షి (యజ)

తా॥ త్వష్టృదేవుఁడు దేవతలఁ గోరువాఁడును, కర్మశూరుఁడు, నగు పుత్త్రుని జనింపజేసెను. ఆపుత్త్రుఁడు త్వష్టవలననుండి గమనమున నేర్పరియగు నదియు, శీఘ్రముగఁబోవునదియు, నగు నశ్వమును బుట్టించెను. ఓహోతా! విశాలమగు జగమును సృజించు త్వష్టృబ్రహ్మను నీయజ్ఞమునఁ బూజించుము. అని చెప్పియుండుటచేఁ బుత్త్రికల్పన త్వష్టవలననే యగుచున్నదని తెలిసికొనుటకు నభ్యంతరమేమియు నుండదు. మఱియు నిందున కనుకూలముగ:—

(4) శ్రుతిః శ్రుణోతు నస్త్వష్టా దేవేభిర్జనిభిః పితావచః ॥

ఋక్. ౮. ౨. ౮. ౧౦

భాష్యమ్॥ తథాదేవేభిర్దైవైరింద్రాదిభిర్జనీభిః దేవపత్నీభిశ్చపితాసర్వేషాం త్వష్టాఏతన్నామకోఽస్మదీయంవచశ్శృణోతు.

తా॥ అటుల నింద్రాదిదేవతలతోడను, దేవపత్నులతోడను నెల్లరకుఁ దండ్రియగు త్వష్ట మావాక్కులను వినవలయును. ఇట్లనుటచే సర్వులకుఁ ద్వష్టయె తండ్రియగుచున్నాడు. మఱియు—

## — త్వష్టవలని ప్రజాసర్గము. —

(5) శ్రు॥ ఇహత్వష్టారమగ్రియం విశ్వరూపముపహ్వయే। అస్మాకమస్తు కేవలః।

తన్నస్తురీప మథపోషయిత్ను । దేవత్వష్టర్వి రరాణః స్యస్వయతో వీరః ॥ ౧॥

కర్మణ్యః సుదక్షోయుక్తగ్రావాజాయతే దేవకామః। శివ స్త్వష్టరిహాగహి విభుః పోషఉతత్మనా । యజ్ఞేయజ్ఞేనఉదవ । పిశఙ్గరూపః సుభగోవయోధాః శ్రుష్టీ వీరోజాయతే దేవకామః । ప్రజాం త్వష్టావిష్యతు నాభిమస్మేఽథా దేవానామప్యేతు పాథః ॥

య. కాం. ౩. ౧. ౧౧

సా. భా॥ తృతీయహవిషస్త్వాష్ట్రస్య పురోఽనువాక్యామాహ। "ఇహత్వష్టా రమగ్రియం విశ్వరూపముపహ్వయే । అస్మాకమస్తు కేవలః" ఇతి । ఇహాస్మిన్ కర్మణి త్వష్టారం దేవముపహ్వయే ఆహ్వయామి । కీదృశం అగ్రియం ముఖ్యం । విశ్వరూపం విశ్వానిరూపాణి గర్భేబిభర్తుం యోగ్యాని యస్యాసౌవిశ్వరూపః తం । సచత్వష్టాఽస్మాకం కేవలోఽస్తు । తత్రైవ యాజ్యామాహ। "తన్నస్తురీయమథపోషయిత్నుదేవత్వష్టర్విరరాణః స్యస్వ । యతోవీరః కర్మణ్యః సుదక్షోయుక్త గ్రావాజాయతే దేవకామః" ఇతి । హేత్వష్టర్దేవ తద్ధనంనోఽస్మభ్యం విశేషణస్యస్వ సమర్పయ । కీదృశంధనం తురీయం తూర్ణం ప్రాప్నోతీ ఇతి తురీయం । అథఅపిచపోషయిత్నుపోషయితృ । త్వంచరరాణోదానశీలః । యతోయస్మాద్ధనాదస్మాభిర్లబ్ధాత్ వీరః శూరః పుత్రోజాయతే । కీదృశంతచ్ఛూరత్వమితి తదుచ్యతే । కర్మణ్యః లౌకికే వైదికేచ కర్మణికుశలః । సుదక్షః సమ్యగుత్సాహీశీఘ్రకారీ ఇత్యర్థః । యుక్తాః సోమాభిషవార్థం ప్రయుక్తాః గ్రావాణోయస్యాసౌయుక్తగ్రావా సర్వదా సోమయాగస్యానుష్ఠాతేత్యర్థః । దేవకామః ఈదృశఃసేవకోఽస్మాకం భూయాదితిదేవైః కామ్యమానః । దేవాన్ వా సేవితుం స్వయంకామయతే । తత్రైవహవిషి వికల్పితాం పురోఽనువాక్యామాహ। "శివ స్త్వష్టరిహాగహి విభుః పోషఉతత్మనా। యజ్ఞేయజ్ఞేన ఉదవ" ఇతి । హేత్వష్టస్త్వం శివః సుఖకరః సన్ ఇహాస్మిన్ కర్మణ్యాగహి ఆగచ్ఛ । ఉతఅపిచ పోషేఽస్మదీయే పోషణవిషయేత్మనావిభుః పరనైరపేక్ష్యేణ స్వయమేవసమర్థః । తాదృశత్వం తస్మిన్ తస్మిన్ యజ్ఞేనోఽస్మాన్ ఉదవఉత్కర్షేణ పాలయ । తత్రైవవికల్పితాం యాజ్యామాహ । "పిశఙ్గరూపః సుభరోవయోధాః శ్రుష్టీవీరోజాయతే దేవకామః। ప్రజాంత్వష్టా విష్యతు నాభిమస్మేథా దేవానామప్యేతుపాథః" ఇతి । యస్యత్వష్టుః ప్రసాదాదస్మాకం వీరః పుత్రోజాయతే ! కీదృశః పిశఙ్గరూపః త్రివర్గస్య సేవితేత్యర్థః । సుభరః సుష్ఠుపోషకః । వయోధాః దీర్ఘస్య వయసోధారకః చిరజీవీత్యర్థః । శ్రుష్టీక్షిప్రకారీ సత్యవాదీవా । దేవకామ ఇతిపూర్వవత్ । యస్యత్వష్టుః ప్రసాదాదీదృశోవీరోజాతః । తాదృశ స్త్వష్టానాభిం చక్రస్య నాభివత్ ప్రశస్తాం ప్రజాం పుత్రపౌత్రాదిరూపాం అస్మే అస్మాసు విష్యతు విశేషేణ సమర్పయతు । అథానంతరం దేవానామపి పాథోఽన్నం ఏతుప్రాప్నోతు ।

తా॥ త్వష్టృసంబంధమగు మూఁడవహవిస్సునకుఁ బురోనువాక్యను జెప్పుచుండెను. ఈ యజ్ఞకర్మయందు ముఖ్యుఁడును, సమస్తరూపములను గర్భమందు ధరించునట్టివాఁడును. నగు త్వష్టృదేవుని బిలుచుచున్నాను. అత్వష్టమాకు ముఖ్యుఁడగుఁగాక!

ఓత్వష్టృదేవా! శీఘ్రప్రాప్తమై పోషించునట్టి ధనమును మాకులభింపఁజేయుము. నీవత్యంత దానశీలుఁడవు ఏలన:— నీవలన లబ్ధమైన ధనముచే లౌకిక వైదికకర్మలయందు శూరుఁడును, మిక్కిలి యుత్సాహముచే శీఘ్రముగ సత్కార్యములఁజేయువాఁడును, సర్వదా సోమయాగము లనుష్ఠించువాఁడును, నిట్టి సేవకుఁడేమాకుఁగావలెనని దేవతలచేఁ గోరఁబడువాఁడు (దేవతల సేవించనెల్లపుడు గోరువాఁడు) నగు పుత్త్రుఁడు గలుగుచున్నాడు. ఓత్వష్టా! నీవు సుఖకరుఁడవై యాకర్మకురమ్ము. మదీయపోషణవిషయమునఁ బరాపేక్షలేక సమర్థింపవిభుఁడవైన నీవాయా యజ్ఞములయందు మమ్ములఁ జక్కగా బాలింపుము. ఏత్వష్టయొక్క ప్రసాదమువలన ధర్మార్థకామములను త్రివర్గముల సేవించువాఁడును, జక్కఁగఁ బోషించునట్టిఁడును, జిరంజీవియు, శీఘ్రకార్యకారియు, దేవకాముఁడు, నగు పుత్త్రుఁడు గలుగుచున్నాఁడో యట్టిత్వష్టృదేవుఁడు చక్రమునకు నాభివలెఁ బ్రశస్తమైన పుత్త్రపౌత్త్రాది రూపమగు సంతానమును మాకధికముగా సమర్పింపవలెను. తరువాత దేవతలకును నన్నమును బొందించుఁగాక! ఇట్లు యజమానుఁ డర్థించుచుండుటచేఁ బ్రజాసర్గాభివృద్ధి త్వష్టృప్రజాపతివలననే కలుగుచున్నదని తెలియుచున్నది.

మఱియు,

(6) దేవస్త్వష్టాసవితావిశ్వరూపః పుపోషప్రజాః పురుధాజజాన । ఇమాచవిశ్వా
భువనాన్యస్యమహద్దేవానామసురత్వమేకమ్ ॥

భా॥ దేవస్త్వష్టాసవితాసర్వరూపః పోషతి ప్రజారసానప్రదానేన బహుధాచేమాజనయతీమాశ్చ సర్వాణి భూతాన్యుదకాన్యస్య మహచ్చాస్మైదేవానామసురత్వమేకం ప్రజ్ఞావత్త్వంవా నవత్త్వంవాపివాసురితి ప్రజ్ఞానమాస్యత్యనర్థానస్తాశ్చాస్యామర్థాఅసురత్వమాదిలుప్తంవాతోవాతీతిసతస్తస్యైషాభవతి "దేవస్త్వష్టా" ఇతి (ఋ. సం. 3.3.3౧.౪) వైశ్వామిత్రస్య ప్రజాపతేరార్షం। వైశ్వదేవేవినియోగః 'త్వష్టా' దేవోమధ్యమః "సవితా" సర్వస్యభూత గ్రామస్య ప్రసవితా ఉత్పాదయితా ఉదకసంప్రదానద్వారేణ కిముత్పాదయితా ఏవ? న- ఇతి ఉచ్యతే_ "పుపోషప్రజాః" పుష్ణాతిచాసావుత్పాద్య। నకేవలం పుష్ణాతి, కింతర్హి? 'పురుధాజజాన' ఇతి బహుధాచైనాః జనయతి" వర్ధయతి । కేనపునరసౌజనయతి, పుష్ణాతివర్ధయతిచ? యత ఆహ— "ఇమాచవిశ్వాభువనాన్యస్య" ఇమాని విశ్వాని భువనానిః ఉదకాని అస్యయతః స్వతాయాం వర్తన్తే తస్మాజ్జనయతి పుష్ణాతివర్ధయతిచ। అతశ్చ సర్వ

మిదంశక్తః కర్తుం యతః" మహద్దేవానామసురత్వమేకమ్" 'మహత్' అసురత్వమ్।
"ప్రజావత్వమ్" అసురితిప్రజ్ఞానమ్ తయాతద్వత్త్వమ్ । తయామహత్యాప్రజ్ఞయాఉద
కేన సాధనేన సర్వమిదంజనయతి । పుష్ణాతివర్ధయతిచ । అప్రజ్ఞోహిసాధనసంపత్త్యావ
పికింకుర్యాత్ । అథవా "అనవత్వమ్" అసుః ప్రాణఃతేన తద్వత్త్వమ్ । ఏవమపిసతి
ప్రాణేనైవశక్యతే ఏతత్సర్వంకర్తుం । అప్రాణోహికింకుర్యాత్ । అన్నవత్వమ్ ఇతికే
చిత్ తేషామన్నహేతునోదకేన తద్వత్త్వమ్ । తథాపియోజ్యమ్ । "అసురితిప్రజ్ఞా
నామ" తత్ కస్మాత్ "అస్యతి అనర్థాన్" ప్రజ్ఞైవహిప్రజ్ఞావతోఽస్యతి క్షిపత్యనర్థాన్ ।
నాశయతి. "అస్తాశ్చ అస్యామ్ అర్థాః" నహితదస్తివ్యక్తైర్యత్ సర్వం ప్రజ్ఞావతాం
ప్రజ్ఞాయాంనాస్తి, ఏతావాన్స్సు, విశేషోఽభివ్యక్తమితి, అథవాయదేతదసురత్వం
వసుమతోభావః "వసురత్వమ్" ఏతత్,రోమత్వర్థేవకారలోపశ్చ । వసునాఉదకేన
తద్వాన్ అసౌత్వష్టా ॥

ఇతి నైరుక్తేదేవతాకాండే ॥

తా॥ త్వష్టృదేవుఁడు సమస్త భూతసముదాయము నుదకప్రధానమార్గమున
నుత్పత్తిసేయువాఁడేకాక ప్రజలనందఱఁ బోషించుచున్నాఁడు. ఈ యుదకము
లన్నియు స్వాయముగా వర్తించుచున్నవి. అందువలననే యుదకసాధనము వలనఁ
బుట్టించుచుఁ బోషించుచున్నాఁడు. మఱియుఁ బ్రజ్ఞగలవాఁడగుటచేతనే యాత్వష్ట
యుదకసాధనముచేతఁ బుట్టించుచుఁ బోషించుచుఁ బెంచుచునున్నాఁడు. ప్రజ్ఞారహి
తుఁ డెంతసాధన సంపత్తిగలిగినను నేమిసేయును? అసువనఁగాఁ బ్రాణము. ఈ
త్వష్ట ప్రాణయుక్తుఁడగుటచేతనే యీసర్వమునుజేయ సమర్థుఁడయ్యెను. ప్రాణ
రహితుఁ డేమిసేయును? యీత్వష్ట యన్నహేతువగు నుదకముతోఁ గూడిన
వాఁడు మఱియు నసువనఁగాఁ బ్రజ్ఞ. ప్రజ్ఞయే ప్రజ్ఞావంతులయొక్క యనర్థము
లను నశింపఁజేయును. —♦ త్వష్ట జగత్కర్త ♦—

7. శ్రుతి॥ యఇమేద్యావాపృథివీ జనిత్రీ రూపైరపింశద్భువనాని విశ్వా। తమద్య హోత
రిషితోయజీయాన్ దేవం త్వష్టారమిహయక్షి విద్వాన్॥ యఇమేద్యావాపృథివ్యౌ
జనయిత్ర్యౌరూపైరకరోద్భూతానిచ సర్వాణి తమద్య హోతరిషితోయజీయాన్
దేవంత్వష్టారమిహయజవిద్వాన్ మాధ్యమికస్త్వష్టేత్యాహుః ర్మధ్యమేచస్థానే
సమామ్నాతోఽగ్నిరితిశాకపూణిస్తస్యైషాపరాభవతి ।

"యఇమేద్యావాపృథివీ" - ఇతి (ఋ. సం. ౮. ౬. ౯. 3.)

'యః' "త్వష్టా" ఇమే "ద్యావాపృథివ్యౌ" సర్వేషాం భూతానాం "జన యిత్రో" 'రూపైః' నానావిధైః అనేకప్రకారైః "అకరోత్" "భూతానిచస ర్వాణి" | అథవారూపైరితి కర్త్రైవానయా తృతీయయా లక్ష్యతే - తత్రరూపమా

శ్రాయ 'యః' త్వష్టాద్యావాపృథివ్యావకరోత్ భూతానిచ సర్వాణి | కింతస్యత్వ ష్టుః ? తందేవం 'త్వష్టారం' 'ఇహ' అద్యైతస్మిన్నహని కర్మణి వా హే హోతః! 'యక్షి' యజ 'విద్వాన్' జానామఃమయేదమవశ్యం కర్తవ్యమితి॥ మాధ్యమికస్త్వ ష్టేతివిచారః | తత్రతావత్ "మాధ్యమికఃత్వష్టా – ఇతి "ఆహుః"

నైరుక్తదేవతాకాండము.

తా॥ ఓ హోతృనామకయజమానుఁడా! ఏత్వష్ట సమస్తభూతములఁ బుట్టించు ద్యులోకభూలోకములను నానావిధరూపములతోడ సమస్తలోకములను గల్పించెనో, అట్టి జగత్కర్తయగు త్వష్టృదేవునిఁ బూజింపుము. అని నుడువఁబడి యుండుటచేఁ ద్వష్టజగత్కర్తయగునటుల స్పష్టపడుచున్నది.

మఱియు నీనైరుక్తభాష్యమునందె యీత్వష్టను మాధ్యమికదేవునిగా నిశ్చ యించుచు"సర్వశిల్పిమహామాచార్య"యనిశిల్పాచార్యునిగానిర్ణయించుచు, త్వష్టా రూపాణి వికరోతి" ఇతి తదయముచ్యతే మనుష్యహోత్రాయజ! త్వమితి' ఏవం తావద్వ్యపదేశః శంక్యప్రతిసమాధానః యత్పునరుక్తం దేవశిల్పీతి | తత్త ద్గుణసామాన్యాదేవాసావపి కౌశలాతిశయమపేక్ష్యోచ్యత ఇత్యదోషః" త్వష్టరూప సృష్టిని జేయుచుండ నట్టి జగత్కర్తను మనుష్యహోతచేఁ బూజింపు మనుట యెట్లు? అనిశంకించి, ఆయాగుణసామాన్యముల వలసనె కౌశలాతిశయ మపే క్షించి దేవశిల్పియని పునరుక్తముగాఁ జెప్పఁబడెనని వివక్షించెను. ఇట్లు వివక్షిం చుటచేఁ ద్వష్టకు శిల్పుల కూటస్థపురుషత్వమగు నాచార్యత్వము దేవసృష్టిరూప శిల్పిత్వము నారోపింపఁబడియున్నది.

## ——♦ త్వష్టృకృతశిల్పబ్రాహ్మణ్యము ♦——

(8)శ్రుతి॥ త్వష్టామాయా వేదపసామపస్తమోబిభ్రత్పాత్రాదేవపానానిశంతమా।
శిశీతేనూనం పరశుం స్వాయసం యేన వృశ్చాదేతశో బ్రహ్మణస్పతిః॥

ఋక్. ౮. ౧. ౧౪. ౯

భా॥ అయం త్వష్టాదేవశిల్పీమాయాః కర్మనామైతత్ కర్మాణి పాత్రనిర్మా ణవిషయాణివేత్ వేత్తి జానాతి సచత్వష్టా అపసాంశోభనకర్మవతాం మధ్యే అప

స్తమః అతిశయేన శోభనకర్మా దేవపానాని దేవాఃపిబన్తి యేషుతాని పాత్రాని సోమపాత్రాణి బిభ్రత్ ధారయన్ వర్తతే ఇతిశేషః సత్వష్టానూనమిదానీం అగ్నౌ హావిర్వహనా యాంగీకృతే సతిస్వాయసంశోభ నాయః సారభూతం పరశుం శిశీతే తీక్ష్ణయతి త్వష్టాపాత్రసంపాదనార్థం యేనపరశునా ఏతశః ఏతశవర్ణః బ్రహ్మణస్పతిః బ్రహ్మణోమంత్రస్య పాత్రాదిసంపాదన రూపస్య కర్మణః పతిః స్వామీ వృశ్చాత్ వృశ్చతిపాత్రాణి.

తా॥ దేవనిర్మాణశీలుఁడు దేవశిల్పినాఁబరగు. అట్టి దేవశిల్పియగు నీత్వష్ట పాత్రనిర్మాణవిషయములగుకర్మ (పను) లను జక్కఁగాఁ దెలిసికొనుచున్నాఁడు. ఆ త్వష్ట యత్యంతప్రకాశిత కర్మలుసేయువారిలో నుత్తమోత్తముఁడు. మఱియు నాత్వష్ట దేవతలు వేనియందుఁ బానముసేయుచున్నారో యట్టి సోమపాత్రలను ధరించు (సృజించు) చుండెను. “ఏతశః, పుం (ఇణ్ “ఇణస్తశస్తశసునౌ” 3.౧౪౯ ఇతి ఉణాదిసూత్రేణతశన్) బ్రాహ్మణః ఇత్యుణాదికోశః” అను శబ్దకల్పద్రుమమందు నిర్వచించుసర్థము వలన నేతశుఁడన బ్రాహ్మణుఁడు నాజను. అట్టి బ్రాహ్మణవర్ణుఁడును బ్రహ్మయన మంత్రము అదియే పాత్రాదిసంపాదనరూపమైన కర్మయగు, నట్టి బ్రహ్మ (శిల్పమున) కు నాయకుఁడు నగు త్వష్ట యేపరశువుచేఁ బాత్రల నొనర్చునో యట్టియాయసరూపమైన బలిష్ఠమగు పరశువును హావిస్సు వహించుటకు నంగీకరించిన యగ్నియందుఁ దీక్ష్ణమైనదానినిగాఁ జేసెను. ఇందు “వృశ్చాత్” అను క్రియాపదమువలన “ఓవ్రశ్చూచ్ఛేదనే”అను ధాత్వర్థముచేఁ బాత్రలను జెక్కెననుట స్పష్టమగుచున్నది, ఇట్లనుటచేఁ ద్వష్టయొక్కయుత్తమవర్ణత్వమును, యజ్ఞపాత్రసంపాదనరూపమైన శిల్పము బ్రాహ్మణ్యమగుటయుఁ దెలియవచ్చుచున్నది.

## —• త్వష్టకు హావిస్స్వీకర్తృత్వము •—

త్వష్ట పూర్వోక్తసృష్టికర్తయగుటయెకాక సోమపానాదుల స్వీకరించునటుల,

(9) శ్రుతి॥ అగ్నేపత్నీరిహావహ దేవానాముశతీరుప। త్వష్టారం సోమపీతయే॥

ఋ. సం ౧. ౨. ౫. ౪

తా॥ ఓయగ్నిహోతృఁడా! సోమమునపేక్షించునట్టి దేవభార్యలగు నింద్రాణ్యాదులను, త్వష్టయను దేవతను, సోమపానముకొఱకు యజ్ఞసమీపమునకుఁ బిలుచుకొనిరమ్ము! అనుటవలనను,

శ్రుతి ॥ సజూర్దేవేన త్వష్ట్రాసోమంపిబస్వాహా ॥

యజుః కాం ౧. ౪. ౨౭. ౧

తా॥ పత్నీవంతుఁడవైన యోయగ్నీ! త్వష్టృదేవునితోఁగూడ సోమమును స్వీకరించుము. అనుటవలనను,

శ్రుతి ॥ సజూర్దేవేనత్వష్ట్రా సోమంపిబేత్యాహత్వష్టా వై పశూనాం మిథునానాగ్ం రూపకృద్రూపమేవ పశుషుదధాతి ॥

యజుః కాం. ౬. ౫. ౮

తా॥ త్వష్టృదేవునితోఁగూడ సోమమును బానము చేయుమనిచెప్పెను. త్వష్టయె మిథునములైన పశువుల రూపములను జేయువాఁడై మనుష్యాది పశువుల యందు రూపమును ధరింపఁజేయుచున్నాఁడు. అనుటవలనను,

శ్రుతి ॥ అగ్నే వాక్పత్నీసజూర్దేవేన త్వష్ట్రాసోమంపిబస్వాహా ॥

కణ్వసంహిత ౮. ౬

తా॥ వాగభిమానదేవతలకు భర్తవైనయోయగ్నీ! త్వష్టృదేవునితోఁగూడ సోమమును బానముచేయుము. అయ్యది చక్కఁగా హుతమగుఁగాక! అనుటవలనను,

శ్రుతి॥ త్వష్టారం సోమపీతయ ఇతీంద్రో వై త్వష్టాతదైంద్రం రూపంతేనేంద్రం ప్రీణాతి ॥ ఐతరేయబ్రాహ్మణపం. ౬. ఖం. ౧౦. అ. 3.

తా ॥ త్వష్టను సోమపానముకొఱకుఁ బిలువవలెను. ఇట్లనుటచే నింద్రుఁడే త్వష్టయగును. త్వష్ట యింద్రదరూపమును వహించుచున్నాఁడు. అట్లగుటచేఁ ద్వష్ట తృప్తివడుటచే నింద్రుఁడు గూడఁ దృప్తివడయుచున్నాఁడు. ఇట్లు నుడువఁబడుటవలనను, ఇట్లేమఱిపెక్కు శ్రుతులు వలుకుచుండుటవలనను, ద్వష్టకుహవిస్స్వీకర్తృత్వము ప్రత్యక్షమగుచున్నది.

## —♦ త్వష్టకుఁ బ్రజాపతిత్వము. ♦—

శ్రుతి ॥ త్వష్టుఃప్రజానాంప్రథమంజనిత్రమగ్నే మాహిగ్ంసీఃపరమేవ్యోమన్ ॥

కణ్వసంహిత అధ్యాయ. ౧౫ అనువాక ౪.

మాధవీయభాష్యమ్ ॥ త్వష్టుఃప్రజాపతేః సకాశాదుత్పద్యమానానాం ప్రథమంజనిత్రంప్రధానత్వేనోత్పన్నమితి·

తా॥ త్వష్టయను ప్రజాపతివలననుండి పుట్టఁబడువారికిఁ బ్రధానమగుటచే ముందుగఁబుట్టినది. అనిత్వష్టను బ్రజాపతిగాఁ బ్రవచింపఁబడినది. ఇంకయుఁ బెక్కు శ్రుతులయందిట్లె నిర్వచింపఁబడుటయెగాక మహాభారతోద్యోగపర్వమందలి "త్వష్టా ప్రజాపతిర్హ్యాసీద్దేవశ్రేష్ఠోమహాతపాః" యను వచనమువలనను, స్కందపురాణ కాశీఖండ. ౮౬. అధ్యాయమందలి "విశ్వకర్మాభవత్పూర్వం బ్రహ్మణస్త్వపరాతనుః। త్వష్టుఃప్రజాపతేఃపుత్రో నిపుణస్సర్వకర్మసు" అను వచనము వలనను, త్వష్టకుఁబ్రజాపతిత్వము సిద్ధమగుచున్నది. మఱియునిట్లె బహుపురాణములును, త్వష్టకుఁబ్రాజాపత్యము ననువదించుచునేయున్నవి. విస్తరభీతిచే విరమింపఁబడెను.

## త్వష్టృవిశ్వకర్మల భేదము.

(9) శ్రుతి॥ అస్మాఇదుత్వష్టాతక్షద్వజ్రంస్వపస్తమంస్వర్యం రణాయ ॥

అధర్వవేదము. కాం ౨౦. అ. ౮. సూ ౩౫

సాయణభాష్యం ॥ అస్మాఇదుఅస్మాఏవేంద్రాయ త్వష్టాసకలజగన్నిర్మాతా విశ్వకర్మాపతన్నామకం ఆయుధం తక్షత్ అతక్షత్ నిర్మితవాన్ ॥

తా ॥ ఇంద్రునికొఱకే త్వష్ట (సకలజగన్నిర్మాతయగు విశ్వకర్మ) ఈ (వజ్ర మను) పేరుగల యాయుధమును జేసెను.

ఇట్లు త్వష్టయు విశ్వకర్మయు నొక్కఁడుగనే పెక్కుచోటుల వక్కాణింపఁబడుటయుఁ ద్వష్టృకృతవృత్రుని హరించినదోషము విశ్వకర్మ ధ్యానముచే విడువఁబడుటయు నివెల్లయుఁ జక్కగా విచారించితిమేని ద్వష్టృవిశ్వకర్మలు పరమేశ్వర విశ్వకర్మయొక్క యాద్యవతారములుగఁ దేలుటయెగాక, త్వష్టయె విశ్వకర్మయని పెక్కుశ్రుతులకర్థముఁ జెప్పఁబడినది. వానిలో నీక్రిందివి యుదాహృతములు.

(10) శ్రు॥ త్వష్టాస్మై వజ్రగ్ంస్వర్యంతతక్ష ॥ తైత్తిరీయక ౨-౫-౮

శ్రు॥ త్వష్టాస్మై వజ్రింస్వర్యంతతక్ష ॥ ఋగ్వే ౧.౨౩౬.౨

భా॥ త్వష్టావిశ్వకర్మా అస్మై ఇంద్రాయ స్వర్యం స్వర్గాయహితం వజ్రిం తతక్షతీక్ష్ణీకృతవాన్ ॥

శ్రు॥ త్వష్టారూపాణి వికరోతి తావచ్ఛోచ్ఛవైత త్వృజాయత ఏషవైదైవ్య

త్వష్టా యోయజతే బహ్వీభిరుపతిష్ఠతే రేతస ఏవసిక్తస్య బహూశోరూపాణి వికరోతి ॥ యజుః కాం ౧ ప్ర ౫ అ౯

భాష్యమ్ ॥ లోకే యోనౌసిక్తం విశ్వకర్మణాయదినవిక్రియేత తదానైవ ప్రజోత్పత్తి రస్తిసచత్వష్టా యావన్తిరూపాణ్యుద్దిశ్య రేతోవివిధం కరోతి తావన్తు త్పద్యంతే। అత్రాపియజమానో దేవైరనుగృహీత త్వష్టాతతో వివిధరూపకరణాయ బహ్వీభిరుపతిష్ఠతే । అయముపస్థానకర్మవిధిః.

తా॥ పైమంత్రములకు భాష్యానుసరణముగ నర్థములఁ జూచితిమేని "ఈను దుని కొఱకే త్వష్ట (జగన్నిర్మాతయగు విశ్వకర్మ) యీ (వజ్ర) నామకమగు నాయుధమును నిర్మించెననియు, త్వష్ట (విశ్వకర్మ) స్వర్గహితముకొఱకు వజ్రాయుధ మును దీక్ష్ణముగఁ జేసెననియుఁ, బ్రపంచమునందు యోనిసిక్తమగు రేతస్సు త్వష్ట (విశ్వకర్మ) చే వికారమును బొందదేని యపుడు ప్రజోత్పత్తికలుగదు. ఆత్వష్ట యెన్నిరూపముల నుద్దేశించి రేతస్సును వివిధములుగాఁ జేయుచున్నాఁడో యన్ని రూపములే పుట్టుచున్నవి. ఇక్కడను యజమానుఁడు దేవతలచే ననుగ్రహింపఁ బడిన వాఁడయ్యెను. త్వష్టయు నాయజమానునివలన బహువిధరూపములఁ జేయుట కొఱకు బహుమంత్రములచేత నుపస్థానముజేయఁ బడుచున్నాఁ" డనియుఁ దెలియు చున్నవి. ఈపైమంత్రములయందేకాక యింకను బెక్కుమంత్రములయందుఁ ద్వష్ట యనుపదమునకు విశ్వకర్మపర్యాయముగ నర్థముఁ జెప్పఁబడియుండెను.

## —♦ త్వష్ట విశ్వకర్మకుమారుఁడె ♦—

అట్లయినను,

"విశ్వకర్మణస్సమ వర్తతాధితస్యత్వష్టా విదధద్రూపమేతి" అనునారణ్య కశ్రుతివలన జగత్కర్తయగు విశ్వకర్మ పరమేశ్వరునివలన సమస్తప్రపంచముగలిగిన అవ్విరాడ్విశ్వకర్మయొక్క రూపమును నిష్పాదించుచుఁద్వష్ట (పుత్త్రి)రూపమున బ్రివర్తించుచున్నాఁడు. (వ్యక్తీకరించుచున్నాఁడు.) అను నర్థము ప్రతిపాదింపఁబడు టచే నిద్దానిననుసరించి త్వష్ట విశ్వకర్మకుమారుఁడేయయినటుల బెక్కులాగము పురాణాదులలోఁ గానవచ్చుచున్నయవి. వానిలో నీక్రిందివి యుదాహృతములు.

* శ్లో॥ బృహస్పతేస్తుభగినీ వరస్త్రీ బ్రహ్మచారిణీ
యోగసిద్ధాజగత్కృత్స్న మసక్తావిచరత్యుత ॥
ప్రభాసస్యతుసాభార్యా వసూనామష్టమస్యహ
విశ్వకర్మా మహాభాగ స్తస్యాంజజ్ఞేప్రజాపతిః ॥
కర్తాశిల్పసహస్రాణాం త్రిదశానాంచవర్ధకీ
భూషణానాంచసర్వేషాం కర్తాశిల్పవతాంవరః ॥
యస్సర్వేషాంవిమానాని దేవాదీనాంచకారహ
మనుష్యాశ్చోపజీవంతి యస్యశిల్పం మహాత్మనః ॥
తస్యపుత్రాస్తుచత్వార స్తేషాం నామానివై శ్రుణు
అజైకపాదహిర్బుధ్న స్త్వష్టారుద్రశ్చబుద్ధిమాన్ ॥
త్వష్టుశ్చాప్యాత్మజ శ్రీమాన్ విశ్వరూపో మహాతపాః ।
విష్ణుపురాణము ప్రథమాంశము ౧౫వ అధ్యాయము.

* విష్ణుపురాణము పెక్కుపాఠభేదములుగ గానవచ్చుచున్నది. ఈశ్లోకపంక్తి రాజారాధాకాంత దేవబహదూరుచే రచితమై కలకత్తాపురమునముద్రితమైన "శబ్దకల్పద్రుమ" మను సంస్కృతకోశగ్రంథమునందు లభ్యమైన విష్ణుపురాణశ్లోకానుసరణముగ వ్రాయఁబడినది. చెన్నపురి జ్ఞానసూర్యోదయముద్రాక్షరశాలయందు ముద్రించిన ప్రతియొకటిలభించినది. అద్దానిలో "శ్లో ॥ యస్సర్వేషాం విమానాని దేవాదీనాంచ కారహ మనుష్యాశ్చోపజీవంతియస్యశిల్పం మహాత్మనః॥ ౧౨౦ ॥ అజైకపాదహిర్బుధ్న స్త్వష్టారుద్రశ్చబుద్ధిమాన్ ।త్వష్టుశ్చాప్యాత్మజః పుత్రోవిశ్వరూపోమహాతపాః॥౧౨౧॥" అని వ్రాయఁబడియుండెను. ఇట్లుండుటచే నన్వయశుద్ధిగనిపింపలేదు. ప్రభాసుని భార్యయగు యోగసిద్ధయందు విశ్వకర్మ ప్రజాపతిపుట్టెను. ఏవిశ్వకర్మ సమస్తదేవాదులకు విమానములను జేసి యిచ్చెనో, ఏమహాత్మునియొక్క శిల్పమునుగూర్చి మనుష్యులు జీవించుచున్నారో, అను నర్థమగుచు అజైకపాత్తు, అహిర్బుధ్నుఁడు, త్వష్ట, బుద్ధిమంతుఁడగు రుద్రుఁడునని చెప్పుటచే నన్వయశుద్ధికి దూరమగుచున్నది. ఇందునకు శ్రీధరీయవ్యాఖ్యయందలి "తస్యాంబృహస్పతేర్భగిన్యాం అజైకపాదాదయశ్చత్వారోజజ్ఞిరే" అనువాక్యముచే నాబృహస్పతి సోదరియందు నజైకపాదాదులు నలుగురుపుట్టిరని సమర్థింపఁబడినను, యోగసిద్ధకు విశ్వకర్మయు నజైకపాదాదులు నలువురును బుట్టియుండవలసివచ్చును, విశ్వకర్మయుఁ ద్వష్టయు సహోదరులగుట యత్యంతమృగ్యము. ఇఁక వెన్నెలగంటి సూరనార్యునిచే నాంధ్రీకరింపఁబడిన విష్ణుపురాణమునందు "ప్రభాసునకు, బృహస్పతిచెలియలైనయోగసిద్ధకు, విశ్వకర్ముండుపుట్టె. వసంతతిలకావృత్తము ॥ ఆవిశ్వకర్మసముదంచిత శిల్పవిద్యా । ప్రావీణ్యతంద్రిదశపట్టణతక్షుఁడై । భావంబునందు బహుభంగులనేమియైనన్ । గావించుచుండుఁ దనకౌశలముల్లసిల్లన్ ॥ వ॥ అట్టివిశ్వకర్మ ప్రజాపతికిఁద్వష్టపుట్టె. వానికి మహాతపోధనుండైన విశ్వరూపుఁడుపుట్టె" ననియుండుటచే విశ్వకర్మ కుమారుఁడు త్వష్టయగుట స్పష్టమగుచున్నది. సూరనార్యునికి లభించిన సంస్కృత విష్ణుపురాణమూలప్రతియె రథకారాధికరణవిచారగ్రంథకర్తకుఁగూడ లభించినటుల వారిగ్రంథమం దుదాహరింపఁబడిన "శ్లో॥ ప్రభావసోస్తుభార్యాయాంవసూనామష్టమస్యహ।విశ్వకర్మామహాభాగోజజ్ఞేశిల్పిప్రజాపతిః ॥ కర్తాశిల్పసహస్రాణాం త్రిదశానాంచవర్ధకిః । భూషణానాంచసర్వేషాం కర్తా

తా॥ బృహస్పతియొక్క సహోదరి యోగసిద్ధయనునామె బ్రహ్మచారిణి యు సంగరహితయునై లోకమంతటను సంచరించెను. అమ్మహాభాగ వసువులలో నష్టముఁడగు ప్రభాసునకుఁ గళత్రమయ్యెను. ఆవరవర్ణినియందు నిర్మలమనస్కుఁడును, అనంతశిల్పులకుఁ గర్తయును, వేల్పులకు శిల్పనిర్మాతయు, సమస్త భూషణముల నొనర్పువాఁడును, శిల్పివర్యుఁడు, నగు విశ్వకర్మయను ప్రజాపతి పుట్టెను. ఏమహామహుఁడు సమస్తదేవాదులకు వ్యోమయానము లొనర్చి యిచ్చెనో, ఏ మహాత్మునియొక్క శిల్పమువలన మనుష్యులు జీవించుచున్నారో, ఆశిల్పివరేణ్యునకు, అజైకపాత్తు, అహిర్బుధ్నుఁడు, త్వష్ట, బుద్ధిమంతుఁడగు రుద్రుఁడు, నను నలువురు కొమరులు గలరు. వారిలోఁ ద్వష్టకు శ్రీమంతుఁడును, మహాతపస్వియు, నగు విశ్వరూపుఁడు పుత్త్రుఁడుగా నుదయించెను. ఇట్లు నుడువఁబడియుండుటచే విశ్వకర్మకుఁ ద్వష్టయుఁ, ద్వష్టకు విశ్వరూపుఁడును, గుమారులైనటుల విశదమగుచున్నది. మఱియు:—

శ్లో॥ అథైషాం దేవతాః పంచవిశ్వకర్మముఖోద్భవాః
మనుర్మయ స్తథాత్వష్టా శిల్పికశ్చతథైవచ
దైవజ్ఞః పంచమః ప్రోక్తాస్స్వర్గస్థాయజ్ఞపోషకాః ॥

శైవాగమము పంచాలబ్రాహ్మణోత్పత్తి ప్రకరణము.

తా॥ విశ్వకర్మ ముఖోద్భవులగు మనుమయ త్వష్టశిల్పి దైవజ్ఞులను నేగురు దేవతలు స్వర్గస్థానముననుండి యజ్ఞములను బోషించుచుందురనియు,

శ్లో॥ మనుర్మయ స్తథాత్వష్టా శిల్పీవిశ్వజ్ఞఇత్యపి
విశ్వకర్మసుతాహ్యేతే పంచసృష్టి ప్రవర్తకాః ॥

స్కందపురాణ నాగరఖండ విశ్వకర్మోపాఖ్యానము
త్రయోదశాధ్యాయము.

తా॥ మనువు, మయుఁడు, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞుఁడు, నను నైదుగురు విశ్వకర్మ కుమారులు సృష్టిప్రవర్తనయందుండెడివారలనియు,

---

శిల్పవతాంవరః ॥ యస్సర్వాసాంవిమానానిదేవతానాంచకారహ । మనుష్యాశ్చోపజీవంతి యస్యశిల్పం మహాత్మనః ॥ అవిజ్ఞాతగతి స్త్వష్టాపుత్రో వైవిశ్వకర్మణః । త్వష్టుశ్చాప్యాత్మజశ్శ్రీమాన్ విశ్వరూపోమహాతపాః॥" అను శ్లోకపంక్తవలనఁదెలియవచ్చినది. పాఠభేదములెన్నియుండినను బూర్వాపరసందర్భములను జక్కఁగా విచారించితిమేని విష్ణుపురాణవచనమున 'విశ్వకర్మకుమారుఁడు త్వష్టయగుట నిశ్చితముగాక మానదు'

శ్లో॥ భూత్వాఽథపురుషాఽకారోవిశ్వకర్మాది పూరుషః
ప్రతీకేష్వసృజద్దేవాన్ విశ్వోత్పత్తిచికీర్షయా ॥ ౭॥
ముఖేభ్యో బ్రహ్మణః పంచజాతామన్వాదయః క్రమాత్
మనుర్మయశ్చత్వష్టాచ శిల్పీవిశ్వజ్ఞఏవచ ॥ ౮॥
విశ్వకర్మపురాణము ౫ అధ్యాయము

తా॥ ఆదిపూరుషుఁడైన విశ్వకర్మ పురుషాకారుఁడై జగదుత్పత్తిజేయు
చ్చచే నంగములయందు దేవతలను సృజించెను. అట్లె క్రమముగా ముఖమువలన
నుమయత్వష్టృశిల్పి విశ్వజ్ఞులను నేగురిని సృజించెను. అనిచెప్పియుండుటయేగాక.

శ్లో॥ యత్కించిద్ద్విజసంభూతం భూతజాతం చతుర్విధమ్ ॥ ౨౬॥
తస్యసర్వస్య సంస్థానం మనుర్ఘటయతిస్వయం
మానవోభూత సంఘోయం శాస్త్రదృష్ట్యా చతుర్విధః ॥ ౨౭॥
మానవత్వం నరేషూక్తం శ్రేష్ఠత్వాన్మనుసంతతౌ (ఇతి మనుకృత్యం)
యత్కించి దింద్రజాలాది మూఢదృష్ట్యైవవర్తతే ॥ ౨౮॥

తత్వతః సర్వథానాస్తి సామాయామయనిర్మితా
నసత్యత్వం మానవ వన్నమృషామయశిల్పవత్ ॥ ౨౯॥
ఘనేఘనేచయచ్చిత్రం నానారూపాకృతిక్రియం (ఇతిమయః)
ఖచరం సర్వగం యచ్చవిశేదపి శిలోదరం ॥ 30॥
ఘనాత్స్థూలం ఘనాత్సూక్ష్మం ఘనాల్లఘుగురుఘనాత్
తత్త్వష్టృనిర్మితం విద్యాద్దివ్యం బ్రహ్మసభాదికమ్ (ఇతిత్వష్టా)॥ 3౧॥
ఉత్కీర్యదారుదృషదం మూర్తిముద్ధరతేతుయః
సతక్షాఖ్మాతలేయేన కృతంపాతాలసప్తకమ్ (ఇతితక్షా)॥ 3౨॥
శిల్పినస్త్రివిధం శిల్పం మృత్స్నధాతూపధాతుజం
మృణ్మయం ద్వివిధం తత్రలేప్యం లేఖ్యంచభామిని ॥ 33॥
అకుప్యం కుప్యజంచైవ ధాతుజం ద్వివిధం మతం
అకుప్యం స్వర్ణరౌప్యాది తామ్రలోహాదికంపరం ॥ 3౪॥
ఉపధాతు భవమపి కుప్యాకుప్యాభిధం ద్వయం
కుప్యంకాచాదిజం శిల్పమకుప్యం పారదాదికం॥ 3౫॥
తార్ణవంతాంతవంచాపి పటవస్త్రాదికంతుయత్
ఉపశిల్పంతుతజ్జ్ఞేయం శిల్పివర్యైః పరివర్తితమ్ ॥ 3౬॥

ఏవంనానావిధం శిల్పం ద్వారకాయాం ప్రకాశితం
మనుప్రభృతిభిర్భ ద్రైః పంచభిర్విశ్వకర్మజైః॥ 321

పద్మపురాణము భూఖండము.

తా॥ ద్విజులచే గావింపఁబడు చతుర్విధ భూతసముదాయము నేకొంచెమైనను నదంతియు మనువుచేయుచున్నాఁడు. శాస్త్రదృష్టిచేఁ జతుర్విధమగు నీ భూతసముదాయమంతయు మనుసంబంధమైనదే. మనుసంతతియందు శ్రేష్ఠమగుట వలన నరులయందు మానవత్వము చెప్పఁబడినది. (ఇది మనువుచేఁ జేయఁబడిన కార్యము) మూఢదృష్టిచే నింద్రజాలాది క్రియలేవి కలవో యవియన్నియుఁ దత్వమువలనఁ గలుగవు. అదంతయు మయునిచే నిర్మితమైనదే. ఇదెల్లయు మానవము (మనుకల్పితము) వలె సత్యమగుటగాదు. మయశిల్పమువలె నబద్ధమగునదియుఁ గాదు. క్షణక్షణము సమస్తాకారముల వికృతిఁబొందు చిత్రమెయ్యదియో యదంతయు మయకల్పితమే. (ఇది మయునికార్యము) ఆకసమున సంచరించునదియు సర్వవ్యాపకమైనదియు, శిలాగర్భముననున్నదియు, క్షణమునకు గొప్పదిగను, క్షణమునకుసూక్ష్మముగను, క్షణమునకుఁ దేలికగను, క్షణమునకుబరువుగను, నుండునదెయ్యదియోయదంతయును, దేవతాసంబంధమైనసభ మున్నగునదంతయుఁ ద్వష్టచే నిర్మితమగునదిగాఁ దెలిసికొనవలెను. (ఇది త్వష్టయొక్కశిల్పము) దారువులను శిలలను భేదించి దేవతామూర్తులను నెవ్వఁడు సృజించునో, యెవ్వనిచే సప్తపాతాళలోకములు గల్పింపఁబడెనో యమ్మహాకల్పనాశీలుఁడెతక్షుఁడునాఁబరగు (ఇయ్యదియె తక్షుకల్పనము) శిల్పియొక్క శిల్పము మృత్స్న యనియు, ధాతువనియు, నుపధాతుజమనియు, మూడువిధములుగలది. వానిలో మృణ్మయశిల్పము లేప్యమనియు లేఖ్యమనియు, రెండువిధములు. కుప్యాకుప్యభేదములచే ధాతుజశిల్పము ద్వివిధముగాఁ బరఁగు. ఆ రెంటిలో స్వర్ణరౌప్యాదిక మకుప్యమనియుఁ, దామ్రలోహాదికముకుప్యమనియు, నిరుభేదములవఱలు. కుప్యాకుప్య భేదములచే నుపధాతుజశిల్పముగూడ వెలయు. వానిలోఁ గాచాదికము (గాజుమున్నగునది) కుప్యనామమునను, పారదాదికము (పాదరసము మున్నగునది) అకుప్యనామమునను, విలసిల్లు. మఱియు నుపధాతుశిల్పము తృణ సంబంధమైనదియు, నూలుతోఁ జేయునదియు, బటవస్త్రాదికములునగును. ఇదంతయు శిల్పివర్యులచేఁ బ్రవర్తింపఁబడుచున్నది. (ఇయ్యది శిల్పికృత్యము) ఇట్లు నానావిధములగు శిల్పములన్నియు మనుమయత్వష్ట శిల్పితక్షులను నేగురు విశ్వకర్మకుమారులచే ద్వారకాపురమునఁ బ్రకాశింపఁబడును

అనినుడివియుండుటచేతను, ఉదాహరిష్యమాణ శిల్పకాండాంతర్గత పంచబ్రహ్మో పనిషత్తువలనను, మూలస్తంభపురాణోక్తివలనను, మఱికొన్ని పురాణవాక్యముల వలనను, విశ్వకర్మకుఁ ద్వష్ట కుమారుఁడగుటయేకాక త్వష్టయను కుమారునితోఁ బాటు నింక నలువురు కుమారులు గలరనియుఁ దెలియుచున్నది.

—•త్వష్టకుఁ బుత్త్రసంతానము•—

పూర్వోక్త విష్ణుపురాణమున విశ్వకర్మకుమారుఁడు త్వష్టయనియు, ద్వష్ట్ర కుమారుఁడు విశ్వరూపుఁడనియుఁ జెప్పఁబడియుండెను. ఇట్లుగాక—

శ్లో॥ త్రిశిరా విశ్వరూపస్తుత్వష్టుః పుత్త్రోఽభవన్మహాన్
విశ్వరూపానుజశ్చాఽపి విశ్వకర్మా ప్రజాపతిః ॥ ౮౫॥

వాయుపురాణ చతుర్థాధ్యాయము.

తా॥ మహాత్ముఁడును, మూడుశిరస్సులుగలవాఁడు, నగు విశ్వరూపుఁడు త్వష్ట్రప్రజాపతికిఁ బుత్త్రుఁడయ్యెను. విశ్వరూపున కనుజుఁడగు విశ్వకర్మయుఁ బ్రజాపతినాఁ బరసిల్లె. అని చెప్పియుండుటవలనను, బూర్వోక్తమగు.

శ్లో॥ విశ్వకర్మాఽభవత్పూర్వం బ్రహ్మణ స్త్వపరాతనుః
త్వష్టుః ప్రజాపతేః పుత్త్రోనిపుణస్సర్వకర్మసు ॥

అను స్కందపురాణ కాశీఖండవచనము వలనను, మఱికొన్ని పురాణవచనముల వలనను, విశ్వకర్మకుమారుఁడగు, త్వష్ట్రప్రజాపతికి విశ్వరూప విశ్వకర్మలను కుమారు లిరువురు గలుగుటయు "అశేషశిల్పాచార్య స్త్వష్టా" అను మున్నగు విష్ణుపురాణాది వచనములవలనను, ద్వష్ట్రప్రజాపతి విశ్వకర్మవలన సాక్షాత్కరించి సర్వశిల్పసృష్టియు, సర్వరూపసృష్టియు, సర్వప్రజాసృష్టియు, నొనర్చి యజ్ఞాదుల యందు హవిర్దానముల స్వీకరించుచు దేవపురోహితులగు విశ్వరూప విశ్వకర్మాదులగు సంతానమును గాంచి లోకాభివృద్ధి గావించెనని నిగమాగమ పురాణాదులు ఘోషించుచున్నవి.

శ్లో॥ శ్రీవిశ్వకర్మ బ్రాహ్మణ్యవంశాగమ కృతావితి
ఉపకాండ స్త్వష్టురయం వైశ్వకర్మణమధ్యగః ॥

ఓం తత్సత్

———

ఓ మ్.

శ్రీమద్దేవాచార్యాయనమః

# విశ్వకర్మ బ్రాహ్మణవంశాగమము.

## విశ్వకర్మకాండీయ విశ్వరూపోపకాండము.

### —♦ విశ్వరూపుని సురాచార్యత్వము ♦—

(1) శ్రుతి॥ విశ్వరూపో వై త్వాష్ట్రః పురోహితో దేవానామాసీత్ ॥

కృష్ణయజుః కాం ౨. ౫. ౧.

ఈయాజుష వచనమువలనఁ ద్వష్ట్రకుమారుఁడైన విశ్వరూపుఁడు దేవతలకుఁ బురోహితుఁ డయ్యెనని తెలియవచ్చినది. ఈయుదంతమె శ్రీమద్భాగవతమున నిట్లు నుడువఁబడియున్నది.

రాజా, శ్లో॥ కస్యహేతోః పరిత్యక్తా ఆచార్యేణాత్మనస్సురాః
ఏతదాచక్ష్వభగవన్ శిష్యాణామక్రమంగురౌ ॥ ౧

శ్రీశుకః, ఇంద్రస్త్రిభువనైశ్వర్య మదోల్లంఘితసత్పథః
మరుద్భిర్వసుభీరుద్రై రాదిత్యైరృషిభిర్నృప ॥ ౨

విశ్వేదేవైశ్చసాధ్యైశ్చ నాసత్యాభ్యాం పరిశ్రితః
సిద్ధచారణ గంధర్వై ర్మునిభిర్బ్రహ్మవాదిభిః ॥ ౩

విద్యాధరాప్సరోభిశ్చ కిన్నరైః పతగోరగైః
నిషేవ్యమాణో భగవాం స్తూయమానశ్చభారత ॥ ౪

ఉపగీయమానోలలిత మాస్థానాధ్యాసనాశ్రితః
పాండరేణాతపత్రేణ చంద్రమండలచారుణా ॥ ౫

యుక్తశ్చాన్యైః పారమేష్ఠ్యై శ్చామరవ్యజనాదిభిః
విరాజమానః పౌలోమ్యా సహార్ధాసనయాభృశం ॥ ౬

సయదాపరమాచార్యం దేవానామాత్మనశ్చహ
నాభ్యనందత సంప్రాప్తం ప్రత్యుత్థానాసనాదిభిః ॥ ౭

వాచస్పతిం మునివరం సురాసుర నమస్కృతం
నోచ్చచాలాసనాదింద్రః పశ్యన్నపి సభాగతం ॥ ౮

తతోనిర్గత్యసహసా కవిరాంగిరసః ప్రభుః
ఆయయౌ స్వగృహంతూష్ణీం విద్వాన్ శ్రీమదవిక్రియాం ॥ ౯
తర్హ్యేవప్రతిబుధ్యేంద్రో గురుహేళనమాత్మనః
గర్హయామాససదసి స్వయమాత్మాన మాత్మనా ॥ ౧౦
అహోబతమయాసాధు కృతంవైదభ్రబుద్ధినా
యన్మయైశ్వర్యమత్తేన గురుస్సదసికాత్కృతః ॥ ౧౧
కోగృధ్యేత్పండితోలక్ష్మీం త్రివిష్టపపతేరపి
యయాహమాసురంభావం నీతోద్యవిబుధేశ్వరః ॥ ౧౨
యేపారమేష్ఠ్యంధిషణ మధితిష్ఠన్నకంచన
ప్రత్యుత్తిష్ఠేదితిబ్రూయు ర్ధర్మంతేన విదుఃపరం ॥ ౧౩
తేషాం కుపథదేష్ట్రూణాం పతతాంతమసిహ్యథః
యేశ్రద్ధధ్యుర్వచస్తేవై మజ్జంత్యశ్మప్లవాఇవ॥ ౧౪
అథాహమమరాచార్య మగాధధిషణంద్విజం
ప్రసాదయిష్యేవిశఠ శ్శీర్ష్ణాతచ్చరణంస్పృశన్ ॥ ౧౫

ఏవంచింతయతస్తస్య మఘోనోభగవాన్గృహాత్
బృహస్పతిర్గతోఽదృష్టాం గతిమాధ్యాత్మమాయయా ॥ ౧౬
గురోర్నాధిగతస్సంజ్ఞాం పరీక్ష్యభగవాన్ స్వరాట్
ధ్యాయన్ధియాసురైర్యుక్త శ్శర్మనాలభతాత్మనః ॥ ౧౭
తచ్ఛ్రుత్వైవాసురాస్సర్వే హ్యాశ్రిత్యౌశనసమ్మతం
దేవాన్ప్రత్యుద్యమంచక్రు ర్దుర్మదాఆతతాయినః ॥ ౧౮
తైర్విసృష్టేషుభిస్తీక్ష్ణై ర్నిర్భిన్నాంగోరుబాహవః
బ్రహ్మాణంశరణంజగ్ము సహేంద్రానతకంధరాః ॥ ౧౯
తాంస్తథాభ్యర్దితాన్వీక్ష్య భగవానాత్మభూరజః
కృపయాపరయాదేవా నువాచపరిసాంత్వయన్ ॥ ౨౦
బ్రహ్మ, అహోబతసురశ్రేష్ఠా హ్యభద్రంవఃకృతంమహత్
బ్రహ్మిష్ఠంబ్రాహ్మణందాంత మైశ్వర్యాన్నాభ్యనందత॥ ౨౧
తస్యాయమనయస్యాసీ త్పరేభ్యోవః పరాభవః
ప్రక్షీణేభ్యస్స్వవైరిభ్య స్సమృద్ధానాంచయత్సురాః ॥ ౨౨
మఘవన్ద్విషతఃపశ్య ప్రక్షీణాన్గుర్వతిక్రమాత్
సంప్రత్యుపచితాన్భూయః కావ్యమారాధ్యభక్తితః ॥ ౨౩

ఆదదీరన్నిలయనం మమాపిభృగుదేవతాః
అధునా దైత్యదైతేయాః కిముతత్రిదశేశ్వరాః ॥ ౨౪
త్రివిష్టపంకింగణయంత్యభేద్య మంత్రాభృగూణామనుశిక్షితార్థాః
నవిప్రగోవిందగవీశ్వరాణాం భవంత్యభద్రాణినరేశ్వరాణాం॥ ౨౫
తద్విశ్వరూపంభజతాశువిప్రం తపస్వినంత్వాష్ట్రిమథాత్మవంతం
సభాజితోఽర్థాన్‌ సవిదాస్యతేవోయదిక్షమధ్వంయదుతాస్యకర్మ॥ ౨౬
తేఏవముదితారాజన్‌ బ్రహ్మణావిగతజ్వరాః
ఋషింత్వాష్ట్రిముపవ్రజ్య పరిష్వజ్యేదమబ్రువన్‌ ॥ ౨౭
దేవాః, వయంతేఽతిథయఃప్రాప్తా ఆశ్రమంభద్రమస్తుతే
కామస్సంపద్యతాంతాత పితౄణాంసమయోచితః ॥ ౨౮
పుత్త్రాణాంచపరోధర్మః పితృశుశ్రూషణంసతాం
అపిపుత్త్రవతాంబ్రహ్మన్‌ కిముతబ్రహ్మచారిణాం ॥ ౨౯
ఆచార్యోబ్రహ్మణోమూర్తిః పితామూర్తిఃప్రజాయతే
భ్రాతామరుత్పతేర్మూర్తి ర్మాతాసాక్షాత్క్షితేస్తనుః ॥ ౩౦
దయాయాభగినీమూర్తి ర్ధర్మస్యాత్మాతిథిస్స్వయం
అగ్నేరభ్యాగతోమూర్తి స్సర్వభూతానిచాత్మనః ॥ ౩౧
తస్మాత్పితౄణామార్తానా మార్తింపరపరాభవం
తపసాపనయంస్తాత సందేశంకర్తుమర్హసి ॥ ౩౨
వృణీమహేత్వోపాధ్యాయం బ్రహ్మిష్ఠంబ్రాహ్మణంగురుం
యథాంజసావిజేష్యామ స్సపత్నాంస్తవతేజసా ॥ ౩౩
నగర్హయంతిహ్యర్థేషు యవిష్ఠాంఘ్ర్యభివందనం
ఛందోభ్యోన్యత్రనబ్రహ్మన్‌ వయోజ్యైష్ఠస్యకారణం॥ ౩౪
శ్రీశుకః, ఇత్యర్థితస్సురగణైః పౌరోహిత్యేమహాతపాః
సవిశ్వరూపస్తానాహ ప్రసహన్‌శ్లక్ష్ణయాగిరా ॥ ౩౫
విశ్వరూపః, విగర్హితంధర్మశీలై ర్బ్రహ్మవర్చఉపవ్యయం
కథంనుమద్విధోనాథో లోకేశైరభియాచితః
ప్రత్యాఖ్యాస్యతితచ్ఛిష్య స్సఏవస్వార్థఉచ్యతే ౩౬
అకించనానాంహిధనంశిలోంఛనం తేనేహనిర్వర్తితసాధుసత్క్రియః
కథంవిగర్హ్యంనుకరోమ్యధీశ్వరాః పౌరోధసంహృష్యతియేనదుర్మతిః॥ ౩౭

తథాపినప్రతిబ్రూయాం గురుభిఃప్రార్థితంకియత్
భవతాంప్రార్థితంసర్వం ప్రాణైరర్థైశ్చసాధయే ॥ ౩౮

శ్రీశుకః, తేభ్యఏవంప్రతిశ్రుత్య విశ్వరూపోమహాతపాః
పౌరోహిత్యంవృతంచక్రే పరమేణసమాధినా ॥ ౩౯

సురద్విషాం శ్రియంగుప్తా మౌశనస్యాపివిద్యయా
ఆచ్ఛిద్యాదాన్మహేంద్రాయ వైష్ణవ్యావిద్యయావిభుః ॥ ౪౦

యయాగుప్తసహస్రాక్షో జిగ్యేఽసురచమూర్విభుః
తాంప్రాహసమహేంద్రాయ విశ్వరూపఉదారధీః ॥ ౪౧

శ్రీమద్భాగవతే షష్ఠస్కంధే సప్తమోఽధ్యాయః

తా॥ పరీక్షిన్నరేంద్రుఁడు శుకయోగీంద్రుం గని స్వామీ! సురాచార్యుఁడు సురల నేలకోపించె నతనివలన దేవతలకేమి యాపదగలిగె నెఱిఁగింపుఁ డన శుకయోగీంద్రుఁ డిట్లనియె. దివంబునందొకదినంబున బ్రహ్మర్షి మరుద్వసురుద్రాదిత్యాశ్వినేయ గరుడసిద్ధసాధ్యచారణవిద్యాధర గంధర్వాప్సరోంగనలు పరివేష్టించి కొలువ ఛత్త్రచామరాది రాజచిహ్నంబులఁ బూని పరివారంబు నిలువఁ బౌలోమీయుతుండగు మహేంద్రుఁడు చింతామణీ భద్రసింహాసనాసీనుండై మంత్రియు, బ్రహ్మణ్యుండును, నాచార్యుండు, నగు వాచస్పతి యాసుధర్మకరుదేరం గాంచి స్వారాజ్యవైభవంబున దేవగణసహితుండై పీఠంబుడిగ్గి ప్రత్యుత్థానంబు సేయకయుదాసీనుండుగా నాదేవగురుండు నిర్జరేశ్వరుని యపార శ్రీమదవిక్రియంబు గ్రహించి మిన్నక స్వావాసమునకుంజనియె. అనంతర మాపాకశాసనుండా గర్వభావంబు దొఱంగి హా! దేవసామ్రాజ్య వర్ధిష్యమాణ పర్యాలోచన పరుండు గురుండు రా మతిహీనుఁడనై పరిభవించి దురితభరితుండనైతి. పారమేష్ఠ్యమైన మైశ్వర్యము నొందిన రాజు లేరింగాంచినను సింహాసనమునుండి లేవఁగూడదను విబుధధర్మము నవలంబించిన కుపథవర్తులు రాతితెప్పగతి నధోగతి పాలగుదురు. కనుక లోకవంద్యుండగు నస్మదాచార్యుని పదపద్మంబులకు నమస్కరించి తదనుగ్రహంబునకుఁ బాత్రుఁడ నగుదునని గురుమందిరంబున కరుగ నతఁ డధ్యాత్మవిద్యాప్రభావ తిరోహితుండగుడు మహేంద్రుఁ డెల్లెడఁ బరికించి యమ్మహాత్మునిఁ గానక చింతాకులస్వాంతుఁడై నిజనిలయంబునకేఁగె. ఈసమాచారమంతయుఁ దెలిసికొని దైతేయులు భార్గవమంత్రబలంబునఁ ద్రివిష్టపంబు ముట్టడించి వాసవప్రముఖాదితేయులఁ బాఱఁద్రోలి సురరాజ్యం బపహరింప, విసృష్టదారుణ సమర

లగు నమరులు సత్యలోకమునకుఁ జని జగన్నిర్మాణచతురుండగు చతురాస్యుని దర్శించి సాష్టాంగదండప్రణామంబు లాచరించి రాక్షసులవలనఁ గలిగిన విపదుదంతంబు సాంతంబు వచించి పాలింపవేయుని ప్రార్థింప నాశతానందుఁ డనుకంపాతిశయ విభవంబున నభయం బొసంగి యిట్లనియె. అమరులారా! ఐశ్వర్యమదంబున బ్రహ్మిష్ఠుండైన బ్రాహ్మణు నాచార్యుం గైకొనక గురుద్రోహంబు సేయుట వలన మీరు బలవంతులయ్యు నల్పులగు దైత్యులచేఁ బరాజితులైతిరి. అని యింద్రునుద్దేశించి ఓయీ! నీపగతురఁ జూడుము! తమయాచార్యుండయిన భార్గవు నారాధించి తన్మంత్రిప్రభావంబున లబ్ధవీర్యులై మదీయనిలయంబునైన నాక్రమింపఁగలవారలై మదోద్రేకంబున నెదురులేక వర్తిల్లుచున్నారు. అట్టి రక్షోనాయకులకుఁ ద్రిదివంబనఁ దృణప్రాయంబకదా? గురుతిరస్కారసత్కారముల యందుఁ గల హాని వృద్ధులఁ గనుఁగొంటివా? విప్రగోవిందగవేశ్వరానుగ్రహ పాత్రులకుఁ దక్క తక్కిన వారలకరిష్టంబగుఁ గాన మీరిప్పుడు బ్రాహ్మణుండును, నిశ్చలతపోమహత్త్వసత్త్వస్వభావుండును, త్వష్టృపుత్రుండు, నగు విశ్వరూపాచార్యు నారాధించిన నతండు మీయభీష్టార్థంబు లొనఁగూర్చి మెట్టి దుర్దశలనైన నడంచు ననివచింప నిందాదులు చింతదక్కి యా యుత్తమ తపస్వికడకుం జని బాబూ! నిన్ను యాచింపఁగోరి నేఁడిటకు వచ్చినారము. పితరులమైన మమ్ముఁ గనికరించి సమయోచితంబులైన కోర్కులొడఁగూరిచి కీర్తిసంపాదించుకొనుము. నీకు శుభమగుఁగాక, సుతులకు బితృశుశ్రూషణ మనంతపుణ్యదాయకము. బ్రహ్మచారులకైనను గురుసేవకన్న వేఱొకటియుండదు. మఱియు నాచార్యుండు పరతత్త్వరూపము, తండ్రి బ్రహ్మరూపము, సహోదరుఁ డింద్రరూపము, తల్లి భూదేవిరూపము, తోఁబుట్టువు కరుణరూపము, భావమ ధర్మస్వరూపము, అతిథియు నభ్యాగతుఁడు నగ్నిరూపము, సర్వభూతములు కేశవరూపము. కావున మాయెడ నీపితృభక్తియు, సార్థరక్షణ పరాయణత్వముఁ జూపి యనుపమానమగు నీతపోమహిమచే మాభయంబుఁ దొలగించిమమ్ముల బ్రతికింపుము. ఏనీబ్రహ్మతేజంబున సత్వరంబుగ, నరివీరుల జయింపఁగలుగుదుమో బ్రహ్మకులోత్పన్నుఁడవు, జ్ఞానపూర్ణుఁడవు, మంత్రోపదేశసమర్థుఁడ, వట్టినిన్నాచార్యునిగ వరింపఁగోరివచ్చితిమి. వేదేతరవిషయములలో వయసుజ్యేష్ఠత్వముగాని వేదవిహితవిషయములలో వయస్సుజ్యేష్ఠత్వముగాదు. కాన విద్యాజ్ఞాన తపోజ్యేష్ఠుఁడవగు నీకభివాదనమొనర్చుట గర్హ్యంబుగాదు. వందనంబులం గొని మాకోరిన యాచార్యత్వమంగీకరింపుఁడని వేడ, మహాతపశ్శాలియగు వి

రూపుఁడు ప్రహసితముఖుండై శిష్టగర్హ్యంబును, బ్రహ్మవర్చోవ్యయంబగు నిట్టిప్రార్థ నంబున కేలయనుమతింతునని తనలోమాద్యశులకడకు ననిమిషు లతిథులుగనరుదేర వీరల కష్టంబులుడుపకుండుట పాడియే? అదియట్లుండఁ బౌరోహిత్య సంప్రాప్తధన ముధర్మంబునొడఁగూర్చినను ధర్మార్జనమునకిదియే ముఖ్యమార్గముకాదు. పుడమి యందకించనులు శిలోంఛవృత్తిచే నర్థంబుగడించి సాధుసత్క్రియలునిర్వర్తించుచుం డుట ప్రసిద్ధంబకదా! ఏదియెట్లున్నను బెద్దలయభిమతంబు నెఱవేర్చుటకర్తవ్యంబని కృతనిశ్చయుఁడై సుమనశ్చయంబు నుపలక్షించి యన్నలారా! మీప్రార్థనంబుఁ ద్రోసిపుచ్చఁజాలక సజ్జనగర్హితాచారమైన యాచార్యత్వమిప్పుడు స్వీకరించితి నాశక్తివంచనములేక మీకోరినయర్థంబు సాధించెద, నని వారల నూఱడించి సురాచార్యుండై పరమసమాధిఁదేజరిల్లి శుక్రమంత్ర ప్రభావసురక్షితమగు దనుజ వీరులమహైశ్వర్యం బనర్గళముగ సంపాదించి యయ్యింద్రున కొసంగి యేమహా మంత్రప్రభావమున సురపతి యరాతివర్గముజయింపఁగల్గునోయట్టి శ్రీమన్నారాయ ణకవచంబు సమంత్రకముగ నుపదేశింపఁ దత్ప్రభావబలంబునఁ ద్రివిష్టపాధీశుఁ డవ లీలనాదైతేయుల నిర్జించె నిది శ్రీమదాంధ్రమహాభాగవతమునందలి షష్ఠస్కంధమున సప్తమాధ్యాయము.

ఇట్లు వేదపురాణములు చెప్పుచుండుటవలన మహామహుఁడగు విశ్వరూపా చార్యుని యుత్కృష్టవంశసంభవత్వమును, విధేయతాసామర్థ్యమును, దపఃప్రభావము ను, నారాయణకవచాద్యుత్తమ శిల్పరచనాకౌశల్యమును బ్రసన్నమగుచున్నది.

శ్రీవిశ్వకర్మబ్రాహ్మణ్య నంశాగమకృతావితి
విశ్వరూపోపకాండోఽయం వైశ్వకర్మణమధ్యగః ॥

ఓం తత్సత్



# ఓమ్.

శ్రీమత్సర్వశిల్పాధిపతయేనమః

# విశ్వకర్మబ్రాహ్మణవంశాగమము.



## శిల్పకాండము.

### — ♦ శిల్పము ♦ —

(1) శ్రు॥ యేభిశ్శిల్పైః పప్రథానామదృగ్ంహత్ । యేభిర్ద్యామభ్యపిగ్ంశత్ప్ర జాపతిః । యేభిర్వాచం విశ్వరూపాగ్ం సమవ్యయత్ । తేనేమమ గ్నఇహవర్చసాసమంధి ॥

తై. బ్రా. అ ౨. ప్ర ౮ అ ౨౫ ద ౨.

సా. భా॥ ప్రజాపతిః యేభిశ్శిల్పైఃయైః కర్మకౌశలైః పప్రథానాం విస్తారయుక్తామిమాం పృథివీం అదృంహత్ దృఢీకృతవాన్ । తథా యేభిః కర్మకౌశలైః ద్యాం ద్యులోకం అభ్యపింశత్ అభితశ్చంద్ర తారకాదిభిః సురూపమకరోత్ । తథా యేభిః కర్మకౌశలైః వాచం ఇమ ముచ్చార్యమాణాం విశ్వరూపాం నానా పదార్థవాచకత్వేనానేక రూపాం సమవ్యయత్ సమ్యక్సంపాదితవాన్ తేన తథావిధ కౌశలజాలేన వర్చసాతద్యోగేన బలేనచ హే అగ్నే ఇమమ్ రాజానం ఇహఇహలోకే సమంధి సమృద్ధంకురు తథావిధసామర్థ్యేన సంయోజయేత్యర్థః.

తా॥ ఈశ్రుతి రాజ్యాభిషేకసమయమునం దాచార్యుఁడు చెప్పునది. ప్రజాపతి (అనఁగా విశ్వకర్మ. "ప్రజాపతిర్విశ్వకర్మా మనోగంధర్వః" అను యజుర్వాక్యమువలనను, "విశ్వకర్మా భవత్ప్రజాపతిః" అను నైతరేయ బ్రాహ్మణ వచనమువలనను, "విశ్వకర్మామహాభాగ స్తస్యాం జజ్ఞేప్రజాపతిః" అను భారతాది పర్వవచనమువలనను) విశ్వకర్మయగు, నట్టివిశ్వకర్మ బ్రహ్మర్షియే శిల్పకౌశలమువలన సవిస్తరమైన యీభూమిని బలమైనదానినిగాఁ జేసెనో యెట్టి క్రియాకౌశలముచేత నాకాశమును నంతటఁ జంద్రతారకాదులచేఁ జక్కని రూపముగల దానినిగా జేసెనో మఱియు నెట్టికలానైపుణిచే సమస్తపదార్థముల పలుకుబడి గలదగుటచే ననేకరూపమైన వాక్కును సంపాదించెనో యట్టి కలాకౌశల జాలముచేత నా నేర్పరితనముతోఁ గూడిన బలము చేత నో యగ్నీ! యీ రాజును

నీలోకమున సమృద్ధివంతునిగాఁజేయుము. అట్టిసామర్థ్యముతో సమకూర్చుము. అని చెప్పుటచే శిల్పమన భూలోకద్యులోకములను బలవంతముగను దేజోవంతముగ నొనర్చి రూపక్రియావికారముల నుచ్చరించు వాఙ్మయమునుగూడఁ గల్పించునది యై కన్పట్టుచున్నది. మఱియునింకొకచోట:—

(౨) శ్రు॥ యత్తే శిల్పంకశ్యపరోచనావత్ । ఇంద్రియావత్పుష్కలంచిత్రభాను । యస్మిన్ సూర్యా అర్పితాస్సప్తసాకమ్ । తస్మిన్ రాజానమధివిశ్వయేమమ్.

తై. బ్రా. అ౧ ప్ర౭ అ౧౫ ద౩.

భాష్యమ్॥ హేకశ్యపాఖ్యప్రజాపతే! తేతవశిల్పం కర్మకౌశలమ్ రోచనావత్ దీప్తిమత్ ఇంద్రియావత్ వీర్యోపేతం పుష్కలంసంపూర్ణం చిత్రభానువిచిత్రత్వే నభాసమానం కించ యస్మిన్ త్వదీయేశిల్పేసప్తసంఖ్యాకాః సూర్యాఃసాకం అర్పితాః సహావస్థితాఃతేచసప్తసూర్యాః అరణ్యకాండే అరోగోభ్రాజ ఇత్యనువాకేప్రపంచితాః । తస్మిన్ శిల్పేఇమంరాజానం అధిశ్రయ అధికత్వేన ఆశ్రితంకురు.

తా॥ ఐతరేయబ్రాహ్మణమునందలి "కశ్యపోవిశ్వకర్మాణం భావనమభిషిషేచ" అను వాక్యమననుసరించియు, స్కందపురాణనాగరఖండ విశ్వకర్మోపాఖ్యానమందలి "కశ్యపోవిశ్వకర్మాచ విశ్వలోక పితామహః" అను వచనమువలనను విశ్వకర్మాంశమున నవతరించిన కశ్యపబ్రహ్మర్షి తన శిల్పకౌశలమువలన నసంఖ్యాకప్రజానిర్మాణ మొనర్చి ప్రజాపతినామమును వహించెను. కశ్యపుఁడను పేరుగల యోప్రజాపతీ! నీశిల్పకౌశలము కాంతివంతమైనదియు, వీర్యముతోఁగూడికొన్నదియు, సంపూర్ణమగునదియు, చిత్రవిచిత్రములుగాఁ బ్రకాశించునదియునగును. అట్టినీశిల్పమునందు సప్తసంఖ్యాకులైన సూర్యులుగూడి నిలిచియున్నారు. అట్టిశిల్పమునం దీరాజును మిక్కిలిగా నాశ్రితునిఁ జేయుము. అని చెప్పుటచే విశ్వకర్మ కశ్యపాదిబ్రహ్మర్షులు శిల్పకలాకౌశలురై లోకనిర్మాణ చాతురీగరిమ నవధరించిన టులఁ దెలియుచున్నది. ఇఁక శిల్పమనినఁ ద్రిలోకవస్తునిర్మాణము. దానినిగూర్చి

(౩) శ్రుతిః॥ శిల్పానిశంసంతి దేవశిల్పాన్యేతేషాం వైశిల్పానామనుకృతీహ శిల్పమధిగమ్యతే హస్తీకంసోవాసో హిరణ్య మశ్వతరీరథః శిల్పం శిల్పంహాస్మిన్నధిగమ్యతే యఏవంవేదయదేవశిల్పాని ఆత్మసంస్కృతిర్వావ శిల్పాని ఛందోమయంవా ఏతైర్యజమాన ఆత్మానంసంస్కురుతే.

ఋగ్వేదీయైతరేయబ్రాహ్మణపం ౬ ఖం ౨౦ అధ్యాయ ౫.

భాష్యం॥ శిల్పత్వంలౌకికనిదర్శనేన ప్రశంసతి శిల్పశబ్దశ్చాఽశ్చర్యకరం క బ్రూతే । తచ్చశిల్పం ద్వివిధం దేవశిల్పం మానుషశిల్పంచేతి నాభానేది ష్ఠాదీ యాని శిల్పాని సంతి తాని దేవానాం ప్రీతిహేతుత్వా ద్దేవశిల్పానీత్యుచ్యంతే ఏతేషామేవ దేవశిల్పానా మనుకృతి సదృశరూప మిహమనుష్యలో శిల్పమధిగమ్యతే, ప్రతీయతే, హస్తీత్యాదినా తదేవోదాహ్రియతే । లో శిల్పినః కర్మకారామృద్దార్వాదిభి ర్హస్తసదృశమాకారం నిర్మిమతే తథాన్యైః శి భిః కంసోదర్పణాది నిర్మీయతే । అపరైర్వాసో వివిధం నిర్మీయతే, గర్దభ్యామశ్వా దుత్పన్నాఽశ్వతరజాతి స్తద్యుక్తో రథోఽశ్వతరీరథః । తదేతత్సర్వ మస్మాభిరధిగమ మానం మానుషశిల్పమేతద్దృష్ట్వానాభానేదిష్ఠాది శిల్పమాశ్చర్య కరమితి ని తవ్యమ్। వేదనం ప్రశంసతి అస్మిన్వేదితరిశిల్పం కౌశలం నానావిధం ప్రాప్యతే సా నాసికప్లుతేన శిల్పానాం పూజ్యత్వం దర్శయతి యస్మాన్నాభానేదిష్ఠాదీని శిల్పశ వాచ్యాని తస్మాత్సువర్ణాభరణాది వత్పూజ్యానీత్యర్థః.

ప్రకారాంతరేణ శిల్పాని ప్రసంశతి వక్ష్యమాణాని నాభానేదిష్ఠాది శిల్పా న్యాత్మ సంస్కృతి ర్జీవాత్మనః సంస్కారకారణాని । తస్మాదేతైర్యజమానో జీవా త్మానం ఛందోమయం వేదమయోయథాభవతి తథా సంస్కురుతే.

తా॥ శిల్పధర్మమును లౌకిక నిదర్శనముతో నుగ్గడించుచున్నా శిల్పశబ్దమే యాశ్చర్యమును గలిగించునది. ఆ శిల్పమ దేవశిల్పము మానుషశిల్పము నని రెండువిధములు. నాభానేదిష్ఠాదులైన యేశిల్ప ములుగలవో యయ్యవి దేవతలకుఁ బ్రీతిహేతువు లగుటవలన దేవశిల్పములు చెప్పఁబడుచున్నవి. ఈదేవశిల్పములకు సమానముగా నీమనుష్యలోకమున శిల్ప మొప్పుచున్నది. అదియే యుదాహరింపఁబడుచున్నది. లోకమునందు ( గర్మకా లగు శిల్పులు మృత్తు, దారువు, మున్నగువానిచే హస్తమువంటి యాకృతిని నిర్మిం చుచున్నారు. మఱికొందఱు కంచము నద్దమును సృజించుచున్నారు. ఇంకఁగొందఱచే వస్త్రాదులు సృష్టింపఁబడుచున్నవి. గర్దభియందు నశ్వమువలనఁ బుట్టినది యశ్వ రమనఁ బడును. మాచేఁ జెప్పఁ బడినది. యిదియంతయు మానుషశిల్పము. దీని జూచి నాభానేదిష్ఠాదిశిల్ప మాశ్చర్యకరమని నిశ్చయింపఁ బడినది. ఇదితెలి సికొనఁగా శిల్పకౌశలము నానావిధములుగఁ దెలియుచున్నది. అను నాసికముతో గూడిన ప్లుతవర్ణముచే శిల్పములకుఁ బూజ్యతఁజూపుచున్నది. ఎందుచే నాభానే ష్ఠాదులు శిల్పములుగఁ జెప్పఁబడినవో యందుచే సువర్ణాభరణాదులవలె శిల్పము లుపూజింపఁదగినవని యర్థమగుచున్నవి.

మఱియొకప్రకారముగా శిల్పములను గొనియాడుచున్నాఁడు. ముందుఁజెప్పఁబోవు నాభానేదిష్ఠాదిశిల్పములు జీవాత్మకు సంస్కారకారణములు. అందువలన నీశిల్పములచే యజమానుఁడు జీవాత్మను వేదమయమగునట్లుగా సంస్కరించుచున్నాఁడు. ఇందులోఁజెప్పఁబడిన నాభానేదిష్ఠాది శిల్పములఁగూర్చి మఱియొకచోటఁ జర్చింపఁబడును. దేవశిల్పము లెయ్యవియని విచారించుదము. దేవతాసంబంధములైన శిల్పములన్నియు దేవశిల్పములే దైవతోపయోగము లెయ్యవియన యజ్ఞకుండ, యజ్ఞవేది, యజ్ఞపాత్ర, దేవాలయ, దేవమూర్తి, దేవోపకరణపాత్ర, సువర్ణాలంకార, రథ, శస్త్రాస్త్రములు మున్నగు సువర్ణ, తామ్ర, లోహ, కాష్ఠ, పాషాణాదులగు పంచవిధములగు శిల్పములు దేవశిల్పములని చెప్పఁబడుచున్నవి. దేవశిల్పములత్యంత పవిత్రవంతములు. దేవశిల్పములవలన బాహ్యాంగములు నంతరంగములుగూడఁ బవిత్రములగును. సప్రమాణములగు నలంకారాదులవలన బాహ్యాంగములు, దేవమూర్తి. యజ్ఞోపకరణాదికరణములవలన నంతరంగములును బవిత్రములగును. స్వర్ణాదిశిల్పకర్మలు కామ్యములే యజ్ఞాదివేదకర్మలు కామ్యములే. మఱియు "యజ్ఞోవైప్రజాపతిః" "ప్రజాపతిర్విశ్వకర్మా" అని వేదవచనములుండుటవలన యజ్ఞమే ప్రజాపతియనియుఁ బ్రజాపతియె విశ్వకర్మయనియుఁదెలియుచున్నది. ఇందుచే యజ్ఞకర్మయన విశ్వసృష్టి కర్మయగుచున్నది. ఇట్లనుటచేత యజ్ఞము శిల్పము నొక్కటియే యించుక యాకృతి భేదము.

## —♦ శిల్పయజ్ఞోపకరణముల సాదృశ్యము. ♦—

అగ్నిహోత్రియు, శిల్పియు, సదృశులు. అగ్నిహోత్రికి నాయతనమను నగ్నికుండ ముండును. శిల్పివరునకు వాగీశ్వరియను నగ్నికుండముండును. యాగాగ్నియందు సమిధలు గోమయపిండముల వేల్చెదరు. శిల్పాగ్నియందు ఖాదిరాంగారములు (చంద్రబొగ్గులు) వేల్చెదరు. యజ్ఞకార్యమున వేణుధమని (వెదురుగొట్టము) నుపయోగించెదరు. శిల్పకార్యమునఁ దామ్రలోహధమనుల నుపయోగించెదరు. యజ్ఞమున మృగచర్మఁపువీవనతో విసరెదరు. శిల్పమునఁ దాళవృంతమున వీచెదరు. యజ్ఞక్రియలఁ బ్రణీతాపాత్రను శిల్పక్రియలఁ బ్రణీతాకృతి పాషాణజలపాత్రను వాడెదరు. యజ్ఞమునందు ఘృతాదికహవిష్యన్నమును, శిల్పమునందు సువర్ణాది ధాతువులను వినియోగించెదరు. యజ్ఞముల నులూఖలముసలములను శిల్పముల మేరుటంకములను దాడించెదరు. యజ్ఞముల దారుమయములైన సుక్సృవములను శిల్పముల స్వనస్వన్యములను నుపకరించుకొనెదరు. యజ్ఞముల

దర్భకూర్చలను శిల్పములు సూకర కేశకూర్చలను (వరాహపుఁగట్ట) సమ్మార్జన జేసికొనెదరు. ఇక్కడ సూకరకేశకూర్చనుగూర్చి చర్చించిన సూకరకేశములు దర్భలవలెఁ బవిత్రములేయగును. ఎట్లన భాగవతతృతీయస్కంధమునఁ బదుమూఁడవ యధ్యాయమున యజ్ఞవరాహమూర్తిని వర్ణించుపట్టున,

శ్లో॥ ఛందాంసియస్య త్వచిబర్హిలోమ స్వాజ్యం దృశిత్వంఘ్రిషుచాతృహోత్రమ్

అని వేదములే యమ్మహాపురుషుని చర్మమనియు, దర్భలే కేశములనియు నాజ్యమేదృక్కనియు, జతుర్హోతలే నాలుగుపాదములనియుఁ, జెప్పఁబడియుండె. మఱియు మత్స్యపురాణమున నిన్నూటనలువదియాఱవ యధ్యాయమున యజ్ఞవరాహమూర్తినివర్ణించునపుడును, శ్లో॥ అగ్నిజిహ్వాదర్భరోమ బ్రహ్మశీర్షోమహాతపాః అని యవ్వరాహమూర్తి దర్భరోముఁడనియే వర్ణింపఁబడినది. కావున వరాహకేశములు పవిత్రదర్భలతో సమానములగునవి. మఱియు నాయతనమను పేరఁబరగు యజ్ఞకుండమున "భృగూణాం త్వాదేవానాం వ్రతపతే వ్రతేనాదధామి" యను వేదమంత్రమున నాధానముఁ జేయుదురు. వాగీశ్వరీకుండ మను పేరఁబరగిన శిల్పకుండమున "ఋభూణాంత్వాదేవానాం వ్రతపతే వ్రతేనాదధామి" యని యాధానముఁ జేయుదురు. కాఁబట్టి శిల్పివరునకు నగ్నిహోత్రికిఁగాని, శిల్పమునకు యజ్ఞమునకుఁగాని భేదమేమాత్రములేదు. ఇంకను దిరిగి యజ్ఞాయుధములను శిల్పాయుధములనుగూర్చి చర్చింపుదము.

శ్రు॥ యజ్ఞాయుధానిసంభరంతి యజ్ఞోవై యజ్ఞాయుధానియజ్ఞమేవతత్సంభరంతి।
స్ఫ్యశ్చకపాలాని చాగ్నిహోత్రహవణీచశూర్పంచ కృష్ణాజినంచశ
మ్యాచోలూఖలంచముసలంచదృషచ్చోపలాచ ॥

యజుఃకాం ౧ ప ౬ అ ౮

భాష్యం॥ వక్ష్యమాణానిస్ఫ్యకపాలాదీని యజ్ఞస్యసాధనత్వాదాయుధానీత్యుచ్యంతే. తాన్యధ్వర్యుః సంపాదయేత్ సాధ్యసాధనయోరభేదోపచారాద్యజ్ఞస్యైవతదాయుధత్వంతత్తే నాయుధసంపాదనే యజ్ఞమేవసంపాదయతి.

తా॥ చెప్పబోవుచున్న స్ఫ్యముకపాలములు మున్నగునవి యజ్ఞమున కుపకరణములగుటవలన నాయుధములని చెప్పఁబడుచున్నవి. వానిని నధ్వర్యుఁడను యాజకుఁడు సంపాదింపవలెను. సాధింపఁదగిన యజ్ఞమునకు సాధించుచున్న యజ్ఞాయుధములకు భేదములేకుండుటవలన యజ్ఞమాయుధములు గలదగుటవలనను, ఆయు

ధసంపాదనమునందు యజ్ఞమునే సంపాదించుచున్నాఁడు. అనిచెప్పి, స్ఫ్యముకపాలములు, అగ్నిహోత్రహవణి, శూర్పము, కృష్ణాజినము, శమ్య, ఉలూఖలము, ముసలము, దృషత్తు, ఉపల, అను యజ్ఞాయుధములుపది వానిని సంపాదించుటయే యజ్ఞము సంపాదించునంతయగును. అని నుడివెను. ఇఁక శిల్పాయుధములెన్ని యనిన,

శ్లో॥ మేరుంటంకంస్వనం భూషానహ్నించ దధతంకరైః ।
కుద్దాలంకరణీంవాసీమమీయంత్రం కమండలుం ॥ ఇతిదశాయుధాని

పద్మపురాణ భూఖండ విశ్వకర్మోపాఖ్యానము.

మేరువు (దాగ,) టంకము (సుత్తె) స్వనము (పట్టుకారు) భూష (ధమని లేక గొట్టము) అగ్నికుండము (కుంపటి లేక కొలిమి) కరణి (ఉలి) వాసి (బాడిస) కుద్దాలము (గుద్దలి) అమీయంత్రము (జలపాత్ర) కమండలువు (అన్యజలపాత్ర) అను దేవశిల్పాయుధములును బదియనియే చెప్పఁబడినవి. యజ్ఞమునకైన యాదశాయుధములును దర్శపూర్ణమాస, చాతుర్మాస్య, షోడశి, ఉక్థ్య, చయన, అగ్నిష్టోమ, వాజపేయములు మున్నగు యజ్ఞములకన్నిటికిని ముఖ్యావశ్యకములే దేవశిల్పోప కరణములైన మేర్వాది దశాయుధములును స్వర్ణరత్నాలంకార, ప్రాసాద, గృహ, దేవమూర్తి, దేవరథ, యజ్ఞకుండ, మండప, యజ్ఞపాత్రములు మున్నగు శిల్పకర్మలొనర్చుటకు ముఖ్యావశ్యకములే యగుచున్నవి. మఱియు నశ్వమేధాదియాగము లారంభించుకాలమునఁ ద్వష్టృ (విశ్వకర్మ) దేవతాత్మకమగు చిత్రానక్షత్రముండవలెను,

శ్రు॥ చిత్రానక్షత్రం భవతి చిత్రంవాఏతత్కర్మయ దశ్వమేధః సమృద్ధ్యై ॥

తై, బ్రా, అ 3 ప్ర ౮ అ ౧

భా॥ అశ్వమేధస్యసంకల్పకాలే నక్షత్రవిశేషంవిధత్తే బహువిధానామనుష్ఠేయానా మిష్టిపశుసోమరూపాణాం సద్భావాదశ్వమేధకర్మణశ్చిత్రత్వ మతస్తస్య సమృద్ధ్యర్థం.

తా॥ అశ్వమేధ సంకల్పకాలమునందు నక్షత్రవిశేషమును జెప్పుచున్నాఁడు. బహువిధములై యనుష్ఠింపఁదగిన యిష్టిపశుసోమాదిరూపములుగలదగుటవలన నశ్వమేధయజ్ఞము చిత్రముగలదయ్యెను. అందువలన నీకర్మాభివృద్ధికొఱకుఁ జిత్రానక్షత్రమున నారంభింపవలెను. ఆచిత్రమనునది శిల్పమే. చిత్రాధిపతిశిల్పాధిపతియునొక్కఁడే యగుటవలన చిత్రానక్షత్రమునకుఁ ద్వష్ట (విశ్వకర్మ) యధిపతి

య మ్యెను. జ్యోతిశ్శాస్త్రమునందు,

శ్లో॥ భేశాదస్రయమాగ్ని ధాతృశశినఃశర్వోఽదితిర్వాక్పతిః ।
శర్పాజాః పితరో భగోయమరవీ త్వష్టాసమీరాగః క్రమాత్ ॥

అని చెప్పుటవలనను, "త్వష్టానక్షత్రమభ్యేతిచిత్రాం" అను శ్రుతివలనను, చిత్రానక్షత్రాధిపత్యము త్వష్టకే సంభవించుచున్నది. త్వష్టృనక్షత్రమనిన చిత్రయనియే వ్యవహరించుకొనుచున్నారు. త్వష్టృసంబంధమైన చిత్రానక్షత్రముశిల్పసంబంధమైనదని చెప్పక తప్పదు. అశ్వమేధకర్మ చిత్రకరమైనదగుటవలన శిల్పము చిత్రము నొకటియగుటవలన నశ్వమేధకర్మ శిల్పకర్మకు సంబంధించిన దనియే నిశ్చితమగుచున్నది. కావునఁ బవిత్రశిల్పకర్మయు, యజ్ఞకర్మయు, నొక్కరూపముగలదని ధ్రువమగుచున్నది. ఇంకను విచారింపఁగా,

## —♦ వేదశిల్పముల యుత్పత్తి ♦—

శ్లో॥ ఋగ్యజుస్సామాథర్వాఖ్యాన్ వేదాన్ పూర్వాదిభిర్ముఖైః ।
శస్త్రమిజ్యాం స్తుతిస్తోమం ప్రాయశ్చిత్తంవ్యధాత్క్రమాత్ ॥ ౩౭ ॥
ఆయుర్వేదం ధనుర్వేదం గాంధర్వం వేదమాత్మభూః ।
స్థాపత్యం చాసృజద్వేదంక్రమాత్పూర్వాదిభిర్ముఖైః ॥ ౩౮

భాగ. స్క ౬ అ౧౨

తా॥ బ్రహ్మ తన తూర్పుమొదలగు నాల్గుమొగములనుండి ఋక్కు, యజుస్సు, సామము, అథర్వము అను నాలుగు వేదములను, శస్త్రము (హోత్రమంత్రము) ఇజ్య (అధ్వర్యునిమంత్రము) స్తుతిస్తోమము (ఉద్గాతృమంత్రము) ప్రాయశ్చిత్తము (బ్రహ్మమంత్రము) అను నీనాల్గింటిని ఆయుర్వేదము (వైద్యశాస్త్రము) ధనుర్వేదము (యుద్ధశాస్త్రము) గాంధర్వము (సంగీతశాస్త్రము) స్థాపత్యము (విశ్వకర్మసాధ్యశిల్పశాస్త్రము, అను నీనాలుగైన యుపవేదములను వరుసగాసృష్టించెను. అని చెప్పియుండుటచే యజ్ఞకర్మలు చెప్పుచున్నవేదము లెక్కడ బుట్టినవో శిల్పకర్మలు చెప్పుచున్న శిల్పవేదములు నక్కడనే పుట్టినవి. అవియు బ్రహ్మముఖముననే (బ్రాహ్మణోద్దిష్టములుగనే) పుట్టినవి. ఇవియు నట్లేపుట్టినవి. కాబట్టి యజ్ఞశిల్పములరెంటికి భేదము గానుపించదు. మఱియునిట్లే,

ఆయుర్వేదశ్చికిత్సాశాస్త్రం ఋగ్వేదస్యోపవేదః ధనుర్వేదోయుద్ధశాస్త్రం యజుర్వేదస్యోపవేదః ॥ ౨ ॥ గాంధర్వవేదః సంగీతశాస్త్రంసామవేదస్యోప

వేదః ॥3॥ స్థాపత్య వేదోవిశ్వకర్మాది శిల్పశాస్త్రం అధర్వవేదస్యోప వేదః ॥౪॥

చరణవ్యూహే చతుర్థఖండః ॥

ఆయుర్వేదమన వైద్యశాస్త్రము, ఋగ్వేదమున కుపవేదము. ధనుర్వేదమన యుద్ధశాస్త్రము. ఇది యజుర్వేదమున కుపవేదము. గాంధర్వవేదమన సంగీతశాస్త్రమియ్యది సామవేదమున కుపవేదము. స్థాపత్యవేదమన విశ్వకర్మాది శిల్పశాస్త్రము, ఇది యధర్వవేదమున కుపవేదము. (స్థాపత్యవేదమునకే "యుద్ధవేద" మని పాఠాంతరముగలదు.) పవిత్రమగు శిల్పమున కుపవేదనామమెగాక, నిఘంటుకోశ ద్వితీయాధ్యాయమునందు "అపఇత్యారభ్యక్రతుః, ధీః, శిల్పం, ఇతి షడ్వింశతికర్మ నామాని" అని "అప" అను శబ్దముమొదలుకొని "శిల్పమ్" అను శబ్దమువఱకు నిరువదియాఱు శబ్దములు కర్మనామములని నుడివియుండుటచేత శిల్పశబ్దమునకుఁ గ్రతుశబ్దము పర్యాయముగ నిశ్చయింపఁబడుచున్నది. కావున శిల్పకర్మకుఁ గ్రతుకర్మకు భేదములేదు. పవిత్రశిల్పకర్మ బ్రాహ్మణులచేతనేఁ జేయఁదగినది. ఏలయన వేదోక్తమంత్రములయందలి ధ్యానరూపములను బ్రత్యక్షవిగ్రహములుగ సృష్టించువిజ్ఞానమే శిల్పమనాఁబడు. ఇందుల కీదృష్టాంతముఁ జూడఁదగు. శ్రుతియందలి "చత్వారిశృంగాత్రయో అస్యపాదా ద్వేశీర్షే సప్తహస్తాసోఅస్య" అను వాక్యమునకు నాలుగు శృంగములు మూఁడుపాదములు రెండు శిరస్సులు నేడు హస్తములు గల మూర్తిని సృష్టించి లోకులకుఁ బ్రత్యక్షీకరింపఁజేయుటయే శిల్పము. అందువలననే "మోక్షేధీర్జ్ఞానమన్యత్రవిజ్ఞానం శిల్పశాస్త్రయోః" అని నామలింగానుశాసన బ్రహ్మవర్గమున వాకువ్వఁబడియె. ఇందులకుఁ డీకాకారుఁడు "శిల్పశాస్త్రవిషయేవిజ్ఞానమితి జానాతిరనట్ జ్ఞానంవివిధం విరూపం వా జ్ఞానంవిజ్ఞానం" అని వివిధరూపములుగా సృష్టించుబుద్ధికే విజ్ఞానమని పేరిడియె. ఇందులకే భాగవతమున దశమస్కంధమునందు "దృశ్యతేయత్రహితాష్ట్రం విజ్ఞానంశిల్పనైపుణం" అని నిర్వర్ణించి విజ్ఞానమనినఁ ద్వష్ట్రసంబంధమైన శిల్పనైపుణ్యమునకే విజ్ఞానమనియె కావున నిట్టి విజ్ఞానవిశిష్టమైన శిల్పము వేదోక్తమనుటకు నిస్సందేహము.

## —♦ శిల్పపూజ్యత ♦—

ఇందులకే ద్వారకానగర నిర్మాణసమయమున శ్రీకృష్ణశివులిట్లు విశ్వకర్మను స్తుతియించిరి.

విశ్వకర్మస్తోత్రే శ్రీకృష్ణరుద్రావూచతుః ॥

శ్లో॥ వశంతంతుమయం శిక్యంశిక్యే బ్రహ్మాండమద్భుతం
నిహితంచోభయంయేన విశ్వకర్మాసపాతునః॥ ౭
దివిభువ్యదరేకాష్ఠపాషాణాదౌ చయేవిభుః
చతుర్ధవ్యభజజ్జ్యోతి శ్చతుర్విధఫలాప్తయే॥ ౮
వాతరజ్జుధృతం దివ్యం జ్యోతిః కాలస్యకారణమ్
బిభ్రమిత్యనిశంయేన ప్రవర్తంతేక్రతుక్రియాః॥ ౯
భౌమమాకారజంజ్యోతిః స్వర్ణాయః పారదాదికం
నానాకార్యకరంలోకే భూషాయుధరసాయనైః॥ ౧౦
యోఽసౌవైశ్వానరోవహ్నిః ప్రాణినాందేహమాశ్రితః
చతుర్విధం పచత్యన్నం తదుదర్యం మహత్స్మృతమ్॥ ౧౧
దృఢాఘాతేనకాష్ఠాదే ర్యత్తేజో జాయతేమహత్
జ్వలనోనామ తల్లోకేశ్రౌతం స్మార్తంహవిఃపచేత్॥ ౧౨
యఃకాలందక్షిణాంచైవ యజమానంహవీంషిచ
ధారయన్యః పరశివో విశ్వకర్మాసపాతునః॥ ౧౩
నయత్యనేకరసతాం మధురైకరసంజలం
యస్తత్తద్బీజయోగేన మహాశిల్పీసపాతునః॥ ౧౪
భౌమాన్యనేకరూపాణి యస్యశిల్పానిమానవాః
ఉపజీవంతితంవిశ్వం విశ్వకర్మాణమీమహే॥ ౧౫
దిక్కాలైస్సూర్యచంద్రాభ్యాం గోవిప్రాభ్యాంహవిర్మనూ
నిర్మాయనిర్మమేయజ్ఞం తస్మైయజ్ఞాత్మనేనమః॥ ౧౬
దివిభువ్యంతరిక్షేవా పాతాలేవాపిసర్వశః
యత్కించిచ్ఛిల్పినాంశిల్పం తత్ప్రవర్తకతేనమః॥ ౧౭

పద్మపురాణే భూఖండే విశ్వకర్మమాహాత్మ్యే అ ౨౫.

తా॥ తంతుమయమైన శిక్యమును (ఉట్టివలెనున్న పృథివిని) ఆశిక్యమునందు బ్రహ్మాండమును నద్భుతమగునదిగ సృష్టించి యునిచి యండపిండబ్రహ్మాండములకు గారకుఁడగు నవ్విశ్వకర్మ మమ్ముల రక్షింపవలెను. భూమ్యాకాశముల మధ్యప్రదేశములయందును, గాష్ఠపాషాణాదులయందును, ధర్మార్థకామమోక్షములను చతుర్విధపురుషార్థములు లభించుటకొఱకుఁ దనతేజస్సును నాలుగుభాగములొనర్చి నిలిపెనోయట్టివిభుఁడురక్షించుఁగాత! కాలమునకుఁ గారణమైనట్టియు,వాయు

రూపమైన రజ్జువులచేఁ దాల్చఁబడిన దివ్యతేజస్సును ద్రిప్పుచుఁ గ్రతుక్రియల నిత్యమెవ్వనిచేఁ బ్రవర్తింపఁబడుచున్నవో యట్టి యజ్ఞకర్తయగు విశ్వకర్మ మమ్ము రక్షించుఁగాత! భూమియందుఁ బుట్టినట్టియు, గనులయందును నగ్నియందుఁ బుట్టినట్టియు బంగరు, ఇనుము, పాదరసము మున్నగు సమస్త కార్యముల కుపయోగించు ధాతువులను లోకమునందు సృజించి వానినెల్ల భూషణములుగ, రసాయనములుగ, నాయుధములుగ నొనర్చినట్టియు, జఠరాగ్నిరూపుఁడై ప్రాణుల దేహమధ్యములయందుండి యన్నమును బక్వమొనర్చి పోషణమొనర్చుచును దర్వాగ్ని గొప్పదని మెప్పువడయునట్టియు, దారువులయొక్క గట్టి యొరపిడిచేత మహత్తరమైన యగ్నిగాఁ బుట్టి జ్వలనుఁడను పేరిచే శ్రౌతస్మార్త కర్మలయందలి హవిస్సును (పురోడాశము నన్నము నాజ్యము మున్నగువాని) పచనమొనర్చి స్వీకరించునట్టియు, వసంతాదికాలములును సువర్ణాది దక్షిణయును, యజమానుఁడును, హవిస్సును, ధరించు పరశివస్వరూపుఁడగు నట్టియు, విశ్వకర్మ మమ్ములఁ బాలించుఁగాత! మధురమే ప్రధానమైన జలమునం దాయాబీజముల యొక్క సంబంధముచే ననేకరసములు గలుగునట్లు చేయు మహాశిల్పియగు విశ్వకర్మ మమ్ములఁ బాలించుఁగాత! ధాతుమయములగు ననేకరూపములగు శిల్పములను సృజించుచు మానవుల బ్రతుకఁజేసిన విశ్వకర్మను ధ్యానించుచున్నాము. దిక్కులు, కాలములు, సూర్యుఁడు, చంద్రుఁడు, గోవు, బ్రాహ్మణులు, హవిస్సులు, వీనిని సృజించి వీనిచే యజ్ఞములు చేయించు యజ్ఞకర్త యగు విశ్వకర్మ కొఱకు మానమస్కారము. స్వర్గమున, భూమిని, ఆకాశమునఁ, బాతాళమునందున, నన్నియెడల నేదేని శిల్పులయొక్క శిల్పముండెనేని నాశిల్పములఁ జేయించు విశ్వకర్మవగు నీకు నమస్కారము. ఇట్టి స్తుతివాక్యములుండుటచే సర్వశిల్పాధికారియగు విశ్వకర్మ సమస్తశిల్పముల నొనర్చునటులను నయ్యవియెల్ల యజ్ఞభాగములలో ముఖ్యములై విలసిల్లునట్లుగను దెలియుచున్నది.

## —♦ యజ్ఞశిల్పములు విరాట్స్వరూపములు. ♦—

మఱియు నింకొకటి విచారించుదమేమనిన "యజ్ఞోవైవిష్ణుః" అను శ్రుతివలన యజ్ఞము విరాట్పురుషుఁడైన విష్ణువే శిల్పమన్ననో?

శ్లో॥ పాదాపాపశిలాస్తస్య జంఘాపాదోర్ధ్వముచ్యతే
గర్భశ్చైవోదరంజ్ఞేయం కటిశ్చకటిమేఖలా॥
స్తంభాశ్చబాహవోజ్ఞేయా ఘంటాజిహ్వా ప్రకీర్తితా

దీపః ప్రాణోస్యవిజ్ఞేయో హ్యపానోజలనిర్గమః ॥
బ్రహ్మస్థానం యదేతచ్చతన్నాభిః పరికీర్తితః
పాదచారస్త్వహంకారో జ్యోతిస్తచ్చక్షురుచ్యతే॥
తదూర్ధ్వం ప్రకృతిస్తస్య ప్రతిమాత్మాస్మృతోబుధైః
తలకుంభాదథోద్వారం తస్యప్రజననంస్మృతమ్॥
శుకనాసాభవేన్నాసాగవాక్షః కర్ణఉచ్యతే
కాయపాలీస్మృతస్కంధోగ్రీవాచామలసారికా॥
కలశస్తు శిరోజ్ఞేయో మజ్జాదిత్మరసంయుతమ్
మేదశ్చ వసుధావిద్యా త్ప్రిలేపోమాంస ఉచ్యతే ॥
అస్థీనిచశిలాస్తస్యస్స్వాయుః కీలాదయఃస్మృతాః
చక్షుషీశిఖరాస్తస్య ధ్వజాః కేశాః ప్రకీర్తితాః॥
ఏవం పురుషరూపంతద్ధ్యాత్వాచమనసాసుధీః ।
శిల్పశాస్త్రము.

తా॥ దేవాలయము విరాట్పురుషునివంటిది. ఆ యాలయముయొక్క పాదశిలలు పాదములు. పాదోర్ధ్వశిలలు జంఘలు, గర్భాలయ ముదరము. మేఖలలు కటిభాగము, స్తంభములు బాహువులు. ఘంటనాలుక, దీపము ప్రాణము జలముపోవుసోమసూత్రము అపానము, బ్రహ్మస్థానము నాభి, పాదచారమహంకారము, కాంతిచక్షువు, ప్రతిమ ఆత్మ, తలకుంభ మథోద్వారము. శుకనాసము నాసిక, గవాక్షము కర్ణము, కాయపాలిమూపు, అమలసారికకంఠము, కలశము శిరస్సు, గచ్చుమేదస్సు, పైపూత మాంసము, శిలలస్థులు, కీలాదులు వాయువు, ధ్వజములు కేశములు, ఇట్టి యవయవములు గల దేవాలయ విరాట్పురుషుని పండితుఁడు మనస్సులో ధ్యానించును. ఇట్టిశిల్పశాస్త్ర దృష్టాంతమువలన శిల్పముగూడ విరాట్స్వరూపమనియే కన్పట్టుచున్నది. మనభరతఖండమునందు "గవామంగేషుతిష్ఠతిసర్వే బ్రహ్మదయస్సురాః" అను గారుడోక్తివలన గోవులు పవిత్రములయినటులను, "వృక్షాణామహమశ్వత్థ" యను భగవదుక్తివలన నశ్వత్థవృక్షము పవిత్రమయినటులను, "అగ్నిరాపశ్చవేదాశ్చ సోమసూర్యామరుత్తథా । సర్వఏవతువిప్రస్యకర్ణేతిష్ఠతి దక్షిణే" అను స్మృతివచనమువలన బ్రాహ్మణుఁడు పావనమయినటులను "తత్సర్వం విశ్వకర్మజ" మ్మను వాయుపురాణోక్తి వలనను శిల్పమెంతయుఁ బవిత్రవంతము దేవతావాసమునగును.

## —♦ శిల్పమువలనఁ బుణ్యలబ్ధి ♦—

"జ్యోతిష్టోమేనస్వర్గకామోయజేత" యను వాక్యమువలన స్వర్గమునుగోరు వాఁడు యజ్ఞమునుఁజేయుచున్నాఁడు. శిల్పమువలనఁ బుణ్యలబ్ధి యేమిగలుగును ? అను ప్రశ్నగలిగెనేని శిల్పకారులు శిల్పకర్మవలన స్వర్గవాసాదిసుఖములును, చతుర్విధ పురుషార్థములును, లభించుటయేగాక కేవల దేవత్వప్రాప్తికూడ లభించునటుల

(4) శ్రు॥ విష్ట్వీశమీతరణిత్వేన వాఘతోమర్తాసః సతోఽఅమృతత్వమానశుః ।
సౌధన్వనాఋభవసూరచక్షసః సంవత్సరేసమపృచ్యంతధీతిభిః ॥

ఋక్ అ౧ అ౮ వ30 మం ౪.

భాష్యమ్॥ సౌధన్వనాః సుధన్వనఋషేః పుత్రాః ఋభవః మర్తాసోవాఘతః సంతోమరణ ధర్మాణో యజమానాః సంతోఽపి తరణిత్వేన శీఘ్రత్వేన శమీవిష్ట్వీ ఆత్మానంకర్మణావ్యాపృతం కృత్వాకుశలకర్మాణి ఏకంచమసంచతురః కృణోతనేత్యాదినాదేవైరుక్తానికర్మాణి కృత్వాఅమృతత్వమానశుః అమరత్వం ప్రాపుః । సంవత్సరేచైకస్మిన్నేవ వర్షేగతేసూరచక్షసః సూర్యవత్తేజోయుక్తాభూత్వాధీతిభిః సమపృచ్యంత ఉపాసకకృతైర్యజ్ఞాదిభిః కర్మభిః స్తోత్రైశ్చసంయుక్తా అభవంస్తేషాంప్రీత్యర్థముపాసకాః కర్మాణిస్తోత్రాణి చాకుర్వన్.

తా॥ సుధన్వఋషి పుత్త్రులగు ఋభువులు తాము మరణధర్మముగలవారయ్యు నొక చమసము నాలుగు చమసములుచేయుటమున్నగు దేవతలు చెప్పిన పనులు శీఘ్రముగ జేసి దేవత్వమును బొందిరి. దేవత్వమును బొందినతరువాత నాసుధన్వపుత్త్రులు సూర్యునితో సమానమైన తేజస్సుగలిగి సంవత్సరభాగమైన వసంతాదికాలములయందుఁ జేయఁదగిన యగ్నిష్టోమాది కర్మలలో హవిర్భాగములకుఁ దగినవారయిరి. అని చెప్పియుండుటచే ఋషిపుత్త్రులైన ఋభువులు శిల్పకర్మకొనర్చి దేవత్వమును బొంది హవిర్భాగముల కర్హులయినటులఁ గానఁబడుచున్నది

## —♦ సువర్ణాలంకార వర్ణనము. ♦—

సువర్ణరత్నాదులచే నిర్మితములగు నలంకారములయొక్క శిల్పములఁగూర్చి చారించుదమన్ననో యయ్యవిగూడఁ జతుర్విధపురుషార్థదాయకములే. యెట్లనిన,

తా॥ పార్వతి యీశ్వరునితో నిట్లనియె. దేవతలకు దేవుఁడవగు నోయీశ్వరా కాశియందు విశ్వకర్మేశ్వరంబను నొక్క లింగంబు ప్రాచీనంబుగఁ బ్రసిద్ధికెక్కి యున్నది. దాని యుత్పత్తి నాసతీయనలయునని పార్వతియడుగ నీశ్వరుఁడిట్లనియె ఓపార్వతీ వినుము. మనోహరంబును మహాపాతకంబులనెల్ల రూపడంచునట్టి విశ్వకర్మే లింగముయొక్క యుత్పత్తికథ జెప్పెద. తొల్లి త్వష్టప్రజాపతియొక్క పుత్త్రుఁ సర్వకర్మల సామర్థ్యంబుగలిగి బ్రహ్మకు రెండవశరీరంబన విశ్వకర్మయను పేరఁ బరగుచుండె. అతఁడు బాల్యంబున నుపనీతుఁడై గురుకులవాసమొనర్చుచు మా కరవృత్తిచే జీవించుచు గురుపరిచర్యసేయుచుండెను. అనంతరమున వర్షాకాల రాగా నాచార్యుఁ డిట్లనియె. వర్షము బాధింపకుండ నానిమిత్తమొక గృహము ని ణమొనర్పుము. ఆ గృహ మొకప్పుడును విరిగిపడఁగూడదు. ప్రాఁతదియుఁ గాఁగూ డదు. ఇట్లాచార్యుఁడు విశ్వకర్మతోఁ బలికినతరువాత గురుపత్ని యిట్లనియె. ఓ త్వష్టృపుత్త్రికా! నాశరీరమునకుఁ దగిన రెవికెను గడుబిగువును గడువదులును గాక డఁ బ్రయత్నముతోఁ జేయుము. వస్త్రములేకయే యెప్పుడు ప్రకాశించునటుల నా చీరయొకటి సృజింపుము. పిమ్మట గురుపుత్త్రుఁడిట్లనియె. నాకొఅకొక జతపా కలఁ గై సేయుము. ఆపాదుకల నెక్కినయెడ నడు సేమాత్ర మంటఁగూడదు పరుగిడునపుడు సుఖమీయవలయు. ఆ పాదుకలతో భూప్రదేశముమీఁ వలె జలప్రదేశముమీఁద సైతము సంచరింపవలయును. అటువెనుక గు పుత్త్రిక యిట్లనియె. ఓ విశ్వకర్మా నాచెవులకుఁ దగినటుల బంగరుచే నొ తాటంకముల నీచేతులతోడనే సిద్ధపఱపుము. పిల్లవాండ్రాడుకొనఁదగిన దంతపుబంతు స్వయముగ నమర్పుము. ఒకప్పుడును విడువకయుండునటుల ఱోలు రోకలి మున్న గృహోపకరణమ్ములఁ జేయుము. తొలఁగకయుండునట్టి యొంటికాలి పీఠములఁబ ములగువానిని గొన్ని చేయుము. మఱియు నోయిమేధావీ! వ్రేళ్ళుగాలకుండున ప్రాయ్యిగల పాకశాల నొకే స్తంభముతో నొకేదారువుతో నమర్పుము. వీనిని నీయిచ్ఛవచ్చినచోటుల సృష్టింపవచ్చును. అటుపిమ్మట నాబాలకునికంటె పెద్దవ స్సుగల సహాధ్యాయులెల్లరుఁ దమకువలయు నుపకరణముల నాతని గోరిరి. బ్రాహ్మ ణుఁడగు నా విశ్వకర్మయు వారివారియెదుట నట్లుకానిండని ప్రతిజ్ఞచేసి బాలుఁ గావున నెండుచింతయు, భయమును గ్రిందుకొన వనమధ్యంబు బ్రవేశించి తా జేసినప్రతిజ్ఞ నెరవేర్పఁజాలమి యిట్లుచింతించె. అందఱిమ్రోల నన్నింటిఁజేసెద మాత్రము బ్రతిజ్ఞచేసితిని. ఇప్పుడెద్దియుఁ జేయఁజాలను. ఏమిసేయుదును? ఎచ్చట కేగుదును? ఎవ్వఁడు సహాయమొసఁగును? తెలివియుండియు దెలివిలేనివాఁడనైతి

దిగ్భ్రాంతుఁడ నరణ్యాశరణ్యుఁడనై తిని. గురువు, గురుపత్ని, గుర్వపత్యము మున్నగు వారి వాక్యములఁ జేసెదనని యొప్పుకొని చేయనిమూఢుఁడు రౌరవాదినరకముల నివసించునే? ఇంతియెగాక బ్రహ్మచారులకు గురుశుశ్రూషగదా ముఖ్యధర్మము. అట్టి నెఱవేర్చుటచే నెల్ల మనోరథములు సిద్ధించును. అట్లు లేమిచే నెద్దియు జేకూరదు. కావున గురువాక్య మెట్టికష్టములఁబడియైన సాధింపనలయును. కావున గురువాక్యసిద్ధినెట్లు జెందఁగలను. బుద్ధిబలములేని నాకిక్కడ నెవ్వఁడు సహాయమొసగును. గురువాక్యము సమర్థించు టటుండనిండు. అల్పుండనై న నొక్కనికి నీపని సమకూర్చెదనని పన్నిదమాడి యాపని నెఱవేర్పనివాఁ డఘముచే నధోగతిఁ జెందుఁగదా? నేనెట్లసహాయుఁడనై యాపనుల నెఱవేర్పఁగలదును? వారుసెప్పినపుడు మాత్రము మోమోటముచేతను భీతిచేతను నొప్పుకొంటిని. ఓవిధీ నీకు నమస్కారము. నన్నెట్లుచేసినను నీయదియకర్తవ్యము. అని పలుతెఱంగుల నావిశ్వకర్మ కాననమధ్యమున విలపింపఁ జొచ్చె. నంతలో నాతనిముందల నొకతాపసుండు దైవవశంబునఁ గాననయ్యె. నట్టడవిఁ గానఁబడిన నాతపస్విని జూచి యవ్విశ్వకర్మ ప్రణామమొనర్చి యిట్లనియె. స్వామీ! మీరెవరు! నాహృదయవీథి నిండుసుఖంబుఁగల్పించుచున్నారు. మీదర్శనముచేఁ జింతాతప్తుఁడనగు నాయెడలు పన్నీటజలకమార్చినట్లయ్యె. నాప్రాక్తనసుకృతమే తాపసవేషమున నిట్లు దర్శనమిచ్చెనో లేక యపారకరుణాపారావారుఁడగు నాజగదీశ్వరుఁడే యిట్లరుదెంచెనో మీరెవరైనఁగానిండు. మీకు నమస్కారము. అసహాయుఁడనగు నాకుపదేశము సేయుఁడు. గురువాక్యమును, గురుపుత్రివాక్యమును, గురుపత్నీవాక్యమును నెఱవేర్చుమార్గమెట్లు? అద్భుతమగు నీకార్యమెట్లుచేకూరును? నాకు బుద్ధిసహాయము జేయుఁడు? ఈనిర్జనారణ్యమధ్యమున బంధువుగ విచ్చేసితివి. ఇట్లా బ్రహ్మచారియడిగిన నాతపశ్శాలియుఁ గరుణాపూరితహృదయుఁడై యథాశాస్త్రీయముగ నుపదేశించెను. అదియుక్తమే ఏలన:—

అప్పుఁడతనితలచి తన్నడిగినపుడు దుర్బుద్ధినొసఁగు మానవుఁడు పంచమహాభూతంబులుండుదనుక ఘోరనరకంబునఁబడును. కావున నీతాపసుఁడు నిష్కపటముగ నిట్లుపలికె. ఓ వడుగా! వినుమువాక్రుచ్చెద. నీవాంఛనెఱవేరుట యొకవింతయా? విశ్వేశానుగ్రహమువలననేకదా చతుర్ముఖుఁడును సృష్టియందుఁ బొండితివహించెను. కావుననీవును వారణాసియందున్న సర్వజ్ఞుఁడగు విశ్వేశ్వరస్వామిని బూజించితివేని యందువలన నీవిశ్వకర్మనామము సార్థకమగునట్లు కోర్కెలుసఫలములగును. కాశీవిశ్వేశ్వరస్వామి నారాధించుటవలన నేకోరికయు దుర్లభముగానేరదు. ఇట్లమ్మౌని

వరుఁడానతిచ్చిన త్వష్ట్రకుమారుఁడాకర్ణించి కాశికేగి గంగాసన్నిధిలోఁ గుటికవెట్టి కందమూలఫలంబుల మెసవుచు విశ్వేశుఁ బూజించెను. ఇట్లుదృఢభక్తిచేఁబూజించు నవ్విశ్వకర్మ భక్తితత్పరతకు విశ్వేశ్వరుఁడుమెచ్చి ఓయీ! త్వష్ట్రనందనా! నీభక్తి మెచ్చితి. నీకుబ్రసన్నుడనైతిని. ఓయి చిన్నకుఱ్ఱా! గురుప్రయోజనార్థమిట్టి యేకాగ్ర దీక్షవహించితివిగాన గురువుచే, గురుపత్నిచే, గురుసంతానద్వయముచే, నింకనితరము లగువారలచే నేయేకోర్కెలుగోరఁబడినవో వానినన్నిటిని వారియిచ్చవోడమునట సమకూర్ప సమర్థుండనయ్యెదవు. ఓమహాభాగా నేనియ్యబోవువరములవినుము. నీచే బూజింపఁబడిన యీలింగముయొక్క మహామహిమచేత నీవెచ్చోటను, సువర్ణా ధాతువులు, దారువులు, శిలలు, మణులు, రత్నములు, పుష్పములు, వస్త్రములు కర్పూరాది సుగంధద్రవ్యములు, కందమూలఫలములు, గృహములు మఱియునెల్ల పదార్థములు జేయనేర్చెదవు. మఱియు దేవాలయాదులయందచ్చటచ్చట నాయా రూపములఁజూచి యట్లేచేయనేర్చెదవు. ఎల్లయాభరణములు నెల్లసువర్ణములయొక్క సర్వవిధశుద్ధులు, నెల్లశిల్పములను, నెల్లనృత్యగీతవాద్యములను నీవు రెండవబ్రహ్మవలె జేయనెఱుంగుదువు. మఱియుఁ బరిపరియాయుధవిధానములతోఁ బలుయంత్రములను బలు జలాధారములను బలువిధదుర్గములను బరులుసారపడకుండునట్లు పన్నెదవు. నావరప్రభావమునవలనఁ గళాజ్ఞానమును రహస్యముగఁనెఱుఁగఁజాలెదవు. ఇంద్రజాల విద్యలన్నియు నీయధీనమగును. ఎల్లకర్మలయందునేర్పును, ఎల్లబుద్ధులయందు శ్రేష్ఠ్య మును, ఎల్లవారియొక్క మనోవ్యాపారమును నావరానుగ్రహముచే నీవెఱుంగుదువు. విశేషించిచెప్పనేల స్వర్గమందును, పాతాళమందును, ఈలోకమందును లోకోత్తరము లగు కర్మములన్నియు నీవుస్వయముగ నెఱుఁగుదువు. సర్వలోకములయందును, సర్వ పదార్థములయొక్క సర్వకర్మములను నీవెఱుగుటంజేసిగదా? నీకు విశ్వకర్మయను నామ ధేయంబుగలిగె. ఓయనఘా నీకింకేమివరముకావలయును? వలసినవేడుము. శివుఁబూ జించువారికిఁక గోరదగినదిలేదనువర కియ్యవలయును. ఎచ్చటనైన లింగపూజసేయు వానియభీష్టములన్నియు నియ్యవలయునన్నఁ గాశియందు లింగపూజసేయువానికిఁజెప్ప నేల? కాశియందు లింగమును బూజించువాఁడును, లింగప్రతిష్ఠసేయువాఁడును లింగ స్తోత్రము సేయువాఁడును, నాస్వరూపముగ్రహించుటకు దర్పణమగును. నీవును గాశి యందు లింగార్చసేయుటవలన నాకన్నులమూఁడింటికిని సద్దమువంటివాఁడనయితివి కావున నీకుం గావలయు వరంబులవరింపుము. ఇట్లంటినని దేవదేవుఁడు కాశియందలి విశ్వకర్మేశ్వర లింగమహిమను దనప్రియపత్నియగు పార్వతికిం దెలియఁజెప్పెను.

ఇట్లు నుడివియుండుటచే బ్రాహ్మణుఁడగు త్వష్ట్రుకుమారుఁడు తన బ్రహ్మచర్య కాలమున గురుకులవాసమొనర్చి భిక్షాశనపరుఁడయి విద్యాభ్యాసమొనర్చుచు గురు ప్రయోజనముకొఱకుఁ దపముఁజేసి పరమేశ్వరానుగ్రహమువలన సమస్త శిల్పకళలు సంగ్రహించినటులఁ దెలియుచున్నది. మఱియు,

"త్వంసువర్ణాదిధాతూనాం దారూణాం దృషదామపి" యనియు "సర్వాన్వై పథ్య రచనాః సర్వహేమ్నశ్చ సంస్కృతీః, సర్వాణి శిల్పకర్మాణి తౌర్యత్రికమథాపివా, సర్వంజ్ఞాస్యసికర్తుం త్వంద్వితీయ ఇవపద్మభూః" అని పరమేశ్వరాజ్ఞయుండుటవలన బంగరు, రాగి, యినుము, సీసము మొదలగు లోహధాతువులు దారువులు శిలలు వీనిచేత నిర్మాణములన్నియు పవిత్రశిల్పములగుటయేగాక యలంకారనిర్మాణములలో సమస్త సువర్ణసంస్కారములు (బంగరువును బుటములువెట్టి వన్నెలుహెచ్చుచేయు టలు) మొదలగు సర్వశిల్పములు చేయుటలో రెండవ బ్రహ్మయోయను నట్లుండఁగల వని చెప్పియుండుటచే నీశిల్పము లింతంతలని చెప్పుటకలవిగాక బ్రహ్మసృష్టికి సదృశ ములని చెప్పివిడిచెను. ఇష్టకోపధానములిఁక విచారించుదము.

ఇష్టకోపధానము.

యజ్ఞవేదికా నిర్మాణములయందును దేవాలయ విమానాది సంస్థాపనయం దును వేదోక్తమంత్రపూర్వకముగా ఇష్టక (ఇటిక)ల నుంచుట శాస్త్రవిధియైయున్నది. ఈయిటికల ప్రమాణమునుగూర్చి,

శ్లో॥ ఇష్టకాశ్చసుపక్వాశ్చ ద్వాదశాంగులవిస్తృతాః
సువిస్తరవిభాగేన వై పుల్యేనసమన్వితాః॥
కరప్రమాణాః శ్రేష్ఠాస్స్యాచ్ఛిలాప్యథశిలామయే
శ్రీసూక్తేనచ తథా శిలాస్సంస్థాప్యఇష్టకాః॥
శక్తయో విమలాద్యాస్తు ఇష్టకానాంతుదేవతాః॥

అగ్నిపురాణ ౪౨౧ అధ్యాయము.

పక్వముగాఁ గాల్చిన యిటికలు పదిరెండంగుళముల పొడవు, తొమ్మిది యంగు ళముల వెడల్పు నొకయంఁగుళము మందముగలవిగనుండవలెను. అయ్యవి శిలలవలెఁ గఠినముగనుండవలెను. ఆథర్వణోక్తమగు శ్రీసూక్తమంత్రములచేత నయ్యిష్టకా శిలలను విమలాద్యష్టశక్తులతో స్థాపించవలెను అని యున్నది. మఱియు నియ్యగ్ని పురాణమునందే, ప్రాసాదేష్టకాస్థాపనమంత్రాది, "అన్యంగేచాఖతేపూర్ణే మునేరంగి

రసస్సుతే, ఇష్టకేత్వం ప్రయచ్ఛేష్టం ప్రతిష్ఠాంకారయామ్యహం" అని వికలాంగము గాక నాశనమైనదిగాక పూర్ణమైన యంగిరోమునికిఁ బుత్త్రికవైన యోయిష్టా నీయిష్టమొసఁగుము. నిన్నుఁ బ్రతిష్ఠఁజేయుచున్నాను. ఇట్లు తాత్పర్యముగల మం ముచేఁ బ్రతిష్ఠించుటచే యంగిరోమునికిఁ బుత్రీప్రాయముగ సభివర్ణించి యంగి పుత్త్రుఁడగు విశ్వకర్మను స్మరియింపఁజేయుచున్నది. ఎట్లన:—భాగవత షష్ఠస్క షష్ఠాధ్యాయమందలి "వస్తోరాంగిరసః పుత్త్రోవిశ్వకర్మాకృతేఃపతిః" ఆకృతేః యనఁగా శిల్పాచార్యుఁడట్టి శిల్పాచార్యుఁడగు విశ్వకర్మ ఆంగిరసునకు వస్తువు బుత్త్రుఁడయ్యెననియుండుటచే నంగిరోమునికిఁ బుత్రికయగు నిష్టకముగూడ విశ్వక త్వము సాధించుచున్నది. ఇష్టకోపధానమున కథర్వమంత్రము లుచ్చరించుటగా నంగిరఃపుత్త్రుడగు నథర్వాంగిరస్సునుగూడ స్మరణమొనర్చుచు, భాగవత షష్ఠస్క షష్ఠాధ్యాయమందలి "ప్రజాపతే రంగిరసస్స్వధాపత్నీ పితౄనథ, అథర్వాంగిరసం వే పుత్రత్వేచాకరోత్సతీ" అంగిరః ప్రజాపతియొక్క సతియను భార్య అథర్వాంగిరస్సు వేదమును బుత్రునిఁజేసికొనియెనను వాక్యమును నన్వర్థీకరింపఁ జేయుచున్నది. మఱియు "తస్మాదాథర్వణః ప్రోక్తాస్సర్వేశిల్పిన ఏవచ" యను శైవాగమోక్తి ననుకరించి య థర్వణశిల్పులనుగూడ జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది.

ఇష్టకాశబ్దవ్యాఖ్యా॥ తందేవా అగ్నేరాహుతీభిరనిూషిజ్యన్,
తేయాంయామాహుతిమజుహవుః, సాసై నంపక్త్వేష్టకా
భూత్వాసమపద్యత, తద్యదిష్టాత్కమ భవత్తస్మాదగ్ని
నాఇష్టకాఃపచంత్యాహుతీరేవై నా స్తత్కుర్వంతి॥

శతపథబ్రాహ్మణే అ ౬. ౧. ౨. ౨౩.

ఇఁక నీయిష్టకలు,

శ్రు॥ హిరణ్యేష్టకా ఉపదధాతి।

యజుః ౫. ౭. ౬. ౨.

అను యజుర్వాక్యమువలన నిష్టకలు హిరణ్యమయములైనటులనే తెలియ చున్నది. అటులనే "తథాహిరణ్మయశ్చాపిపురుషః కార్యఏవహి" అను స్క పురాణోక్తియు ననుకూలించి పలుకుచున్నది. మఱియు,

శ్లో॥ కారితాస్సర్వఏవైతే శాస్త్రజ్ఞైర్యజ్ఞకోవిదైః
శోభార్థంతస్య యజ్ఞస్య కాంచనాలంకృతాభవన్॥ ౨౪.

వాల్మీకిరామాయణే బాలకాండే ౧౪ సర్గే.

తిలకాఖ్యావ్యాఖ్యా॥ కాంచనాలంకృతాభవన్నిత్యత్ర అడభావాచ్ఛాందసః ।
శాస్త్రజ్ఞైః శాస్త్రం శిల్పశాస్త్రం శుల్బశాస్త్రంచ.

శిల్పశాస్త్రమును దెలిసినవారును యజ్ఞవిధానములఁ బండితులునగువారిచే సర్వయూపస్తంభములు చేయఁబడినవి. ఆ యజ్ఞముయొక్క శోభకొఱకు బంగరుచే నలంకరింపఁబడినవయ్యెను. అని చెప్పియుండుటచే యూపములు కాంచనాలంకృతము లగుటయేకాక శిల్పశాస్త్రజ్ఞులగు పండితవరులచేఁ జేయింపఁబడినవనియుఁగూడఁ దెలియనచ్చుచున్నవి. యజ్ఞకోవిదులకు శిల్పజ్ఞతప్రాధాన్యమని దీనివలనఁ దెలిసికొనఁదగును. మఱియు సువర్ణవేదికనుగూర్చి "రుక్మవేదియజ్ఞః" అను భాగవత దశమస్కంధోత్తరార్థ వచనమునకు శ్రీధరీయ టీకయందు "రుక్మవేదికైర్మహాధ్వరైర్యజమానోఽవసత్" యని వ్రాసి సువర్ణవేదికామధ్యమమునందు యజమానుఁడు నివసించుచున్నాఁడను నర్థమును వివరించెను. ఇంకను,

శ్లో॥ మరుతస్యయథాయజ్ఞో నతథాన్యస్యకశ్చన
సర్వంహిరణ్మయం త్వాసీద్యత్కించిచ్చాస్యశోభనమ్॥ ౨౭

శ్రీమద్భాగవతే ౯ స్కంధ ౨ అధ్యాయే.

శ్రీధరీయటీకాయామ్. అస్యయత్కించిత్పాత్రాదికమస్తితత్సర్వం హిరణ్మయం శోభనమాసీత్.

ఈ యజ్ఞమునకేయే పాత్రలుగలవో యవెల్లవియు బంగారుతోఁ జేసినవియుఁ బ్రకాశించునవియుగ నుండవలెను. ఇంతయెగాక తాండ్యమహాబ్రాహ్మణమునందు "సౌవర్ణం స్రుచంసామగాయదదాతి" అని "పసిఁడితోఁ జేయఁబడిన స్రుక్కును సామవేదపాఠకునికిచ్చుచున్నాఁడు" అని సువర్ణపాత్రప్రయోగమును వివరించెను. కావున సువర్ణమయములయిన యజ్ఞపాత్రలు, యూపస్తంభములు, ఇష్టకలు మున్నగునవన్నియు నలయునటులఁ బూర్వోక్తవచనప్రమాణములవలన విశదమగుచున్నవిగదా?

ఇష్టకారచనమునుగూర్చి విచారించుదము.

శ్లో॥ ఇష్టకాశ్చయథాన్యాయం కారితాశ్చప్రమాణతః
చితోగ్నిర్బ్రాహ్మణై స్తత్రకుశలై శ్శిల్పకర్మణి॥ ౨౯

సచితోరాజసింహస్య సంచితః కుశలై ర్ద్విజైః
గరుడోరుక్మపక్షో వై త్రిగుణోష్టా దశాత్మకః॥ ౩౯

వాల్మీకిరామాయణ బాలకాండ ౧౪ సర్గ.

శిల్పకర్మయందు నేర్పరులగు బ్రాహ్మణులచే ధర్మ మతిక్రమింపఁబడకుండ నిష్ట కలుచేయింపఁబడెను. దశరథమహారాజుయొక్క చయనము మూఁటిచే హెచ్చింపఁ బడిన పదునెనిమిది (యేఁబదినాలుగు) సంఖ్యలుగల యిటికలచే గరుడాకృతియు సువర్ణ మయములయిన పక్షములుగలదిగా నేర్పరులగు బ్రాహ్మణులచే రచింపఁబడియెను. ఇట్లనుటచే సువర్ణశిల్పము ముఖ్యముగాఁ బండితులగు బ్రాహ్మణు లభ్యసించి యందు నైపుణ్యము సంపాదింపవలెననుట తెలియఁదగును. మఱియు,

శ్లో॥ తతోబ్రవీద్ద్విజాన్ వృద్ధాన్ యజ్ఞకర్మసునిష్ఠితాన్
స్థాపత్యేనిష్ఠితాన్ శ్చైవ వృద్ధాన్ పరమధార్మికాన్॥ ౬

వాల్మీకిరామాయణ బాలకాండ ౧౩ అధ్యాయః

టీకా. అబ్రవీదితి. వసిష్ఠోఽత్రకర్తా, స్థాపత్యం స్థపతేరథకారస్య కర్మతత్రనిష్ఠి తాన్ ప్రవీణాన్॥

వసిష్ఠుఁడంత యజ్ఞకర్మలయందుఁ బ్రవీణులగునట్టియు రథకారకర్మయందు నేర్పరులగునట్టియు నుత్తమ ధర్మశీలురగునట్టియు వృద్ధులగునట్టి బ్రాహ్మణులగూర్చి పలికెను. అని బ్రాహ్మణులకు రథకారకర్మయందు నిపుణత సంపాదింపవలెనని వెల్లడి యగుచున్నది.

ఇష్టకోపధానముల యజుర్వేద విధానము.

శ్రుతిః॥ విశ్వకర్మఋషిః. ప్రజాపతి గృహీతయాత్వయావాచం గృహ్ణామిప్రజాభ్యః।
ప్రాచీదిశాం వసంతఋతూనామగ్నిర్దేవతా బ్రహ్మద్రవిణం త్రివృత్స్తోమఃసఉ
పంచదశవర్తని స్త్ర్యవిర్వయః కృతమయానాం పురోవాతోవాతః సానగఋ

షిః ॥౧॥ దక్షిణాదిశాం గ్రీష్మఋతూనామింద్రో దేవతాక్షత్రం ద్రవిణంపంచ దశస్తోమః సఉపంచదశవర్తనిర్దిత్యవాడ్వయస్త్రేతాయానాం దక్షిణాద్వాతో వాతః సనాతనఋషిః ॥౨॥ ప్రతీచీదిశాం వర్షాఋతూనాం విశ్వేదేవా దేవతా విట్ద్రవిణగ్ం సప్తదశస్తోమః సఉవేకవిగ్ంశవర్తని స్త్రివత్సోవయోద్వాపరో యానాం పశ్చాద్వాతోవాతోహభూనఋషిః॥౩॥ ఉదీచీదిశాగ్ంశరదృతూనాం మిత్రావరుణౌదేవతాపుష్టంద్రవిణమేకవిగ్ంశస్తోమః సఉత్రిణవవర్తనిస్తుర్యవా డ్వయఆస్కందోయానాము త్తరాద్వాతోవాతః ప్రత్నఋషిః ॥౪॥ ఊర్ధ్వాదిశాగ్ంహేమంతశిశిరావృతూనాం బృహస్పతిర్దేవతావర్చోద్రవిణం త్రిణవస్తోమః సఉత్రయస్త్రిగ్ంశవర్తనిః పష్టవాడ్వయోఽభిభూరయానాం విష్వగ్వాతో వాతః సుపర్ణఋషిః ॥౫॥ పితరఃపితామహాఃపరేవరేతేనః పాంతుతేనోఽవంత్వస్మిన్ బ్రహ్మన్నస్మిన్ క్షత్రేస్యామాశిష్యస్యాం పురోధాయామస్మిన్ కర్మన్నస్యాందేవహూత్యాం॥

అత్రభాష్యమ్॥ తత్రప్రాచ్యాందిశ్యుపధేయానామిష్టకానామాహ॥ ప్రాచీదిశాం .........సానగఋషిః. హేఇష్టకేదిశాం మధ్యేయా ప్రాచీసాత్వమసి. ఋతూనాం మధ్యేయోవసంతః త్వంతద్రూపాసి, దేవానాంమధ్యేయోఽగ్నిః త్వంతద్రూపాసి. స్వకీయత్వేన సంపాదనానాం ద్రవిణానాం మధ్యేవిశిష్టబ్రాహ్మణ్యరూపం యద్ధనంతద్రూపా త్వమసి. స్తోమానాం మధ్యేత్రివృన్నామకః యఃస్తోమః త్వంతద్రూపాసి. సఉసోపిత్రివృత్స్తోమకః పంచదశవర్తనిః పంచదశస్తోమస్యప్రవర్తకః. బహిష్పవమానస్తోత్రేత్రివృత్ స్తోమప్రవృత్తౌసత్యాం తతఊర్ధ్వంభావిషు ఆజ్యస్తోత్రేషు పంచదశస్తోమాః ప్రవర్తంతే. తత్ప్రవర్తనరూపాత్వమసి. వయసాంమధ్యేత్ర్యవిసార్ధసంవత్సరరూపం యద్వయస్తద్రూపాత్వమసి. త్ర్యవిశబ్దః సార్ధసంవత్సర ముపలక్షయతి. అవిజాతౌప్రాయేణ గర్భధారణమారభ్య షష్ఠేమాస్యేనకశుర్జాయతే. త్రిసంఖ్యాకాః అవిజన్మకాలాయస్యవయసః తత్త్ర్యవిసహి సో చ్యతే. అయానాం యుగానాంమధ్యే యత్కృతయుగం త్వమసి. వాయూనాంమధ్యే పురోవాతోయోవాయుః తద్రూపాత్వమసి. ఋషీ

ణాంమధ్యే సానగాఖ్యః యఃఋషిః తద్రూపాత్వమసి. సమహానుభావః, దక్షిణస్యాః దిశ్యుపధేయానాం ఇష్టకానాం మంత్రమాహదక్షిణాదిశాం.........సనాతనఋషిః. మాధ్యందిన పవమానే పంచదశస్తోమమనుష్ఠాయ తతఊర్ధ్వం భానిష్ఠు పృష్ఠస్తోత్రే షు సప్తదశస్తోమోనుష్ఠాతవ్యః తదా సఏవ పంచదశస్తోమః. సప్తదశస్తోమం ప్రవర్త యతి. యాప్రవర్తనశక్తిః సాత్వమసి. వయసాంమధ్యే ద్విసంవత్సర వయో రూపాసి. దిత్యవాట్ఛబ్దేన సంవత్సరద్వయముపలక్ష్యతే. దిత్యం పురుషం బాలం వహ తీతిదిత్యవాట్ అవ్యాదిభేదే యఃకశ్చిదవాంతరజాతిరేకః ససంవత్సరద్వయేన బాలం వహతీతిదిత్యవాడితిదిత్యవాట్ఛబ్దః. సంవత్సరద్వయోపలక్షకః దక్షిణాత్ దక్షిణస్యాం దిశి. సప్తమ్యర్థకాన్వయం. శేషంపూర్వవత్ ప్రతీచీదిశాం......అహభూనఋషిః త్రయోవత్సాః యస్యాసౌత్రివత్సః తత్పరిమితంయద్వయః తద్రూపాత్వమసి, పశ్చాద్వాతరూపాసి, అహభూనఇతికస్యచిదృషేర్నామ సతుమహాప్రభావః త్వష్టృణాం యజ్ఞాదిప్రవర్తకః. ఉదీచీదిశాం.........ప్రత్నఋషిః—పుష్టశబ్దః వర్ణత్రయపో షకత్వే చ్ఛూద్రజాతిమాచష్టే. అతఏవవాజసనేయినః సమామనంతిసశౌద్రంవర్ణమసృజత పోషణమితి. తురీయంచతుర్థసంవత్సరం వహతీతితుర్యవాట్. సార్ధత్రివత్సరః-ధర్మా ఆస్కందయతీ త్యాస్కందః. కలియుగః యాగాదిధర్మాన్ శిథిలయతి. ప్రత్నఇతికస్య చిదృషేర్నామ. ఊర్ధ్వాదిశాం.........సుపర్ణఋషిః. వర్చఃబలమ్. చతుర్ష్వపిపశు షుయోబలవాన్. తద్రూపం ధనంత్వమసి. పృష్ఠేపృష్ఠే.భారం వహతీతిపష్ఠవాట్. సఏవదకారాం తశబ్దేనఉచ్యతే. వర్షచతుష్టయకాలరూపాసి. కృత్స్నం ధర్మం అభిభవ తీత్యభిభూఃకల్యవసానకాలః తద్రూపాత్వమసి. నానాదిక్షు సాంకర్యేణసంచరన్ వాయుః విష్వగ్వాతః. సుపర్ణఇతికశ్చిదృషిః, సోపిమహానుభావః. పితరః పితామహాః పరేవరేతేనః.........దేవహూంత్యామ్. హేపితరః హేపితామహాః హేపరే ప్రపితామహాదయః. అపరేభ్రాతృపుత్రాదయః ఈదృశాఃయేభవన్తః సన్తితేనః అస్మాన్ పాన్తు పాలయన్తు అవన్తు రక్షన్తు. అస్మిన్ బ్రహ్మన్ అస్యాంబ్రాహ్మణజాతౌ అస్మిన్ క్షత్రే అస్యాంక్షత్రియజాతౌ అస్యామాశిషిఏతస్యాం కామనాయాం అస్యాంపురోధాయాం రాజపౌరోహిత్యవృత్తౌ అస్మిన్ కర్మణిదేవతాహ్వానక్రియాయాం హేఇష్టకేత్వాముప దధామి—

తాత్పర్యము—ప్రాసాద నిర్మాణములయందును జయనయజ్ఞములయందును బహ్వాకృతి కుండనిర్మాణమునకును (లేక) యజ్ఞభూమియొక్క సర్వాకృతి నిర్మాణమునకును ప్రారంభమున మంత్రపూర్వకముగా నిష్టకలంబఱచుటకే యిష్టోపధానమందురు. ఈపైనం జెప్పినశుృతియె చయనయజ్ఞమందు పక్షిరూపమగు కుండనిర్మా

మున కిష్టకోపధానముయొక్క విధిచెప్పుచున్నది. ఇష్టకోపధానము ప్రాణభృత్సంజ్ఞ యనియు నపానభృత్సంజ్ఞయనియు రెండువిధములు. ప్రాణభృత్సంజ్ఞయగు నిష్టకోప ధానము "అయంపురోభవ" యను మంత్రమున వశిష్ఠుఁడు, భరద్వాజుఁడు, విశ్వా మిత్రుఁడు, జమదగ్ని, యను నలువుర మహర్షులను వరుసగా, తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తరము యీ దిక్కుల ననఁగా నాలుగుదిక్కులను నిష్టకోపధాన కర్తలుగా ననువదించి, తరువాతఁ జయనప్రాసాదాది సర్వశిల్పాధీశ్వరుఁడై మహామేధావియగు విశ్వకర్మ బ్రహ్మర్షిని సర్వయజ్ఞభూమి రక్షించుటకు, సర్వయజ్ఞకర్మల దర్శించుటకు నూర్ధ్వదిక్కున ననువదించెను. అందువలననే "విశ్వకర్మాత్వాసాదయ త్వంతరిక్షస్య పృష్ఠే" అను (యజుఃకాం ౪.3.౬॥)వచనోక్తివలన నూర్ధ్వదేశమున (నగ్నిస్థాపనను నిష్టకోపధానరచననుబరిశీలించుటకు మధ్యమదేశమవకాశముగలదగుటవలన)విశ్వకర్మ బ్రహ్మర్షిప్రతిష్ఠితుఁడయ్యె. అందువలననే'విశ్వకర్మాతేఋషిః' అను[యజుఃకాం ౪.3. ౪3.] వచనమునకు భాష్యమ్ "హేఇష్టకే విశ్వకర్మాతే తవఋషిర్ద్రష్టా" ఓయిష్టకా విశ్వకర్మయే నీకు ఋషి (నిన్నుజూచువా)డని యర్థము తెలియుచున్నది. ప్రాణభృ త్సంజ్ఞకమగు నిష్టకోపధానమున నీపైనఁ జెప్పినట్లు నిర్ధారణ మొనర్చి "ప్రాచీదిశాం" అను మంత్రములచే నపానభృత్సంజ్ఞయగు నిష్టకోపధానము ననువదించె. ఇందును బ్రాణభృత్సంజ్ఞవలెనె పూర్వ దక్షిణపశ్చిమోత్తరోర్ధ్వదేశముల వరుసగా, సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సుపర్ణులను నేవురు బ్రహ్మర్షులు ననువదింపఁబడిరి.వీరలె విశ్వకర్మాన్వయ సంభూతులగు బ్రహ్మర్షులు. వీరి విషయము సమగ్రముగా మఱియొక చోటఁ జెప్పఁబడును. ఇఁక నీపై మంత్రమున నిష్టకలమర్చుటలో "దశదశోపధాతి" అను [యజుఃకాం ౫. ౨. ౧౦॥] వచనమునవలన దిక్కునకొక పదియిష్టకలచొప్పున లెక్కతో నిర్ధారణ మొనర్చె, ఎట్లన:—

ప్రాచీదిశాం॥౧॥ [ఓయిష్టకాదిక్కులలోఁ బ్రాచివి] వసంతఋతూనాం ॥౨॥ [ఋతువులలో వసంతమవు] అగ్నిర్దేవతా ॥3॥ [దేవతలలో నగ్నివి] బ్రహ్మద్రవిణం ॥౪॥ [ధనంబులలో బ్రాహ్మణ్యరూపధనంబవు] త్రివృత్స్తోమః ॥౫॥ [స్తోమంబులలోఁ ద్రివృత్తవు] సఉపంచదశవర్తనిః ॥౬॥ [అత్రివృత్స్తోమమురాఁబోయెడు పంచదశస్తోమ ప్రవర్తకము బహిష్పవమానస్తోత్రమునఁ ద్రివృత్స్తోమము బ్రవర్తించినవెనుకఁ బైనా ద్యస్తోత్రమునఁ బంచదశస్తోమంబు బ్రవర్తించుచున్నది. అటులఁ బ్రవర్తింపఁజేయుశక్తి యు నీవె] త్ర్యవిర్వయః ॥౭॥ [వయస్సులలో నర్ధసంవత్సరమవు] కృతమయానాం ॥౮॥ [యుగములలోఁ గృతయుగమవు] పురోవాతోవాతః ॥౯॥ [వాయువులలోఁ దూర్పు

వాయువవు] సానగఋషిః ॥౧౦॥ (ఋషులలో సానగఋషివి) ఇది తూర్పుదెస ననుస
రించిన యిష్టకోపధానము. ఇట్లే పదియిష్టకలు దక్షిణంబున, దక్షిణాదిశాం ॥౧॥ [ఓ
యిష్టకా దిక్కులలో నీవు దక్షిణదిక్కువు] గ్రీష్మఋతూనాం ॥౨॥ [ఋతువులలో
గ్రీష్మఋతువవు] ఇంద్రోదేవతా ॥౩॥ [దేవతలలో నింద్రుండవు] క్షత్రంద్రవిణం ॥౪॥
[ధనంబులలో క్షత్రరూపధనంబవు] పంచదశస్తోమః ॥౫॥ [స్తోమంబులలోఁ బంచదశస్తో
మంబవు] సఉసప్తదశవర్తనీః ॥౬॥(మాధ్యందినపవమానస్తోత్రంబునఁ బంచదశస్తోమం
బమర్చి పైరాఁబోయెడు పృష్ఠస్తోమంబున సప్తదశస్తోమంబు సేయవలయును. అప్పుడు
పంచదశస్తోమంబు సప్తదశస్తోమంబునకుఁ బ్రవర్తకంబు.ఆప్రవర్తనాశక్తియునీవె) దిత్య
వాడ్వయః ॥౭॥ [వయస్సులలో వర్షద్వయ వయస్సవు] త్రేతాయూనాం ॥౮॥[యుగం
బులలోఁ ద్రేతవు] దక్షిణాద్వాతోవాతః ॥౯॥ [వాయువులలో దక్షిణవాయువవు]
సనాతనఋషిః ॥౧౦॥ [ఋషులలో సనాతనఋషివి] ఇది దక్షిణదిక్కునందలి యిష్టకో
పధానము. ఇఁకఁ బశ్చిమదిక్కున. ప్రతీచీదిశాం ॥౧॥ [ఓయిష్టకా! దిక్కులలోఁ బ
మటదెసవు] వర్షర్తూనాం ॥౨॥ [ఋతువులలో వర్షమవు] విశ్వేదేవాదేవతా ॥౩॥ [దే
వతలలో విశ్వేదేవతలవు] విడ్ద్రవిణం ॥౪॥ (ధనంబులలో వైశ్యరూపధనంబవు) సప్త
దశస్తోమః ॥౫॥(స్తోమంబులలో సప్తదశస్తోమంబవు) సఉవేకవిగ్ంశవర్తనీః ॥౬॥ (సప్త
దశస్తోమానంతరమందలి యేకవింశస్తోమవు నీవె)త్రివృత్తోవయః ॥౭॥ (వయస్సులలో
మూడుసంవత్సరముల వయస్సవు) ద్వాపరోయూనాం ॥౮॥ (యుగములలో ద్వాప
మవు) పశ్చాద్వాతోవాతః ॥౯॥ (వాయువులలోఁ బశ్చిమవాయువవు) అహభూన
ఋషిః ॥౧౦॥ (ఋషులలో సహభూనఋషివి) ఇది పడమటిదెసయందలి యిష్టకోప
ధానము. ఇఁకనుత్తరదిశయందలి యిష్టకోపధానము. ఉదీచీదిశాం ॥౧॥ (ఓయిష్టకా
దిక్కులలో నుత్తరదిశవు) శరదృతూనాం ॥౨॥ (ఋతువులలో శరదృతువవు) మిత్రా
వరుణోదేవతా ॥౩॥ [దేవతలలో మిత్రావరుణులవు] పుష్టంద్రవిణం ॥౪॥ (ధనంబు
లలో శూద్రరూపధనంబవు) ఏకవిగ్ంశస్తోమః ॥౫॥ [స్తోమంబులలో నేకవింశస్తోమం
బవు] సఉత్రిణవవర్తనీః ॥౬॥ [ఏకవింశస్తోమానంతరమునఁ బ్రవర్తింపఁబడు సప్తవిం
స్తోమంబవు నీవె] తుర్య వాడ్వయః ॥౭॥ [వయస్సులలో మూడున్నర సంవత్సరవయ
స్సవు నీవ] ఆస్కందోయూనాం ॥౮॥ [యుగములలోఁ గలియుగంబవు] ఉత్తరాద్వా
తోవాతః ॥౯॥ [వాయువులలో నుత్తరవాయువవు] ప్రత్నఋషిః ॥౧౦॥ [ఋషులలో
బ్రత్నఋషివి] ఇయ్యది యుత్తరదిశయందలి యిష్టకోపధానము. ఇఁక నూర్ధ్వదిశ
యందలి [మధ్యమ ప్రదేశమందలి] యిష్టకోపధానము. ఊర్ధ్వాదిశాం ॥౧॥ [దిశలలో
నూర్ధ్వదిశవు] హేమంతశిశిరాఋతూనాం ॥౨॥ [ఋతువులలో హేమంతశిశిరఋతు

వులవు] బృహస్పతిర్దేవతా ॥3॥ [దేవతలలో బృహస్పతివి] వర్చోద్రవిణం॥౪॥ [ధనము లలో జతుర్వర్ణములలో బలమైన ధనమెయ్యదియో యాధనంబవు] త్రిణవస్తోమః॥౫॥ [స్తోమంబులలో సప్తవింశస్తోమంబవు] సజుస్త్రయస్త్రింగ్ంశవర్తనీః ॥౬॥ [సప్తవింశస్తో మానంతరమున జరుపఁబడు త్రయస్త్రింశస్తోమంబవు నీవ] షష్ఠవాడ్వయః ॥౭॥ [వయస్సులలో నాలుగుసంవత్సరముల వయస్సవు] అభిభూరయానాం ॥౮॥ [యుగములలోఁ గల్యవసానకాలంబవు] విష్వగ్వాతోఽవాతః ॥౯॥ [వాయువులలో సుడిగాలివినీవ] సుపర్ణఋషిః ॥౧౦॥ [ఋషులలో సుపర్ణఋషివీవ] ఇట్లూర్ధ్వదిశయందలి యిష్టకోప ధానము. ఈ పై మంత్రములచే నేర్పరుపఁబడిన యిష్టకలు దిశదిశకు దశసంఖ్యాక ముగ నుంచవలెనని తేలినదిగదా! ఆయిష్టకలే "హిరణ్యేష్టకా ఉపదధాతి" [యజుః కాం ౫. ౭. ౬. ౨. 3] అను వచనముచే బంగరుచేఁ జేయబడినవిగా నుండవలె ననియు నట్లె బోధాయనశ్రౌతసూత్రోక్తచయన ప్రయోగమునందు "హిరణ్యశకలం నిధాయ" అని హిరణ్యశకలమునుంచవలెననియుఁ జెప్పియుండుటచేతను హిరణ్యశకల రూపములయిన సువర్ణేష్టకలఁ జయనమొసర్పవలెనని పర్యవసించుచున్నది. బంగరు టిటి కలఁగూర్చి యీ క్రిందివిధముగఁ దెలియుచున్నది.

శ్రుతిః॥ విశ్వకర్మాదిశాంపతిస్సనః పశూన్పాతుసోఽస్మాన్పాతుతస్మైనమః ప్రజాపతీరు
ద్రోవరుణోఽగ్నిర్దిశాంపతిఃసనః పశూన్పాతుసోఽస్మాన్పాతుతస్మైనమఃఏతా
వై దేవతాఏతేషాం పశూనామధిపతియస్తాభ్యోవాఏషఆవృశ్చతే యత్పశుశీర్షా
ణ్యుపదధాతిహిరణ్యేష్టకాఉపదధాత్యేతాభ్యఏవదేవతాభ్యోనమస్కరోతి॥

యజుఃకాం ౫. ప్ర ౫. అ ౫. మం ౧.

సాయణభాష్యమ్॥ అథపంచమే హిరణ్యేష్టకాద్యాఉచ్యన్తే॥ యదుక్తం సూత్ర కారేణ "విశ్వకర్మాదిశాంపతి" రితిపంచహిరణ్యేష్టకాం ప్రతిదిశామేకాంమధ్యే ఇతి మన్త్రానుత్పాదయతి. "విశ్వకర్మా.........నమ" ఇతి యోఽయం విశ్వకర్మా దిశాంపాలకః సోఽస్మదీయాన్పశూనస్మాంశ్చరక్షతు. తస్మైవిశ్వకర్మణేనమః ప్రజా పతిరిత్యాదిభిః చతుర్భిః పదైశ్చత్వారో మన్త్రాఉత్పన్నాః సర్వత్రానుషంగాయ దిశాం పతిరితిపునఃపాఠః॥ "ఏతావై.........నమస్కరోతి" పురుషాశ్వర్షభవృష్ణి బస్తానామేతేషాం పశూనాం విశ్వకర్మాదయః స్వామిభూతాదేవతః ఏవంసతిపశుశీర్షో

పధానే తాభ్యో దేవతాభ్యో ఆవృశ్చతే తాసాం దేవతానాం ద్రోహీభవతీత్యర్థః అత త్పరిహారాయ హిరణ్యేష్టకాఉపదధ్యాత్, హిరణ్యశకలాపవ హిరణ్యేష్టకా స్తదుపధానేన తాభ్యోనమస్కరోతి, తన్మాత్రేషు తస్మైనమ ఇతిదర్శనాత్.

తరువాతఁ బంచమానువాకమున హిరణ్యేష్టకాదులు చెప్పఁబడినవి. "విశ్వకర్మాదిశాంపతి"యను నైదుమంత్రములచే ప్రతిదిశయం దొక్కొక్క హిరణ్యేష్టకను నుపవలెను. ఆయీ విశ్వకర్మ దిక్కులను బాలించువాఁడు. అట్టి విశ్వకర్త మా సంబంధములగు పశువులను మమ్ములను రక్షించుఁగాత! అట్టి విశ్వకర్మకొఱకు నమస్కారము. ప్రజాపతి, రుద్రుఁడు, వరుణుఁడు, అగ్ని, యను నాలుగుపదములచే నాలుగు మంత్రములు గలుగుచున్నవి. మంత్రమంతటఁ గలిసియుండుటచేత "దిశాంపతి" యని తిరిగి పఠించవలెను. పురుషుఁడు, అశ్వము, వృషభము, పొట్టేలు, మేకపోతు, అను నీయైదు పశువులకు, విశ్వకర్మ, ప్రజాపతి, రుద్రుఁడు, వరుణుఁడు, అగ్ని, అను నేగురు పరిపాలకులైన దేవతలు. ఇటుల నగుచుండఁ బశుశిరస్సులఁ బరచునపుడు, ఆదేవతలకు యజమానుఁడు ద్రోహియగుచున్నాఁడు. అందువలన నాయుపరాధపరిహారముకొఱకు హిరణ్యేష్టకలనుంచవలెను. హిరణ్యశకలములే, హిరణ్యేష్టకలు. ఆ యిటికలనుంచుటచే నాయా మంత్రములయందు వారివారి కొఱకు నమస్కారము చెప్పుటవలన, ఆ దేవతలకొఱకు నమస్కారమొనర్చుచున్నాఁడు. ఇట్లు నక్కాణించియుండుటచే హిరణ్యేష్టకలునుంచుటకుఁ బ్రథమకారణుఁడు సర్వశిల్పకర్తయగు విశ్వకర్మ యనియె తెలియుచున్నది.

ప్రాణభృత్సంజ్ఞకమగు నిష్టకోపధానమునఁ బూర్వదక్షిణ పశ్చిమోత్తరములయందువరుసగా వసిష్ఠ భరద్వాజ విశ్వామిత్ర జమదగ్నులను నిలిపి యూర్ధ్వదిశయను మధ్యమదేశమున సర్వదిష్టతకు విశ్వకర్మబ్రహ్మర్షిని నిలుపుటచేతను ననంతరమగు నపానభృత్సంజ్ఞకమగు నిష్టకాచయనమందు "ప్రాచీదిశాం" "దక్షిణాదిశాం" "ప్రతీచీదిశాం" "ఉదీచీదిశాం" "ఊర్ధ్వాదిశాం" అను మంత్రములలో వరుసగా, సానగఋషిః, సనాతనఋషిః, అహభూనఋషిః, ప్రత్నఋషిః, సుపర్ణఋషిః, అని చెప్పియుండుటచేతను, నీసానగాది పంచఋషులు సర్వశిల్పాధినాయకుఁడును సర్వయజ్ఞద్రష్టయు నగు విశ్వకర్మబ్రహ్మర్షికిఁ బ్రతినిధులని తోఁచకమానదు. ఈపైని చయనవిధానమంతయు వివరముగాఁ గాత్యాయన శ్రౌతసూత్రమునందు విశదపరచియున్నది. గ్రంథవిస్తరభీతిచే నిచటవ్రాయక విరమింపఁబడినది. శిల్పర్షులును బ్రహ్మరులును సానగాదులను గూర్చి విచారింపుదము.

## సానగాది బ్రహ్మర్షుల జననము.

శౌనకప్రశ్నే, శౌనకఉవాచ } శ్లో॥ తన్ముఖేషు యథాజాతా సానగాద్యామహర్షయః
తత్ప్రశంసాకథంలోకే వర్తమానేచరంతితే॥ ౧౨
వసిష్ఠఉవాచ॥ సుపర్ణఃసానగశ్చైవ సనాతన ఇతిస్మృతః
గురుశ్రేష్ఠోఽహాభూనశ్చ ప్రత్నోఽథాత్రీసురక్షకః॥ ౧౩
విశ్వకర్మముఖోద్భూతా బ్రాహ్మణాః పంచకీర్తితః
సద్యోజాతముఖేజాతో సానగోవిశ్వకర్మణః॥ ౧౪
వామదేవముఖేజాతో బ్రహ్మర్షిస్తుసనాతనః
అఘోరముఖసంజాతోఽహాభూనో విశ్వకర్మణః॥ ౧౫
తత్పురుషేముఖేజాతః ప్రత్నోఽసావిశ్వకర్మణః
తస్యేశానముఖేజాతస్సుపర్ణో విశ్వకర్మణః॥ ౧౬
వసిష్ఠోపపురాణము. కాం ౩. అ ౬.

శౌనకుఁడు వసిష్ఠునిగూర్చి ఆవిశ్వకర్మముఖములయందు సానగాదిమహర్షులెట్లు పుట్టిరి? వారినిగూర్చి వర్తమానప్రజలెట్లు ప్రశంసించుచున్నారని యడుగ వసిష్ఠుఁడిటులఁ జెప్పెను. సుపర్ణుఁడు సానగుఁడు సనాతనుఁడు అహాభూనుఁడు ప్రత్నుఁడనునైదుగురు బ్రాహ్మణులు విశ్వకర్మముఖమునం దుద్భవించిరి. విశ్వకర్మయొక్క సద్యోజాతమను ముఖమునందు సానగుఁడును వామదేవముఖమునందు సనాతనుఁడును, అఘోరముఖమునందు అహాభూనుఁడును, తత్పురుషముఖమునందు బ్రత్నుఁడును, ఈశానముఖమునందు సుపర్ణుఁడును బుట్టిరి అని వసిష్ఠోపపురాణమునందుఁ జెప్పఁబడియెను. పద్మపురాణభూఖండ విశ్వకర్మోపాఖ్యానమందలి "పంచవక్త్రం దశభుజం బ్రహ్మచారివ్రతేస్థితం" అను వచనమువలన విశ్వకర్మకుఁ బంచముఖములయినటులఁ దెలియవచ్చుచున్నది. ఈవిషయమునే తైత్తిరీయ పంచబ్రహ్మోపనిషత్తునందిటులఁ జెప్పఁబడెను.

## తైత్తిరీయ పంచబ్రహ్మోపనిషత్.

యస్మాద్విశగ్ సమస్తంక్రియతే । సమాంవిశ్వకర్మాపాతు । విశ్వస్రష్టా విశ్వభర్తా విశ్వశాంతికః । జీవాతాభువనానాం సిద్ధానాం కిన్నరాణాం యఃపురాణశ్చ జీమూతవర్షకః । త్రాతానుమాతా పురుషఃపరః । విరాడ్విశ్వకర్మా స్వరాడ్విశ్వకర్మా

సగ్ంరాడ్విశ్వకర్మా । బ్రహ్మవిష్ణురుద్రశతమఖాదయో దేవాజాయంతే। విశ్వేదేవా వసవః పితరోగంధర్వాఇమే సర్వేలోకాశ్చేతి విశ్వకర్మణః । వ్యోమ్నోమారుతః । మారుతాద్వైశ్వానరః । వైశ్వానరాజ్జలం । జలాద్భూమిః । భూమ్యాఓషధయః । ఓషధీభ్యోబీజాని । బీజేభ్యోఽఖిలసస్యాని । సస్యోద్భవంధాన్యం । ధాన్యేభ్యోఽన్నంభవతి । అన్నాదేవరసః । తద్రసేనజంతూనాగ్ సర్వేషాగ్ రేతః శుక్రశోణితరూపమేవాహ । తస్మాత్పిండాస్సముత్పన్నాః । సముత్పన్నానిస్థావరజంగమరూపాణి । జాతాన్యనేకానిపిండబ్రహ్మాండాని । ఇతివిశ్వకర్మణాభూతాని। విశ్వకర్మణావృద్ధాని । తేనైవాహప్రతిష్ఠితాని । పంచముఖేభ్యః పంచశీర్షస్యాస్యమనుఃప్రథమః । మయోద్వితీయః । త్వష్టాతృతీయః । శిల్పీచతుర్థః । విశ్వజ్ఞఃపంచమఇతిసపవార్క్-విధేయతే । సానగః సనాతనోఽహభూనః ప్రత్నః సుపర్ణశ్చేత్యేతేచసర్వేగోత్రపురుషాః । ప్రాకృతేష్వాద్యాద్యా । ఈశ్వరోవిశ్వకర్తాఆహుః । కశ్యపోఽత్రిస్తాభ్యాగ్ సూర్యచంద్రాదయో జాయంతే । గవాద్యాః కుంభిసూత్రాః । స్థలజాజలజాఃకీటకాశ్చతుర్విధాః ప్రకృతయః। ప్రజాతావేదవిద్యాః సాంఖ్యాదయోఽపి కర్మజ్ఞానబోధకాః । నిగమాగమాశ్చ । సర్వం విశ్వం నిర్మితం । సవిశ్వకర్మాపరబ్రహ్మేత్యుపనిషత్ । యఏతదుపనిషత్పఠేత్ప్రాతరాదిసమయే । ససర్వపాపైఃప్రముచ్యతే । తద్వైవం విశ్వకర్మకారణమ్, పంచబ్రహ్మాధిగచ్ఛతి॥

ఈ యుపనిషన్మధ్యమమున విశ్వకర్మయె సర్వకర్తయని చెప్పఁబడియె. అండపిండబ్రహ్మాండములన్నింటిని సృజించిన విశ్వకర్మకైదుముఖములుండెననియు నట్టి పంచముఖముల మనువు, మయుఁడు, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞుఁడునను నేఁగురు బ్రహ్మలు పుట్టిరనియు, నట్టి పంచబ్రహ్మోపాసకులగు బ్రాహ్మణులకు గోత్రకర్తలయి వరుసగా సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సుపర్ణులను మహర్షులేవురు జనించిరనియు సర్వనిర్మాణకర్తయు సర్వాధిపతియునగు నవ్విశ్వకర్మ నీయుపనిషద్రూపమున స్తుతియించిన సర్వకాలముల సమస్తపాపములు పరిహరించుననియు ముఖ్యార్థము. మనుమయాదుల విషయమింకను బద్మపురాణభూఖండమందును స్కాందపురాణ నాగరఖండ విశ్వకర్మోపాఖ్యానమునందును, మఱియుఁ బెక్కుశిల్పములయందును బ్రశంసింపఁబడియె. వానినన్నిటిని సాధ్యమయినంతవరకు రథకారకాండమున వివరింపఁబడును. ఇఁక నీ సానగాదులగూర్చి బ్రహ్మాండపురాణ వచనమును మాత్రమొకింతవ్రాసి విరమించఁబడును.

శ్లో॥ నమోస్తుతే సానగవిశ్వకర్మణే నమోస్తుతే పూర్వముఖోద్భవాయ
నమోస్తు షడ్భూతవినిర్మితాయ నమోస్తు చిద్రూప నమోనమస్తే ॥౧॥
సాధనంనాస్తి సర్వత్రలోకానాం సర్వసాధకః
కరోతి లోహకర్మాణి లోకాన్ రక్షతిసానగః ॥౨॥
దదౌశస్త్రాణిదేవానాం దుష్టనిగ్రహకారణాత్
సచసర్వం జగత్కర్తాసద్యోజాతముఖోద్భవః ॥౩॥
శూలందదాతిభర్గాయ చక్రం దత్తంచవిష్ణవే
పాశస్తుబ్రహ్మణేదత్త స్త్రిమూర్త్యాత్మగ సానగః ॥౪॥
క్షుత్తృష్ణాదినివృత్తాత్మా జాయతే దక్షిణాముఖాత్
సనాతనోదారుకర్మకుశలో నిర్మమేపురా ॥౫॥
హలాదీనాంతు కర్తవ్యం మందిరాణాం విశేషతః
స్యందనాదీనియానాని వికరోతిసనాతనః ॥౬॥
సంస్తుతోనారదాద్యైస్తు హభూనఋషిసత్తమః ॥౭॥
అశేషమునిభిః పూజ్యస్త్వఘోరవదనోద్భవః
యోగార్ణపత్యధర్మస్య వినిర్మాతాజగద్విభుః ॥౮॥
త్వష్టాస్వర్ణాదిభిర్లోహైః పాత్రాణివికరోతిసః
ప్రత్నోవిశ్వస్యకర్తాసౌజగద్రక్షా పరాయణః ॥౯॥
బ్రహ్మణోద్యదఙ్ముఖాజ్జాతః ప్రవరఃప్రత్నసంతతేః
మహోన్నతో మహాత్మానై పీనవక్షాస్సుసుందరః ॥౧౦॥
అనాదినిధనః స్వర్ణః సుపర్ణస్తస్యనామహి
స్వర్ణం దదాతిలోకానాం బ్రహ్మణ్యూర్ధ్వముఖోద్భవః ॥౧౧॥
కిరీటకుండలాదీనాం భూషణానాం ప్రయోజకః

బ్రహ్మాండపురాణ ద్వితీయపటలము
విశ్వకర్మోపాఖ్యానము.

విశ్వకర్మ పరమేశ్వరుని పూర్వముఖమునఁబుట్టి సమస్త భూతనిర్మాణమొనర్చు చిద్రూపుఁడవైన సానగవిశ్వకర్మా నీకొఱకు నమస్కారము. ఏ యుపకరణములు లేక సర్వలోకసాధకుఁడై సానగబ్రహ్మర్షి లోహకర్మలుచేయుచు లోకములను రక్షించుచున్నాఁడు. మఱియు నాసానగుఁడు దుష్టనిగ్రహకారణముగా దేవతలకు శస్త్రాస్త్రము లొసంగెను. అతఁడె సద్యోజాతముఖోద్భవుఁడు. సర్వజగములసృజించువాఁడు. అతఁడే

భర్గునకు శూలమును, విష్ణువునకుఁ జక్రమును, బ్రహ్మకుఁ బాశమను నాయుధవిశేషము నొసంగెను. అఁకలిదప్పికను దీర్చఁదగిన దారుకర్మకుశలుఁడగు సనాతనబ్రహ్మర్షి పరమేశ్వరుని దక్షిణముఖమున జనించెను. ఆ మహర్షియె పూర్వము హాలాదులను, మందిరములును, రథములును, విమానములును, సృజించెను. నారదాదులచే స్తుతిఁ జేయఁబడు నహాభూనబుషివర్యుఁడు పరమేశ్వరుని పశ్చిమవదనమగు నఘోరనామ ముఖమున నుద్భవించెను. ఆజగద్విభుఁడు గృహస్థధర్మమున కుపయుక్తములగు నుపకరణముల సృజించెను. సువర్ణాదులైన లోహములచేఁ బాత్రలెల్ల నాత్వష్టయెనిర్మించెను. విశ్వకర్తయును జగద్రక్షాపరాయణుఁడునగు ప్రత్న మహర్షి పరమేశ్వర విశ్వకర్మ యొక్క యుదఙ్ముఖమున జనించెను. ఇతఁడు ప్రత్నసంతతికిఁ బ్రవరుఁడయ్యె. మహోన్నతుఁడును మహానుభావుఁడును విశాలవక్షుఁడును సుందరాకృతిగల సుపర్ణుఁడను మహర్షి విశ్వకర్మోర్ధ్వముఖమునఁ బుట్టెను. ఇమ్మహాత్ముఁడు సువర్ణశిల్పము లొనర్చుచుఁ గిరీటములు, కుండలములు, భూషణములు మున్నగువానినన్నిటి సృజియించును.

ఇట్లుదాహృతమగుటచే నిష్టకాచయనమందలి శిల్పకార్యానునదులై సానగాది మహర్షులు విశ్వకర్మమహర్షికిఁ దనూజాతులును దత్సంతతికి గోత్రర్షులు నగుట విశదమయ్యెను.

## పితృగణమే శిల్పిగణము.

ఈ పైన వ్రాసిన "ప్రాచీదిశా" మను మంత్రముల చివర "పితరః పితామహాః.........దేవహూత్యామ్" అని చెప్పఁబడినది. అందలి యర్థమో తండ్రులారా! ఓ తాతలారా! ఓప్రపితామహులారా! ఓసహోదరులారా! దేవతారూపులుగ మీ రెవ్వరుగలరో మీరెల్లరు మాభయమువోనఁడచి మమ్ములఁ గాపాడుదురుగాత! అన్నవస్త్రాదులచేఁ బోషించుదురుగాత! ఈబ్రాహ్మణజాతియందును ఈక్షత్రియజాతియందును ఈప్రార్థనయందును ఈ రాజపౌరోహిత్యమందును దేవతలఁ బిలుచునట్టి యీకర్మలయందును ఓయిష్టకా నిన్నుఁదలఁచెదము. అని పితృగణమును శిల్పకార్యమునఁ బ్రార్థింపఁబడియె. ఇందుచేఁ బితృగణమెయ్యదని శిల్పగణమునకుఁ బితృగణమునకేమైన సంబంధముగలదాయని విచారింపవలసివచ్చినది. పూర్వోక్తమగు నైతరేయబ్రాహ్మణపంచికమున "శిల్పానిశంసంతి" అను శ్రుత్యంతరభాష్యమున "నాభానేదిష్ఠాదిశిల్పమాశ్చర్యకరమితి నిశ్చేతవ్యమ్.........యస్మాన్నాభానేదిష్ఠాదీనిశిల్ప

శబ్దవాచ్యానితస్మాత్సువర్ణాభరణాదివత్పూజ్యా” నీత్యర్థః “అనినాభానేదిష్ఠాది శిల్పమాశ్చర్యకరమనియు శిల్పశబ్దముతోఁ జెప్పఁదగిన నాభానేదిష్ఠాదులు సువర్ణాభరణాదులవలెఁ బూజింపఁదగినవనియుఁ జెప్పఁబడియె. అందువలన నీనాభానేదిష్ఠాది దేవశిల్పమెయ్యది? ఈనాభానేదిష్ఠుఁ డెవ్వఁడు? అని విచారింపవలసియున్నది.

## నాభానేదిష్ఠుఁడు.

ఐతరేయ బ్రాహ్మణత్రింశోఽధ్యాయమునందే,

హోతుః శిల్పంవిధత్తే । నాభానేదిష్ఠంశంసతి ఇతి ॥

నాభానేదిష్ఠాఖ్యేన మహర్షిణాదృష్టమిదమిత్థేత్యాదిసూక్తం నాభానేదిష్ఠంతద్ధోతాశంసేత్.

తత్ప్రశంసతి.

రేతో వై నాభానేదిష్ఠో రేత స్తత్సించతి, ఇతి

ఏతైస్సూక్తైర్యజమానస్యాఽత్మసంస్కారో వేదమయ జన్మరూపోఽభిహితః సపవక్రమేణోపవర్ణ్యతే, తత్రనాభానేదిష్ఠాఖ్యః సూక్తవిశేషో యజమానోత్పాదనరేతస్థానీయః । తత్తేనసూక్తేనహోతా రేతస్సించతి.

హోతయొక్క శిల్పముచెప్పఁబడుచున్నది. నాభానేదిష్ఠుఁడను మహర్షిచేతఁ జెప్పఁబడిన యీసూక్తము నాభానేదిష్ఠమనఁబడును. దానిని హోత ప్రశంసించుచున్నాఁడు.

ఈసూక్తములచేత యజమానున కాత్మసంస్కారము వేదస్వరూపమువలె నెయ్యది చెప్పఁబడినదో యది క్రమముగా నుపవర్ణింపఁబడుచున్నది. అక్కడి నాభానేదిష్ఠమను సూక్తవిశేషము యజమానున కుత్పాదకమగు రేతస్థానముగా నిర్ణయింపఁదగినది. అందుచే నాసూక్తముచే హోతరేతస్సేచనము చేయుచున్నాఁడు. అని నాభానేదిష్ఠుఁడను నొకమహర్షి రేతస్సేచనమను శిల్పమొనర్చుచు నీసూక్తమొనర్చెనని తెలియుచున్నది. మఱియు, నీ యధ్యాయమునందె,

తస్యనాభానేదిష్ఠస్య సూక్తాంతరసాహిత్యంవిధత్తే
తంనారాశంసంశంసతి ప్రజావై నరోవాక్శంసః ।

ప్రజాస్వేవతద్వాచం దధాతితస్మాదిమాఃప్రజా
వదత్యోజాయంతే ! ఇతి.

భా॥ తం నాభానేదిష్ఠాఖ్యం సూక్తవిశేషంనారాశంసాఖ్య సూక్తసహితః హోతా శంసేత్. నరా అంగిరసోమహర్షయో మనుష్యజాతావుత్పన్నత్వాత్తే శస్యంతే యస్మిన్నేయజ్ఞేనేతిసూక్తవిశేషే సోఽయంనారాశంసస్తేనసహితమిదమిత్థాశాద్రమిత్యే తన్నాభానేదిష్ఠం సూక్తంశంసేత్, తత్రమనుష్యరూపాః ప్రజాఏవనరాశబ్దేనాభిధీయంతే శంసశబ్దేనచవాగుచ్యతే। తథాసతినరాశంసశబ్దేన ప్రజాస్వేవ వాచమవస్థాపయతి తస్మాత్కారణాదిమాః ప్రజా వదత్యో వాగ్వ్యవహారం కుర్వత్యఉత్పద్యంతే। అత్రేదం చింతనీయమ్। కిమిదం నారాశంస సూక్తం నాభానేదిష్ఠ సూక్తస్యపురస్తాత్పఠనీయమ్ ఉతోపరిష్టాత్ అథవామధ్యఇతి.

ఆనాభానేదిష్ఠసూక్తమును నారాశంససూక్తముతోఁగూడ హోతప్రశంసించుచున్నాఁడు. నరులన నంగిరోమహర్షులు. వారు మనుష్యజాతియందుఁ బుట్టుటచే "యేయజ్ఞేన" అను సూక్తమునందుఁ బ్రశంసింపఁబడుచున్నారు. అదియే నారాశంససూక్తము. ఆసూక్తముతోఁగూడ నీ "ఇదమిత్థారౌద్ర"మను నాభానేదిష్ఠసూక్తమును బొగడవలెను. అక్కడ మనుష్యరూపులైన ప్రజలే నరాశబ్దముచే జెప్పఁబడుచున్నారు. శంసశబ్దముచే వాక్కు చెప్పఁబడుచున్నది. అట్లగుటచే నరాశంసశబ్దము ప్రజలయందే వాచకమును స్థాపించుచున్నది. ఆకారణమువలనఁ బ్రజలు వాగ్వ్యవహారముఁజేయుచు బుట్టుచున్నారు. నారాశంససూక్తము నాభానేదిష్ఠసూక్తము కంటె ముందుగానైనను మధ్యయందైనను బఠింపఁదగినది అని చెప్పఁబడియుండుటచే నారాశంససూక్తమును విచారించుదము.

నారాశంససూక్తము.

శ్రుతి॥ యేయజ్ఞేనదక్షిణయా సమక్తాఇంద్రస్య సఖ్యమమృతత్వమానశ ।
తేభ్యోభద్రమంగిరసోవో అస్తుప్రతిగృభ్ణీతమానవంసుమేధసః॥

ఋగ్వే. అ. ౮ అ ౨. వ ౧. ఋ ౧.

భాష్యమ్॥ నాభానేదిష్ఠః స్వపిత్రామనునాభ్యనుజ్ఞాతః సత్రమాసీనానాంగిరసోఽభ్యేత్యమాంప్రతిగృహ్ణీత యుష్మభ్యం యజ్ఞం ప్రజ్ఞాపయామి ఇతియదుక్తవాన్ తదుచ్యంతే.

తా॥ నాభానేదిష్ఠుఁడు తన తండ్రియగు మనువుచేత నాజ్ఞాపింపఁబడినవాఁడై సత్రియాగమందుఁ గూర్చుండిన యంగిరస్సులగూర్చి మీరు చాలబుద్ధిమంతులరు. యజ్ఞభాగమందలి కర్మకౌశలురు. ఇందువలన మిత్రులరు. అట్టి మీకు శుభమగుగాత. మీరు మమ్ముల గ్రహించవలెనని పొగడెను. ఈచెప్పుటచే నాభానేదిష్ఠుఁడు శిల్పియయినటులనే నారాశంసులు (నంగిరసులు) గూడ శిల్పులేయయినటుల గానవచ్చుచున్నది.

ఆంగిరసగణమె శిల్పిగణము.

అథయదాౘ్రిజానాగవిష్ఠాసరత్సరణ్యుః కారవే జరణ్యుః ।

విప్రః శ్రేష్ఠః సహ్యేషాం బభూనపరాచవక్షద్దుతపర్యదేనాౕ॥

ఋగ్వే అ ౮. ౧. ౩౦.

భాష్యమ్॥ హేరాజానౌ రాజమానౌమిత్రవరుణౌ అథ అధునాసత్రిసమాప్తౌ యద్యస్మాత్ గవిష్ఠౌ గవామేషణాయాం సత్యాం సరణ్యుః సరణశీలోయః సరత్ గచ్ఛతి। కింకుర్వౕ కారవేకర్మకుర్వతే అంగిరసాంగణాయ జరణ్యుః స్తుతిమిచ్ఛౕ తస్మాత్ సవిప్రోనాభానేదిష్ఠః ఏషామంగిరసాం శ్రేష్ఠః ప్రియతమోబభూవ.

అనఁగా నాభానేదిష్ఠుఁడను బ్రాహ్మణుఁడు గోవులవెదకుటకుఁ బోవుచు శిల్పకర్మచేయుచున్న యంగిరస్సుల గణమును నుతిఁజేయుటవలన నాయంగిరోగణమునకు స్నేహితుఁడయ్యెను. ఈచెప్పుటవలన నారాశంససూక్తమందుఁ జెప్పఁబడిన యంగిరోగణము శిల్పగణమయినటుల విస్పష్టమయినది. ఇఁక నాభానేదిష్ఠుఁడెవ్వఁడనిన,

నాభానేదిష్ఠుఁడు విశ్వకర్మకు దౌహిత్రుఁడు.

శ్రుతి॥ తద్బంధుః సూరిర్దివితేధియన్ధానాభానేదిష్ఠో రపతిప్రవేనౕ।

సానోనాభిః పరమాస్యవాఘాహంతత్పశ్చాకతిథశ్చిదాస॥

ఋగ్వే ౮. ౧. ౨౯.

భాష్యమ్॥ తచ్చాదిత్యపుత్రోమను ర్మనోః పుత్రో నాభానేదిష్ఠఇత్యేవం సూర్యాపత్యం పర్యవస్యతి, సూర్యనాభానేదిష్ఠయోః సంబంధశ్చరమపాద ఉత్తరమ

న్త్రైచవక్ష్యతే. సచధియన్తాః కర్మణాంధారకో నాభానేదిష్ఠోవేనః అంగిరోద త్తం గోసహస్రం వేనః కామయమానః ప్రలపతిస్తాతిరిత్యర్థః॥

ఇందలి ముఖ్యార్థము సూర్యపుత్రుఁడు మనువు, మనువుపుత్రుఁడు నాభానేది ష్ఠుఁడని తెలియుచున్నది. ఇందుల కనుకూలముగ,

శ్లో॥ అదితిః సుషువేపుత్రమాదిత్యం కశ్యపాద్ద్విజాః
తస్యాదిత్యస్యచై వాసీ ద్భార్యాత్రయమథాపరమ్ ॥౨॥
సంజ్ఞారాజ్ఞీప్రభాచ్ఛాయా పుత్రాస్తాసాంవదానివః
సంజ్ఞాత్వాష్ట్రీచసుషువే సూర్యాన్మను మను త్తమమ్ ॥౩॥

లింగపురాణ ౬౫ అధ్యాయః

కించ.శ్లో॥ సంజ్ఞాత్వాష్ట్రీతుసుషువే సూర్మాన్మను మను త్తమమ్॥

కూర్మపురాణ ౨౦ అధ్యాయః

కశ్యపునివలన నదితిసూర్యునిగాంచెను. అయ్యాదిత్యునికి సంజ్ఞారాజ్ఞి, ఛాయ, యని ముగ్గురు భార్యలుగలరు. వారిలోఁ ద్వష్ట్రపుత్రికయగు సంజ్ఞకు మహో త్తముఁడగు మనువుపుట్టెను. ఇట్లే కూర్మపురాణమునందు నున్నది కావునఁ ద్వష్ట్రవిశ్వకర్మకు గూఁతురగు సంజ్ఞకుఁ గుమారుఁడగు (అనఁగా విశ్వకర్మ దౌహిత్రుఁడగు) నై వస్వత మనువునకుఁ గుమారుఁడు నాభానేదిష్ఠుఁడు. ఇట్లనుటచే సర్వశిల్పాధిపతియగు విశ్వ కర్మ సంతతియగుటచేతనే నాభానేదిష్ఠునకును శిల్పమధిగమింపఁబడినది.

అంగిరోగణమగు నారాశంసిగణమును విచారించుదము.

సూ॥ ప్రయాజై శ్చరంతి, పంచై తేభవంతి, పంచవచనం నారాశంసః, తనూ పాద్వా ॥ఇతి॥

ఆశ్వలాయనశ్రౌతసూత్రే ౧. ౫. ౬.

నారాయణీయవృ త్తిః॥ నారాశంసాః పితృసంజ్ఞకాః ఋషీణాం గోత్రజాతాః। చమసాదిపాత్రసంపాదకాః॥

కించ॥సూ॥ ఆప్యాయితాఞ్ఛ్చమసాఞ్ సాదయంతి । తేనారాశంసాభవంతి. నారాశంసాభవంతీత్యర్థః। అన్వర్థసంజ్ఞేయం నారాశంసానామత్రయః పితృగణాః ఉమాః ఔర్వాః కావ్యాశ్చేతి తేషామనుసవనం యథాసంఖ్యేనాప్యాయితానాం చమసానాం దేవతాభవంతి॥

ఆశ్వలాయన శ్రౌతసూత్రే ౫. ౬. ౩౦.

పునఃకించ॥ నారాశంసాః చమసదేవతాః పితరః । తనూనపాద్యాగః పంచైతే పంచశబ్దేనసరాశంసః॥

తారానాథతర్కవాచస్పతికృత బృహదభిధానకోశేపత్ర ౪౦౪౯...

పితృసంజ్ఞకాఃఋషయ ఏవదేవశిల్పినః.

నైరుక్తేదేవతాకాండే పృష్ఠే ౧౯౫.

ఈపై నుదాహరణములవలన నారాశంసగణము పితృసంజ్ఞకులనియు, ఋషిగోత్రజులనియు, చమసాది పాత్రసంపాదకులనియు, చమసదేవతలనియు, వారికిఁ దనూనపాద్యాగమనియు, వారు పంచసంజ్ఞగలవారనియు, పితృసంజ్ఞగలవారు ఋషులును దేవశిల్పులుననియు విశదమగుచున్నది.

ఋభువులు పాత్రసంపాదకులును, అంగిరోవంశమునఁ బుట్టినవారు నెట్లయిరో యట్లె. నారాశంసశిల్పులు నంగిరోవంశమున బుట్టినవారును చమసాది పాత్రసంపాదకులునయిరి. అందువలననే "ప్రాచీదిశా"మను శ్రుతి సానగాది శిల్పిబ్రహ్మర్షుల ననువదించి వారలఁ బితృగణమగునటులఁ "బితరః పితామహా" యని సంబోధించి చెప్పెను.

మఱియు బోధాయన మహాప్రవరాధ్యాయాంతమున బ్రాహ్మణ క్షత్రియ వైశ్యగోత్రములను జెప్పుచు నారాశంస గోత్రములగూడఁ జెప్పెను. అట్లే గోత్ర ప్రవరదర్పణమునందు,

"భృగుగణేత్వాష్ట్రేయాః । అగ్రేనారాశంసాన్ వ్యాఖ్యాస్యామః । వసిష్ఠ శునకాత్రిభృగుకణ్వవాధ్న్యశ్వవాధూలఇతి॥

అని త్వష్టృవంశజు లది భృగుగణమనియు, వసిష్ఠుఁడు శునకుఁడు, అత్రి, భృగువు, కణ్వుఁడు, వ్యాధ్న్యుఁడు, అశ్వుఁడు, వాధూలుఁడు వీరెల్లరు నారాశంస గణమునఁ జేరినవారనియు, జెప్పియుండుటచే భృగ్వంగిరోవంశమె త్వష్టృవంశమనియు, వారలె నారాశంసశిల్పవంశమున జేరినవారనియు, స్పష్టమగుచున్నది. ఇంకొక ప్రమాణము.

శ్రుతిః॥ మన్నోన్వాహువామహే నారాశంస్సేనసోమేన.

ఋగ్వే ౮. ౧. ౧౯.

భాష్యమ్॥ నరైః శంస్యతేఇతి నారాశంసః పితరః.

అనియు,

శ్రుతిః॥ అంగిరసోనః పితరోనవగ్వాఅధర్వాణో భృగవః సోమ్యాసః॥
ఇతినైరుక్తేదేవతాకాండే.

భాష్యమ్॥ మాధ్యమికో దేవగణః ఇతినైరుక్తాః॥ ఋభవః, అంగిరసః, భృగవః, అథర్వాణః ఇతిస్తుత్యుపపత్తేః। దేవతాపదమధ్యేసమామ్నాత, ఏకైకశఏషాం దేవగణా ఇతినైరుక్తాఃమన్యన్తే॥ పితరఇత్యాఖ్యానం, పితరఇత్యుక్తైఋభ్వంగిరసభృగ్వథర్వాణోబుధ్యంత ఇత్యర్థఃకోవిశేషః అగ్న్యాదిదేవతాపద విపర్యయస్తద్ధర్మదేవతాప్రకారఏవాయంయఏతేపితరోనామ తఏవఋభుసనత్కుమారాదయ ఇత్యాఖ్యానవిదః స్మరంతి, అసావపిమంత్రాణాం విషయఉపేక్ష్యః అపిచదేవగణాః ఏతేఉతపితరః ఇతి కుతో విచారః ఋభవః అంగిరసః భృగవః ఇత్యేవమాదీనాం అభిధానానాం ఋషిషు ప్రసిద్ధేః, అథాపి ఇదమపరం కారణమృషయఏవైతే॥

అని నారాశంసులు పితరులనియు ఋభువులు, అంగిరసులు, భృగువులు, అథర్వులు వీరలు స్తుతులయందుండుటవలన దేవగణమని నిరుక్తకారులు పలుకుచున్నారు. వీరలనే పితృగణమందురు. పితరులనుటవలన ఋభువులు, అంగిరసులు, భృగువులు, అథర్వులు నీపితృగణములోఁ జేరినవారనియె తెలిసికొనఁదగియున్నారు. ఇందులో విశేషమేమి? అగ్న్యాది దేవతాపద విపర్యాయమున నాధర్మదేవతాప్రకారమునసనే యీ పితరులు ఋభుసనత్కుమారాదులని వ్యాఖ్యానకర్తలు దలఁచుకొనుచున్నారు. దేవగణములనియుఁ బితృగణములనియు నెందుకు విచారము? ఋభువులు, అంగిరసులు, భృగువులు, ఈమున్నగుపేరుగల వారెల్లరు ఋషులయందుఁ బ్రసిద్ధిఁ బొందినవారలే. వీరలెల్లనను ఋషులే.

అని నారాశంసులు పితలనియు, వారలే ఋషులనియు, శిల్పివర్యులగు, ఋభువులు, అంగిరసులు, భృగువులు, అథర్వులు వీరలెల్లరు ఋషులయందు సుప్రసిద్ధులనియుఁ దెలుపఁబడుచున్నది. అథర్వులు శిల్పులైనటుల, "అథర్వణశ్చోపవేదః శిల్పవేదః ప్రకీర్తితః। తస్మాదాథర్వణాః ప్రోక్తాః సర్వేశిల్పినఏవచ" అని యథర్వవేదమునకుపవేదముగ శిల్పవేదము పుట్టినది. అందువలన నాయథర్వణులను వారలెల్లరు శిల్పులని ప్రసిద్ధివడసిరని శైవాగమవచనమువలన దెలియుచున్నది. ఇఁకశిల్పివర్యులగౌరవమునుగూర్చి వివరింపఁబడును.

## శిల్పాచార్యుల గౌరవము.

శ్రుతిః॥ అనవ స్తేరథమశ్వాయతక్షన్ త్వష్టావజ్రం పురుహూతద్యుమన్తమ్ ।

బ్రహ్మాణఇంద్రం మహయన్తో అర్కైరవర్ధయన్నహయేహ న్తవాఉ॥

ఋగ్వే ౪. ౧. ౩౧. ౪.

భాష్యమ్॥ హేపురుహూత! బహుభిరాహూతేన్ద్ర! తేత్వదీయం రథమశ్వా యూశ్వాభ్యాం సంయోగార్హ్యమనవోమనుష్యా ఋభవ స్తక్షన్ అతక్షన్ అకుర్వన్ త్వష్టాచత్వదీయం వజ్రం ద్యుమ న్తం దీప్తిమంతమకరోత్ । ఉ. అపిచ. మహయంత ఇన్ద్ర పూజయంతో బ్రహ్మాణో౽ంగిరసః పరివృఢామహాతోవా । అహయేఽహిం వృత్రం హంతవేహంతుం అంకై స్తోత్రైః అవర్ధయన్ వర్ధితవంతః॥

యజమానుఁ డింద్రునిగూర్చి స్తుతిఁజేయుచున్నాఁడు. బహుసంఖ్యాకులగు యజమానులచే నాహ్వానింపఁబడు నో యింద్రా! అంగిరస వంశ్యులగు ఋభువులు నీరథమునకుఁ గూర్పఁదగిన యశ్వములను జేసిరి. త్వష్టయు (విశ్వకర్మయు నితఁడు నంగిరోవంశసంభూతుడే) నీవజ్రాయుధమును దేదీప్యమానముగాఁ జేసెను. ఇటుల రథాశ్వవజ్రాయుధములొసగువిధమున నింద్రుని బూజించుచున్న యంగిరసులు (ఋభు విశ్వకర్మలు) చాల గొప్పవారలు. వీరు వృత్రునిఁజంపుటకు స్తోత్రములు జేయఁబడు చున్నారు. ఇటులఁ జెప్పియుండుటచే రథాయుధకర్తలగు ఋభువిశ్వకర్మలు దేవతల చేతను యజమానులచేతను నుతింపఁబడుచున్నారు.

## శిల్పజ్ఞానములేమిచే స్వర్గజ్ఞానముగలుగదు.

శ్రుతిః॥ అంగిరసఇమేసత్రమాసతేతేసువర్గం లోకం

నప్రజానంతితేభ్యఇదం బ్రాహ్మణంబ్రూహి॥

యజుఃకాం ౩. ౧. ౯.

భాష్యమ్॥ అంగిరోనామకాఇమేమహర్షయః సత్రమనుతిష్ఠంతి- తేతుస్వర్గప్రాప్తి సాధనానాం నాభానేదిష్ఠనామక శస్త్రాదీనా మపరిజ్ఞానాత్స్వర్గం నజాన న్త్యత స్తేభ్యఇదం త్వయాధీతం శస్త్రాదిప్రతిపాదకం బ్రాహ్మణం బ్రూహి.

అంగిరులను నీఋషులు సత్రయాగ మొనర్చిరి. వారలు స్వర్గప్రాప్తికి సాధనము లయిన నాభానేదిష్ఠములను పేరుగల శస్త్రాదులయొక్క శిల్పమును దెలిసికొనక

పోవుటవలన స్వర్గమును దెలిసికొనకపోయిరి. అందుచే వారికొఱకే నీచే జదువఁబడిన శస్త్రాది శిల్పప్రతిపాదకమగు బ్రాహ్మణమును జెప్పుము. అను నీ శ్రుత్యర్థముచే శస్త్రములు మున్నగు శిల్పప్రతిపాదకమగు విజ్ఞానము స్వర్గజ్ఞానము ననుసంధించునని తెలియఁదగును.

రథనిర్మాణశిల్పవత్తు మంత్రయుతమైన స్తోత్రమునంటిది.

శ్రుతిః॥ అస్మాఇదుస్తోమం సంహినోమిరథం నతష్టేనతత్సినాయ।
గిరశ్చనిర్వాహసేసువృక్తీంద్రాయవిశ్వమిన్వం మేధిరాయ॥

ఋ ౧. ౬౨. ౭.

భాష్యమ్॥ స్తోతృభిఃప్రేషితానిస్తోత్రాణి రథవదింద్రమానయంతి. అతఃకారణాద్రథేచ్ఛాకుర్వతే రథకారోరథంకరోతి తద్వదహమింద్రాయైన నత్వన్యదేవాయస్తోత్రం రచయామియత్తోస్త్రం రథవత్సువృక్తిసుసంస్కృతమితి॥

స్తుతిసేయువారలచేఁ బంపఁబడిన స్తోత్రములు రథమువలె నింద్రునిఁ దెచ్చుచున్నవి. ఈ కారణమువలన రథమందిచ్ఛచే రథకారుఁడు రథమును జేయుచున్నాఁడు. అటులనే నేను నింద్రునికొఱకే (ఇతరదేవతకొఱకుఁ గాదు) స్తోత్రమును రచియించుచున్నాను. ఈ నా స్తోత్రము రథమువలెఁ జక్కగా నడచునదియుఁ జక్కగా సంస్కరించినదియునగును. అని యిటుల నుడువఁబడియుండుటచే మంత్రకర్త దానుమంత్రమును రచియించుటలో రథమువలె ఋజువుగా నడచునదియుఁ జక్కగాఁ బరిశుద్ధీకరింపఁబడినదియునని చెప్పుటవలన మంత్రరచనాస్తోత్రముకంటె రథమెక్కువ పావనమైనదిగను, మంత్రరచయితకంటె రథకారుఁ డధికపవిత్రతనొందువాఁడనియుఁ దెలియకమానదు.

శిల్పి దేవసదృశుఁడు.

ఇఁక దేవమూర్తిరచయితనుగూర్చి తెలిసికొనుదము.

శ్లో॥ శిల్పినాం దేవకర్తృత్వం వంశ్యానాం విశ్వకర్మణః
అహంవిశ్వస్యకర్తాచకర్తారోమమశిల్పినః ॥౧॥
శిల్పిగర్భాణిలింగాని లింగగర్భాశ్చశిల్పినః
శిల్పిరూపంతుమద్రూపం నభేదఃశ్రుణుపార్వతి ॥౨॥

స్కందపురాణ ప్రతిష్ఠాఖండము.

ఈశ్వరుఁడు పార్వతితోఁ జెప్పినది—ఓపార్వతీ ! విశ్వకర్మ బ్రహ్మవంశస్థులగు శిల్పులకు దేవతలరచించుట నియమితమయ్యెను. నేనందఱును జేయువాఁడను. ఆదేవ శిల్పులు నన్నుఁ జేయువారలు. నాగర్భమునందు వారలవతరించిరి. వారి గర్భమునందు నేనవతరించుచున్నాను. అందుచే నాకును వారికిని భేదములేదు అని చెప్పఁబడియున్నది. ఈవిషయమునే యనుసరించి,

శ్లో॥ శిల్ప్యుత్పత్తిం ప్రవక్ష్యామి శ్రుణుషణ్ముఖయత్నతః
తదంగేషుచసంభూతాః పుత్రాః పంచజటాధరాః ॥౧౬॥
హస్తకౌశలసంపూర్ణాః పంచబ్రహ్మరతాస్సదా
పాణిస్థాపకసంజాతాః మమతుల్యాశ్చశిల్పినః ॥౧౭॥
సంధ్యాత్రయం ప్రకుర్వంతి స్నానదానాదితర్పణం
వైశ్వదేవం బలేర్దానం షట్కర్మాణ్యపిశిల్పినామ్ ॥౧౮॥
శివార్చనరతానిత్యం జపహోమాదికర్మసు
ఏవం విధిక్రియాఖ్యాతా శిల్పినాంచైవషణ్ముఖ ॥౧౯॥
విశ్వకర్మపరాణాంచ బ్రహ్మవిష్ణుశివాత్మనామ్
తేషాం సూత్రం సమాఖ్యాతం విశ్వనామస్వయంభువా ॥౨౦॥
ప్రాసాదభవనాదీని లింగస్థాపనమేవచ॥

ఇత్యాది

స్కందపురాణ ప్రభాసఖండే సోమనాథమాహాత్మ్యే
సోమపుత్రసంవాదే ఈశ్వరఉవాచ.
సంపుట ౧. పుట ౪౯.

ఈశ్వరుఁడు షణ్ముఖునితో నిట్లు నుడివెను. ఓకుమారా ! శిల్పులయొక్కయుత్పత్తిని జెప్పెదను. ఆవిశ్వకర్మయొక్క యంగములనుండి జటాధరులగు నేగురు పుత్త్రులు పుట్టిరి. వారలు హస్తకౌశలమునందు సంపూర్ణ నిపుణులు. పంచబ్రహ్మ ధ్యానమొనర్చువారు. హస్తస్థాపనవలనఁ బుట్టిన యాశిల్పులు నాకు సమానులు. వారలు కాలత్రయసంధ్యావందనములను స్నానదానాదితర్పణములును, వైశ్వదేవము, బలిదానము, యజనయాజనాధ్యయ నాధ్యాపకదాన ప్రతిగ్రహముల నుషట్కర్మలను, జేయుదురు. మఱియు నాశిల్పులు శివార్చనపరాయణులును నిత్యజపహోమాది కర్మలఁజేయువారును, విశ్వకర్మధ్యాన తత్పరులును బ్రహ్మవిష్ణుశివులయందేకీభావహృదయులును నగుదురు. వారికి స్వయంభువగు విశ్వకర్మచే విశ్వమను సూత్ర

ముచెప్పఁబడినది. ఆసూత్రముచేఁ బ్రాసాదములు, భవనములు, లింగస్థాపనములను జేయుదురు.

అని యీశ్వరోక్తియుండుటవలన శిల్పివర్యుల యాభిజన్యము కులీనత యాచారగరిష్ఠత మున్నగు గుణవిశేషములు విశదమగుచున్నవి. ఇందువలననే ప్రతిష్ఠా యజ్ఞాంతమున,

ప్రతిష్ఠాయజ్ఞాంత శిల్పాచార్యధర్మము.

శిష్యఉవాచ॥శ్లో॥ కథం తత్రితుకర్తవ్యమారంభం కుత్రవర్తతే
గార్గేయోవాచ॥ సుదినేచసువారేచ సునక్షత్రే శుభేఽహని
సులగ్నేచ సుహోరాయాం వాద్యఘోషపురస్సరమ్॥
యజమానసహోపేతః నృత్యవాద్యాదిభిఃసహ
స్వస్తివాచనతః శిల్పీప్రవిశేచ్ఛిల్పమందిరమ్॥
కర్తవ్యం తద్విశేషేణవక్ష్యేశ్రుణుసమాహితః
శిల్పాచార్యః శుచిర్భూత్వాపూజాం కృత్వాగణాధిపం॥
పశ్చాత్త్రికలశం స్థాప్యస్వర్ణం రజతమేవచ
తామ్రం వామృణ్మయం వాపిపాత్రమేవం వినిర్దిశేత్॥
పంచప్రస్థాధికం ధాన్యం తదర్థం తండులంతథా
ధాన్యం ప్రసారితంచైవ నిక్షిప్య కలశత్రయం॥
కలశేషుజలం పూర్యపల్లవాద్యైరలంకృతమ్
సుధయాకలశాన్ లిప్యగంథపుష్పాదిభిర్యుతాన్॥
ఇమమ్మేత్యాది మంత్రైస్తుపూజయే ద్విధివత్తతః
స్వస్తివాచనపూర్వంతు కుర్యాత్పుణ్యాహవాచనమ్॥

కించద్వితీయాధ్యాయే మృత్తికాప్రార్థనవిధా } ఓంబ్రహ్మపృథ్వీతిమంత్రేణ శిల్పీచప్రార్థయేద్భువమ్
భూమిర్భూమ్నేతి మంత్రేణశిల్పినాచాభిమంత్రయేత్॥

ఆవరణపూజాయాం॥ ఓంతత్సవితురిత్యుక్తే హ్యజమావాహ్యచేశ్వరం
ఘటికావిష్ణుమావాహ్య శిల్పాచార్యస్తతఃపరమ్॥

పునఃతృతీయాధ్యాయే॥ దక్షిణాయాం దిశిస్థిత్వాస్థపతిః సృక్సువైర్ఘృతః
దర్వ్యాత్వాజ్యేన సంగృహ్యాహోమంకుర్యాద్యథావిధి॥
ప్రజాపతయే స్వాహేతిమంత్రేణస్థపతిఃక్రమాత్

తృతీయాధ్యాయేపి॥ సుత్రివేణవాస్తుహోమంచ శిల్పీకుర్యాద్యథావిధి
వాస్తోష్పతేతి మంత్రేణహోమంచాష్టోత్తరంశతమ్॥

పంచమాధ్యాయే॥ ఏతత్కార్యాత్పరం శిల్పీసుఖాసీనః శుచిఃపరం
పంచామృతస్నానమిదం కుర్యాదేవం యథావిధి॥
దధిక్షీరాఽజ్యమధుభిః స్నాయాచ్ఛర్కరయాక్రమాత్
దధిక్రావ్ణేతిచబుుచాదధిస్నానం సమాచరేత్॥
పయోమంత్రేణపయసాశుక్రేణాజ్యం ప్రకీర్తితం
మధుమంత్రేణ మధుచకాండాదేవతుశర్కరా॥

నవమాఽధ్యాయే॥ దర్భాసనం పరిస్తీర్యచిత్రాసనమథోపరి
శిల్పాచార్యశ్శుచిస్తస్మిన్ స్థిత్వాఽచామ్యయథావిధి॥
ఓంభూరితిచమంత్రేణ సంకల్పంచసమాచరేత్
కుండమధ్యే ప్రతిష్ఠాప్యకారకాగ్నిం యథావిధి॥
పాత్రాసాదనమేతద్ధి పూర్వవచ్చోదితంయథా
మూర్తిహోమం ప్రవక్ష్యామికారకాగ్నిముఖేతుచ॥
ఇంద్రంవోవిశ్వత ఇతికద్రుద్రాయేతి చక్రమాత్
ఇత్యేనం మంత్రముచ్చార్యప్రత్యేకంచ యథావిధి॥
అష్టాదశం వారమేతజ్జుహుయాచ్ఛిల్పికోత్తమః

త్రయోదశాఽధ్యాయే॥ జ్యోతిర్నిర్మాణత శ్శిల్పీబింబస్యగురురిష్యతే॥
జ్యోతిర్మండలమాలిఖ్య శిల్పాచార్యో మహాతపాః
బింబస్యదక్షిణేకర్ణే ఓంకారాష్టోత్తరం శతం॥
ఏకాగ్రయాధిషణయాజపేన్మంత్రం మనూత్తమం
ఉపదేశగురుశ్శిల్పీ సఏవగురుర్దైవతః॥

గార్గేయప్రతిష్ఠాగమము.

ఈ గార్గేయప్రతిష్ఠాగమ వచనముల విచారించిన శిల్పాచార్యుఁడు సుముహూర్తకాలమునందు స్వస్తివాచనము నృత్యవాద్యములు ఘోషిల్ల యజమానునితో శిల్పమందిరమును బ్రవేశించవలెను. అట్టి శిల్పాచార్యుఁడు శుచిర్భూతుఁడై గణాధిపపూజయొనర్చి స్వర్ణరజతతామ్రములలో నేదైన పాత్రలుగాని మృణ్మయపాత్రలు గాని కలశత్రయము నిర్మించి ప్రస్థపంచకధాన్యముపై నునిచి జలపూరితమగు కలశముల యందు పల్లవములను గంధపుష్పాక్షతలను నునిచి పూజించి "ఇమమ్మేవరుణశ్రుధీ"

యను వేదమంత్రములఁ బ్రారంభించి పుణ్యాహవాచనముఁ జేయవలెను. తరువాత "ఓంబ్రహ్మపృథ్వీ" యను మంత్రమున భూధ్యానమొనర్పవలెను. తరువాత నాశిల్పాచార్యుఁడే "భూమిర్భూమ్నా" యను మంత్రమున భూమినభిమంత్రించవలెను, తరువాత "తత్సవితుః" అను మంత్రములచే బ్రహ్మ విష్ణు మహేశ్వరుల నారాధింపవలెను॥...............స్థపతియనఁగా శిల్పాచార్యుఁడు స్రుక్స్రువముల ధరించి స్రువముచే నాజ్యమును గ్రహించి "ప్రజాపతయేస్వాహా"యని హోమమును జేయవలెను. తరువాత "వాస్తోష్పతే ప్రతిజానీహ్యస్మాన్"అను మంత్రముచేత నూటయెనిమిదిసారులు వాస్తుహోమమును జేయవలెను. ఈ హోమకార్యము నిర్వర్తించి శుచిర్భూతుఁడైన శిల్పివరుఁడు "దధిక్రాణ్ణః" అను మంత్రముచేత దధిని, "ఆప్యాయస్వ" అను మంత్రముచేత క్షీరమును, "శుక్రమసి" యను మంత్రముచేత ఘృతమును, "మధువాతా ఋతాయతే" అను మంత్రముచేతఁ దేనెను, "కాండాత్కాండా" అను మంత్రమున శర్కరను, బింబమును (మూర్తిని) పంచామృతస్నానమును జేయింపవలెను. దర్భాసనముపైఁ జిత్రాసనముపరచి శుచిర్భూతుఁడై శిల్పాచార్యుఁడందుఁ గూర్చుండి "ఓంభూః" అను మంత్రముచేఁ బ్రాణాయామమొనర్చి సంకల్పముఁజేసి కుండమధ్యమునఁ గారకాగ్నినిఁ బ్రతిష్ఠించి యథాశాస్త్రముగాఁ బాత్రాసాదనమొనర్చి మూర్తిహోమముఁ జేయవలెను. ఆ కారకాగ్ని ముఖమునందె "ఇంద్రంవోవిశ్వతః" అను మంత్రమును, "కద్రుద్రాయ" అను మంత్రమును బదునెనిమిదిసారులు హోమముఁజేయవలెను. జ్యోతిర్నిర్మాణకుఁడగు శిల్పిబింబమునకు గురువని చెప్పఁబడును. మహాతపస్వియగు శిల్పాచార్యుఁడు జోతిర్మండలమును లిఖించి బింబముయొక్క దక్షిణకర్ణమునందు నూటయెనిమిదిసారులు ప్రణవమంత్రమును ఏకాగ్రబుద్ధితో జపించవలెను. బింబమున కుపదేశగురువు శిల్పాచార్యుఁడు, అందువలననే శిల్పిగురుదైవతుఁడని చెప్పఁబడును. అనియుండుటచే శిల్పాచార్యుఁడు మూర్తి నిర్మాణమున నెట్టి వైదికకర్మలొనర్చవలెనో తెలిసికొనఁదగియున్నది. ఇంతియెగాక విశ్వకర్మస్వరూపుఁడైన శిల్పాచార్యుఁడు, ("వస్తోరంగిరసః పుత్రోవిశ్వకర్మాకృతీపతిః" అను భాగవతవచనమునకు "ఆకృతీపతిశ్శిల్పాచార్య" అని శ్రీధరీయ వ్యాఖ్యానము) ప్రణవమంత్రమును దేవమూర్తికర్ణమున నుపదేశించి దేవతలకాచార్యుఁడై "దేవాచార్యస్యమహాతో ధీమతో విశ్వకర్మణః" అను వాయుపురాణ వచనమును ననుసరించును.

ఈ పై శ్లోకార్థముల ననుసరించియె,

శ్లో॥ తేషామేవస్థపత్యాఖ్యో విశ్వకర్మేతి సంస్కృతః
ఏభిర్వినాహిసర్వేషాం కర్మకర్తుం నశక్యతే॥
తస్మాదేతేసదాపూజ్యాః స్థపత్యాద్యాశ్చపంచచ॥
ఏభిస్థపత్యాదిభిరత్రలోకే, వినాగృహీతుం సుకృతం నశక్యతే।
తైరేవసాధ్యం గురవశ్చతస్మాత్, భవంతిమోక్షం భవతాంతుమర్త్యాః॥

శిల్పమయమతమ్. ౫ అధ్యాయః

వారలలో స్థపతియను నతఁడు విశ్వకర్మయని పేర్కొనఁబడెను. స్థపతివంశమున (విశ్వకర్మవంశమున) బుట్టిన యేఁగురు శిల్పులు లేక యేశిల్పమునర్చుటకు సాధ్యముగాదు. అందుచే నీస్థపతులేఁగురు నెల్లపుడుఁ బూజనీయులు. ఈస్థపత్యాదులేఁగురు లేక సత్కర్మ సంగ్రహించుటకీలోకమున శక్యముగాదు. వారిచేతనే సర్వకర్మలు సాధ్యములగును. అందుచే వారలే గురువులగుచున్నారు. మర్త్యులెల్లరు వారిచేతనే మోక్షమును బొందుచున్నారు అని శిల్పమునఁ జెప్పఁబడియుండుటచేతను, మఱియు నాశిల్పమునందె,

. . . . . . . . .

శ్లో॥ ప్రాతచేతోవిశుద్ధాత్మా స్థపతిర్వరవేషయుక్
పీత్వాశుద్ధం పయోరాత్రావుపోష్యాఽధివసే త్తతః॥
ప్రాసాదస్యాగ్రితోయాగమండపం విధినాచరేత్

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

తన్మధ్యే వేదికాంకుర్యాదత్రద్వాత్రింశమానతః॥
చతురస్రంచతుర్దిక్షువిదిక్ష్వశ్వత్థపత్రవత్
ప్రాగ్దిశీశానయోర్మధ్యే కుండమష్టాశ్రమిష్యతే॥
త్రిమేఖలాసమాయుక్త మేకమేఖలయాన్వితమ్
స్థాపిత్తైర్మూర్తిభిస్సార్థం విధినాహోమమాచరేత్॥

మయమతమ్. ౧౯ అధ్యాయః.

పరిశుద్ధబుద్ధియు, పరిశుద్ధస్వభావముగల స్థపతి (శిల్పాచార్యుఁడు) పరిశుభ్రవేషముల ధరించి పవిత్రమగు క్షీరమును పానముజేసి యారాత్రియం దుపవసించి ప్రాసాదము ముందఱ యాగమండపమును రచింపవలెను. ఆ యాగమండపమధ్యమునందు ముప్పదిరెండంగుళముల పరిమాణముగల వేదికను నిర్మించవలెను. నాలుగు దెసల నాలుగు కోణములును విదిక్కుల నాలుగు కోణములను నశ్వత్థపత్రమువలె

వేదికను నిర్మించవలెను. అయ్యది పూర్వదిశయొక్కయు నీశానదిక్కుయొక్కయు మధ్యప్రదేశమున నుండవలెను. అది త్రిమేఖలచేతను నేకమేఖలచేతను నుండవలెను. ఆ శిల్పాచార్యుఁడు స్థాపించిన దేవమూర్తితోఁగూడి శాస్త్రవిధిగా హోమముచేయ వలెను. ఇట్లు యగ్నిస్థాపనాదికర్మలు శిల్పాచార్యుఁడొనర్పవలెనని,

శ్లో॥ స్థపతిశ్శుద్ధదేశేతుసిత యజ్ఞోత్తరీయకః
సితచందనలిప్తాంగః సితపుష్పధరః శుచిః॥
స్వర్ణయజ్ఞోపవీతశ్చ శుద్ధపంచాంగభూషణః
ప్రసన్నమానసోభూత్వా సర్వకర్మాణ్యనుష్టితః॥
గార్హపత్యాగ్నిమాభూతమగ్నిమంత్రమ్ సముచ్చరేత్.
అగ్నిం సంస్థాపయేత్తత్ర॥............విశ్వకర్మశిల్పము.

మఱియు నిట్లు,

శ్లో॥ స్థపతిస్తుశుచిర్భూత్వా యజ్ఞసూత్రోత్తరీయకః
ప్రాగ్వదగ్నిం సమభ్యర్చ్య............

కాశ్యపశిల్పే ౫౫ పటలః

తద్వదేవాస్తు దేవాగ్నిశ్చస్థాపయేచ్ఛిల్పికోత్తమః

౫౬ పటలే.

అథ శేషంతు యత్కర్మశిల్పిభిస్తువిశేషతః
కర్తవ్యం లక్షణోపేతం స్థపతిశ్శిల్పిరుచ్యతే॥

౬౭ పటలే.

అనియును, ప్రతిష్ఠావిధియందు,

శ్లో॥ ప్రతిష్ఠాదివసాత్పూర్వం పంచమేదివసేశుభే
శిల్పినాసుకృతాయాంతు ప్రతిమాయాం విశేషతః॥
స్థపతిర్యజమానశ్చ నవవస్త్రైర్విశేషితౌ
కుంభద్వయకరయుగే స్థాప్యఉదకాభ్యామనన్వయిా॥
ప్రోక్ష్యపుణ్యాహమేవంతాం కుర్యాద్ద్విజవరైస్సహ
అలంకృత్యచతాం పశ్చాత్ గీతవాద్రితనిస్వనైః॥
ప్రదక్షిణత్రయం కృత్వాచాలయం వేదఘోషణైః

ముఖబంధోత్తరీయైశ్చ స్థపతిర్ధారయేన్నవైః॥

... ... ... ... ...

గర్భాలయే ప్రతిష్ఠాప్య దేవతామూర్తిముత్తతః
స్థపతిః సూత్రవిన్యాసం కృత్వాచైవాష్టబంధనమ్॥
స్థపతిస్థాపయేత్పశ్చాత్పూజకస్త్వపి పూజయేత్.

విశ్వకర్మశిల్పే ౪ అధ్యాయే.

శిల్పాచార్యుఁడు పరిశుద్ధప్రదేశమున స్వర్ణయజ్ఞోపవీతమును, స్వచ్ఛవస్త్రములను ధరించి, తెల్లని మంచిగంధమును, తెల్లని పూవులనుదాల్చి పవిత్రములైన పంచాంగములకు భూషణముల నలంకరించి, నిర్మలమైన మనస్సుగలవాఁడై సంధ్యాద్యనుష్ఠానకర్మలనెల్ల ననుష్ఠించి, గార్హపత్యహోమకుండమును సమీపించి యగ్నిమంత్రమునుచ్చరింపవలెను. అచ్చట నగ్నిని సంస్థాపించవలెనని కాశ్యపశిల్పమునందును, నాశిల్పగ్రంథమునందె యేఁబదియైదవ పటలమునందు, స్థపతిశుచియై యజ్ఞసూత్రోత్తరీయాదులచేఁ బవిత్రుఁడయి పూర్వమువలె నగ్నినర్చింపవలెననియు, మఱియు నేఁబదియాఱవ పటలమునందు నావేదికాస్థానమునందె శిల్పివరేణ్యుఁడు వాస్తుదేవతల స్థాపించవలెననియు, నింక నలువదియేడవ పటలమునందు మిగిలిన కర్మలన్నియు శిల్పులచేఁ జేయించవలెను, అయ్యవి సలక్షణముగాఁ జేయవలెను, స్థపతియనఁగా శిల్పివరేణ్యుఁడనియుఁ జెప్పఁబడినది.

మఱియు విశ్వకర్మ శిల్పమునందుఁ బ్రతిష్ఠాదివసమునకు ముందైదుదినములకుఁ బూర్వముగా శిల్పివర్యునిచే మూర్తిబింబముఁ జక్కఁగాఁ జేయించి స్థపతియు యజమానుఁడును నూతనవస్త్రములను ధరించి కుంభమును కరద్వయమున ధరించి బింబమునుఁ బ్రోక్షించి బ్రాహ్మణులతోఁగూడి పుణ్యాహవాచనమునుఁ జేయవలెను. ఆ బింబముల నలంకరించి గీతవాద్యాదులతోడను వేదనిస్వనములతోడను నాలయమునకుఁ బ్రదక్షిణమొనర్చి, తిరిగి నూతనములగు ముఖబంధోత్తరీయాదుల ధరించి, దైవతమూర్తులఁ బ్రతిష్ఠింపవలెను. తరువాత స్థపతి సూత్రవిన్యాసమొనర్చి యష్టబంధముచే స్థాపించవలెను. తరువాతఁ బూజకులు పూజింపవలెను. అని చెప్పియుండుటచేఁ బ్రతిష్ఠాంతమున శిల్పాచార్యుఁడె సమస్తకార్యము లొనర్పవలెనటులఁ దెలియుచున్నది.

## నేత్రోన్మీలనసంస్కారము.

వర్ణసంస్కారప్రకరణే॥ శ్లో॥ ప్రాతస్స్నాత్వాశుచిశ్శిల్పీ ప్రాప్తపంచాంగభూషణః
హేమయజ్ఞోపవీతస్తు క్షౌమైర్వస్త్రైరలంకృతః॥
కుంభాదికైశ్చాభిషేచ్య కృత్వాగంధాదిభిః క్రమాత్
పూర్వంమంగళవాదిత్ర నృత్యగీతాదిభిస్సహ॥
హేమసూచ్యాశిలాయాంతు లేఖయేన్నయనత్రయమ్
పశ్చాత్తీక్ష్ణేనశస్త్రేణ మండలత్రియ ముల్లిఖేత్॥
సారస్వతీయ శిల్పశాస్త్రము.

ప్రాతస్స్నానాదులచే శుచియగు శిల్పాచార్యుఁడు పంచాంగభూషణము ధరించి హేమయజ్ఞోపవీతములను బట్టువస్త్రములనుదాల్చి కుంభాభిషేక మొనర్పఁ కొనఁబడి గంధాదులచేతఁగూడ నలంకృతుఁడై ముందఱ మంగళవాద్యనృత్యగీతాదులు భోరుకొలుప హేమసూచి (బంగరుసూది)చే బింబమునందు నయనత్రయమును లిఖించవలెను. అనంతరము వాడియగు శస్త్రముచేత మండలత్రయమును వ్రాయవలెను. అనియు,

శ్లో॥ దృష్టిమోక్షణతత్కాలే పూర్వమేనసవత్సగామ్
వస్త్రాణిచ హేమరత్నభూషణానిసభూమికమ్॥
దాసదాస్యాదీనిదత్వా శిల్పినం పూజయేచ్ఛుభమ్
భుక్తిముక్తి ఫలంచైవ పుత్రపౌత్రాది సిద్ధిదమ్
ఏవంహి సుప్రతిష్ఠాయా మాయురారోగ్య వర్ధనమ్॥

నేత్రోన్మీలన కాలమునందు ముఁదుగనే వత్సముతోఁగూడిన గోవును వస్త్రములను స్వర్ణమణిభూషణములను భూమిని స్త్రీ పురుషులైన సేవకుల నిచ్చిశిల్పిని బూజింపవలెను. అట్లు పూజించిన భుక్తియు ముక్తియు లభించుటయెగాక పుత్రపౌత్రాద్యభివృద్ధి లభించును. ఇట్లు ప్రతిష్ఠాకాలమున జరిగెనేని ఆయురారోగ్యవృద్ధి కలుగును. అని శిల్పాచార్యు నెక్కువగా నేత్రోన్మీలన సంస్కారకార్య సమయమునఁ బూజింపవలెనని చెప్పఁబడియె.

ఇట్లనే నేత్రోన్మీలన సంస్కారమునుగూర్చి గార్గేయాగమమునం దెక్కువ విసరముగాఁ జెప్పియున్నది. గ్రంథవిస్తరభీతిచే నిచట విరమింపఁబడినది.

## రథప్రతిష్ఠ.

రథప్రతిష్ఠావిధౌ, శ్లో॥ సుముహూర్తే సులగ్నేచ స్థితిహోరాసుయోగకే
ఆశాంశే దృష్టికాలేచ జీవన్యాసం ప్రకల్పయేత్॥

స్థపతిః స్థాపకశ్చైవ కర్మమండప మాగతౌ
రథాంగాం శ్చనిరక్ష్యేథ రథశోభాబలాకృతిమ్॥
తత్ప్రమాణం పరీక్ష్యేథ తక్షకాన్ స్తత్ప్రపూజయేత్
వస్త్రాణి భూషణాదీని దత్వాతాంబూల చందనమ్॥

.....................................

స్థండిలం స్థపతిః ప్రాజ్ఞః పద్మాకృతిచ విన్యసేత్

.....................................

తత్కాలాంతరే స్తపతిః కర్మమండపసన్నిధౌ
సితవస్త్రోత్తరీయేన సితపుష్పైశ్చభూషితః॥
పంచాంగ భూషణయుతః విశ్వకర్మా న్యసేత్తతః
స్థపతిః స్థాపకః కర్తా పుష్పాంజల్యా సుపూజయేత్॥
విశ్వకర్మశిల్పే సప్తమాధ్యాయే॥

రథప్రతిష్ఠాసమయమున శిల్పాచార్యుఁడు స్థాపకునితోఁగూడ సుముహూర్త సమయమున యాగమండపమును సమీపించి దృష్టిసమయమున జీవవిన్యాసమును గల్పించవలెను. తరువాత రథచక్రములను నితరరథోపకరణములను రథశోభను బలమును వాని ప్రమాణమును బరీక్షించి యచ్చట నితరశిల్పులను వస్త్రభూషణతాంబూల చందనాదులతోఁ బూజింపవలెను. ప్రాజ్ఞుఁడగు స్థపతి పద్మాకారముగా స్థండిల నిర్మాణమును జేయవలెను. ఆమధ్యకాలమునందె స్థపతి తెల్లనివస్త్రములుఁ దెల్లని పుష్పములు ధరించి పంచాంగములయందును భూషములఁదాల్చి యా మండపమున విశ్వకర్మ విన్యాసమొనర్పవలెను. స్థపతియు, స్థాపకుఁడును, గర్తయు, దరువాతఁ బుష్పాంజలుల సమర్పించవలెను. అని రథప్రతిష్ఠాసమయమున శిల్పులకును శిల్పాచార్యులకు నేతాదృశమర్యాదాపూజనము లుగ్గడింపఁబడియె.

## నూతనగృహప్రవేశ సమయము.

గృహప్రవేశవిధానే॥ శ్లో॥ కుండేవాస్థండిలేవాపి సమిదాజ్యతిలంచరుం
లాజకశ్చైవపంచైతే ప్రత్యేకాష్టాదశాహుతీన్॥
ప్రణవాదీనిస్వాహాంతం శక్తిబీజంసముచ్చరన్
శక్తిగాయత్రీమంత్రేణ పూర్ణాహుతిం సమాచరేత్॥
అధివాసితకుంభస్థ జలే నైవాభిషేచయేత్
వాహనాదీనిసంప్రోక్ష్యస్థపతిస్థాపకావుభౌ॥

యజమానాయపశ్చాత్తు దద్యాన్నైవేద్య శేషకమ్
స్థపతిస్థాపకానాంచ విశిష్టానాం ద్విజన్మనామ్॥
దద్యాద్దక్షిణతాంబూలం తత్రసద్మప్రవేశనే॥
మానసారేవాస్తుశాస్త్రే.

గృహప్రవేశసమయమున స్థపతియు స్థాపకుఁడును, హోమకుండమందుఁగాని లేక వేఱుహోమప్రదేశమునందుఁగాని సమిధలు నాజ్యము తిలలుఁ జరువును లాజలు నను నీ పంచహవ్యములచేతఁ బ్రత్యేకముగాఁ బదునెనిమిది యాహుతులను ఓంకారమును మొదలుకొని స్వాహాంతముగా శక్తిబీజముల సంపుటీకరించి హోమము జేయవలెను. తరువాత శక్తిగాయత్రీ మంత్రముచేఁ బూర్ణాహుతి నొసర్పవలెను. అధివాస మొనర్చిన కుంభమందలి జలమును యజమాను నభిషేక మొనర్చి వాహనాదులనుగూడఁ బ్రోక్షించవలెను. తరువాత స్థపతి స్థాపకు లిరువురు నైవేద్యశేషము యజమానున కొసఁగవలెను. అప్పుడు స్థపతిని స్థాపకుని నితర బ్రాహ్మణులను దక్షిణ తాంబూలాదులచేఁ బూజింపవలెను. అని గృహప్రవేశ సమయమునందును స్థపతి స్థాపకుల కిరువురకు వైదిక మంత్రములచే హోమాదులు నియమితములయ్యె.

## దేవప్రతిష్ఠయం దష్టాదశకర్మలు.

శ్లో॥ అథాతస్సం ప్రవక్ష్యామి ప్రతిష్ఠాలక్షణక్రమమ్
దేవానామపి దేవీనాం భక్తానాం వాహనస్యచ॥
లింగానాం లోహదారూణాం శర్కరా మృద్వికారిణాం
సుధానాం చిత్రకానాంచ వాస్తుశాస్త్రాబ్ధిపారగైః ॥
కర్తవ్యం వాస్తుశాస్త్రోక్తం రాజారాష్ట్రం సుఖంభవేత్
కాలవృష్టిర్భవే ద్భూమా ధనధాన్య సమృద్ధయః ॥
గావశ్చ సుదుఘానిత్యం జరారోగ వివర్జితాః
వాస్తుశాస్త్ర క్రియాహీనం కర్తృనాశం కులక్షయం ॥
తత్సర్వం వాస్తురూపంచ శిల్పిజీవిత ముచ్యతే
విశ్వకర్మ బ్రహ్మకులో వేదశాస్త్రార్థ పారగః ॥
అరోగీ రూపసంపన్నః సత్యవాగ్ధర్మ పారగః
మంత్ర తంత్ర క్రియాభిజ్ఞః కుటుంబీ సత్కులోద్భవః ॥
వేదశాస్త్రార్థ పారీణః నిత్యకర్మ రతశ్శుచిః
ప్రతిష్ఠా కర్మకుశలః శాంతస్సజ్జన సంస్తుతః ॥

బ్రహ్మజ్ఞానీ జపేశక్తః సూత్రగ్రాహీ శుభాన్వితః
వేదోక్తకర్మనిరతః కాలజ్ఞ స్సర్వశాస్త్రవిత్ ॥
ఏవం విధగుణోపేతః శిల్పీకల్ప్యాత్ ప్రయత్నతః
స్నానం సంధ్యా జపోహోమః స్వాధ్యాయః పితృతర్పణమ్ ॥
ఆతిథ్యం వైశ్వదేవంచ అష్టకర్మాణ్య కారయత్
కేయూరహార మకుటైః కంకణై రుపశోభితః ॥
వ్యజనైః కేతుభిశ్ఛత్రై శ్చామరైశ్చ విరాజితః
యజమానాది భిస్సర్వై స్సేవ్యమానో జనై రపి ॥
బింబం ప్రదక్షిణం కుర్యాన్నృత్య గీతాదిభిస్సహ
ప్రవిశ్య శిల్పగేహంచ పంచసూక్తై రనూత్తమైః ॥
పుణ్యాహం వాచయిత్వాథ చాంకురార్పణ మాచరేత్
ద్వితీయం జలవాసంచ స్నపనం శిల్పకోవిదైః ॥
పంచగవ్యైః పంచామృతైః పంచత్వక్పంచపల్లవైః
తృతీయం క్షీరవాసంచ చతుర్థం ధాన్యవాసకం ॥
పంచమో వాస్తుహోమశ్చ బలిః శాంతాఖ్యకర్మచ
షష్ఠంచ మూర్తిహోమశ్చ సప్తమం శిల్పిభోజనం ॥
పుణ్యాహం దశశాంతిస్స్యా దష్టమం గేహశుద్ధికం
నవమోగర్భ విన్యాసః దశమో రత్నసంస్థితిః ॥
ఏకాదశం పీఠబంధః శకునై స్సప్తమంత్రకైః
పరిణీయాలయంబింబం కారయిత్వా ప్రవేశనం ॥
కర్తవ్యం శుభలగ్నేచ ద్వాదశం చాష్టబంధనమ్
పంచసూత్రైః ప్రలంబశ్చ అభిషేకం త్రయోదశ ॥
అనునీతే తిసూక్తేన ప్రాణప్రతిష్ఠా మాచరేత్
బింబం పూరుషసూక్తేన చార్చయిత్వా యథావిధి
న్యాసం నారాయణంసూక్తం కుర్యాద్ధ్యానం చతుర్దశమ్ ॥
నేత్రమోక్షం పంచదశ మంత్రపుష్పంతు షోడశ
ధ్వజారోహం సప్తదశ వివాహ స్త దనంతరమ్ ॥
అష్టాదశ రథారోహః కర్మాణ్య ష్టాదశక్రమాత్ ॥

వాతూలాగమే, ప్రతిష్ఠాలక్షణే.

తరువాతఁ బ్రతిష్ఠాలక్షణమును జెప్పుచున్నాను. దేవబింబములుగాని దేవీ బింబములుగాని భక్తవిగ్రహములుగాని దేవతావాహనములుగాని లోహములచేతను, దారువులచేతను ఇసుకచేతను మృత్తికచేతను సున్నపు గచ్చుచేతను రచించిన లింగములుగాని రచించునప్పుడును బ్రతిష్ఠించునపుడును సంపూర్ణముగా వాస్తుశాస్త్రమును దెలిసినవారిచేఁ జేయించిన రాజు సుఖపడును. రాష్ట్రము రాష్ట్రజనములును సుఖపడుదురు. కాలమునఁ జక్కగా వర్షములు గురియును. భూమియందు ధనధాన్య సమృద్ధి గలుగును. గోవులు సంపూర్ణముగా క్షీరములు పితుకును. ప్రజలు రోగ రహితులై సదారోగ్యమున జీవింతురు. వాస్తుశాస్త్రపద్ధతిని జేయకుండిరేని కర్తృ నాశమును గులక్షయమును జరుగును. అందుచే సకలవాస్తు స్వరూపము శిల్పిజీవిత మనియె తెలియుచున్నది. శిల్పాచార్యుఁ డెట్టివాఁడనిన:- విశ్వకర్మ బ్రహ్మర్షి వంశమున జనించి వేదశాస్త్రార్థములను గూలంకషముగాఁ జదివియుండవలెను. మఱియు నారోగ్యవంతుఁడును సుందరాకృతి గలవాఁడును, సత్యవాక్శీలుఁడును, న్యాయ శాస్త్రములఁ జక్కగాఁ దెలిసిన వాఁడును, మంత్రములను దంత్రములను వానివైద్యములను బూర్ణముగా నెఱిఁగినవాఁడును, పెద్ద కుటుంబమునఁ బుట్టిన వాఁడును, సద్వంశమున జనించినవాఁడును, నిత్య నైమిత్తకర్మల యథాశాస్త్రముగా నెఱవేర్చు వాఁడు గనుకనే పరిశుద్ధాచారము గలవాఁడును, ప్రతిష్ఠా కర్మయందు నేర్పరియు, శాంతచిత్తము గలవాఁడును, సత్పురుషులెల్ల రౌననఁ దగినవాఁడును, బ్రహ్మపదార్థ జిజ్ఞాసువు గలవాఁడును, జపానుష్ఠానమున సమర్థుఁడగువాఁడును, సూత్రవిన్యాసముల నెల్లఁ జక్కగ నెఱింగినవాఁడును, వేదోక్తకర్మలయందు నిత్యానుష్ఠానతత్పరుండును, కాలాకాలములయందు విభాగజ్ఞానము గలవాఁడును, సమస్తశాస్త్ర తత్వములఁబూర్ణ ముగా గ్రహించినవాఁడును, అయియుండవలెను. ఇట్టి సర్వగుణ సంపత్తిగల సంపూర్ణ ప్రజ్ఞావంతునే శిల్పాచార్యునిగ నియమించుకొనవలెను. మఱియు నాబ్రహ్మవంశ్యుఁడు స్నానము, సంధ్యావందనము, గాయత్రీజపము, ఔపాసన హోమము, వేదవేదాంగ పఠనము, పితృతర్పణము, అతిథిపూజ, వైశ్యదేవము, అను నీ యెనిమిది కర్మలు నిత్యము జరుపుచుండవలెను. మఱియు నాతఁడు బాహుపురులు, ముత్తెపు సరులు, శిల్పరాజ్యాభిషేక మకుటము, హస్తకంకణములు వీనిచేఁ బ్రకాశించు చుండవలెను. మఱియు ఛత్రచామర వ్యజన ధ్వజాదులతోడను శోభించుచుండవలెను. ఇట్టి శిల్పాచార్యుఁడు యజమానుఁడు మున్నగువారలచే సేవింపఁబడినవాఁడగుచు నృత్యగీతాదులతోఁగూడి బింబమునకుఁ బ్రదక్షిణ మొనర్చి శిల్పగేహమును బ్రవేశింపవలెను. తరువాతఁ బుణ్యాహవాచనము పంచసూక్తములతోఁ జేయవలెను. పిమ్మట నంకు

రారోపణముఁ జేయవలెను. ఇయ్యది ప్రథమ సంస్కారము. రెండవది శిల్పకోవిదు లచే స్నపన మొనర్చి జలాధివాసముఁ జేయుట. ఈ యధివాసమునఁ బంచగవ్యముల చేతను బంచామృతములచేతను పంచత్వక్కులచేతను, బంచపల్లవములచేతను నభి షేక మొనర్పవలెను. మూఁడవది క్షీరవాసము. ఈ యధివాసమునఁ బ్రత్యేకము క్షీరమున నభిషేక మొనర్పవలెను. నాల్గవది ధాన్యాధివాసము. ఐదవది వాస్తుహో మము. దీనియందు బలియు శాంతియుఁ జేయవలెను. ఆరవది మూర్తిహోమము. ఏడవది శిల్పివర్యుల భోజనము. దీనియందె పుణ్యాహము శాంతికర్మలు జఱుపవలెను. ఎనిమిదవది గృహశుద్ధి. ఇదియె గర్భాలయశుద్ధి. తొమ్మిదవది గర్భవిన్యాసము. ఇదియె గర్భాలయమున భూసంగ్రహాది క్రియలొనర్చుట. పదియవది రత్నసంస్థితి. దీనియందె నవరత్నస్థాపన మొనర్చుట. పదునొకొండవది పీఠబంధనము. ఇదియె పీఠ స్థాపనముఁజేయుట. దీనియందె శాకునాది మంత్రములు జపించుటయు సిద్ధమైన గర్భాలయముకడకు శుభలగ్నమునందు బింబమును బ్రవేశ పెట్టుటయు. పదిరెండవది అష్టబంధనము. దీనిచేఁ బీఠమున మూర్తినిఁ బ్రతిష్ఠించుట. పదుమూఁడవది యభి షేకము. ఇయ్యది పంచసూత్రాలంబనముతోఁ జేసెదరు. ఇందె ప్రాణప్రతిష్ఠ యొన ర్పవలెను. పురుషసూక్తములచేత నర్చించి నారాయణ సూక్తన్యాస మొనర్పవలెను. ఇందె ధ్యాన మొనర్పవలెను. ఇయ్యదియె పదునాలుగవది. పదునైదవది నేత్ర మోక్షము. పదియారవది మంత్ర పుష్పము. పదియేడవది ధ్వజారోహణము, వివా హమును. పదునెనిమిదవది రథారోహణము. ఈ యష్టాదశ సంస్కారములు శిల్ప కోవిదుఁ డొనర్పవలెను.

ఈవాతూలాగమ వాక్యమున నష్టాదశ సంస్కారములు శిల్పాచార్యుఁడె చేయవలెనని యున్నది.

కశ్యపుని బ్రహ్మశిల్పము; శిల్పిబ్రాహ్మణుఁడు; వేదోక్తమగు శిల్పరచనము.

“ కశ్యపో విశ్వకర్మాచ విశ్వలోక పితామహః ” అను పురాణోక్తి వలనఁ గశ్యప బ్రహ్మర్షి విశ్వపితామహుఁడగుట లోకవిదితము. ఇమ్మహామహునిచే నుద్ధ రింపఁబడిన శిల్పమునకు బ్రహ్మశిల్పమని నామమిడినట్లు:-

శ్లో॥ కశ్యపోక్తం బ్రహ్మశిల్పం సమభ్యస్యచ తేనహి
విగ్రహాణాంచ నిర్మాణం కుర్వాత్సాశిల్పిస్స ఉచ్యతే ॥

కశ్యపశిల్పము తృతీయపటలము.

కశ్యప బ్రహ్మర్షిచేఁ జెప్పఁబడిన బ్రహ్మశిల్పము నభ్యసించి దానిచే విగ్రహ నిర్మాణము నొనర్పవలెను. అట్లు నిర్మించిన శిల్పి ప్రాజ్ఞుఁడని చెప్పఁబడును. అను నర్థముగల పై వాక్యముచేఁ దెలియుచున్నది. బ్రహ్మశిల్ప శబ్దమున కర్థము విచారించితిమేని, "బ్రహ్మనామవేదః తేనరచనంచ శిల్పంచ బ్రహ్మశిల్పం వేదోక్తరచన మితియావత్" అను విగ్రహ రీతిచే బ్రహ్మమనిన వేదము దానిచేఁ జేయఁబడినదిగావున బ్రహ్మశిల్పమని యర్థము నిష్పన్నమగుచున్నది.

మఱియు లింగనిర్మాణ ప్రకరణమున:-

శ్లో॥ బ్రహ్మశిల్పేన లింగస్య నిర్మాణం వక్ష్యతేఽధునా
ఏతద్జ్ఞాత్వా విప్రవర్యైష్షడ్దర్శన సుదీక్షితైః॥
కార్యందీక్షావిధానేన పక్షదీక్షా క్రమేణహి
త్రిభాగ మాదితోరుద్ర భాగనిర్మాణ మీర్యతే॥
అనంతరం బ్రహ్మ విష్ణుపీఠే నిర్మాయ బుద్ధిమాన్
సూత్రేణ మాపితం బ్రహ్మభాగం రుద్రైక భాగకం॥
విష్ణోర్భాగం తథైవాఽశు కుర్యాత్తత్తన్మ సూక్తితః॥

కశ్యపశిల్పము, ద్వితీయపటలము.

తా॥ ఇప్పుడు బ్రాహ్మశిల్పముచే లింగనిర్మాణము చెప్పఁబడుచున్నది. దీనినిఁ దెలిసికొని షట్శాస్త్రపారంగతులైన విప్రశ్రేష్ఠులచే దీక్షావిధానముచేతను పక్షదీక్షా క్రమముచేతను జేయింపవలెను. బుద్ధిమంతుఁడైన శిల్పాచార్యుఁడు ముందుగ లింగనిర్మాణశిలను మూఁడుభాగములొనర్చియందు రుద్రభాగమును నిర్ధారణముఁజేసి, తరువాత బ్రహ్మ విష్ణు పీఠములను నిర్మించవలెను, మనువచనమువలన సూత్రముచేఁ గొలవఁబడిన బ్రహ్మభాగము, రుద్రభాగము, విష్ణుభాగమును శీఘ్రముగా విభజింపవలెను.

అనియుండుటచే శిల్పకార్యము వేదమార్గము ననుష్ఠించి దీక్షాపరాయణులగు విప్రవరేణ్యులచేతనే చేయింపవలెనని తెలియనచ్చుచున్నది. మఱియు నాపటలము నందె,

శ్లో॥ ఇమం విధిం విదిత్వైవద్విజః షడ్దర్శనక్రమాత్,
సంపూర్ణదీక్షితః కుర్యాత్తత్తదంగ ప్రకల్పనమ్॥
తత్తన్మంత్రోచ్చారణేన కుర్యాల్లింగాదికంభువి
పంచాక్షరం జపన్మత్రిమేకస్యాశిలయైనహి॥

అపృథఙ్మార్గతోలింగం కుర్యాద్భాగ త్రియాత్మకమ్
అయం సర్వవిధానాంచలింగానాం పరికల్పనే॥
విధిస్స్యాత్సర్వదా విప్రశ్శిల్పీభూయాత్సుదీక్షితః॥

తా॥ ఈ విధిని దెలిసికొనియే షట్ఛాస్త్రములవలనను సంపూర్ణ దీక్షాతత్పరుఁడగు ద్విజుఁడు (బ్రాహ్మణుఁడు) ఆ యా యంగకల్పనములను జేయవలెను. లింగములు మున్నగువాని నా యా మంత్రముల నుచ్చరించుచుఁ జేయవలెను. పంచాక్షర మంత్రమును జపించుచు నేకశిలతో వేఱుమార్గమున గాక భాగత్రయముతోఁ గూడిన లింగమును రచింపవలెను. సర్వవిధములైన లింగముల నిర్మించుటయందును నియ్యదియె యనుష్ఠానమగును. ఈ యనుష్ఠానమునందు బ్రాహ్మణుఁడగు శిల్పాచార్యుఁడు దీక్షాపరుఁడు కావలెను. అనియు, వృషభనిర్మాణ ప్రకరణమునందు,

శ్లో॥ చతుష్పాద్విగ్రహం శిల్పీకుర్యాద్వృషభమేవచ
ధర్మరూపతయా సర్వచతుష్పాత్సువరం మతమ్॥
ఛందసాంచైవ సర్వేషాం విశ్వాకారానుబోధినామ్
విశ్వరూపం సర్వసుర మానవర్షి ప్రసేవితమ్॥

అని యనువదించి,

తన్నిర్మాణవిధిం ధ్యాత్వాకశ్యపేన మయాకృతం
సర్వలోకహితార్థాయకృతం స్యాచ్ఛిల్పిదేశికైః॥
ఉషస్స్నాత్వాప్రాతరగ్ని ముపాస్య విధిపూర్వకమ్
తిష్ఠన్క్రమేణవా దేవస్యాభిముఖ్యేనమంగళమ్॥
ఉపవిష్టక్రమం ధ్యాత్వాహ్యపరిమత్తమనాస్తదా
సత్క్రియాణాం ధ్యానవిధం లిఖిత్వాసర్వపూజనమ్॥
సమాప్య సంకల్పపూర్వం కుర్యాద్వృషభముత్తమమ్
ఖురాద్యారభ్యమూలాంతం వేదానాంచ చతుష్టయమ్॥
సముచ్చరన్ పాదలగ్నలక్షణానాం వినిర్మితం
కుర్యాదన్యవిధైరేవ నవిధిర్దృశ్యతేభువి॥
ఊరుమూల స్కంధమూల నిర్మాణే సతియత్నతః
మహావాక్యానిచత్వారి పఠన్ సాధుపరికల్పయేత్॥
పురః పాదయుగస్యైవ నిర్మాణాంతే భుజస్థలే

నిర్మితేసతిశకస్య మంత్రించైవ సముచ్చరేత్॥
స్కంధశబ్దో వృషస్యైవగళ పశ్చాత్కకుత్స్మృతః
తదాతదాస్కంధమూలే పురఃపాదయుగస్యహి॥
తన్మూలాదారభ్యగళ పశ్చాత్ స్కంధస్య నిర్మితం
కుర్యాదింద్రస్య మంత్రేణ బ్రాహ్మణశ్శిల్పిసత్తమః (సంస్తుతః)॥
శిష్టాన్యంగాని సర్వాణి వృషమంత్రేణ వై బుధః
బ్రహ్మవిష్ణుశివానాంచమంత్రైః కుర్యాద్యథావిధి॥

తా॥ చతుష్పాద్రూపమైన విగ్రహమును శిల్పిచేయవలెను. అదియె వృషభము. ధర్మరూపమగుటచే సర్వచతుష్పాత్తులలో నీవృషభమును శ్రేష్ఠమయినదిగాఁ జెప్పుదురు. మఱియు నీ వృషభము విశ్వాకారమును బోధించు సర్వవేదముల యొక్క సర్వస్వరూపమును బొందునదియు సమస్త దేవమానవ ఋషులచే సేవింపఁబడినదియు నగును.

కశ్యపుఁ డనగు నాచేఁ జేయఁబడిన యీ వృషభనిర్మాణ విధిని మనస్సున ధ్యానించి (తలఁచుకొని) సమస్త లోకహితముకొఱకు శిల్పాచార్యులచేఁ జేయఁబడవలెను. మఱియు నాశిల్పాచార్యుఁడు ఉషఃకాలమున స్నానమొనర్చి విధిపూర్వకముగాఁ బ్రాతఃకాలాగ్నిని నుపాసించి దేవతాపూజనమొనర్చి దేవతాభిముఖముగా మంగళస్తుతులొనర్చి ధ్యానించి యపరిమత్తుఁడై ధ్యానవిధముగా విగ్రహమును వ్రాసి పూజించి సంకల్పపూర్వకముగా నుత్తమమగు వృషభమును నిర్మింపవలెను. డెక్కలు మొదలుకొని మూలమువఱకు నాలుగువేదములను నుచ్చరించుచు పాదలక్షణములను జక్కగా నిర్మింపవలెను. తొడలను మూఁపురమును సృజించునప్పుడు మిక్కిలి ప్రయత్నముతో మహావాక్యముల నాల్గింటిని బఠించుచుఁ జక్కగా నిర్మింపవలెను. ముందఱి పాదములను భుజములను సృజించునప్పుడు ఇంద్రమంత్రమును సముచ్చరింపవలెను. కంఠమును దరువాతి మూఁపురమును ముందఱి పాదములకు మూలభాగమును నన్నిటిని సృజించునప్పుడు ఇంద్రమంత్రమును బఠించుచు బ్రాహ్మణుఁడగు శిల్పివర్యుఁడు సృష్టిచేయవలెను. మిగిలిన యవయవములను నన్నిటిని వృషమంత్రముచేతను బ్రహ్మవిష్ణుశివ మంత్రములచేతను యథావిధిగా బుధుఁడగు శిల్పి నిర్మించవలెను.

మఱియు షణ్ముఖనిర్మాణమునందు.

శ్లో॥ షడాననస్యాననానాం మాత్రిం ద్వాదశబాహుకం
శిల్పిప్రోక్తం ప్రస్తరాద్యైర్నిర్మాణం స్యాంన్మనుక్రమం॥
ప్రతిహస్తస్య నిర్మాణేఇంద్రమంత్రిం సముచ్చరేత్
ముఖషట్కవి నిర్మాణే గళా(ది) కమనూక్తిభిః॥
ప్రత్యేకం వస్తుమంత్రైశ్చభాషా మంత్రైశ్చభాషితైః
వాయుమంత్రైరశ్వమంత్రైశ్చంద్రాదిత్య సుమంత్రికైః॥
అశ్వినీదేవమంత్రైశ్చ రుద్రైకాదశమంత్రికైః
ద్వాదశాదిత్య మంత్రైశ్చ మహాదేవస్య మంత్రితః॥
వామదేవ మహామంత్రైః పినాకిమనునా తథా
పార్వతీ పరమేశస్య మంత్రాభ్యా మేకయోగతః॥
వాయుమంత్రై రగ్నిమంత్రై ర్జీవరేఖాది నిర్మితమ్
శీర్షాదిపాదపర్యంతం సృష్టినిర్మాణ ముత్తమం॥
అన్యేషాంవిగ్రహాణాంచ సృష్టినిర్మాణముత్తమం
శిల్పీకుర్యాద్ధోమ దీక్షాప్రకారేణైవ హోమతః॥
అవశిష్టాంగ నిర్మాణేమంత్రాః పూర్వోదితా యయా
విదితాశ్చేచ్ఛిల్పిభిశ్చకార్యం తైరంగవేదిభిః॥

తా॥ కుమారస్వామియొక్క యాఱుమోములును బండ్రెండు బాహువులును సృజించుటకుఁ దగిన శిలలను శిల్పిచే నుద్ధరింపఁబడినవానిని మూలమంత్రాను క్రమణముగా నాకారమును సృజింపవలెను. హస్తములెల్ల సృజించునపుడు ఇంద్రమంత్రమును జెప్పవలెను. ఆఱుమొగములు సృజించునపుడా యాముఖాను సరణములగు మూలమంత్రములను బఠించవలెను. ఇంకను బ్రత్యేకవస్తు మంత్రములచేతను, భాషామంత్రములచేతను, వాయుమంత్రములచేతను, అశ్వమంత్రములచేతను, చంద్రాదిత్య మంత్రములచేతను, అశ్వినీదేవ మంత్రములచేతను, ఏకాదశ రుద్ర మంత్రములచేతను, ద్వాదశాదిత్య మంత్రములచేతను, మహాదేవ మంత్రములచేతను, వామదేవ మహామంత్రములచేతను, పినాకిమంత్రముచేతను, ఏకముగాఁ గూడిన పార్వతీ పరమేశ్వర మంత్రములచేతను, వాయుమంత్రములచేతను, అగ్నిమంత్రముల చేతను, జీవరేఖాదికములన్నియు నిర్మింపఁబడవలెను. ఇతర విగ్రహములనుగూడ నిట్లె నిర్మించవలెను. శిల్పిహోమదీక్షాక్రమముగా హోమమాచరించి విగ్రహనిర్మాణ

మును జేయవలెను. మిగిలిన యవయవనిర్మాణము నాచేఁ జెప్పఁబడినది. తెలుపఁబడిన యీపూర్వోక్త లక్షణములచే నవయవ వేదులైన శిల్పులు నిర్మించవలెను.

మఱియు నితరనిర్మాణక్రమమునందును,

శ్లో॥ శిల్పియత్నంచ కుర్యాద్వై దీక్షాకర్మసుతత్పరః
యస్య యంత్రస్యయో మంత్రస్తైనై వహిసుదీక్షయా॥
భూమి మేరుప్రస్తరాది లోహజాలేనకారయేత్
వృక్షమంత్రైశ్చ వృక్షంచ దేహమంత్రైస్సురాలయాన్॥
జలమంత్రైశ్చ కూపానాం నిర్మాణం శిల్పిభిర్మతం
శతరుద్రైర్ధనుర్మంత్రైః పీఠం కుర్యాత్సమాహితః॥
ఖడ్గఖేటాదిమంత్రైశ్చ ఖడ్గఖేటాది నిర్మితమ్
కుర్యాత్సౌర్యైస్సుమంత్రైశ్చ రథనిర్మాణ ముత్తమమ్॥
ఇదం శిల్పంతు మునినాకశ్యపేనమయోదితమ్॥
విదిత్వాతేనకుర్వంతు సర్వవిగ్రహ సంచయమ్॥

తా॥ శిల్పి దీక్షాకర్మయం దాసక్తిగలవాఁడై యేయంత్రమునకు నేమంత్రమునుపాసన చేయవలెనో ఆయామంత్రోపాసనలయందు దీక్షవహించి పూనికతోఁ జేయవలెను. భూప్రస్తారము మేరుప్రస్తారము మున్నగు శ్రీచక్రాదులు లోహసముదాయముతోఁ జేయించవలెను. వృక్షమంత్రములతో వృక్షనిర్మాణమును, జలమంత్రములతోఁ గూపనిర్మాణమును శతరుద్రీయధనుర్మంత్రములచేతఁ బీఠనిర్మాణమును జేయవలెను. ఖడ్గఖేటాదిమంత్రములచేత ఖడ్గఖేటాది నిర్మాణమును సమస్తములైన సన్మంత్రములచేత రథనిర్మాణమును జేయవలయును. ఈశిల్పమంతయుఁ గశ్యపమునినైన నాచేఁ జెప్పఁబడినది. దీనిని దెలిసికొని యీశిల్పముచే నెల్లవిగ్రహములను జేయవలెను.

అని యీ పూర్వోక్తవాక్యములచే శిల్పాచార్యుఁడు శిల్పవిజ్ఞానమునందేకాక వేదవేదాంగ పరిజ్ఞానమునందు సంపూర్ణప్రతిభా ధురంధరుఁడుగావలెనని తెలియవచ్చుచున్నది. ఇంతయేకాక యీశిల్పవృత్తి వేదోక్తమయినదియు బ్రాహ్మణకార్యమయినదనియుఁ దెలియుచున్నది. మఱియు నిందలి "ద్విజఃషడ్దర్శనక్రమాత్ సంపూర్ణదీక్షితః కుర్యాత్తత్తదంగప్రకల్పన" మ్మనియు, "సర్వదావిప్రశ్శిల్పీభూయాత్సుదీక్షితః" అనియు "బ్రాహ్మణశ్శిల్పిసత్తమః" అనియుఁ జెప్పు వాక్యములవలన శిల్పికులము విశదమగుచున్నది. ఇంతయకాక శిల్పారంభకర్మయందు:—

శ్లో॥ కుంభాన్ షోడశసంస్థాప్య కశ్యపం బ్రహ్మణస్పతిమ్
ఆవాహ్యతద్ఘటోదేన జీవరేఖాక్రమం శుభమ్॥
సువర్ణతంతుం సంవేష్ట్య శతహస్తప్రమాణితమ్
త్వష్టారం విశ్వకర్మాణం మనుంచ మయమేవచ॥
సమావాహ్యాపాసనాగ్నౌ తత్తచ్ఛిల్పం నివేద్యహి
అధునా బ్రహ్మ శిల్పేనకృతం దైవతవిగ్రహమ్॥
పశ్యతాత్సర్వథాగాఢం నిర్దోషం స్వీకురుక్రమాత్
ఇతి ప్రత్యేక సంబోధనాంత ముచ్చార్యతత్కృతమ్॥
తేషాం తేషాం శిల్పవిధమశాపంశస్తమేవయత్
తత్సర్వం బ్రహ్మణేతుభ్యమర్పయా మీతిసాంజలిః॥
పుష్పాక్షతకరో భూత్వా స్వకృతం విగ్రహాదికమ్
నిర్దోషంకురు పూజార్థం ప్రార్థితోహం మహీతలే॥
యేయేవాంఛంత్యహం తేషాం తేషాం దాస్యామికశ్యప
ఇతి సంప్రార్థ్య శిల్పీచ షోడశోదఘటాంబునా॥
అభిషేకంతతః కృత్వా పూజాం కృత్వా యథాక్రమమ్
త్వష్ట్రేహ్యాజాం సవత్సాంచ ధేనుం వై విశ్వకర్మణః॥
మయస్య గ్రామమేకంతు మనవే పుస్తకం క్రమాత్
దత్వాభవచ్ఛాపమేన దానేదానేన నాశితమ్॥
బ్రాహ్మణానాం దేవశిల్పం భావశిల్పం మనోమయం
కురుధ్వం సాధుశిల్పీంద్రాః యూయమ్॥

ప్రథమః పటలః.

తా॥ శిల్పకార్యారంభమునఁ బదియాఱు కుంభముల స్థాపించి యందు బ్రహ్మణస్పతియగు కశ్యపు (శిల్పి)ని నావాహించి ఆ కుంభములయందలి యుదకముచే జీవరేఖాక్రమ మొనర్పవలెను. మఱియు శతహస్తప్రమాణమైన సువర్ణతంతువును జుట్టవలెను. అందుఁ ద్వష్టను, విశ్వకర్మను, మనువును, మయుని నావాహనమొనర్చి, యౌపాసనాగ్నియందు నా యా శిల్పములను నివేదించి, "ఇప్పుడు బ్రహ్మశిల్పముచేఁ జేయఁబడిన దైవత విగ్రహమును జూడుము! అన్నివిధముల నిర్దోషమయిన దానినిగా స్వీకరించుము!" అని ప్రత్యేక సంబోధనముచేఁ బలికి, "ఆయా శిల్పవిధము శస్తమైనను అశస్తమైనను నంతయు బ్రహ్మవైన నీకు సమర్పించుచున్నా"నని పుష్పా

క్షతకరుఁడై దోసిలియొగ్గి "ఓ కశ్యపా! నాచేఁ జేయఁబడిన సమస్త విగ్రహాదులును నిర్దోష మొనర్పుము. అవి పూజ్యతచే వఱలుటకొఱకు నిన్నుఁ బ్రార్థించితిని. భూమి యందెవ్వరెవ్వ రెయ్యవి గోరిన వానినెల్ల నిచ్చెదను. వానినెల్లఁ జక్కఁజేయుము!" అని ప్రార్థించి శిల్పిషోడశకలశముల నున్న యుదకముచేతను నభిషేకమొనర్చి యథాక్రమముగాఁ బూజసేసి, త్వష్టకొఱకు నజమును, విశ్వకర్మకు సవత్సయగు గోవును, మయునకొక్క గ్రామమును, మనువునకొక పుస్తకమును గ్రమముగా దానమొనర్చి "మీ శాపమంతయు నీదానముచే నశింపవలెను. ఓ శిల్పీంద్రులారా! బ్రాహ్మణుల యొక్క దేవశిల్పమును భావశిల్పమును మనోమయమగు నటులను సాధువగు నటులను మీరు చక్కఁజేయుఁడు" అని ప్రార్థించవలెను.

అని వక్కాణించియుండుటచే శిల్పులకుఁ గూటస్థులగు మనుమయ త్వష్ట్ర విశ్వకర్మలను మాత్రమావాహనమొనర్చి శిల్పిని మాత్రమావాహన మొనర్చియుండకపోవుట విచారింపవలసియున్నది. ఇందుఁ బ్రప్రథమముగఁ "గశ్యపంబ్రహ్మణస్పతిమ్, ఆవాహ్య" అని వ్రాసియుండుటచేఁ గశ్యపుఁ డాదిశిల్పియగుటయె గాక బ్రహ్మణస్పతియను విశేషముండుటచేత, "బ్రహ్మణస్పతిరేతా సంకర్మారఇవాధమత్" అను ఋగ్వేదవచనము ననుసరించి బ్రహ్మణస్పతియను శబ్దము శిల్పకర్తకే యనువదించుటచే నీకశ్యపుఁడు సాక్షాచ్ఛిల్పియనుట కభ్యంతరముండదు. అందువలన శిల్పివరేణ్యుల కూటస్థులగు మనుమయత్వష్ట్ర శిల్పి విశ్వకర్మ (విశ్వజ్ఞు) లను నావాహనమొనర్చి వారిని బూజించి వారిని బ్రార్థించి వారి యాజ్ఞచే నశప్తులరై శిల్పము నొనర్పవలెనని స్పష్టమగుచున్నది. మఱియుఁ ద్వష్టకు మేషమును, విశ్వకర్మకు ధేనువును, మయునకు గ్రామమును, మనువునకుఁ బుస్తకమును దానమొనర్పవలెనని యుండుటచే లక్షణ యా వీరు నలువురు మనుమయత్వష్ట్ర విశ్వకర్మలను అయోదారులోహ సువర్ణకర్తలగు శిల్పిబ్రాహ్మణులే యగుదురు. ఆహ్వానమొనర్చునది శిలాకర్తయగు శిల్పివర్యుఁడు. ఆహూతులు మనుమయత్వష్ట్ర విశ్వకర్మలు. శిల్పివర్యుఁడు విగ్రహ నిర్మాణమునకు ప్రధానుఁడు. మనుమయత్వష్ట్ర విశ్వకర్మలు సహాయులు. వీరేగురు గలసిన సర్వశిల్పములకు ముఖ్యకర్తృత్వమును వహించెదరు. శిల్పికిఁ బ్రాధాన్యమిచ్చు నీ శిలావిగ్రహనిర్మాణశిల్పమున శిల్పిప్రాధాన్యముచేఁ దాదాత్మ్యమును వహించు కశ్యపశిల్పిని మున్నపూజించి యనంతరమ సహాయశిల్పులగు మనుమయాదులఁ బూజించి వారి ననివార్యదానములచేఁ దృప్తినందించి వారి యాజ్ఞ స్వీకరించుట విధాయకమయ్యెను.

## శిల్పాచార్యుని వేదవేదాంగతత్వ నిపుణత.

మయశిల్పశాస్త్రమున నీ క్రిందివిధముగ వచింపఁబడియె.

శ్లో॥ విశ్వకర్మకులశ్రేష్ఠో ధర్మజ్ఞో వేదపారగః
సాముద్రిగణితానాంచ జ్యోతిశ్శాస్త్రస్యచైవహి॥
లోహపాషాణకాష్ఠానా మిష్టకానాంచసంకలే
సుధానాం చిత్రికానాంచ చతుష్షష్ఠికమర్మగః
సూత్రశాస్త్రక్రియా ప్రాజ్ఞో వాస్తు విద్యాబ్ధిపారగః
శైవవైష్ణవశాక్తేయం గాణాపత్యం బౌద్ధకమ్॥
కాపాలికంచ షడ్దర్శం నిర్మితం స్థాపితం తథా
శ్రౌతస్మార్తక్రియాప్రాజ్ఞో మంత్రతంత్రార్థకోవిదః॥
సంకల్పంచానువాకంచ మార్జనంచాఘమర్షణమ్
పంచాంగలక్షణం స్నానసంధ్యాది జపతర్పణమ్॥
పంచయజ్ఞో మహాధ్యానం వైశ్వదేవంచసంతతమ్
సత్యవాక్యస్సదాచారః విద్యాకుశలబుద్ధిమాన్॥
సర్వలక్షణసంపన్నః సర్వావస్థాసుశోభితః
ఆరోగ్యేచాప్రమాదేచ సప్తవ్యసనవర్జితః॥
వేదకర్మాసదాచారః ఏకపత్నీవ్రతస్తథా
మనుసూత్రాదిశాస్త్రజ్ఞో గుణవాన్ సత్యవాచకః॥
ఏవంగుణగణైర్యుక్త శ్శిల్పాచార్యస్సదోచ్యతే॥

తా॥ విశ్వకర్మ బ్రాహ్మణవంశమున శ్రేష్ఠుఁడును, ధర్మముఁ దెలిసినవాఁడును, వేదంబుల దరిఁజూచినవాఁడును, గణితశాస్త్రము సాముద్రికశాస్త్రము జ్యోతిశ్శాస్త్రము ఇవి కూలంకషముగఁ జదివినవాఁడును, సువర్ణాది లోహములు పాషాణములు దారువులు ఇటికలు గచ్చులు చిత్రములు మొదలగు పనులునేర్చినవాఁడును, అరువదినాలుగు విద్యల మర్మములను దెలిసినవాఁడును, సూత్రశాస్త్రక్రియలయందుఁ బ్రావీణ్యతనందినవాఁడును, వాస్తువిద్యాసముద్రమును దాటినవాఁడును, శైవము వైష్ణవము శాక్తేయము గాణాపత్యము బౌద్ధము కాపాలికము అను నీ నాఱుమతములను దెలిసినవాఁడును, స్థాపించినవాఁడును, శ్రౌతస్మార్తక్రియలయందుఁ బ్రవీణుఁడును, మంత్రతంత్రంబులు దెలిసినవాఁడును, సంకల్పము అనువాకము మార్జనము అఘమర్షణము స్నానము అను పంచాంగలక్షణములు గల స్నానమును, సంధ్య,

జపము, తర్పణము పంచయజ్ఞము మహాధ్యానము వైశ్వదేవము మున్నగు నిత్య కర్మలు నిత్యముగఁ జేయువాఁడును, సత్యము పలుకువాఁడును, సదాచారము గలుగు వాఁడును, విద్యలయందు నేర్పుగల బుద్ధిగలవాఁడును, సలక్షణములగు సర్వాంగ ములు గలవాఁడును, సర్వావస్థలయందును ప్రకాశించువాఁడును, ఆరోగ్యమునందును అప్రమాదమునందును ద్యూతసురాపాననాది సప్తవ్యసనములు వర్జించినవాఁడును, వేదోక్తధర్మంబులఁ జక్కఁగ నాచరించువాఁడును, ఏకపత్నీవ్రతముగలవాఁడును, మనుసూత్రమను శాస్త్రమును డెలిసినవాఁడును, గుణవంతుఁడును, సత్యవాచకుఁ డును, అగు నట్టి శిల్పాచార్యుం డెల్లపుడు జెప్పఁబడును.

ఇటులఁ జెప్పఁబడిన మయశిల్పోక్తి కశ్యపశిల్పోక్తిని బలపఱచుచున్నది. ఇంతయ కాక కశ్యపోక్తులగు శిల్పుల విశేషించిన ద్విజ విప్రబ్రాహ్మణ శబ్దములు సంస్కారకర్తృక వేదపాఠక బ్రహ్మజ్ఞులని యన్వర్థము ప్రతిపాదించుచున్నది.

## వాగీశ్వర్యగ్నికుండోత్పత్తి.

వాగ్వై వాజస్య ప్రసవః । వాచాగ్ం సరస్వత్యా॥

తై. బ్రా. అ. ౧౨. 3.

ఈ పై శ్రుతివలన వాజపేయ యజ్ఞజన్యుఁడగు వాచస్పతియు, వాగ్దేవత యగు వాగీశ్వరియు నొక్కటియేయై వాగీశ్వరీదేవతాత్మకమగు నగ్నికుండము విశ్వ బ్రాహ్మణశిల్పవరుల గృహమందు నిత్యము వఱలుచున్నది. అట్లయిన వాగీశ్వరీ స్వరూపిణియగు వాగ్దేవతకు నగ్నికుండమునకు సంబంధమేమియని ప్రశ్నించుట కవకా శముగలుగును గదా? ఇందులకు ముఖ్యకారణము. "త్వష్టాసర్వజ్ఞరూపోయం త్వష్ట్ర రూపా సరస్వతీ" అను స్కందపురాణ నాగరఖండ విశ్వకర్మోపాఖ్యానమందలి వచన మువలనను, "వాగ్దేవతామేవదన ప్రసన్నా" యను నథర్వణ రహస్యోక్తివలనను, "ముఖాదింద్రశ్చాగ్నిశ్చ" అను శ్రుతివచనమువలనను, "ముఖాదగ్నిః ప్రజాయతే, ముఖమగ్నిరిద్ధః" అను భాగవతోక్తులవలనను స్పష్టీకరించుచున్నది. అనగా వాగ్దేవ తకు విశ్వకర్మయె స్వరూపమనియు అట్టి వాగ్దేవత నాయొక్క ముఖమునందు సుప్ర సన్నయగు గావుతమని ప్రతిమనుష్యునికిఁ గోరికెగలుగుననియు, ముఖమునవలన నగ్ని గలుగుననియుఁ డెలియుచున్నది. మఱియు,

శ్లో॥ "బ్రహ్మత్వేతాన్ సృజన్ లోకాన్, మహదాద్యాన్ మహాద్యుతీన్
సృష్టేఽగ్నిర్ముఖతఃపూర్వం, లోకానాం హితకామ్యయా"

వృద్ధగౌతమస్మృతి.

అను వచనమువలన బ్రహ్మ తేజోవంతములగు లోకములను సృజించుచు లోక హితముకొఱకు ముందుగా ముఖమువలన నగ్నిని సృజించునటుల వివరమగుచున్నది. ఇంతియెగాక వాగ్దేవతకు నగ్నికిని కార్యకారణయోగము విచారించితిమేని,

"మనఃకాయాగ్ని మాహంతి, సప్రేరయతి మారుతమ్।
మారుతస్తూరసిచరన్, మంద్రం జనయతి స్వరమ్॥"

వేదాంగశిక్షా॥

మనస్సు కాయమందలియగ్నిని ప్రేరేపించుచున్నది. ఆయగ్ని వాయువును జేపుచున్నది. ఆవాయువు వక్షస్థలమున సంచరించుచు మంద్రస్వరమును బుట్టించుచున్నది. ఇట్లనుటవలన హృదయాగ్ని తేగి వాయుప్రేరణచే వాగ్రూపముతో జిహ్వాగ్రమున, బహిర్గతముగఁ బ్రసరించుచున్నదని తెలియుచు నగ్నివాగ్దేవతలకు కార్యకారణములచే నిత్యసంబంధము గలిగించుచున్నది. అందువలననే స్వర్ణాది శిల్పకర్మల నగ్నికుండముఖమువలన నాకృతుల నొనర్చుచు నయ్యగ్నికుండమునకు వాగీశ్వరియను నామమును నిర్వచించుచున్నారు. ఇంతియెగాక యగ్నికి "జాతవేద" యను నామము గలదు. "జాయతే వేదసముదాయో యస్మాత్సఃజాతవేదాః" యను నుత్పత్తివలన (అనఁగా వేదములు పుట్టించినవాఁడగుటవలన) జాతవేదుఁడని నామమువచ్చినది. అగ్ని, ముఖజాతుఁడగుటవలననే వేదోత్పత్తికిఁ గారణభూతుఁడయ్యెను. "జాతవేదసే సునవామ" అను ఋగ్వేద. అ. ౧. అ. ౭. వ. ౭. మంత్రమును దేవీసూక్తముగఁ బరిగణించి దేవ్యావాహనమును జేయుచున్నారు. అదేవీసూక్తమునందె "తామగ్ని వర్ణాంతపసాజ్వలంతీంవైరోచనీంకర్మఫలేషుజుష్టామ్। దుర్గాం దేవీగ్ం శరణమహం ప్రపద్యే"అనుమంత్రమువలన అగ్నిస్వరూపిణియగు దుర్గాదేవినిశరణుగోరుచున్నారు. కావుననే విశ్వకర్మవంశీయరథకారబ్రాహ్మణుఁడైన వాజఋభుదేవతకు సంబంధించిన వాజపేయాగ్నికుండమున (వాగీశ్వర్యగ్నికుండమున)

పావకానస్సరస్వతీ, వాజేభిర్వాజినీవతీ।

ఋగ్వేద అ ౧. అ ౧. వ ౬..

అను మంత్రమువలన వాగ్దేవి నావాహనముఁ జేయుచున్నారు. ఇందుల కింకొక కారణముగలదు. రుద్రయామళోక్తదేవీ సహస్రనామావళియందు,

శ్లో॥ పద్మావతీ సునస్త్రాచ ప్రబుద్ధాచ సరస్వతీ
కుంజాసనా జగద్ధాత్రీవృద్ధమాతా జనేశ్వరీ
మూలాధారా నిరాకారా వహ్నికుండ కృతాలయా
వాయుకుండ సుఖాసీనా నిరాధారా నిరాశ్రయా
పాంచాలీకాలికాబాలా బాలక్రీడా సనాతనీ॥

అను శ్లోకములవలన దేవికి, ఆసనాధిష్ఠానము లగ్నికుండమున నిర్వచింపఁబడియె. ఇందువలన శిల్పసంబంధమగు నగ్నికుండమునకు వాగీశ్వరీనామ ముచితమనియె తోఁచుచున్నది. ఇందులకుఁ దగినట్లె భాగవత తృతీయ స్కంధమున ౨౬ అధ్యాయమునందలి సాంఖ్యవిషయిక బ్రహ్మాండోత్పత్తి కథనమునందు.

శ్లో॥ హిరణ్మయాదండకోశా దుత్థాయసలిలేశయాత్,
తమావిశ్యమహాదేవో బహుధానిర్బిభేదఖమ్॥ ౫౩.
నిరభిద్యతాస్య ప్రథమం ముఖం వాణీతతోభవత్
వాణ్యాం వహ్నిరథోనాసే ప్రాణోఽతోఘ్రాణఏతయోః॥ ౫౪.

మహాజలమునందున్న ప్రకాశబహుళమగు నండకోశమునుండి పరమేశ్వరుఁడు లేచి ప్రవృత్తియందు దున్ముఖుఁడయి యింద్రియగణమును ననేకవిధములుగ భేదించెను. అందు ముందుగ ముఖము వ్యక్తియయ్యెను. ఆముఖమునుండి వాణి యుద్భవించెను. ఆ వాణియందు నధిష్ఠాతగ నగ్నినిలిచెను. అని వివరించుటచే ఆంగీరసవంశ విశ్వ బ్రాహ్మణులకు వాగీశ్వరీనామకాగ్నికుండము సచ్ఛిద్ర హిరణ్మయాండ రూపమునలె ముఖాకృతియగునటులఁ బాఠకులకు బోధించక తప్పదు.

కావున వాగీశ్వరి నుపాసించు విశ్వబ్రాహ్మణులకు "బ్రాహ్మణోస్యముఖామాసీత్" అను శ్రుతిపదమువలన ముఖాకృతి బ్రాహ్మణత్వముకూడ నిందుల కుచితరీతియె యుగ్గడించుచున్నది.

వాగీశ్వరీకుండమున నిర్ధూమాగ్ని ప్రజ్వలించుచుండును. ఇందులకుఁ గారణ మేమనః—వాగీశ్వరీ యాజకులగు బృహస్పతి విశ్వకర్మలకుఁ దండ్రియగు నంగిరస్సు అగ్నివలనఁ బుట్టినటుల.

శ్లో॥ "అంగారేష్వం గిరోజాతో హ్యర్చిభ్యోఽత్రి స్తథైవచ
మరీచిభ్యో మరీచిస్తు తతోజాతో మహాతపాః॥"

అను మత్స్యపురాణోక్తినలన తెలియుచున్నది. మఱియు "అంగిరాముఖా జజ్ఞే" అను భాగవతోక్తికూడ బ్రహ్మముఖమునుండి యంగిరస్సు పుట్టినటులఁ జెప్పుచుండుటచేఁ బై వాక్యమును దృఢపరచుచున్నది. ఈచెప్పుటచే నాంగిరసవాచస్పతి విశ్వకర్మ వంశీయస్థపతి సంజ్ఞక శిల్పిబ్రాహ్మణులయొక్క యగ్నికుండమునకు వాగీశ్వర్యభిధానముండుట సార్థక్యతచే రూఢిపఱచుటయేగాక "సగీష్పతీష్ట్యాస్థపతిః" అను నామలింగానుశాసనాంతర్గత బ్రహ్మవర్గమందలి వాక్యమును వాచస్పతి విశ్వకర్మవంశీయుల నుద్దేశించి చెప్పినదనియె స్పష్టముగాక మానదు.

## వాగీశ్వరీకుండమే యాగ్నేయేష్టి కుండము.

ఇట్లు వక్కాణించుటచే నిందుల కింకొక్క సందేహము వాటిల్లినది. అదెద్దియన:—మహారాష్ట్ర దేశమందలి విశ్వబ్రాహ్మణుల గృహమందున్న యగ్నికుండమునకే వాగీశ్వరీ కుండమనియు, దానికి వికృతిపదము బాగేసరియనియు వాడుకొనుచున్నారు. ద్రావిడ కర్ణాటాంధ్ర విశ్వబ్రాహ్మణుల గృహములయందున్న యగ్నికుండమునకు "అగోష్టి" యను పేరున వాడుకొనుచుందురు. కావున వాగీశ్వర్యభిధానము సర్వలోకసామాన్య మెట్లగును?

అనునీ సందేహమున కీక్రిందిరీతి సమాధానముఁ జెప్పనగు. వాగీశ్వరికి బాగేసరి యగునటులనే ఆగ్నేయేష్టికి "అగోష్టి" యనుపదము వికృతిచే నుత్పన్నమయినది. ఆగ్నేయేష్టియన "ఆగ్నేయానామిష్టిః ఆగ్నేయేష్టిః"అను తత్పురుష సమాసరూపమున నాగ్నేయులయొక్క యిష్టియను నర్థమిచ్చుచున్నది. ఆగ్నేయు లెవ్వరనిన:—

శ్లో॥ అష్టౌచాంగిరసఃపుత్త్రా ఆగ్నేయాస్తేఽప్యుదాహృతాః
బృహస్పతిరుతథ్యశ్చపయస్యః శాంతిరేవచ
ఘోరోవిరూపః సంవర్తః సుధన్వాచాష్టమఃస్మృతః॥

భారతము. అనుశాసనపర్వము. ౮౩ అధ్యాయము.

అంగిరస్సుయొక్క పుత్త్రు లెనమండుగురు. ఆగ్నేయులని ప్రసిద్ధిగాంచిరి. బృహస్పతి, ఉతథ్యుఁడు, పయస్యుఁడు, శాంతి, ఘోరుఁడు, విరూపుఁడు, సంవర్తుఁడు, సుధన్వుఁడు. వీరే ఆగ్నేయసంజ్ఞకలవారు. "సగీష్పతీష్ట్యాస్థపతిః" యను కోశవాక్యమున కనుసంధానముగ నాగ్నేయేష్టియు గీష్పతీష్టియు నొక్కటియె; ఏలన నాగ్నేయులు గీష్పతి ప్రముఖులెకదా?

తైత్తిరీయ సంహితాభాష్యమందలి "హిరణ్యకామః కుర్వీతహ్యాగ్నేయాది హవిస్స్వయమ్" అను వాక్యమునలన వాగీశ్వరీ యాజకులు నాగ్నేయేష్టి యాజకులు రథాదిశిల్పసిద్ధికొఱకు వాచస్పతీష్టినామక రథవిషయకవాజపేయ యజ్ఞమునే చేయువారలగుటచే మహారాష్ట్ర విశ్వబ్రాహ్మణులు గాని ద్రావిడ కర్ణాటకాదిదేశ విశ్వబ్రాహ్మణులుగాని తాముచేయు శిల్పయజ్ఞము భేదనామముచే నొక్కవిధిగనే చేయుచున్నారని తేలుచున్నది.

ఇచ్చట బృహస్పతి, విశ్వకర్మలనుగూర్చి కొంత చెప్పవలసియున్నది. శ్రుతుల యందు బృహస్పతి విశ్వకర్మ లొక్కరనియె పెక్కురీతుల వక్కాణించియున్నది. ఇఁకఁ బురాణములో ఇద్దరను వ్యక్తిభేదములుగ వర్ణించుచున్నవి.. ఇక్కడఁ బౌరాణిక శ్రౌతమతములు విరుద్ధములైనవి. అయినను బృహస్పతి దేవతలకుఁ బురోహితుఁడైన యాంగిరస శిల్పియయ్యెను. విశ్వకర్మయో దేవపురోహితుఁడైన యాంగిరసశిల్పియె యయ్యెను. అంగిరఃపుత్త్రుఁడు బృహస్పతి. అంగిరస్సున కష్టమపుత్త్రుఁడగు సుధన్వుఁడు విశ్వకర్మవాచ్యుండని "సుధన్వా విశ్వకర్మణి" యను విశ్వకోశవాక్యమునలన స్పష్టమగుచున్నది. ఇరువురు నాంగిరస వంశ్యులు రథాది శిల్పవిద్యానిపుణులు. వ్యక్తిభేదముచేఁగాని యైక్యభావముచేఁగాని లోకులకు సంస్మరణీయులు. అర్థవాదమువలన విష్ణ్వవతారములలో వాసుదేవుఁ డొక్కరుఁడు. అతనిపుత్త్రుఁడు ప్రద్యుమ్నుఁడు. ప్రద్యుమ్న పుత్త్రుఁ డనిరుద్ధుఁడు. వీరు ముువ్వురు విష్ణు పర్యాయనామములతోఁ బరిగణింపఁ బడినటుల బృహస్పతి విశ్వకర్మలు పౌరాణికోక్తులచే భేదవ్యక్తులైనను, నభేదాధ్యవసానముగఁ బరిగణించుట సమంజసము.

### ఆంగీరసుల కాగ్నేయ సంజ్ఞలు.

అంగిరోత్పత్తిని విచారించుదమనిన:—

శ్లో॥ హిరణ్యగర్భస్తందృష్ట్వా జ్వాలాంభిత్వా వినిస్సృతాం
భృగుస్త్వ మితిహోవాచ యస్మాత్తస్మా త్స్నవై భృగుః॥ ౩౮
మహాదేవ స్తథోద్భూతం దృష్ట్వాబ్రహ్మాణ మబ్రవీత్
మమైషపుత్రకామస్య దీక్షితస్య త్వయంప్రభో॥ ౩౯
విజజ్ఞేఽథభృగుర్దేవో మమ పుత్త్రోఽభవత్వయమ్
ద్వితీయంతు తతశ్శుక్రమంగారేష్వపతత్ప్రభుః
అంగారేష్వంగిరోంగానిసంహితాని తతోంగిరాః॥ ౪౦

సంభూతిం తస్యతాం దృష్ట్వావహ్ని ర్బ్రహ్మాణ మబ్రవీత్
రేతోధాస్తుభ్యమే వాహం ద్వితీయోయం మమాస్త్వితి॥
ఏవమస్త్వితి సోప్యుక్తో బ్రహ్మణా సదసస్పతిః
తస్మాదంగిరసశ్చాపి ఆగ్నేయా ఇతినః శ్రుతమ్॥ ౪౩

వాయుపురాణము ౪ అధ్యాయము.

ప్రజాపతి వంశానుకీర్తనము.

భావార్థము॥ పూర్వకాలమున బ్రహ్మదేవుఁడు వరుణసంబంధమగు యజ్ఞమొనర్చెను. ఆయజ్ఞకుండమున మహేశ్వర మహాతేజస్సు ప్రజ్వలించెను. ఆతేజస్సునందు భృగుమహర్షి యావిర్భవించెను. మహాదేవుఁడాకుమారునిఁజూచి ప్రథమమునఁబుట్టిన యాతనిఁ బుత్రకాముఁడై నాకిమ్మని బ్రహ్మనడిగెను. రెండవసారి యగ్నియందుఁబడిన శుక్రము నిర్ధూమాగ్నియందుఁబడుటచే నంగిరోనామముచే నొకముని ప్రభవించెను. అంగిరుఁడు నిర్ధూమాగ్నియందుఁ బుట్టినవాఁడగుటచే నంగిరోవంశము వారందఱకు నాగ్నేయులని పేరువచ్చెను.

ఇట్లనెడు వాయుపురాణోక్తిచే నంగిరోవంశమునఁ బుట్టిన బృహస్పతి, సుధన్వ (విశ్వకర్మ) మొదలగువారికందఱకు వారివంశమువారలకు నాగ్నేయసంజ్ఞ ప్రసిద్ధమగుచున్నది.

విశ్వకర్మ ప్రతిబింబమూర్తులు శిల్పులగుట.

శ్రు॥ ప్రజాపతిశ్చరతిగర్భే అంతః।
అజాయమానోబహుధావిజాయతే।
తస్యధీరాః పరిజానంతియోనిం।
మరీచీనాం పదమిచ్ఛంతి వేధసః ॥౩॥

యజురారణ్యక ప్రశ్న ౩ అ ౧౩ దశ ౧.

భాష్యమ్॥ "ప్రజాపతిర్విశ్వకర్మా" ఇతిశ్రుతేః ప్రకరణవశాచ్చాత్రప్రజాపతి పదేనవిశ్వకర్మైవగృహ్యతే, సఃగర్భేగర్భస్థస్య దేహినోనిమిత్తం అంతఃమాతురుదరేచరతి సంచరతి, తతశ్చసగర్భః అజాయమానఃస్వయం అపరిణమమానః అనేన

చాంతశ్చరతానిమిత్తభూతేన బహుధా బహుప్రకారేణ అనేక సకల శిరాద్యాకారేణ విజాయతే వివిధరూపేణచజాయతే । కాష్ఠతుల్యోగర్భః అనేనైవాకృతి విశేషం ప్రాప్నోతీత్యర్థః । ఇతిభాష్యకారోక్తిః॥ ధీరాః ధ్యానశీలాః యోగినః, తస్యవిశ్వకర్మణో యోనిం నివాసస్థానం విష్ణోరివశాలిగ్రామం పరిజానంతి సాకల్యేనవిందంతి । యోని శబ్దస్యస్థానవాచిత్వమ్॥ "యోనిష్ఠ ఇంద్రసదనే అకా"రీతి మంత్రేదృష్టం । తత్రవిశ్వకర్మణః స్థానభూతాః శిల్పినః । ఇతివాస్తుతంత్రే రుద్రయామళే సపాదలక్షాంతే ప్రసిద్ధమ్.

"మృదాకాష్ఠేన లోహేన పాషాణైః పారదేనవా ।
రచయంతి విచిత్రాణి రూపాణి వివిధానియే ।
దివ్యాన్ ఛాయానంతరిక్షాన్భావాన్సందర్శయంతియే ।
పంచాలాస్తేసదాపూజ్యాః ప్రతిమావిశ్వకర్మణః ॥
అచేతనం చేతనకార్యకారికుర్వంతి యంత్రప్రతిమాదికంయే ।
స్వయం వహం నైకశుమారచక్రం రథాన్విమఃనానిచఖేచరాణి ।
పంచాంగులాన్తానిహవర్ణలోపాత్పంచాలసంజ్ఞాశ్చతురాన్యచహస్తాన్।
పంచప్రభేదాన్ భువనస్యభర్తుఃపూజా పదానీతివిదుః పురాణాః॥
గృహాది నిర్మాణవిధౌ తతస్తానాద్యంత మధ్యేషు వినాయకాంశ్చ ।
సంపూజయేదన్నధనాదిభిశ్చ సౌవర్ణరూప్యైశ్చ తదాయుధైశ్చ॥"

తస్మాద్విష్ణోః శాలిగ్రామమివ విశ్వకర్మణః ప్రతిమాభూతాన్ శిల్పినరాన్ విశ్వకర్మదృష్ట్యాపూజనీయాత్ । తేనచ విశ్వకర్మ సాయుజ్య ప్రాప్తిరితిభావః। కథంతర్హి తరాన్ బ్రాహ్మణాదీన్ విహాయశిల్పినః పూజనీయా ఇత్యాశంక్యాహమరీచీనామితి। వేధసః బ్రహ్మణస్తుల్యత్వాద్వేధః శబ్దేన బ్రాహ్మణాఉచ్యంతే । తేసర్వేమరీచీనాం అంశూనాం పదమివపదే సంచారస్థానం ఇచ్ఛంతి పూజయితుమితిశేషః తథాహి మంత్రాంతరే. "జ్యోతిర్మయస్యసూర్యస్య భాస్వరతరమండలమే వాధిష్ఠానం స్వరూపమ్ । భూభూధరాదికంతు తత్కిరణానాం సంచారస్థానం । ఏవంసర్వశిల్పకర్తుర్విశ్వకర్మణః శిల్పినరా ఏవముఖ్యం స్వరూపం । శిల్పిత్వసాధర్మ్యాత్ సహిజగద్బింబశిల్పీ ఏతేతు తదంతర్వర్తికతిపయ పదార్థవిషయా శిల్పనంత ఇతి"

బ్రాహ్మణదేవతాదయస్తు త్వష్టు రంశుభూతానాం కలానాం సంచారపదాని। అతః యేకర్మారాన్విహాయవాస్తుకర్మణీతరాన్ బ్రాహ్మణానేన పూజయంతితే సూర్య

మండలం విహాయభూప్రదేశస్థం తత్ప్రిభానమండలం ప్రణమంతీతితేషామజ్ఞత్వాము క్తం భవతి । తస్మాద్బ్రాహ్మణాద్యపేక్షయాపి శిల్పిన ఏవపూజ్యాఇతిభానః.

తాత్పర్యము॥ "ప్రజాపతిర్విశ్వకర్మా" అను మంత్రిమునవలనఁ బ్రికరణవశ ముచే నిక్కడఁ బ్రజాపతిపదము విశ్వకర్మయని గ్రహింపఁబడుచున్నది. ఆవిశ్వకర్మ గర్భస్థుఁడై న దేహికొంటకిః తల్లియొక్క యుదరమున సంచరించుచున్నాఁడు. అందు వలన నాగర్భము సంతరమునఁ జరించుటవలన బహు ప్రికారములగు శిక్షాద్యాకార ములచేఁ బుట్టుచున్నది. కాష్ఠతుల్యమైనగర్భము నీవిశ్వకర్మచే నాకృతివిశేషములఁ బొందుచున్నదని భావము. ధ్యానశీలు రావిశ్వకర్మయొక్క (యోనిని) నివాసస్థాన మును విష్ణువుయొక్క స్థానమును శాలిగ్రామమునువలెఁ దెలిసికొనుచున్నారు. యోని శబ్దము స్థానపర్యాయముగా "యోనిష్ఠఇంద్రిసదనే అకారి" అను మంత్రిమునందుఁ గూడ విస్పష్టమగుచున్నది. అక్కడ విశ్వకర్మకు స్థానభూతులు శిల్పులని రుద్రి యామళగ్రింథమున నీక్రింది తాత్పర్యముగల శ్లోకములు చెప్పఁబడినవి.

" ఎవ్వరు మృత్తుచేతను, కాష్ఠముచేతను, లోహముచేతను, పాషాణము చేతను వివిధములయిన విచిత్రిరూపముల సృజించెదరో, యెవ్వరు ద్యులోకభూలో కాంత రిక్షలోక ధర్మములను జూపుచున్నారో ఆ విశ్వకర్మ ప్రితిబింబస్వరూపులైన పంచాలు రెప్పుడును బూజ్యులు. అచేతనములను చేతనముగాఁ జేయుటయు యంత్ర ప్రతిమాదికముల నొనర్చుటయు స్వయముగా జ్యోతిశ్చక్రిముచు దాల్చుటయు రథ ములను నభమందు సంచరించు విమానములను రచించుటయు నెవ్వరికి సాధారణ ప్రి వర్తనమో వారలే శిల్పివరేణ్యులు. పంచాంగులశబ్దము 'గు' అను వర్ణము లోపించు టచే పంచాల అను పేరుకలిగినది. పంచాంగుళములుగల చతురహస్తములున్నవారు గనుక నీపేరున సార్థక్యత వహించినది. లోకభర్తకుఁ బంచభేదములుగ పూజాస్థాన ములను బ్రాచీనులు జెప్పుచున్నారు. గృహాది నిర్మాణము లనుష్ఠించువేళ నాశిల్పి వరుల నాద్యంతమధ్యమములయందును అన్నధనాదుల నొసఁగియు సౌవర్ణమయము లైనవారి యాయుధాదు లొసఁగియుఁ బూజింపవలెను."

ఇట్లునక్కాణించుటవలన విష్ణువునకు శాలిగ్రామమునువలె విశ్వకర్మకుఁ బ్రతిమ లైన శిల్పివరులను విశ్వకర్మదృష్టిచేఁ దెలిసికొనవలెను. అందుచే విశ్వకర్మ సాయు జ్యము లభించునని యభిప్రాయము. అట్టులైన నితరులగు బ్రాహ్మణాదులను విడిచి శిల్పులే పూజింపఁదగినవారా? యను సందేహమును శంకించి "మరీచీనా" మను

వాక్యములచేఁ జెప్పుచున్నాఁడు. బ్రహ్మకు సమానులగుటవలన వేధశ్శబ్దము బ్రాహ్మణ పర్యాయముగఁ జెప్పఁబడినది. ఆబ్రాహ్మణులందఱు అంశువులయొక్క స్థానమని పూజించుటకుఁ గోరుచున్నారు. అట్లె మఱియొక మంత్రమునందు:—

"జ్యోతిర్మయుఁడైన సూర్యునికి ప్రకాశమానమగు మండలమే యధిష్ఠాన స్వరూపము. భూమియుఁ బర్వతములు మొదలగునవన్నియు నతని కిరణములయొక్క సంచారస్థానము. ఇట్లు సర్వశిల్పకర్తయగు విశ్వకర్మకు శిల్పిత్వము సమానమగుట వలన శిల్పివరులే ముఖ్యస్వరూపము. ఆవిశ్వకర్మ జగత్స్వరూపమైన శిల్పి. ఈశిల్పు లోయాయా జగన్మధ్యంగతములైన కతిపయ పదార్థ విషయములగు శిల్పము గలవారు."

బ్రాహ్మణులు దేవతలు మొదలగువారును విశ్వకర్మయొక్క కలలకుసంచార స్థానములు. ఇందునలన నెవ్వరు కర్మారులను (శిల్పివరులను) వదలి యితర బ్రాహ్మణులనే పూజించుచున్నారో వారు సూర్యమండలమును వదలి భూప్రదేశమందున్నతి త్కాంతిమండలమును నమస్కరించుచున్నారని వారి యనభిజ్ఞత్వము తెలుపఁబడు చున్నది. అందువలన బ్రాహ్మణాదు లనునపేక్షచేతనైనను, శిల్పివరులు పూజింప నలసినవారని విస్పష్టభావ మగపడుచున్నది.

భాష్యకారునిచేఁ జెప్పఁబడిన యీశ్రుత్యర్థము శిల్పివరులు లోకోత్కృష్ట పూజనీయులని వక్కాణించుచున్నది. మఱియు నీశ్రుత్యర్థము ననుసరించిచెప్పుచున్న యీక్రిందివాస్తుశాస్త్రశ్లోకములు సంస్మరింపఁబడినవి.

## వాస్తుపురుష పూజార్హత.

శ్లో॥ రథేయన్త్రిగృహేసౌధ దేవతాయత నాదికే
వాపీకూపతటాకాది ష్వారామఘటనేషునై ॥ ౧౧
ఆరంభేమధ్యమేచాంతే పూజయేద్వాస్తుపూరుషన్।
వాస్తోష్పతిర్విశ్వకర్మా విశ్వశిల్ప క్రియాధిపః॥ ౧౨
సఏవవాస్తుపురుషో వాస్తోఃపూరుషకారణాత్।
తతోర్చయేత్పతింవాస్తో ర్విశ్వకర్మ మనీషయా॥ ౧౩
అపితుప్రతిమాభూతం ప్రత్యక్షం విశ్వకర్మణః।
అర్చయేత్స్థపతింకాలే శాలిగ్రామం హరేరివ॥ ౧౪

స్థపతి ర్విశ్వకర్మేతి శ్రుతిస్మృతిభి రీరితః।
యజేత్త థాపిస్థపతి మంశజం విశ్వకర్మణః॥ ౧౫

యత్రకుత్రై వవావాస్తుపురుషం పూజయేద్యది ।
తద్భావేన యజేద్విశ్వకర్మ బ్రాహ్మణశిల్పినమ్ ॥ ౧౬

తా॥ రథము, యంత్రము, గృహము, సౌధము, దేవాలయాదులు, బావులు, నూతులు, తటాకములు మున్నగువానియందును, తోటలు వేయుటయందును, వాని ప్రారంభమధ్య మానసాన సమయముల వాస్తుపురుషపూజన మొనర్పవలెను. వాస్తోష్పతి యనగా గృహస్థానాధ్యధిష్ఠానదేవతయగును. ఆదైవతమ విశ్వశిల్పక్రియానేత యగు విశ్వకర్మయనుట యథార్థేతరము గానేరదు. ఆవిశ్వకర్మయె గృహాది స్థానములకు విరాట్పురుషుఁడగుటవలన వాస్తుపురుషుఁడనఁబరగును. అందువలన వాస్తోష్పతియనఁదగు వాస్తుపురుషుని విశ్వకర్మయను నుద్దేశముచేతనే పూజించవలెను. ఇంతయెగాక విశ్వకర్మ పరమేశ్వరునకుఁ బ్రతిబింబస్వరూపుఁడై ప్రత్యక్షీకరించిన స్థపతిని (శిల్పివరేణ్యుని) విష్ణువునకుఁ బ్రతిబింబస్వరూపమగు సాలగ్రామమునువలెఁ బూజింపవలెను. ఈ పూజనము వాస్తుపురుషపూజాకాలము లెప్పుడెప్పుడు చెప్పఁబడియున్నవో యాయాకాలములందుఁ జేయవలెనని తెలియుచున్నది. మఱియు స్థపతి విశ్వకర్మయనియె శ్రుతిస్మృతులచేతఁ జెప్పఁబడుచున్నాఁడు. విశ్వకర్మాంశసంభూతుఁడగు నాశిల్పివరేణ్యుఁ డట్లైనఁ బూజింపఁదగియున్నాఁడు. ఎక్కడనైనను వాస్తుపూరుషుఁ బూజించునెడల, నావిశ్వకర్మస్వరూపునిగనే భావించి విశ్వకర్మ బ్రాహ్మణుఁడగు శిల్పాచార్యుని బూజింపవలయునని ఫలితార్థము దేలుచున్నది.

ఈ చెప్పుటలో నత్యంతవిశేషమేమియుఁ గానిపించదు. ఏలన; కన్యాదానాది దానములు చేయునపుడు "శ్రీమహావిష్ణుస్వరూపాయ వరాయ" యనియు "శ్రీమహావిష్ణుస్వరూపాయ బ్రాహ్మణాయ" యనియు గృహ్యసూత్రప్రయోగవాక్యములుండినటులె "శ్రీవాస్తుపురుషస్వరూపాయ శిల్పాచార్యాయ" యనుట సామాన్యముగనే యున్నది. శిల్పకార్యారంభాది సమయముల శిల్పాచార్యాభ్యర్చనము సర్వకల్యాణదాయకమని మిక్కిలిగా వ్రాయుట సర్వలోకవిదితమగుటచే ననావశ్యకమని యింకయుఁ బెక్కులగు శిల్పవాస్తు శాస్త్రోద్యుదాహరణ వాక్యములు ప్రకటించుట గ్రంథవిస్తరభీతిచే విరమింపఁబడినది. ఇఁక నీశిల్పకాండాంతమున శిల్పమహిమను గరతలామలకముగఁ దెలుపు "మహాశిల్పోపనిషత్తు" ను సంస్మరింపవర్థమని యీయెడఁ బ్రకటింపఁబడినది.

## యాజుషాథర్వణ మహాశిల్పోపనిషత్.

ఓం సహనావవతు సహనౌభునక్తు సహవీర్యం కరవావహై । తేజస్వినావ
ధీతమస్తుమావిద్విషావహై । ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః.

అథమహా శిల్పోపనిషదం వ్యాఖ్యాస్యామః॥ సకల నిగమాగమ సారపారగం
పరిపక్వభావ భరమాచార్యం ప్రణమ్యఛాత్రః పరిపృచ్ఛతి। భగవన్! మేమహాశిల్ప
తత్త్వరహస్యంబ్రూహీతి । తగ్ంసహోవాచ । అణోరణీయ న్మహత్ మహీయదతో
నవేదితుగ్ం శిల్పరహస్యగ్ం శక్నోతి । భవ తస్మాత్సావధానః । వాఙ్మనోగోచరా
తీతాఽనన్త దివ్యతేజోమయో నిత్యో నిర్వికల్పోనిరఞ్జనో నిరాఖ్యాతోఽతి శుద్ధో
దేవఏకః పరబ్రహ్మ విరాజతే । సఏవాఖి లాజాండకోటీనాం మూలబీజంభవతి ।
తస్మాన్నద్వితీయోఽస్తి కశ్చిత్ । సనిరాకారోఽపిసాకార త్త్వం నిధత్తే । నిరాకార
సాకారానస్య నైసర్గికావ క్తేతే । జగదుదయకారణం తన్మనోజాయతే । మనస్సంకల్పా
త్సర్వం జగ త్సంకల్పితంభవతి । తదేవైనం ప్రారభ్యతే జగచ్ఛిల్పమ్ । యఇమా
విశ్వాభువనాని జుహ్వద్ ఋషిర్హోతా నిషసాదపితానః । సఆశిషాద్రవిణ మిచ్ఛమానః
పరమచ్ఛదో వర ఆవివేశ । విశ్వాని సృష్ట్యవనప్రళయరూపాణి కర్మాణియస్యాసౌ
విశ్వకర్మాభవతి । యస్మిన్నిదగ్ంసర్వం భువనం జజాన । యస్మాదిదగ్ం సమస్తగ్ం
సంకల్పరూపగ్ంశిల్పం ప్రకల్ప్యతే । సవిశ్వకర్మా పరమాత్మా భవతి । ఆదిశిల్పకృత్త
తస్సభవతి । మనసాయత్సృజ్యతే విశ్వకృద స్త త్సర్వగ్ంశిల్పమేవభవతి । యత్తద్వి
ధానమనుబ్రూహీతి ఛాత్రేణ పృష్టోదేశిక స్సపునరువాచేతి । యదాసపరబ్రహ్మణ
స్సంకల్పోదయోభవతి । తదైవాహం కారఃప్రజాయతే । తస్మాత్పంచభూతాని ।
భూతేభ్యఓషధయస్సర్వే । తేభ్యోఽన్నం తతస్థావరజంగమః ప్రపంచో భవతి । కార
ణంభవత్యత్ర చోపాదాన మాకాశాదీని । అఖండోఽపిదీవ్యతేఽ యమేవహ్యశే
శేషు పరిచ్ఛిన్న జీవత్వేన । వ్యాప్నోతి చాకాశవత్సర్వమ్ । అలంచకార నక్షత్రా
దిభిరాకాశమ్ । శైలకానన ద్రుమాదిభిశ్చవసుంధరామ్ । నానార్థభాజంవాచగ్ంశిల్ప
విచిత్రసుందరామకరోత్ । ఏవమేవాలం కృతవాన్ పదార్థానివై సర్వాణి । సర్వమేత
ద్భవతివిశ్వకృదశ్శిల్పమ్ । యదాతదాభవ జ్జగద్విజ్ఞాన శూన్యగ్ం సోఽ కామయతా
త్మాసంపంచాస్యమ్ । తదైవావిరాసీత్ప్రవృత్త్యై । తస్యైవతేజోంశాదభవన్
బ్రహ్మణోమనుర్మయ స్త్వష్టాశిల్పీవిశ్వజ్ఞ ఇతిపంచ । తానేవగ్ంహోవాచ విశ్వకర్తా ।
ప్రవర్తయతలోకం పంచకర్మభిరితి । ప్రవర్తత ఇత్యేతైః పంచభిరితి ప్రపంచోభవతి ।
యజ్ఞఏవేదం కర్మయజ్ఞః కర్తైమ్రవ । శ్రుణుత తద్యథా సృష్టిస్థితిలయ తిరోధానాను

గ్రహ రూపాణీతి । ఏతద్భవత్యేవం విశ్వకర్మణః।కుర్యాదేవ మేవచలోకస్య।దాతారో
భవన్తు జ్ఞానస్య విజ్ఞానస్యచశిల్పినః । అధిష్ఠాతాహంకర్మణ స్సకలస్య యజ్ఞరూపః ।
విలసితమేనం మయైవజగచ్ఛిల్పస్య కౌశలమ్ । గుహ్యమిదమాధ్యాత్మమ్ । రహస్యం
భవతి ప్రాణినామజ్ఞేయమ్ । తదేత ద్విన్నృణుత విన్నృణుత లోకస్య । ప్రకల్పయత
యజ్ఞగ్ంశిల్పేన । శిల్పేనై వేద ముపబృంహితమ్। యజ్ఞోభవతిలోకానాం నిశ్రేయసే।
సిధ్యైరన్ వివిధా న్యపికార్యాణి । భవతిచతన్నానావిధశిల్ప బహుళమ్ । శిల్పాదృతే
కించిత్సత్రమితి నోచ్యతెనోచ్యతఇతి । తతోఽవశ్యం విసృజత విసృజ తోపకరణాని
జ్యేష్ఠాః । అభ్యర్చనీయోఽహంయజ్ఞైనైవలోకస్య । తాన్యేవంవేదీకుణ్డరథ పాత్రా
దీ న్యభ్యూహయత।కారయతాధ్వరాన్ సర్వై రపిలోకై రనుశ్రుతిమితి।ఏకై కస్మై ర్యకై
కోధ్యక్షఇతివేదస్య । తత్రాథర్వణశ్శిల్ప భూయిష్ఠమత్యంతమ్। మంత్రేణైవస్వరూపాణి
ప్రకర్తవ్యాని । ధ్యానేనైవ పశ్యన్తితద్రూపమ్ । రూపేణైవ ధ్యాయన్తేతద్దైవతమ్ ।
రూపమేవతచ్ఛిల్పమ్ । తాన్యయో దారుశిలాతామ్ర హిరణ్యవికారాణి।మృదాదీన్య
థమాని । యద్యస్యోక్తంతద్వికారంతస్య । ఆయతనవన్తివై సర్వాణ్య పిదైవతాని।
ఏవమేవాపరాణ్యపి శిల్పవిలసితానికర్మాణి । భవన్త్యేతానిచ మోక్షప్రదాని । సంప
ద్యైరన్ సర్వకల్యాణానిలోకాః । సంచినుయాత్పుణ్యమేభి శ్శిల్పైరితి। బ్రాహ్మణానా
మేతద్భవతిశిల్పమ్ । యద్యబ్రాహ్మణోభవేన్నశిల్పీతి । అబ్రవీదేవం పునరాచార్య
స్సర్వజ్ఞః । యదాయదావహీయతే లోకాదస్మాద్ధర్మగ్ంశిల్పరూపమ్ । తదైవా
విర్భాయతే భగవాన్విశ్వక ర్మాత్మన స్తేజసఃప్రకల్ప్యకారాన్ । తస్మాదేవప్రజాపత్య
ఋషయఃప్రజాయన్తే శిల్పవిభవః । తేభ్యఏవపారంపార్యగ్ం సమాగతంభవతిశైల్పిక
మాచార్యత్వంచ । దేవానామప్యాచార్యాస్తఏవవిభ్రాజన్తేమహాన్తః। నిరుక్తాస్తేభువ
న్యాదికర్తారో లోకపరివర్తకాః । తద్ద్వివిధమేవగ్ం శిల్పం దైవంమానుషంచేతి।
నాభానేదిష్ఠాదీన్యత్రప్రథమాని।అన్యాని మానుషాణీత్యుచ్యన్తే । దేవమూర్తి దేవాయ
తనేష్ట్యాదికం భవతి సర్వం దైవమితి విచిత్రగ్ం శిల్పమ్ । మానుషంచైవం భవతి
శస్త్రాస్త్రయన్త్రహలప్రాసాదవాప్యాభరణాదీనీతి । తయోరేవగ్ంశిల్పయోర్భవన్తి వాగీ
శ్వరీ మెర్వాదీన్యుపకరణాని । ఏభ్యోదశభ్య ఏవక్రియతే సర్వంనైవిచిత్రగ్ం శిల్పం ।
అతశ్శిల్పమూలాని సర్వాణి । పూజనీయానిసర్వేషామతోభవన్తి వైశిల్పాని । ఏభి
స్సుఖం జీవేయుర్లోకాః । ఏభిరాప్నుయాన్ని శ్రేయసమ్ । ఏభిర్భవన్తి జగన్తి చక్షు
ష్మన్తి । ఏభిః పూజ్యన్తేత్ర వేధసస్థపతయశ్చ । ఏభిఃపూర్ణం భవత్యానందంచ । ఏభి
ర్ముముక్షవః ప్రాప్నువంతిమోక్షమ్ । ఇత్యేవం భవతిశిల్పమ్ । శిల్పగ్ంహాస్మిన్నధి

గమ్యతే, తస్మాజ్జగత్సర్జనంభవతి శిల్పమ్. యజ్ఞోభవతుశిల్పమ్ । శిల్పంవైభవతు యజ్ఞః । పుణ్యంభవతు శిల్పమ్ । జ్ఞానంభవతు విజ్ఞానంచ శిల్పమ్. లౌకికం భవతు వైదికంచాపి శిల్పమ్ । బ్రాహ్మణానామె వేదగ్ం శిల్పంభవతు । తత్త్వంభవతి శిల్పమ్ । రహస్యంభవతి శిల్పమ్ । జగత్సర్వగ్ం శిల్పమేవభతి, తదేవ విశ్వవర్ధకం భవత్విత్యుపనిషత్ ॥ ఓం సహనావవతు—శాన్తి శ్శాన్తి శ్శాన్తిః॥

ఇతి యాజుషాథర్వణ మహాశిల్పోపనిషత్సమాప్తః

తా॥ సమస్తవేదాగమసారములఁ జక్కఁగా నెఱింగి పరిపక్వబుద్ధితోఁ బ్రకాశించు నాచార్యవర్యునికి నమస్కరించి శిష్యు "డో భగవంతా! మహాశిల్ప తత్వరహస్యమును నాకుఁదెలుపు" మనుడు నామహాత్ముఁ డిట్లువాక్రుచ్చెను. అణువులలో నణువగునదియు మహత్తులలో మహత్తగునట్టి శిల్పరహస్యమునుదెలిసికొనుటసాధ్యము గాదు. అందువలన నేకాగ్రచిత్తముతో వినుము. వాక్కునకు మనస్సునకుఁ జూపునకు నందరాక యఖండతేజస్స్వరూపమునంది నిత్యుఁడును, వికల్పరహితుఁడును, మిక్కిలి జూడఁదగినవాఁడును, ఎక్కువగాఁ జెప్పఁబడువాఁడును, మహాపరిశుద్ధుఁడు, నొక్కఁడె యగు పరబ్రహ్మ ప్రకాశించుచున్నాఁడు. అతఁడె సకల బ్రహ్మాండకోటులకు మూలబీజ మగును. అతనికంటె నన్యుడొకఁడు కానరాఁడు. అతడాకారము లేనివాఁడైనను సాకారత్వమును ధరించుచుండును. నిరాకారత్వ సాకారత్వములురెండు నతనికిసహజ సిద్ధములే. జగ దుత్పత్తికి హేతువగు మనస్సంకల్పము లతనియందుఁ బొడమినతోడనే జగత్తంతయుఁ గల్పింపఁబడుచున్నది. మనస్సంకల్పా ద్యుపకరణములచేతనే జగచ్ఛిల్పము ప్రారంభింపఁబడినది. ఎవ్వఁడు ప్రళయకాలమునందు నీయనంత బ్రహ్మాండములను దనయందాహుతి వేసికొనునట్లు హరించి యతీంద్రియద్రష్టయై మాకుఁదండ్రియై నిలిచియుండెనో యాపరమేశ్వరుఁ డాశీర్వాదరూపముచే జగద్రూప ధనాపేక్షవహించి స్వశరీర మధ్యంగత పుండరీకస్థానమునందు జీవస్వరూపుఁడై ప్రవేశించెను. సమస్తములగు సృష్టిస్థితి ప్రళయము లెవ్వనికిఁగలవో? యట్టిపరమాత్మ విశ్వకర్మనాఁబరగె. ఎవనియం దీప్రపంచమంతయుఁ గలిగెనో, ఎవనివలన నీసమస్త సంకల్పరూపమగు శిల్పము కల్పింపఁబడుచున్నదో, యాపరమాత్మయె విశ్వకర్మ పరమేశ్వరుఁడుగఁ బ్రకాశించుచున్నాఁడు. ఆమహనీయుఁడె యాదిశిల్ప కర్తయగుచున్నాఁడు. అవ్విశ్వకర్మ పరమాత్మచే నెయ్యది సృజింపఁబడుచున్నదో యదంతయు శిల్పమేయగుచున్నది. ఆశిల్పవిధానమును బూర్ణముగా ననుగ్రహింపుమని యడిగిన శిష్యునకుఁ

దిరిగి యిట్లాచార్యుఁడు వక్కాణించెను. ఎప్పుడప్పరమేశ్వరునకు జగత్సర్జనాసంకల్పము పుట్టుచున్నదో అప్పుడే యహంకారము గలుగుచున్నది.

ఆ యహంకారమువలనఁ బంచభూతములును, ఆభూతపంచకమువలన నోషధులును, వానివలన నన్నమును, నద్దానివలన స్థావరజంగమప్రపంచము కలుగుచున్నది. అందుల కుపాదానకారణ మాకాశాదిభూతపంచకమెయగుచున్నది. అఖండస్వరూపుఁడగు నీ పరబ్రహ్మయే హృదయకోశములయందుఁ బరిచ్ఛిన్నజీవస్వరూపుఁడై ప్రకాశించుచున్నాఁడు. ఆకాశతత్వమువలె సర్వత్ర వ్యాపించుచున్నాఁడు. మఱియు నవ్విశ్వకర్మపరమేశ్వరుఁడే నక్షత్రాదులచే నాకాశము నలంకరింపఁజేసెను. శైలములచేతను, నడవులచేతను, వృక్షాదులచేతను భూమిని నలంకరింపఁజేసెను. అనేకార్థములతో నొప్పుచున్న వాక్కులను శిల్పవిచిత్రములచే మనోహరమైనవిగాఁ జేసెను. ఇట్లే సమస్తపదార్థములచేఁ బ్రపంచమంతయు నలంకరింపఁజేసెను. ఇదంతయు విశ్వకర్మపరమేశ్వరుని శిల్పమే. ఎప్పుడు జగత్తు విజ్ఞానశూన్యముగఁ గన్పట్టుచున్నదో యప్పుడవ్విశ్వకర్మ యైదుముఖములతోఁ దా నవతరించెను. పంచముఖావతారము నందిన తాను తన తేజస్సువలన మనువు, మయుఁడు, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞుఁడు నను నేగురు బ్రహ్మలను నవతరింపఁజేసి వారితో నిట్లు నుడివెను. "మీరైదుకర్మలతో లోకమును బ్రవర్తింపఁజేయుడు. ఈ పంచకర్మలచేఁ బ్రవర్తింపఁబడుటచేతనే జగమంతయుఁ బ్రపంచమగుచున్నది. సృజించుట, పోషించుట, నశింపఁజేయుట, అంతర్థానమగుట, యనుగ్రహించుట యను పంచకర్మలు విశ్వకర్మనగు నావలననే గలుగుచున్నవి. ఇట్లే మీరలుకూడ సృజింపుఁడు. శిల్పివర్యులగు మీరు జ్ఞానవిజ్ఞానముల నిచ్చువారలుగండు. సకలకర్మకు యజ్ఞరూపుఁడనైన నేనె యధిష్ఠాతనగుచున్నాను. ఇట్లే నాచేత జగద్రూపశిల్పముయొక్క నేర్పరితనమంతయుఁ బ్రకాశింపఁబడును. ఇదంతయు నాధ్యాత్మికమగు రహస్యము. ఈ రహస్యము ప్రాణిలోకము తెలిసికొననేరదు. దానినంతయు లోకమునకుఁ జక్కగా వివరింపుఁడు. శిల్పముచే యజ్ఞమును గల్పింపుఁడు. శిల్పముచేతనె యజ్ఞమంతయు వృద్ధిబొందుచున్నది. లోకకల్యాణముకొఱకె యజ్ఞమగుచున్నది. సమస్తశిల్పకార్యములను సిద్ధిబొందించెదరుగాత! ఆ యజ్ఞరూపమగు నానావిధశిల్పము వృద్ధియగుచున్నది. శిల్పమువలనఁగాక మఱియొకవిధముగా యజ్ఞము గానేరదు గానేరదు. అందువలన నోజ్యేష్ఠపుత్త్రులారా! యజ్ఞోపకరణములను బూర్తిగా సృజింపుఁడు. యజ్ఞముచేతనే నేను లోకమున నర్చనీయుఁడ నగుచున్నాను. ఆ యజ్ఞోపకరణములగు యాగవేదికలను గుండములను యజ్ఞరథములను బాత్రాదులను రచింపఁజేయుఁడు. సమస్తయజ్ఞములను లోక

ములచేఁ బ్రసిద్ధముగాఁ జేయింపుఁడు. ఒక్కొక్క రొక్కొక్క వేదమున కధికారులు గండు. వానిలో నథర్వవేదము శిల్పమును దెలుచుగా బోధించును. మంత్రములచేతనే స్వరూపములను జేయవలెను. మంత్రధ్యానమువలననే తత్స్వరూపమును జూడఁగలరు. రూపనిర్మాణమును గనుగొనియె యాదైవమును ధ్యానించి కృతార్థులగుదురు. ఆరూపనిర్మాణమే శిల్పమునాఁబడు. ఇనుముచేతను, దారువుచేతను, శిలలచేతను, దామ్రముచేతను, సువర్ణముచేతను నిర్మితములగునవి యాశిల్పములే. వానిలో మృత్తికచేతను, ఇటికలు మున్నగువానిచేతను రచించినవి యధమములు. వీనికన్నిటికి శాస్త్రములు చెప్పఁబడినవి. సమస్తదైవతములు నాలయస్థానములుగలవియగును. ఇట్లే యితరశిల్పకర్మములు ప్రకాశింపఁబడుచున్నవి. ఈశిల్పకర్మలన్నియు మోక్షదాయకములగుచున్నవి. లోకములన్నియు సమస్తశుభములను బొందుచున్నవి. ఈశిల్పములచేతఁ బుణ్యములను గూర్చుఁ"డని చెప్పెను. కావున బ్రాహ్మణులకే యీశిల్పము గలుగుచున్నది. శిల్ప మెఱుఁగనివాఁడు బ్రాహ్మణుఁడు గానేరడు. సర్వజ్ఞుఁడగు నాచార్యుఁడు తిరిగి చెప్పుచున్నాఁడు. ఎప్పుడెప్పుడు శిల్పధర్మ మీ లోకమునలన నశింపఁబడుచున్నదో యప్పుడప్పుడె భగవంతుఁడగు విశ్వకర్మ తన తేజస్సువలన నాత్మప్రతిబింబమూర్తుల నవతరింపఁ జేయుచున్నాఁడు. ఆవిశ్వకర్మ వలననే శిల్పస్వాములగు ప్రజాపతులు ఋషులు పెక్కండ్రు జనించిరి. వారి పారంపర్యకముగనే శిల్పధర్మము నాచార్యత్వమును వచ్చుచున్నది. ఆప్రజాపతులు ఋషులే మహాత్ములుగను, దేవతల కాచార్యులుగను బ్రకాశించుచున్నారు. లోకప్రవర్తకులగు నాదిశిల్పకర్తలు వారలే. శిల్పము దైవము, మానుష మని రెండువిధములు గలది. నాభానేదిష్ఠాది శిల్పములు దైవములు తక్కినవి మానుషములు. దైవశి విగ్రహదేవాలయయాగాదులన్నియు దైవశిల్పములు. ఇవన్నియు మిక్కిలి యాశ్చర్యముకలిగించునవి. శస్త్రములు, అస్త్రములు, హలాదులు, హర్మ్యములు, బావులు, భూషణములు మున్నగునవన్నియు మానుషశిల్పములు. ఆదైవమానుష శిల్పముల రెండింటికి వాగీశ్వరీమేర్వాదులగు నుపకరణములేయుపయోగింపఁబడుచున్నవి. ఈదశాయుధోపకరణములవలననే యాశ్చర్యకరములగు సర్వశిల్పములు చేయఁబడుచున్నవి. ఇందువలన సర్వమునకు శిల్పమేమూలము. ఇందువలన సర్వులకు శిల్పములు పూజింపఁదగియున్నవి. ఈశిల్పములచేతనే సర్వలోకములు జీవించుచున్నవి. ఈశిల్పముచేతనే సర్వకల్యాణమును బొందుదురు. ఈశిల్పములచేతనే సర్వజగములు కన్నులు గలవగుచున్నవి. ఈశిల్పములచేతనే బ్రహ్మలగు స్థపతులు పూజింపఁబడుచున్నారు. ఈశిల్పములచేతనే సంపూర్ణానందము గలుగుచున్నది. మోక్షాపేక్షకు లీశిల్పములచేతనే

మోక్షమును బొందుచున్నారు. శిల్పమిట్లగుచున్నది. శిల్పమత్యాశ్చర్యకరమని తెలుపఁబడుచున్నది. అందువలననే జగత్సృష్టియంతయు శిల్పమె. యజ్ఞమంతయు శిల్పమె. శిల్పమె యజ్ఞమగుచున్నది. శిల్పమె పుణ్యమగుచున్నది. జ్ఞానవిజ్ఞానములు శిల్పములగుఁగాత! లౌకిక వైదికములు శిల్పములగుఁగాత! ఈశిల్పము బ్రాహ్మణులకేయగుఁగాత! శిల్పము యదార్థమగుచున్నది. శిల్పమురహస్యమగుచున్నది. శిల్పమె సమస్త ప్రపంచమగుచున్నది. ఆశిల్పమె విశ్వప్రపంచ వృద్ధిఁ జేయుఁగాతమని యుపనిష త్తుగ్గడించుచున్నది.

శ్రీవిశ్వకర్మ బ్రాహ్మణ్య వంశాగమ కృతావితి
ద్వితీయ శ్శిల్పకాండోఽ యంశిల్పధర్మప్రపాదితః॥

ఓమ్ తత్సత్.



శ్రీరథకార్యాధిపత్య విశ్వకర్మణేనమః

# రథకారకాండము.

దేవయజ్ఞ సంబంధములైన శిల్పకర్మలు బ్రాహ్మణులకు ముఖ్యధర్మములని పర్యవసానమేర్పడినదిగదా? అట్టి శిల్పకర్మ లమరునిచే నేవర్గమున వివరింపఁబడిన దనిన:—

## బృహస్పతికి శిల్పకర్తృత్వము.

నామలింగానుశాసన బ్రహ్మవర్గమునందు, "సగీష్పతీష్ట్యాస్థపతిః" అని నుడువఁబడినది. బృహస్పతి సవనమును జేసినవాఁడు "స్థపతిః" యని చెప్పఁబడుచున్నాఁడు. అని పై వాక్యమున కర్థము. గీష్పతీష్టియన బృహస్పతి సవనము. బృహస్పతి సవనమన విశ్వకర్మ సవనమే. ఏలన: "వాచస్పతిం విశ్వకర్మాణమూతయే" అను యాజుషశ్రుతివచనమువలనను, "వాచస్పతిర్విశ్వకర్మాభూత్" అను యజురారణ్యకవచనమువలనను, "బ్రహ్మణస్పతిరేతా సంకర్మారఇవాఽధమత్" అను ఋగ్వచనమువలనను, బృహస్పతియన విశ్వకర్మయని భాష్యానుసారముగ నన్వయించుచున్నది. అందువలననే "స్థపతిర్విశ్వకర్మాస్యాత్" అను శిల్పశాస్త్రవచనముగూడ నిందుల కనుకూలించుచున్నది. మఱియు భాగవత తృతీయస్కంధమున "స్థాపత్యం విశ్వకర్మశాస్త్రం" అని వ్రాయఁబడి "స్థపతేర్విశ్వకర్మణఇదం స్థాపత్యం" అని యన్వయింపఁబడుచున్నది. ఇఁక బృహస్పతి విశ్వకర్మల కైక్యవిషయమున:—

శ్రుతిః॥ సప్రథమస్సంకృతిర్విశ్వకర్మా ।
సప్రథమోమిత్రో వరుణోఽఅగ్నిః ।
సప్రథమో బృహస్పతిశ్చికిత్వాన్ ॥

యజుర్బ్రాహ్మణ ప్రథమాష్టక ప్ర ౧.

భాష్యాంశమ్॥ సమీచీనాకృతి నిర్మాణం యస్యాసౌసంకృతిః తాదృశో విశ్వకర్మనామకో దేవ ఇంద్రఏవ.

ఉత్తమమగు నిర్మాణకర్మచేయుఁవాఁడు సంకృతియను నర్థము. అట్టివాఁడే విశ్వకర్మయను దేవుఁడు. అతఁ డింద్రుఁడే. యింద్రునివంటి వైశ్వర్యవంతుఁడేయని

యర్థము. "యాగలక్షణేన పరమైశ్వర్యేణ యోగాద్యజమాన ఇంద్రః" అను భాష్యకారవచనమువలన నింద్రుఁడన యజమానుఁడని యర్థమొసగుచున్నది. అట్లె, మిత్రుఁడు, వరుణుఁడు, అగ్ని, బృహస్పతియు నట్టివారే. అనఁగా సంకృతివంటి వారలే. అనఁగా సమీచీనాకృతి నిర్మాణకర్తలే. ఇందువలన బృహస్పతికిఁగూడ విశ్వకర్మత్వ మాపాదింపఁబడినది.

ఇఁక గీష్పతీష్టివలన స్థపతిత్వమెట్లు వొడమినది? అనఁగా శిల్పిత్వ (శిల్పకర్తృత్వ) మెట్లు లభించినది? అను సందేహము కలుగనచ్చును. మఱియు మేదినీకోశము నందు, "క్లీబంతులక్షణోపేతే స్థపతిః కంచుకిన్యపి॥ జీవేష్టియాజకే శిల్పిభేదేనాసత్తమే త్రిషు। స్థపతిః శిల్పభేదే" పీ।తినానార్థః అని స్థపతిశబ్దము లక్షణోపేతమను నర్థము వచ్చునెడల నపుంసకలింగమును కంచుకియందును, జీవేష్టియాజకునియందును, శిల్పిభేదమునందును పుంలింగమనియు సత్తమార్థము వచ్చినపుడు త్రిలింగములయందు నన్వయించునని మేదినీకోశమును, స్థపతిశబ్దము శిల్పభేదమునందును నని చెప్పుటవలన జీవేష్టియాజకునందే కాక శిల్పిభేదమునందునునని నానార్థవర్గమునందును జెప్పియున్నది. స్థపతిశబ్దము కంచుకియందును, జీవేష్టియాజకునందును, శిల్పిభేదమునందును నన్వయించునెడల జీవుఁడను బృహస్పతియెడల శిల్పికర్తృత్వముండి కంచుకిత్వమేల యుండదు? కావున నొకశబ్దమున కనేకార్థములున్న మాత్రమున నే యాయర్థవద్ధర్మములుండుట యసంభవముగదాయనియుఁ గూడ నొకసంశయము గలుగును. ఈసంశయమంత విచారింపఁదగినదిగాదు. బృహస్పతికి శిల్పిత్వముండినటుల కంచుకిత్వముండుట యసంభవము. అమరకోశ నానార్థవర్గమందలి "స్థపతిశ్శిల్పిభేదేపి" యను వాక్యముండుటచే స్థపతియనునది శిల్పిభేదమునందునని చెప్పుటవలన స్థపతికి యొక శిల్పిత్వముండినటులను మఱియొక శిల్పికిఁగూడ నాశబ్ద మన్వయించుననియుఁ దెలియుచున్నది. ఇఁక బృహస్పతికి శిల్పిత్వమెట్లు? యనునది విచారించుదము.

అమరకోశమందలి "సగీష్పతీష్ట్యాస్థపతిః" అను వాక్యమునకు యాజవర మహేశ్వరకృత టీకయందు, "వాజపేయేనేష్ట్వా బృహస్పతి సవేనయజేతేతితద్విధిః" అని వ్యాఖ్యానమొనర్చుటచే బృహస్పతి సవనమనిన వాజపేయమని యన్వయించుచున్నది. అందుల కీబ్రాహ్మణశ్రుతి యంగీకరించుచున్నది.

"యోవాజపేయేన యజతే। బార్హస్పత్య ఏషచరుః"

తైత్తిరీయబ్రాహ్మణ అ ౧. ౩. ౬.

వాజపేయ యజ్ఞక్రియయందుఁ జరువు (హవిస్సు) బృహస్పతి సంబంధమై నది. ఇఁక వాజపేయ యజ్ఞక్రియయందు వేదమందెట్లున్నదో చూతము.

శ్రుతిః॥ దేవసవితః ప్రసువయజ్ఞం ప్రసువయజ్ఞపతిం భగాయదివ్యో గంధర్వః
కేతపూః కేతం నఃపునాతువాచ స్పతిర్వాచ మద్యస్వదాతినః।
ఇంద్రస్యవజ్రోసివార్త్రఘ్నస్త్వయాయం వృత్రం వధ్యాత్।
వాజస్యసుప్రసవే మాతరం మహీమదితిం నామవచసాకరామహే।
యస్యామిదం విశ్వం భువనమావివేశతస్యానోదేవస్సవితా
ధర్మసావిషత్। అప్సు॥

యజుర్వేదకాం ౧. ౭. ౭.

భాష్యమ్॥ ఇత్థం షట్స్వనువాకేషు దార్శిక యజమానబ్రాహ్మణ శేషోవర్ణితః అథదేవసవితః ప్రసువేత్యాదిషు షట్సువాజపేయ విషయా ఆధ్వర్యమంత్రాఉచ్యంతే. తత్రాఽస్మిన్ సప్తమేఽనువాకేరథవిషయక మంత్రాః కథ్యంతే। తేషాం వాజపేయమంత్రాణాం వ్యాఖ్యానం బ్రాహ్మణగ్రంథే ప్రథమకాండే తృతీయప్రపాఠకే ద్వితీయమారభ్య నవమాన్తే ష్వష్టస్వనువాకేషు ఆమ్నాతం। తత్రవాజపేయ స్తోత్రగ్రహవిధిః పశువిధిశ్చాద్యేషు త్రిష్వనువాకేషు క్రమేణామ్నాతాః। అనయోర్వాజపేయ విషయయోర్మంత్ర బ్రాహ్మణయోరత్యంత విప్రకృష్టదేశవర్తిత్వేన బుద్ధిస్థత్వాభావాచ్ఛ్రోతౄణాం ప్రతిపత్తిసౌకర్యాయ పూర్వోక్తదార్శిక సౌమిక కాండద్వబ్రాహ్మణేన సహైవమంత్రావ్యాఖ్యాయంతే। తస్యచబ్రాహ్మణస్య ప్రథమానువాకేవాజపేయ విధాతుం ప్రస్తౌతి. "దేవావై యథాదర్శం యజ్ఞానాహరంత। యోఽగ్నిష్టోమం। యఉక్థ్యం। యోఽతిరాత్రం। తేసహైవసర్వే వాజపేయమపశ్యన్తే అన్యోన్యస్మైనాతిష్ఠంత। అహమనేన యజా ఇతి। తేఽబ్రువన్। ఆజిమస్యధావామేతి। తస్మిన్నాజిమధావన్। తంబృహస్పతి రుదజయత్। తేనాయజత। సస్వారాజ్యమగచ్ఛత్। తమింద్రోఽబ్రవీత్। మామనేనయాజయేతి। తేనేంద్రమయాజ

యత్ । సో౽గ్రం దేవతానాం పర్యైత్ । అగచ్ఛత్స్వారాజ్యం । అతిష్ఠన్నస్మైజ్యైష్ఠ్యాయ'' ఇతి । దేవానాం మధ్యేకశ్చిదగ్నిష్టోమం దదర్శ అన్యఉక్థ్యం అపరో౽తిరాత్రిం తేచస్వస్వదర్శనమనతిక్రిమ్య తాన్ యజ్ఞానాహరంత అనుష్ఠితవంతః। తేదేవాస్సర్వేనహైవవాజపేయం దృష్ట్వా౽హమేవ ప్రథమమనేన వాజపేయేన యజఇత్యేవం వివదమానాః పరస్పరం ప్రథమానుష్ఠాతృత్వలక్షణాయ జ్యైష్ఠ్యాయనాతిష్ఠంత జ్యైష్ఠ్యం నాంగీచక్రుః । తతఏవసమయంచక్రుః। అస్మాకం మధ్యఆజిధావనేన యఃకశ్చిజ్జయతి సఏవజ్యేష్ఠోస్త్వితి । ఆజిర్ధావన ప్రదేశస్యావధి ర్భూమిరితి శేషః । ఏవం సమయం కృత్వాతస్మిన్ వాజపేయవిషయే విజయాయాజిమధావన్ తత్రితం వాజపేయం ప్రతిధావన్ బృహస్పతి రుత్కృష్టేనాజయత్ ఇతరేభ్యః ప్రథమమవధింపస్పర్శ । తతః ప్రథమం సఏవతేనవాజపేయే నేష్ట్వా స్వారాజ్యమపారతన్త్ర్యరూపం మహారాజ్యమగచ్ఛత్ । తతఇంద్రఃతం బృహస్పతిం సంప్రార్థ్య తేనవాజపేయేనేష్ట్వాదేవానాం మధ్యే జ్యేష్ఠత్వమపారతంత్ర్యేణ స్వర్గాధిపత్యలక్షణ స్వారాజ్యంచాగచ్ఛత్ । అస్యేంద్రస్య జ్యేష్ఠ్యమితరే సర్వేదేవామాత్సర్యం పరిత్యజ్యాంగీచక్రుః॥

ఇట్లాఅనువాకములయందు దార్శికసంబంధమయిన యజమాన బ్రాహ్మణశేషము వర్ణింపఁబడినది. తరువాత "దేవసవితః ప్రసువ'' అను నాఱనువాకములందు వాజపేయ విషయములగు సర్వార్యసంబంధములగు మంత్రములు చెప్పఁబడినవి. ఈసప్తమానువాకమున రథవిషయక మంత్రములు చెప్పఁబడినవి.ఆవాజపేయ మంత్రములకు వ్యాఖ్యానము బ్రాహ్మణగ్రంథమందలి ప్రథమకాండ తృతీయప్రపాఠకము లోని ద్వితీయానువాకము మొదలుకొని నవమానువాకమువరకు నెనిమిది యనువాకములయందును జెప్పఁబడినది. అక్కడ వాజపేయవిధియు గ్రహవిధియుఁ బశువిధియు మూఁడనువాకములయందుఁ గ్రమముగాఁ జెప్పఁబడినవి. ఈ వాజపేయ విషయకములగు మంత్రములకు బ్రాహ్మణములకు మిక్కిలి దూరమగుటవలన బుద్ధికి స్ఫురించ దనునభిప్రాయముచే శ్రోతలకు జ్ఞానసౌకర్యముకొఱకు పూర్వోక్తములగు దార్శికాది మంత్రబ్రాహ్మణముతోఁగూడ మంత్రములకు వ్యాఖ్యానము చేయఁబడినవి. ఆ బ్రాహ్మణమురెుక్క ప్రథమానువాకమునందు వాజపేయము జేయుట స్తుతింపఁబడినది. దాని కీయర్థము వ్రాయఁబడినది. దేవతలమధ్యయందు ఒకఁడగ్నిష్టోమము, మఱియొకఁడు ఉక్థ్యమును, ఇంకొకఁడు అతిరాత్రమును జూచిరి. వారు చూచినయజ్ఞముల నతిక్రమించి యితర యజ్ఞముల ననుష్ఠించిరి. ఆదేవతలందఱుఁగూడి వాజపేయ యజ్ఞమునుజూచి నేను ముందుఁజేయుదును నేను ముందుఁజేయు

దునని ప్రవాదమొనర్చినవారలై జ్యేష్ఠత్వ మొకనికిచ్చుట కెవ్వరు నంగీకరింపరైరి. అప్పు డీవిధముగా శపథమొనర్చిరి. మనలో నెవ్వఁడీయశ్వమును బరుగెత్తించుటలో జయించుచున్నాఁడో వాఁడే జ్యేష్ఠుఁడు కావలయుననిరి. అశ్వమును బరుగెత్తుభూమి యొక్క యవధిని నిర్ణయించిరి. ఇట్లు సమయమొనర్చి వాజపేయ విషయమునందు అశ్వమును బరుగెత్తించిరి. అక్కడ నా వాజపేయమునుగూర్చి పరుగెత్తించుటలో బృహస్పతి యితరులకంటె ముందుగాఁ జక్కగా జయించి నియమితస్థానమును ముట్టుకొనెను. అందుచే నాబృహస్పతి యందఱికంటె ముందుగా వాజపేయ యాగమును జేసి యపారతంత్ర్యరూపమైన స్వారాజ్యమును బొందెను. తరువాత నింద్రుఁడు బృహస్పతిని బ్రార్థించి యతని సహాయమున వాజపేయ యజ్ఞమునుజేసి దేవతల నడుమ జ్యేష్ఠత్వమును నపారతంత్ర్యముచే స్వారాజ్యమును స్వర్గాధిపత్యమును బొందెను. ఆ యింద్రునకు జ్యేష్ఠత్వమును యితర దేవతలెల్లరు నంగీకరించిరి. అని భాష్యమున వ్రాసిరి.

ఇందులవ్రాసిన యశ్వధావనమెట్టిది? అశ్వధావనమునకు గమ్యార్థ మెయ్యది? అను నావిషయమును జర్చకుఁ దీసికొనవలసియున్నది. అశ్వధావనమన రథముతోఁ గూడిన యశ్వమును బరుగెత్తించుటగాని ప్రత్యేకాశ్వముగాదు. అశ్వధావనమునకు గమ్యార్థము (రథవిషయక) వాజపేయయజ్ఞ నిర్వహణము ఏలయన:— "ఏవం సమయం కృత్వాతస్మిన్ వాజపేయవిషయే విజయాయాజిమధావన్. తత్రతం వాజపేయం ప్రతిధావన్ బృహస్పతి రుత్కృష్టేణాజయత్ । ఇతరేభ్యః ప్రథమమవధిం పస్పర్శ। తతఃప్రథమం సఏవతేన వాజపేయే నేష్ట్వాస్వారాజ్య మపారతంత్ర్యరూపం మహారాజ్యమగచ్ఛత్॥" అను భాష్యకారుని వచనమువలన నిట్లు శపథమొనర్చి ఆ వాజపేయ విషయమునందు విజయముకొఱకు నశ్వమును బరుగెత్తించెను. అచ్చట నా వాజపేయమును బరుగెత్తించుచు బృహస్పతి యధికముగా జయించెను. ఇతరుల కంటె ముందుగా నియమితస్థానమును ముట్టుకొనెను. అందుచే నాబృహస్పతియే యా వాజపేయముచే యజ్ఞమొనర్చి అపారతంత్ర్యరూపమైన మహారాజ్యమును బొందెను. అని తెలియుటచే వాజపేయవిషయకమగు రథముతోఁగూడ నశ్వమును సంధించి (అనగా యజ్ఞవిషయకములగు రథములను శస్త్రాస్త్రములను గేతువును నశ్వములను పగ్గములను నందఱికంటె ముందుగాఁగూర్చి) బృహస్పతి జయించెననుట విస్పష్టము. రథనిర్మాణమును జేయుటయు రథధావనమొనర్చుటయు నీ సప్తమానువాకమునఁ జెప్పఁబడినది. దానినంతయు విపరించుటకు గ్రంథవిస్తరభీతిచే విరమింపఁబడి యందలి సంగ్రహ శ్లోకముల వివరింపఁబడియె.

అత్రవినియోగ సంగ్రహః॥

శ్లో॥ దేవహోమోత్రకర్మాదా విన్ద్రస్యరథమాహరేత్
వాజస్య వేదిమధ్యే తమభ్యావర్తయతేరథమ్॥
అప్స్వశ్వాన్ ప్లావయేద్వాయు ర్యునక్తితురగంరథే
అపాంతదశ్వపృష్ఠాని మార్ష్టివిష్ణోరథం వ్రజేత్॥

అంకౌరథేమ్య శేత్యక్షావష్టామంత్రా ఇహోదితాః॥ ఇతి
'దేవ' అను మంత్రముచేఁ గర్మాదియందు హోమముఁ జేయవలెను. "ఇంద్రస్య" అను మంత్రముచే రథమును దీసికొనిరావలయును. 'వాజస్య'అను మంత్రముచే దక్షిణ వేదిశ్రోణ్యంతమునందు నశ్వమునువిడిచిన రథమును సౌమికవేదిమధ్యలోనుందుఁ బ్రదక్షిణముగాఁ దీసికొనిరావలయును. "అప్సు" అను మంత్రముచేత నశ్వములనుఁ గడుగవలయును. "వాయుః" అను మంత్రముచేత రథమునందుఁ దురగమును గట్టవలయును. "అపాం" అను మంత్రముచే నశ్వముల వీపును నభిమంత్రించవలయును. "విష్ణోః" అను మంత్రముచేత రథమును విడువవలయును. "అంకౌన్యంకౌ"అను మంత్రముచేఁ జక్రములను స్పృశింపవలయును. అని యిట్లెనిమిది మంత్రములు చెప్పఁబడినవి. ఇట్లు సామాన్యముగ రథనిర్మాణమునుగూర్చి వివరించెను. అందుఁ బ్రథమ మగు

శ్రుతిః॥ దేవసవితః ప్రసువయజ్ఞం ప్రసువయ్యజ్ఞపతిం భగాయదివ్యో గంధర్వః।
కేతపూః కేతం నఃపునాతు వాచస్పతిర్వాచ మద్యస్వదాతినః॥

భాష్యమ్॥ హేసవితర్దేవప్రేరకాంతర్యామిన్ అస్మదీయం వాజపేయయజ్ఞం ప్రవర్తయ। యజ్ఞపతిం యజమానం భగాయ అనుష్ఠానరూపాయైశ్వర్యాయ । దివిభవోయోగంధర్వః సవితురనుగ్రహాత్ కేతాన్ పునాతి । ప్రాణినాం విజ్ఞానానిశోధయతి । సోఽస్మాకం కేతం వాజపేయవిజ్ఞానం పునాతుశోధయేత్। వాచస్పతిశ్చ, సవిత్రానుజ్ఞాతోఽద్యాస్మిన్ కర్మణివాచం అస్మాభిఃపఠితాన్ వాజపేయమంత్రాన్ స్వదాతి స్వదయతు యథావత్పాఠయతు।

అనుమంత్రమున ప్రేరకుఁడవు నంతర్యామినగు నో సవితృదేవా! మా సంబంధమైన వాజపేయ యజ్ఞమును బ్రవర్తింపఁజేయుము. యజ్ఞపతియగు యజమానుని యనుష్ఠానరూపమైనయైశ్వర్యముకొఱకుద్యులోకమందుఁ బుట్టిన గంధర్వుఁడు సవితయొక్క యను

గ్రహాముచలన బ్రాహ్మణులయొక్క విజ్ఞానమును (శిల్పజ్ఞానమును) శోధించు చున్నాఁడు. ఇక్కడ గంధర్వుఁ డెవ్వఁడనిన:—"విశ్వకర్మాహ్యజనిష్ఠదేవ ఆదిద్గంధర్వోఽభవద్ద్వితీయః" అను యాజుషవచనమువలనను, "ప్రజాపతిర్విశ్వకర్మా మనో గంధర్వస్తస్య" అను మఱియొక యాజుషవచనమువలనను, గంధర్వరూపుఁడైన విశ్వకర్మయని తెలియుచున్నది. మఱియుఁ బ్రాహ్మణులయొక్క విజ్ఞానమునుచోట "దేవత్వష్టర్భూరితేసగ్ సమేతు" అను యజుర్వచనమునందలి, ఓ త్వష్ట్రుదేవా! నీ యనుగ్రహాముచే సమస్తములయిన యవయవసముదాయమును ఛేదించుటచే వేఱై నప్పటికి సమముగా నుండుఁగాత, మనునర్థమువలనను, యజుర్వేద ప్రథమాష్టక పంచమప్రపాఠక నవమానువాకమందలి"యానచోఛ్వైరేతసః సిక్తస్య త్వష్టారూపాణి వికరోతి" అను మంత్రమందలి, "ఆ విశ్వకర్మ యెన్నిరూపముల నుద్దేశించి రేతస్సులను వివిధములఁగాఁ జేయుచున్నాఁడో యన్నియు నుత్పన్నమగుచున్నవి" అను నర్థములవలనను, గర్భాంతరాళమందలి ప్రాణికల్పనా శిల్పమును విశ్వకర్మయొనర్చుట విధాయకము గనుక గంధర్వరూపుఁడైన విశ్వకర్మ ప్రాణులయొక్క శిల్పమును బరిశోధించుచున్నాఁడని పర్యవసానమగుచున్నది. ఆ గంధర్వుఁడు మాయొక్క వాజపేయ విజ్ఞానమును బరిశోధించుఁగాక! ఇక్కడ వాజపేయవిజ్ఞానము యజ్ఞోపయుక్తములగు పాత్రాయుధకుండములె గాక రథరథాశ్వములు ముఖ్యములు వీని రచనమును బరిశోధించుఁగాతమని ముఖ్యాశయము. వాచస్పతియు సవితచే ననుజ్ఞాతుఁడై మాచేఁ బఠింపఁబడు నీ వాజపేయమంత్రములను జక్కఁగాఁ బఠింపఁజేయవలెను. అని వ్యక్తమగుచున్నది. వాజపేయవిజ్ఞానమనునది మఱలఁ జర్చింపవలయును. వాజపేయయజ్ఞమనునది సోమయజ్ఞమే: ఎట్లన:—

శ్రుతిః॥ సోమోవై వాజపేయః । యోవై సోమం వాజపేయం వేదీ
వాజ్యేవైనం ప్రీత్వాభవతి । ఆఽస్యవాజీజాయతే॥

తై. బ్రా. ౧. ౩. ౨.

సోమయజ్ఞమే వాజపేయయజ్ఞము. ఈ రెండును నొకేరూపము. కారణమేమన వాజపేయయజ్ఞమునకు సోమమేహవిస్సు. వాజపేయసంబంధమైన సోమహ

విష్యమును భుజించినయెడల నతఁడు స్వయముగా వాజి (మహావీర్యవంతుఁడునుశీఘ్రగామియు బలిష్ఠుఁడు) అగుచున్నాఁడు. అని నుడువఁబడియున్నది. ఇట బృహస్పతియు సోమపానమొనర్చి మహాబలిష్ఠుఁడై యశ్వమును (అర్వాద్వా) రథమును గల్పించి దేవతలలో జ్యేష్ఠత్వమును నింద్రునకు నాచార్యత్వమును వహించెను.

సోమపానమొనర్చి బలిష్ఠుఁడైనది బృహస్పతియెగాక త్వష్ట (విశ్వకర్మ)యు ఋభువులును సోమపానమొనర్చి బలిష్ఠులై యశ్వరథాదుల సృజించి లోకపూజ్యులైరి. ఎట్లన:—“త్వష్టారగ్ సోమపీతయే” అనియు, “త్వష్టాసోమంపిబస్వాహా” అను మున్నగు యజుర్వచనమువలనఁ ద్వష్టసోమపానమొనర్చినవాఁడు గనుకనే “త్వష్టుర ర్వాజాయత ఆశురశ్వః” అను యాజుషవచనమువలన చుఱుకుఁదనముగల రథాశ్వములను శీఘ్రముగ రచింపఁగల వాఁడయ్యెను. ఇఁక ఋభువులో,

శ్రుతిః॥ ఋభూన్ వాజాన్మరుతః సోమపీతయే॥

భాష్యమ్॥ ఋభూన్ విభ్వావాజయుక్తం ఋభుం తథైవవాజాన్ విశ్వయుక్తం వాజమేతన్నామకం దేవమ్.

అని చెప్పఁబడియుండుటచే ఋభు విభ్వావాజులను ఋభువులు సోమపానమొనర్చియె బలిష్ఠులైరి.

వాజపేయయజ్ఞ మధ్యమున ఋభువుల ప్రాధాన్యత.

పూర్వమీమాంసాయాం॥ ఆర్భవేచోదకాదుక్థ్యాస్తిభ్యాంతదనంతరః ।
శ్రుతిబాధాస్తదా తస్మాత్తృతీయె వికృతిత్వతః॥

భాష్యకారః॥ వాజపేయే తృతీయసవనే ప్రథమం ఆర్భవఃపవమానఇతి॥

అని భాష్యకారుఁడు నుడువుటవలన వాజపేయయజ్ఞ మధ్యమందలి తృతీయ సేవనమున ఋభువులు ప్రప్రధానులైరి. అందువలననే వారును, “అనవస్తే రథమశ్వాయ తక్షన్” అను మొదలగు శ్రుతివచనములవలన రథాశ్వముల నిర్మించు శక్తి గలవారైరి. ఇటులనే బృహస్పతియు వాజపేయయజ్ఞమందలి హావిష్యమగు సోమమును భుజించి బలిష్ఠుఁడై యజ్ఞరథాశ్వముల సృజించి విజ్ఞానకర్త యయ్యెను.

ఇఁక రథము నొకింత విచారింపవలసియున్నది. రథనిర్మాణమందలి మంత్రమగు,

"ఇంద్రస్య వజ్రో౽సివా ర్త్రిఘ్నస్త్వయాయం వృత్రం వధ్యాత్॥"

అను మంత్రమునకు, "వా ర్త్రిఘ్నో వైరిఘాతీ యోయమింద్రస్య వజ్రః హేరథసఏవత్వమసిత్వయా సహకారిణా సహితో౽యం యజమానో వృత్రం వైరిణం వధ్యాత్॥" అని భాష్యీకరించుటవలన, శత్రువులకు ఘాతఁజేయు నింద్రుని వజ్రమైన యో రథమా! (ఆవజ్రమే నీవగుచున్నావు) సహకారివైన నీతోఁగూడిన యజమానుఁడు వైరిని జంపవలెను. అను నర్థము ప్రతిపాదింపఁబడుటచే వజ్రమనునదియె రథమగుచున్నది. ఇందున కనుకూలముగ "వజ్రోవై రథః । వజ్రేణైవద్విశా౽భిజయతి" అను తైత్తిరీయ బ్రాహ్మణవచనము (౧. ౩. ౬) గూడ వజ్రమే రథమని బలపఱచుచున్నది. ఇందుచే వజ్రనిర్మాతయు రథనిర్మాతయుఁ ద్వష్ట (విశ్వకర్మ) యనియె బహు శ్రుతులు పేర్కొనుచున్నవి. బృహస్పతియుఁగూడ నట్టివాఁడె యగును.

వాజపేయయజ్ఞ స్థాపత్యవేదముల కుత్పత్తిస్థానమొక్కటియె.

శిల్పకాండమున నుదాహరింపఁబడిన భాగవత తృతీయస్కంధద్వాదశాధ్యాయమందలి,

శ్లో॥ ఋగ్యజుస్సామాథర్వాఖ్యాన్ క్రమాత్పూర్వాది భిర్ముఖైః।
శస్త్రమిజ్యాస్తుతిస్తోమం ప్రాయశ్చిత్తం వ్యధాత్ క్రమాత్॥ ౩౭
ఆయుర్వేదం ధనుర్వేదం గాంధర్వం వేదమాత్మభూః
స్థాపత్యంచాసృజద్వేదం క్రమాత్పూర్వాదిభి ర్ముఖైః॥ ౩౮
షోడశ్యుక్థౌ పూర్వవక్త్రాత్పురీష్య గ్నిష్టుతావథ ।
అప్తోర్యామాతిరాత్రౌచ వాజపేయంచ గోసవమ్॥ ౪౦

బ్రహ్మ తన పూర్వాది ముఖములనుండి, ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదమును, వరుసగా నట్లె ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము, స్థాపత్యవేదము (విశ్వకర్మసాధ్య శిల్పశాస్త్రము)ను నట్లె క్రమముగా, బూర్వముఖమున షోడశ్యుక్థ యజ్ఞములను, దక్షిణముఖమునఁ జయనాగ్నిష్టోమములను, బశ్చిమ ముఖమున నప్తోర్యా మాతిరాత్రములను, ఉత్తరముఖమున వాజ

పేయాశ్వమేధములను సృజించెను. అనుటవలన బ్రహ్మయొక్క యుత్తరముఖము నుండి, అథర్వవేదమును, బ్రహ్మమంత్రమును, స్థాపత్యవేదమును, వాజపేయాశ్వమేధములును బుట్టినటుల స్పష్టమగుచున్నది. అందుచే స్థాపత్యవేదోత్పత్తి స్థానమున వాజపేయయజ్ఞము పుట్టి వాజపేయయజ్ఞమున బృహస్పతికిఁ బ్రాధాన్యత్వమువచ్చి వాజపేయయజ్ఞమన బృహస్పతిసవనమని పేరుబొందియుండుటవలననే బృహస్పతిసవనమొనర్చువానికి స్థపతియని పేరువచ్చినది. అందుచేతనే "సగీష్పతీష్ట్వా స్థపతిః" అని యమరకోశ బ్రహ్మవర్గాంతమునఁ జెప్పఁబడినది. అందువలననే బృహస్పతికిఁ గంచుకిత్వమువలెఁగాక స్థాపత్యము బ్రతిష్ఠింపఁబడినది. స్థాపత్యమన విశ్వకర్మత్వము రథకారత్వమును, స్థపతియన విశ్వకర్మయు, రథకారుఁడు నగును. "ఏతేషాంహిస్థపత్యాఖ్యో విశ్వకర్మేతి సంస్కృతః"అని మయమత శిల్పశాస్త్రవచనమును, "స్థాపత్యే నిష్ఠితాః" అను వాల్మీకిరామాయణ వచనమునకు "స్థాపత్యే రథకారకర్మణి" యను వ్యాఖ్యానవచనమును, స్థపతిశబ్దము విశ్వకర్మరథకార పర్యాయముగాఁ బ్రచురింపఁబడుటయెగాక స్థాపత్యవేదోత్పత్తికి స్థానభూతమగు నుత్తరదిశయందు "విశ్వకర్మాన ఆదిత్యైరుత్తరత ఉపదధతామ్" అని విశ్వకర్మకు స్థానము నియమింపఁబడినది.

### స్థపతివాచ్య విశ్వకర్మ బృహస్పతులకు నేకవాక్యస్థానము.

అమరకోశప్రథమకాండమునందు "అన్వీక్షుకీదండనీతి స్తర్క విద్యార్థశాస్త్రయోః" ఇందులకు మహేశ్వర టీక అన్వీక్షుకీత్యేకం, తర్కవిద్యాయాంగౌతమాదేః ప్రణీతాయామ్, దండనీతిరిత్యేకంచ, అర్థశాస్త్రే బృహస్పత్యాదిప్రణీతే॥

అని యర్థశాస్త్రసంజ్ఞకమగు నథర్వవేదోపవేదమునకుఁ గర్త బృహస్పతిగాఁ జెప్పఁబడియె. బృహస్పతిచేఁ జేయఁబడిన యర్థశాస్త్రము శిల్పవిద్యాకాథర్వవేదోపవేదముగా నీక్రిందివాక్యమునఁ జెప్పఁబడినది.

చరణవ్యూహ చతుర్థఖండే॥ స్థాపత్యవేదోఽర్థశాస్త్రం విశ్వకర్మాది శిల్పశాస్త్రం అథర్వవేదస్యోపవేదః॥

కాఁబట్టి యర్థవేదకర్త బృహస్పతియు విశ్వకర్మయు నగుట తేటస్థించినది. మఱియు "ద్వేవిద్యే వేదితవ్యేహి" అను నథర్వణశ్రుతికి నగ్నిపురాణ ప్రథమాధ్యాయమునందు "ద్వేబ్రహ్మణీవేదితవ్యే శబ్దబ్రహ్మ పరంచయత్ । ద్వేవిద్యే వేదితవ్యే

హిఇతిచాథర్వణీ శ్రుతిః” అని బ్రహ్మస్వరూపములు రెండుగను, అందు మొదటిది శబ్దబ్రహ్మముగను రెండవది పరబ్రహ్మముగను జెప్పఁబడినది. శబ్దబ్రహ్మమును గూర్చి యీ యగ్నిపురాణమునందె, “ఋగ్యజుస్సామాథర్వాఖ్యా వేదాంగా నిచ షడ్ద్విజ । శిక్షాకల్పోవ్యాకరణం నిరుక్తం జ్యోతిషాం గతిః । ఛందోభిధానం మీమాంసాధర్మశాస్త్రం పురాణకం । న్యాయవైద్యక గాంధర్వ ధనుర్వేదార్థ శాస్త్రకమ్॥” అని శిల్పాత్మకమగు నథర్వవేదోపవేదమునకు నర్థశాస్త్రమని చెప్పఁబడినది. ఇట్లుకాక వాల్మీకి రామాయణమునందుఁ జిత్రకూటస్థితుఁడైన శ్రీరాముఁడు భరతుని “ఇష్వస్త్రవరసంపన్న మర్థశాస్త్ర విశారదమ్ । సుధన్వాన ముపాధ్యాయం కచ్చిత్త్వం తాతమన్యసే” ధనురస్త్రవిద్యలయందుఁ బ్రవీణుఁడు నర్థశాస్త్రమునందుఁ గడుఁ గుశలుఁడు నుపాధ్యాయుఁడు నగు సుధన్వుని మన్నించుచున్నావా! యని యడిగినటులఁ జెప్పఁబడినది. ఇక్కడ నర్థశాస్త్రము స్థాపత్యనామక శిల్పమే, ఏలయన, సుధన్వుఁడు “సుధన్వా విశ్వకర్మణి” యను విశ్వకోశమువలన విశ్వకర్మ యని బోధపడుచున్నాఁడు. కావున నర్థశాస్త్రమనిన స్థాపత్యోపవేదమనుటకు నిస్సంశయము.

ఇఁక రథవిషయక వాజపేయయజ్ఞకర్తయు స్థపతిశబ్దవాచ్యుఁడు నగు బృహస్పతి శిల్పియే. కారణమేమనిన బృహస్పతి యంగిరసుని పుత్రుఁడు. అంగిరస్సథర్వనామకుఁడగుటచే నథర్వాంగిరస్సని పెక్కుచోటులఁ జెప్పఁబడియె. అథర్వవేదమునకు నథర్వాంగిరస్సంజ్ఞ కలదు. కావున బృహస్పతి కాథర్వణసంజ్ఞ వచ్చినది. “అథర్వవేదస్యోపవేదః శిల్పవేదః ప్రకీర్తితః । తస్మాదాథర్వణాః ప్రోక్తాః సర్వేశిల్పిన ఏవచ” అను శైవాగమవచనమువలన నాథర్వణులెల్లరు శిల్పినామముగలవారలై యగుచున్నారు. బృహస్పతి యాథర్వణుఁడు గనుక శిల్పియనుట నిస్సంశయము గదా. రథకరణ మొనర్చుటచే రథకారుఁడనుటకును సందేహముండదు.

## ర థ వి భా గ ము.

“రథంకరోతీతి రథకారః” అను వ్యుత్పత్తివలన రథముచేయువాఁడు రథకారుఁడు అను నర్థము నిష్పన్నమగుచున్నది. కావున రథమెయ్యది? అను విచారణ చేయవలసివచ్చినది. “రముక్రీడాయాం” అను ధాతువువలన రథమనఁ గ్రీడించునదియను నర్థమును దెలుపుచున్నది. రథమనునది నాలుగువిధముల విభాగము చేయవచ్చును.

(1) ఛందోమయ రథము. (3) దేహమయ రథము.
(2) దేవమయ రథము. (4) వాహమయ రథము.

మొదటిది ఛందోమయ రథము.

శ్రుతి. సోఽబ్రవీత్ప్రజాపతిః ఛందాగ్ంసిరథో మేభవత ।
యుష్మాభిరహమేత మధ్వానమనుసంచరాణీతి ।
తస్యగాయత్రీచ జగతీచ పక్షావభవతామ్ ।
ఉష్ణిక్చ త్రిష్టుప్చ ప్రష్ట్యౌ । అనుష్టుప్చ పఙ్క్తిశ్చధుర్యౌ ।
బృహత్యేవోద్ధి రభవత్ । సఏతం ఛందోరథమాస్థాయ ।
ఏతమధ్వానమను సమచరత్ । ఏతగ్ంహవై ఛందోరథమాస్థాయ ।
ఏతమధ్వానమను సంచరతి । యేనైష ఏతత్సంచరతి ।
యఏవం విద్వాన్సోమేనయజతే । యఉచైనమేవంవేదఇతి॥

తైత్తిరీయబ్రాహ్మణ అ ౧ ప్ర ౫

ఆప్రజాపతి చందస్సులు నాకు రథముగుండనిచెప్పెను. మీచేత నేను మార్గమును సంచరించెదననియెను. ఆరథమునకు గాయత్రి జాగతులను ఛందస్సులు రెండును చక్రములుగావలెను. ఉష్ణిక్కు త్రిష్టుప్పులను ఛందస్సులు ముందటి దండములు గావలెను. అనుష్టుప్పుపంక్తులనునవి వాహనములు గావలెను. బృహతియనునది మధ్యప్రదేశముకావలెను. [అని ప్రజాపతిచెప్పి] యీ ఛందోరథమునెక్కి యీమార్గమును సంచరించెను. యీఛందోరథమును గుర్తెఱిగిన విద్వాంసుఁడు సోమయజ్ఞఫలమును బొందుచున్నాఁడు. అనుతైత్తిరీయబ్రాహ్మణోక్తిచేఁ బ్రజాపతిచే ఛందోమయరథము సృష్టింపఁబడినటులఁ దెలియుచున్నది. ఈప్రజాపతి యెవ్వఁడనినఁ "ప్రజాపతిర్విశ్వకర్మా" యను యజుర్వచనమువలనఁ బ్రజాపతియన విశ్వకర్మయని తెలియుచున్నది.

అందువలననే:—

అస్మాఇదుస్తోమం సంహినేమిరథం నతష్టేవతత్సినాయ ।
గిరశ్చగిర్వాహసే సువృక్తీంద్రాయ విశ్వమిన్వం మోధిరాయ ॥

ఋగ్వే ౧. ౪. ౨౭.

భాష్యమ్॥ స్తోతృభిః ప్రేషితానిస్తోత్రాణిరథవదింద్రమానయంతి అతఃకారణాద్రథేచ్ఛాంకుర్వతే రథకారోరథం కుర్వతే రథకారోరథం కరోతి తద్వదహమింద్రాయైవ నత్వన్యదేవాయ స్తోత్రం రచయామి, యత్స్తోత్రం రథవత్సువృత్తి సుసంస్కృతామితి.

స్తోత్రముచేయువారలవలనఁ బంపఁబడిన స్తోత్రములు రథమునవలె నింద్రుని బొందుచున్నవి. ఆకారణమువలన రథకారుఁడు రథమును జేయుటవలెఁ జక్కని వర్తనమును జక్కని సంస్కరణమును గల (రథమువంటి) స్తోత్రమును బుద్ధిశాలియగు నింద్రుని కొఱకు బంపుచున్నాను. అని స్తోత్రమును రథమువలె నుపయోగించుకొనెదనని చెప్పఁబడినది. ఇందువలన రథపారిశుద్ధ్యతయు ఛందోమయతయు వివరింపఁబడుచున్నది.

## దేవమయరథము.

శ్రు॥ వైశ్వదేవోవై రథః । అంకౌన్యం కావభిత్రో రథం యావిత్యాహ।

యాఏవదేవతా రథేపరివిష్టాస్తాభ్యఏవ నమస్కరోతి॥ తై. బ్రా.

తా॥ సమస్తదేవతలు రథమునందు నిలువవలెను. ఆరథము వైశ్వదేవమనఁబడును. "అంకౌన్యంకౌ" అను మంత్రముతో నంతట నభిమంత్రితమగు రథమునందుపవిష్టులగు దేవతలందఱికొఱకు నమస్కారము చేయుచున్నాఁడు. అనియుండుటయేకాక వాజపేయరథమును "అంకౌరథేమృశేత్యక్షౌ" అని వినియోగసంగ్రహమునఁ జెప్పియుండుటచేత నీవైశ్వదేవరథము వాజపేయరథము నొక్కటియెయని కానఁబడుచున్నది. దేవమయరథము నింక నీక్రింది ప్రమాణములను ధ్రువపఱచుచున్నది.

శ్లో॥ చక్రుశ్చంద్రంచ సూర్యంచ చక్రేకాంచనరాజతే
శుక్లపక్షం కృష్ణపక్షం పక్షద్వయ మపీశ్వరాః
రథనేమిద్వయం చక్రుర్దేవా బ్రహ్మపురస్సరాః
ఋగ్వేదః సామవేదశ్చ యజుర్వేద స్తథాపరః
వేదాశ్చత్వార ఏవైతే చత్వారస్తురగాభవన్॥

కాంచనరౌప్యకాంతులతోఁబరగు సూర్యచంద్రులిరువురును చక్రములుగను, శుక్లకృష్ణపక్షములు రెండును బండికంటికమ్ములుగను, మఱియు ఋగ్యజుసామాథర్వణ వేదములు నాలుగును నశ్వములుగను బ్రహ్మపురస్సరులగు దేవతలొనర్చిరి.

ఈత్రిపురాసుర సంహారమొనర్చిన రథమునే శివపురాణమున నిరువదిమూఁడవ యధ్యాయమున నీక్రిందివిధముగఁ జెప్పఁబడినది.

శ్లో॥ సర్వదేవమయం దివ్యం రథం పరమశోభనమ్
రచయామాసవిశ్వార్థం విశ్వకర్మా స్వయంతథా ౨౫
సర్వభూతమయశ్చైవ సౌవర్ణం సర్వసమ్మతమ్
రథాంగం దక్షిణం సూర్యం వామాంగం సోమఏవచ॥ ౨౬

సర్వదేవమయమై మిక్కిలి శోభించు దివ్యమైన రథమును విశ్వోపకారము కొఱకు సర్వభూతమయుఁడగు విశ్వకర్మ స్వయముగా సృజించెను. అయ్యది సువర్ణ మయమయినదియు సర్వసమ్మతమయినదియునగును. దానికిఁ జంద్రసూర్యులు వామ దక్షిణచక్రములైరి.

ఇట్లీదేవమయరథమును వర్ణించి దీనికర్తృత్వము విశ్వకర్మకే యాపాదింపఁ బడినది. మఱియు,

శ్లో॥ అథరుద్రస్య దేవస్య నిర్మితో విశ్వకర్మణా
సర్వలోకమయో దివ్యోరథో యత్నేనసాదరన్॥ ౧
సర్వభూతమయశ్చైవ సర్వదేవ నమస్కృతః
సర్వదేవమయశ్చైవ సౌవర్ణః సర్వసమ్మతః॥ ౨

లింగపురాణము. ౭౨ అధ్యాయము.

అనియు రుద్రదేవునకు నాదరపూర్వకముగా దేవమయరథమును నిర్మించి విశ్వకర్మ యిచ్చెననియె చెప్పఁబడియున్నది. సౌవర్ణరథమునుగూర్చి ఋగ్వేదమున నీక్రింది విధమున,

శ్రుతిః॥ శశ్వదిన్ద్రః పోప్రుథద్భిర్జిగాయనానదద్భిః శాశ్వసద్భిర్ధనాని। సనోహిరణ్యరథందంసనావాన్త్సనః సనితాసనయేసనోదాత్॥

ఋక్ అ౧ అ౨ వ ౩౧. మం ౧౬

భాష్యమ్. తుష్టేనేంద్రేణదత్తం హిరణ్యరథం అనయాప్రతిజగ్రాహ। తథాచబ్రాహ్మణమ్. "తస్మాఇన్ద్రస్తూయమానః ప్రీతోమనసా హిరణ్యరథందదౌ।తమేతయా ప్రతీయాయ శశ్వదిన్ద్రఇతీతి" (ఐ. బ్రా.) ఇన్ద్రః శశ్వత్సర్వదాధనాని వైరిసంబంధీనిజిగాయ జితవాన్ అశ్వైరితిశేషః కీదృశైః పోప్రుథద్భిఃవాసభక్షణానంతరభావినమోష్ఠశబ్దంకుర్వద్భిః నానదద్భిః నాదమస్యగతం హేషాశబ్దంకుర్వద్భిః శాశ్వసద్భిఃపునః పునర్భృశంవాశ్వసద్భిః దంశనావాన్ కర్మవాన్ సనితాదాతాస ఇన్ద్రోస్మాకం సనయేసంభజనార్థం హిరణ్యరథం సువర్ణేననిర్మితంరథమ్ అదాత్. దత్తవాన్। సనఃసనోద్విరుక్తిరాదరార్థమ్.

సంతుష్టిఁబొందిన యింద్రునిచే నియ్యఁబడిన సువర్ణరథమును బ్రతిగ్రహించెను. ఇంద్రుఁడు సర్వదా శత్రువులయొక్క ధనములను వాసభక్షణము తరువాతఁబెదవులతో ధ్వనిచేయునట్టియు హేషలొలుకునట్టియు వెనువెంట శ్వాసలువిడుచునట్టివియునగు నశ్వములతో జయించెను. కర్మవంతుఁడును దాతయునగు నింద్రుఁడు నా యుపయోగముకొఱకు బంగరుచే నిర్మింపఁబడిన రథమునిచ్చెను. అనిచెప్పుటచే నింద్రుఁడు సువర్ణరథమిచ్చెనని తెలియుచున్నది. ఈ యింద్రుఁడు "సమీచీనాకృతి నిర్మాణం యస్యాసౌసంకృతిః తాదృశో విశ్వకర్మనామకోదేవ ఇంద్రఏవ" అను భాష్యోక్తివలన విశ్వకర్మయనియె యూహింపఁదగియున్నది.

## దేహమయరథము.

ఆత్మానగ్ం రథినం విద్ధిశరీరగ్ం రథమేవతు।
బుద్ధింతుసారథిం విద్ధిమనః ప్రగ్రహమేవచ॥

కఠోపనిషత్, తృతీయావల్లి.

తాను రథియనియు శరీరము రథమనియుఁ దెలియుచున్నది. ఇచ్చట రథదేహముల కభేదాధ్యవసాయమయినప్పుడు దేహ (రథ) కారుఁడెవ్వఁడని మనము విచారింపవలసియున్నది. యజుర్వేద ప్రథమాష్టకపంచమప్రపాఠక నవమానువాక

మందలి " యావచ్ఛోవై రేతసః సిక్తస్యత్వష్టారూపాణి వికరోతి " అను మంత్రి మందలి " ఆవిశ్వకర్మ మెన్నిరూపముల నుద్దేశించి రేతస్సులను వివిధములుగాఁ జేయుచున్నాఁడో యన్నియు నుత్పన్నమగుచున్నవి " అను నర్థమువలన దేహ (రథ) కారుఁడును విశ్వకర్మయనియె కన్పట్టుచున్నది.

## వాహమయరథము.

ఈరథములు దేవతలకు రాజులకు యుద్ధవీరులకును నారోహ్యములగుట సుప్రసిద్ధమే. యజ్ఞోపయోగరథమునుగూర్చి మున్ను వివరించియెయున్నది. యజ్ఞరథమును దేవమయరథమని సిద్ధాంతీకరింపవచ్చును. ఈరథనిర్మాతలు ఋభుత్వష్టృ విశ్వకర్మాదులయినటులఁ బెక్కులు ప్రమాణములు గాన్పించుచున్నవి. వానిలోఁగొన్నిటి నీక్రింద నుదాహరింపఁబడినవి.

శ్రుతి॥ యఇంద్రాయవచోయుజాతతక్షుర్మనసాహరీశమీభిర్యజ్ఞమాశత॥

ఋగ్వే. అ౧ అ౧ వ ౩౭ సూ ౨౦ మం ౨

భాష్యానుసారతాత్పర్యము॥ మాటనుదెలిసికొని తమంతట వచ్చిచేరునట్టి గుఱ్ఱములను ఇంద్రునికొఱకు సృజించిన ఋభుదేవతలు చమసాది నిర్మాణరూపకార్యములచే మాయజ్ఞమును బొందిరి. అనఁగా సహాయులుగావచ్చి చమసాది నిర్మాణరూపకార్యములను జేసిరి.

తక్షన్నాసత్యాభ్యాంపరిజ్మానంసుఖంరథమ్।తక్షన్ధేనుంసబర్దుఘామ్॥ ౩

తా॥ ఋభువులు అశ్వినీ దేవతలకొఱకు నిర్బంధములేక యంతట సంచరించునట్టిదియు, పైనఁగూర్చుండుటకు సుఖకరమగు నట్టిదియునైన రథమును పాలుపితుకునట్టి యొకానొక యావును సంకల్పమాత్రముచే సృజించిరి.

తక్షన్రథంసువృతంవిద్మనాపసస్తక్షన్హరీఇంద్రవాహావృషణ్వసూ।
తక్షన్పితృభ్యామృభవోయువద్వయస్తక్షన్వత్సాయమాతరం సచాభువమ్॥

ఋగ్వే అ ౧ అ ౭ వ ౩౨ మం ౧

తా॥ ఉత్కృష్టజ్ఞాన సాధ్యములగు కర్మములుగల ఋభువులు అశ్వినీదేవతలు ఎక్కుటకు గట్టి చక్రములుగల రథమును జేసిరి. అట్లే ఇంద్రుని వాహనములయిన

హరులను సంజ్ఞలుగల గుఱ్ఱములనుజేసిరి. మఱియు వృద్ధులైన తమ తల్లిదండ్రుల కొఱకు యౌవనముతోఁగూడిన ఆయుష్యమును ఋభువులుచేసిరి. అట్లె లేగకొఱకుఁ దల్లియైన యావుగూడ నుండునట్లు చేసిరి.

మఱియు నీరథమునుగూర్చియు హరులనుగూర్చియు పెక్కుచోట్ల వర్ణింపఁబడి యున్నవి. నానిలోఁ గొన్ని యీక్రింద నుదాహృతములు.

నకిష్టద్రథీతరో హరీయదింద్రయచ్ఛసే నకిష్ట్వానుమజ్మనానకిఃస్వశ్వఆనశే॥
ఋగ్వే. అ ౧ అ ౬ వ ౬ మం ౧

తా॥ ఓ యింద్రుఁడా ఏకారణమువలన నీవు హరులను పేరుగల రెండు గుఱ్ఱములను రథమునఁ గట్టుచున్నావో, ఆకారణమువలన నీకంటె నెక్కువ రథికుఁడు వేఱొకఁడులేడు (ఇతరుల కిట్టి గుఱ్ఱములుకట్టిన రథములేదు కనుక) బలమునను నీతో సమానుఁడు లేఁడు. మంచిగుఱ్ఱములు గల యితరుఁడును నిన్నుఁ బోలఁడయ్యెను. (ఇందు్రని బలము గుఱ్ఱములు నితరులకు లేమి నింద్రునితో సముఁడగు బలవంతుఁడు నశ్వవంతుఁడు లోకమున లేఁడు:)

యోవామశ్వినామనసో జవీయాన్రథస్వశ్వో విశఆజిగాతి। యేనగచ్ఛథస్సుకృతోదురోణం తేననరావర్తిరస్మభ్యం యాతం॥

తా॥ ఓ యశ్వినీ దేవతలారా! మీఁదైన మనస్సుకంటె నెక్కువ వడిగలదియు మంచిగుఱ్ఱములుగలదియు నగు రథము మనుష్యుల కభిముఖముగా వచ్చుచున్నది. ఏరథముచే మంగళప్రదమయిన యజమానునియొక్క యజ్ఞశాలయను గృహమును బొందుచున్నారో ఆరథముతోఁ బ్రభువులైన అశ్వినీదేవతలారా! మా నివాసమగు ఇంటినిగూర్చి రండు!

శ్రు॥ అశ్వినోరసనం రథమశ్వం వాజినీవతోః। తేనాహం భూరిచాకన॥
ఋగ్వే అ ౧ అ ౮ వ ౨౩ మం ౧౦

తా॥ అన్నములేక బలముగల క్రియగల అశ్వినీదేవతలయొక్క గుఱ్ఱములు లేకపోయినను మిక్కిలి సామర్థ్యమున నడచుచున్న రథమును స్తోత్రకర్తనైన నేను పొందితిని. ఆరథముచే గొప్ప శ్రేయస్సును గోరుచున్నాను.

అయం సమహమాతనూహ్యతేజనామ్ అను । సోమపేయం సుఖోరథః॥

మం ౧౧

తా॥ ధనముతోఁగూడిన యో రథమా! ఈ యెదుటనున్న నీవు నన్నుఁ బుత్రపౌత్రధనాది సమృద్ధిగలవానిగాఁ జేయుము! మంచి అవకాశముగలది లేక సుఖహేతువు అయిన రథము స్తోత్రముచేయు జనులనుగూర్చి సోమము ద్రావుటకుఁ దీసికొని పోఁబడుచున్నది. కాఁబట్టి అశ్వినీదేవతలు ఇచ్చునది రథమే యిచ్చునని రథమును సంబోధించి ప్రార్థనము చేయఁబడుచున్నది.

కావున ఋభుకృతములయిన రథాశ్వములు లోకోత్తరములయి సర్వజన సంభావ్యములయి యద్వితీయములయి నడలుచున్నవి.

మఱియు,

అనవ స్తేరథమశ్వాయతక్షన్ త్వష్టావజ్రంపురుహూతంద్యుమ న్తమ్ । బ్రహ్మాణ ఇన్ద్రంమహయన్తో అర్కైరవర్ధయన్నహయేహన్తవాఉ॥

భాష్యమ్॥ హేపురుహూత బహుభిరాహూతేంద్ర తేత్వదీయం రథమశ్వాయాశ్వాభ్యామ్ సంయోగార్హ్మనవో మనుష్యా ఋభవ స్తక్షన్ అతక్షన్ అకుర్వన్, త్వష్టాచత్వదీయమ్ వజ్రం ద్యుమన్తం దీప్తిమన్తమకరోత్ । ఉఅపిచమహయంత ఇంద్రం పూజయంతో బ్రహ్మాణోంగిరసః పరివృఢామహాతోవా । అహయేఽహిం వృత్రం హంతవేహంతుం । అర్కైః స్తోత్రైః అవర్ధయన్ వర్ధితవంతః॥

తా॥ పెక్కురు యజమానులచేఁ బిలువఁబడు నోయింద్రా! నీరథ మశ్వములచేఁ గట్టఁదగినదానినిగా మనుష్యులైన ఋభువులు చేసిరి. త్వష్టయగు విశ్వకర్మ వజ్రమును బ్రకాశవంతముగాఁ జేసెను. ఇంతయెగాక యింద్రుని బూజించుచున్న బ్రహ్మలగు నంగిరసులు (పూర్వోక్తులగు ఋభుత్వష్ట్రాదులు) గొప్పవారై వృత్రునిఁ జంపుటకు స్తోత్రములచే వృద్ధిఁబొందినవారైరి. (అనఁగా వృత్రహననమునకు నింద్రునకు సహాయముఁజేయఁ బ్రార్థింపఁబడినవారైరి.

ఇందువలన ఋభుత్వష్ట్రాది రథకారు లెంతటియుదారులును బూజ్యులునైరో తెలియుచున్నది. ఇంతయెకాక త్వష్టదీప్తిమంతముగాఁజేసిన వజ్రమనునదియె రథమని "వజ్రోవై రథః" అను తైత్తిరీయ బ్రాహ్మణవచనమువలనఁ దెలియుచున్నది..

ఇంకను పెక్కుపురాణ వచనములవలనను త్వష్టయు విశ్వకర్మయు రథకారులగుట స్పష్టీకరింపఁబడియె యున్నది. పర్యవసానము విచారించితిమేని సృష్టిక్రియలలో నుత్తమోత్తమగునదియె రథశిల్పము. అద్దానిని సృష్టించుటయుఁగూడ మహత్తర కార్యము. ఆసృష్టికిఁ గర్తలు కేవల జగత్సృష్టికర్తలతో సమానులే. ఋభువుల యొక్కయు విశ్వకర్మాదులయొక్కయు గులీనతయుఁ బావనతయు ముందు ఋభుచరిత్రమున వివరింపఁబడును. పావన చరిత్రులగు నీరథకారవరేణ్యులను ఒకానొక స్మృతివాక్యమువలన భ్రాంతిపడి మీమాంసాకారుఁడును, కొన్నియెడల భాష్యకారులును భిన్నాభిప్రాయములకుఁబాల్పడి నీచత్వారోపణచేఁ బరిభావించిరి.

రథకారుల యాధానవిషయిక విశేషవర్ణనము.

కశ్యపాదు లనేకులు సృష్టికర్తలును ప్రజాపతులు కలరు. వారిలోఁ గశ్యపుఁడు మొదటివాఁడు. అట్లయినను గశ్యపుని తర్వాతవారిలో భృగువు, అంగిరస్సు అను వారలు ముఖ్యులు. ఇందులకు దృష్టాంతముగ

శ్లో॥ ఆగ్నేయ స్త్వంగిరాశ్శ్రీమాన్ కవిర్బ్రహ్మామహాయశాః
భార్గవాంగిరసౌ లోకేలోక సంతానలక్షణౌ॥

భారతానుశాసనపర్వము అ ౮౩

అని సర్వప్రజాసంతానమునకుఁ గారణభూతులగువారు భృగువు అంగిరస్సును నగుదురు. ఈయాంగీరసులలో, భరద్వాజాంగిరసులు, గౌతమాంగిరసులు, భృగ్వాంగిరసులు, మున్నగు భేదములచేఁ బెక్కండ్రు వఱలుదురు. వారిలో సుధర్వాంగిరసులనువారు కలరు. వారలె రథాదిశిల్పకార్యములొనర్చి లోకసృష్టియొనర్తురు. వారిలోఁ బ్రముఖులే విశ్వకర్మ, బృహస్పతి, సుధన్వ, శుక్రాచార్య, భువన, భావన, సంవర్త, అంగిర, ఋభు, సానగ, ప్రముఖులు బ్రహ్మర్షివరేణ్యులు. వారలెరథ, వా, స్త్వలు కార, మూర్తి, యజ్ఞపాత్ర, శస్త్రాస్త్రాది, శిల్పవిజ్ఞానమున సుప్రసిద్ధులు. వీరలె నిరంతర శిల్పకర్మప్రవీణులగుటచే రథకారబ్రాహ్మణులని యుగ్గడింపఁబడుచుండిరి. వారి వంశమువారికిఁగూడ నట్లు రథకార బ్రాహ్మణులను నామము సుప్రసిద్ధికివచ్చినది. అగ్న్యాధానకాలమున బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, రథకారులకు వేర్వేరుగ నీక్రిందిరీతిగ యాజమాన్యమంత్రములు చెప్పఁబడినవి.

శ్రుతిః॥ యస్యవాలయథాదేవ తమగ్నిరాధీయతే ।
ఆదేవతాభ్యో వృశ్చ్యతే, పాపీయాన్భవతి ।
యస్యయథాదేవతం నదేవతాభ్య ఆవృశ్చ్యతే ।
వసీయాన్భవతి । భృగూణాం త్వాంగిరసాం వ్ర
తపతేవ్రతేనాదధామీతి భృగ్వంగిరసామాదధ్యాత్ ।
ఆదిత్యానాం త్వాదేవతానాం వ్రతపతేవ్రతేనా
దధామీత్యన్యాసాం బ్రాహ్మణీనాం ప్రజానామ్ ।
వరుణస్యత్వారాజ్ఞో వ్రతపతే వ్రతేనాదధామీతిరాజ్ఞః ।
ఇన్ద్రస్యత్వేన్ద్రియేణ వ్రతపతే వ్రతేనాదధామీతి రాజన్యస్య ।
మనోస్త్వాగ్రామణ్యో వ్రతపతే వ్రతేనాదధామీతి వైశ్యస్య ।
ఋభూణాన్త్వాదేవానాం వ్రతపతే వ్రతేనాదధామీతి రథకారస్య॥

భాష్యమ్॥ హేవ్రతపతే కర్మస్వామిన్ అగ్నేభృగూణామాంగిరసాంచ సంబంధినా వ్రతేనకర్మ విశేషేణ నిమిత్తభూతేన। త్వామాదధామి. ఇహాయతనేస్థాపయామీతి మన్త్రార్థః । ఏవముత్తరత్రాపి.

తా॥ అగ్న్యాధానమొనర్చువారలే దేవతలకు సంబంధించియుందురో యాదేవతలనే యనువాదమొనర్చి ఆయతనమునందగ్ని నునుపవలెను. అట్టివారలకు శ్రేయః ప్రాప్తిలభించును. అందులకు వ్యతిరిక్తముగఁ జేయువారు పాపిష్ఠులై నరకఫలము ననుభవించెదరు. భృగ్వంగిరసులగు బ్రాహ్మణులు "భృగూణాంత్వా" యని తమకూటస్థులగు భృగువులకని యనువాద మొనర్చవలెను. అట్లె యన్యబ్రాహ్మణులు "ఆదిత్యానాంత్వా" యనియు రాజు "వరుణస్యత్వా" యనియు, రాజన్యుఁడు "ఇన్ద్రస్యత్వా" యనియు, వైశ్యుఁడు "మనోస్త్వా" యనియు, రథకారుఁడు "ఋభూణాన్త్వా" యనియు ననువాద మొనర్పవలెను. అట్లుండుటచేఁ దమవంశకర్తలను దామనువాదించుట తెలుపుచున్నది.

భృగ్వంగిరసుల విషయమై విచారించెదమేని మత్స్యపురాణమున ౧౯౩ అధ్యాయమున శ్లో॥ భువనోభావనశ్చైవ సుజన్యః సుజనస్తథా। శుచిఃక్రతుశ్చ

మూర్ధాచత్వాజ్యశ్చ వసుదశ్చహః। ప్రివాపశ్చాత్యయాశ్చైచ వదక్షోధర్వాదశ స్తథా॥ ఇత్యేతేభృగవోనామ దేవాద్వాదశకీర్తితాః॥ అనువచనమువలన నీపన్నిద్దఱు భృగువంశమువారని తెలియుచున్నది. అంగిరోవంశమువారిలో, వాయుపురాణము ౧౮అధ్యాయమున, శ్లో॥ ఔదార్యాయుర్దనుర్దక్షో దర్భపాణి స్తథైవచ। హవిష్మాన్హవిష్ణశ్చ క్రతుః సత్యశ్చతేదశ॥ అనువచనమువలన, ఆంగిరసులు పదుగురుగాన్పించుచున్నారు. ఋభువులు, కౌరవులు పాండవులును ఒక కురువంశముననె పుట్టి కౌరవ పాండవ భేదమును బొందినటులనే రథాది శిల్పకార్యమునం దసవద్యులగుటచే భృగ్వంగిరోవంశ బ్రాహ్మణులయినను రథకారులని యుపనామమును నహించిరి. * అందువలననే, భృగ్వంగిరోవంశబ్రాహ్మణులకు "భృగూణాన్త్వా" యని యాజమాన్యముచెప్పి, ఇతరబ్రాహ్మణులకు "ఆదిత్యానాన్త్వా"యని యాదిత్యాత్మకమగు యాజమాన్యము చెప్పి, యనంతరము రాజులకు, రాజన్యులకు, వైశ్యులకు విభాగించి చిట్టచివరకుఁ బ్రత్యేకించి రథకారునికి యాజమాన్యము నిరూపించి చూపెను. వర్ణత్రయానంతరమున రథకారులకుఁజెప్పుటచే వీరు త్రైవర్ణికేతరులని చెప్పుటకు సాహసించెదరేమో! అట్లనంజనదు. వేదకారునకుఁబౌర్వాపర్యదోషమున సందేహములేదు. చూడుఁడు తైత్తిరీయబ్రాహ్మణమున "ఋగ్భ్యోజాతం వైశ్యంవర్ణమాహుః । యజుర్వేదం క్షత్రియస్యాహుర్యోనిం । సామవేదోబ్రాహ్మణానాంప్రసూతిః॥ అని ఋక్కులవలన వైశ్యవర్ణముగలిగినదనియు, యజుర్వేదము క్షత్రియున కుత్పాదకారణమనియు, సామవేదము బ్రాహ్మణులకు జన్మస్థానమనియుఁ జెప్పియున్నది. వేదముల కన్నిటికిఁ దొలుదొల్తటిది ఋగ్వేదము. అట్టి ప్రారంభవేదమున వైశ్యుఁడు జన్మించుటచే మొట్టమొదటివాఁడు వైశ్యుఁడుగాని బ్రాహ్మణుఁడగునా? ఈవిషయములో ముందు వెనుక లాలోచింపఁదగదు. మూఁడవవేదమునఁ బుట్టిన బ్రాహ్మణుఁడు మొదటివాఁడుగ వ్యవహరింపఁబడినటులనే పర్యాయమునఁజెప్పిన రథకారుఁడుగూడ బ్రాహ్మణులలోఁ బరిగణనీయుఁడనుటకు నిస్సందేహము, ఇంతయెకాక బ్రాహ్మణాది వర్ణత్రయమునకుఁ గాలముల నిర్ణయించుటలో యజుర్బ్రాహ్మణము "వసంతేబ్రాహ్మణోగ్నిమాదధీత" "గ్రీష్మేరాజన్య ఆదధీత" "శరదివైశ్యఆదధీత" అని బ్రాహ్మణునకు వసంతర్తువగ్న్యాధానకాలమనియు, రాజన్యునకు గ్రీష్మర్తువనియు, వైశ్యునకు శరదృతువనియు, వర్ణత్రయమువారికే నిర్ణయించి రథకారుఁడు బ్రాహ్మ

* భృగ్వంగిరోవంశమున ఋభుజననము ఋభుచరిత్రమున వివరింపఁబడును.

గాంతర్భూతుఁడగుటవలననే వానికిఁ గాలము నిర్ణయించలేదు. కాని సూత్రకర్తలు కొందఱు "వర్షారథకారస్య" అని రథకారునకు వర్షర్తువుగా నిర్ణయించిరి. సూత్రకర్తలగు నాపస్తంబాది మహర్షులు చాలవరకు సూక్ష్మదృష్టిని బర్యాలోచించియె కాలనిర్ణయమొనర్చిరి. రథకారుఁడు బ్రాహ్మణ క్షత్రియులకు వాజపేయాది యజ్ఞములయందు రథాద్యుపకరణము లొనర్చుటచే వసంతగ్రీష్మర్తువులు గడపి యనంతరమగు వర్షాకాలమున నగ్న్యాధానము సలుపఁదగునని నిష్పన్నమొనర్చిరి. ఇంతయె కాక సూర్యతేజస్స్వరూపులగు ఋభువుల నాహ్వానమొనర్చుటకు వర్షాకాలమే తగుననియు నా ఋభువుల యనుగ్రహమున నర్షాదులు లభించుటచేఁ బ్రపంచపోషణ జఱుగుననియు మహర్షుల యభిప్రాయము. ఈవిషయము ముందొకచో వివరింపఁబడును.

## భ్రాంతిమయమగు మాధవీయ భాష్యము.

ఋభువులఁగూర్చియు రథకారులఁగూర్చియు బ్రాహ్మణులని యెన్నియో దృష్టాంతములుండినను, "రథకారస్య సంకీర్ణజాతీయస్య" అని మాధవాచార్యులు రథకారుఁడు సంకీర్ణజాతీయుఁడని రథకారశబ్దమునకు వ్యాఖ్యానమొనర్చెను. ఇయ్యదియె ఆ ధీమంతుని భ్రాంతిమయ ప్రమాదము. ఈ భాష్యకర్త మీమాంసాశాస్త్రముతో గతానుగతికతను బాటించుకతమున నీభ్రాంతి వాటిల్లెను. రథకారున కీసంకర జాతి యెచ్చటనుండి వచ్చెననః—

శ్లో॥ మాహీష్యేణ కరణ్యాంతురథకారః ప్రజాయతే।
అసత్సంతస్తువిజ్ఞేయాః ప్రతిలోమానులోమజాః

తా॥ పురుషు లుత్తమజాతులయి స్త్రీ లధమజాతులయి వీరలకుఁ గలిగిన సంతానము అనులోములనియు, స్త్రీ లుత్తమజాతులయి పురుషు లధమజాతులయి వీరలకుఁ గలిగిన సంతానము ప్రతిలోములనియుఁ జెప్పఁబడుదురు. క్షత్రియునిచే వైశ్యస్త్రీయందుఁ గలిగినవాఁడు మాహిష్యుఁడు; వైశ్యునిచే శూద్రస్త్రీయందుఁ గలిగినది కరిణి, వీరి యుభయులకుఁ (మాహిష్యకరణులకు) గలిగినవాఁడు రథకార నామముచే నొప్పు నొకజాతీయుఁడు. అనఁగా సంకీర్ణజాతీయులకుఁ బుట్టిన సంకరుఁడు. అని యాజ్ఞవల్క్యమహర్షి యనులోమ విలోమ సంకీర్ణ సంకరజాతుల నిర్ణయించుచు రథకారజాతిని పూర్వశ్లోకరూపమున నిర్ణయించెను. యాజ్ఞవల్క్యులు జాతి మాత్రము నిర్ణయించిరిగాని సంస్కారములు నిర్ణయింపక విడిచిరి. అట్లయినను

యాజ్ఞవల్క్య స్మృతికి వ్యాఖ్యానమొనర్చిన విజ్ఞానేశ్వరుఁడు "తస్య చోపనయనాది సర్వంకార్యం వచనాత్" అని యారథకారునికి ఉపనయనాదికము సర్వముఁ జేయఁ దగినది వేదోక్తమగు విధివచనమువలన నని యారథకారునికే యుపనయనాదికము నిర్ణయించెను. అందులకు శంఖవచనముఁగూడ నొకటిగలదని "తస్యేజ్యాధానోపనయన సంస్కారక్రియాశ్వ ప్రతిష్ఠారథ సూత్రవాస్తు విద్యాధ్యయన వృత్తితాచేతి" ఆరథకారునికి యజ్ఞము, ఆధానము, ఉపనయనము, అశ్వప్రతిష్ఠ, రథము, సూత్రము, వాస్తువిద్య, అధ్యయనము మున్నగు వృత్తులుగలుగునను నర్థముగల సూత్రవాక్యము నుదాహరించెను. ఇంతయకాక, విజ్ఞానేశ్వరుఁడు తనజాతి వివేకమను గ్రంథమందు,

క్షత్రియేణవైశ్యాయా ముత్పాదితో మాహిష్యః। వైశ్యేన శూద్రాయా ముత్పాదితాకరణీ। తస్యాంమాహిష్యేణోత్పాదితో రథకారోనామ జాత్యాభవతి। తస్య-చోపనయనాది సర్వం కార్యం వచనాత్॥

అని పూర్వోక్త వ్యాఖ్యానానుకూలముగనే వ్రాసివిడిచెను. రథకారజాతిని గూర్చి విజ్ఞానేశ్వరుని యభిప్రాయము చాల విస్మయముఁ గలిగించుచున్నది. అతీంద్రియదర్శియగు యాజ్ఞవల్క్యమహర్షికి వేదవచనము స్ఫురణకు రాకపోలేదు. అట్లు వచనము స్ఫురణగలిగినను మాహిష్యజాతికిని కరణజాతికిని లేనివచనము మాహిష్య కరణులకుగలిగిన సంకరజాతికే యావచనము ("ఋభూణాన్త్వా దేవానాం వ్రతపతే వ్రతేనా దధామీతి రథకారస్య" అనునది) కలిగినదని యూహ జనింపలేదు. "నామూలం లిఖ్యతేకించి" త్తనునటుల మూలాతిక్రమణముగాకుండ వ్యాఖ్యానము వ్రాసిన నెంతోమేలగునుగదా? విజ్ఞానేశ్వరుఁడట్లు తలఁచుకొనక ముందఱ నేమేమో వ్రాసి తుదకుఁ దన బృహజ్జాతి వివేకమునందు,

శ్లో॥ మాహిష్యేణకరణ్యాంతు రథకారః ప్రజాయతే
నైవోపనయనం తస్య శూద్రధర్మాద్బహిష్కృతిః॥

మాహిష్యకరణజాతులకుఁబుట్టిన రథకారుఁడు ఉపనయనాది సంస్కారములు లేక శూద్రధర్మములు గలిగినవాఁడగుటనలన బహిష్కరింపఁబడుచున్నాఁడు. అని పూర్వవాక్యమునకు విరోధముగా వ్రాసెను. ఇట్టి విరోధములు చాలఁగలవు. అవి యెల్ల సమయానుకూలముగ వివరింపఁబడును. ప్రస్తుత విచారణమునుగూర్చి చర్చించుదము. రథకారునకు నాధానాధికారము కలదని వేదవచనము నిర్ణయించుచున్నది. రథకారనామకమగు నొకానొకజాతి కలదనియు నయ్యాది సంకీర్ణులకుఁ బుట్టిన సంకర

జాతియనియు యాజ్ఞవల్క్యస్మృతి పలుకుచున్నది. ఆవచనమీజాతికేయని విజ్ఞానేశ్వరుఁడు ముడివెట్టెను. రథకారజాతికి నుత్పాదకారణజాతులగు మాహిష్యకరణ జాతులకు నాధానాధికారము నేవేదవచనము నిర్ణయింపలేదు. ఆవేదవచన రథకారుఁడే యీసంకీర్ణరథకారుఁడని యాజ్ఞవల్క్యమహర్షికిఁ గోచరింపలేదు. సంకీర్ణజాతులకు (మాహిష్యకరణులకు) లేని యాధానాధికారము, సంకీర్ణులకుఁబుట్టిన సంకరజాతికి ఆధానాధికారమెట్లు పొసఁగెనో యాశ్చర్యజనకముఁ గాకమానదు. విజ్ఞానేశ్వరుఁడు విచారించి విచారించి శంఖవచనమొకటి యుదాహరించెను. స్మృతికర్తలలో మొట్ట మొదటివాఁడు మనువు రెండవవాఁడు యాజ్ఞవల్క్యుఁడు. తక్కుఁగలవారెల్లరు తరువాతివారు. మనువునకు రథకారజాతి యుత్పత్తియె తెలియదు. యాజ్ఞవల్క్యునకో రథకారజాతియొకటి కలదని తెలిసినది. ఆనంతర్యులగు శంఖాదులకు వేదవచన రథకారుఁడే సంకీర్ణసంకర రథకారుఁడని గోచరించినది. పావనతరమగు వేదవచనము నెట్లెట్లు పరిణమింప నర్థమొనర్చిరో చదువరులు నిర్ణయింపవలెను. భాష్యకర్తలగు మాధవాచార్యులు భ్రాంతిపడిన దీ విజ్ఞానేశ్వర వ్యాఖ్యానమువలనఁగాదు. వీరు మీమాంసాశాస్త్రమునకు గతానుగతికులు. కావుననే వీరికిభ్రాంతి సందర్భించినది.

## మీమాంసకానుమాన నిరాకరణము.

శ్లో॥ విప్రాదిరైన్వ రథకృదన్యోవా యస్తుయోగతః
రూఢేర్వర్ణాన్తరంప్రాప్య తస్యవర్షర్తురిష్యతే॥

మీమాంసాధికరణ రత్నమాల,
అ ౬ పాద ౧

తా॥ బ్రాహ్మణాదులే రథకారులా? లేక అన్యులా? అని విచారించి యోగ శక్తినవలంబించిన నన్యులుకారుగాని రూఢిచే నన్యజాతీయులే. వారికి ఆధానకాలము వర్షర్తువు.

అని బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులను వర్ణత్రయమువారలా రథకారులని సందేహము వొడమి యోగశక్తిచేత ననఁగా "రథంకరోతీతి రథకారః" అను వ్యుత్పత్తివలన వర్ణత్రయమువారిలో నెవ్వరు రథమునుజేయుదురో వారలు రథకారులు గాని రూఢి (వాడుక) వలన వర్ణత్రయమేతరులై వారు వర్షర్తువునం దాధానమును జేయుదురు అని యనుమాన నిరాకరణమును జేసికొనెను. ఇదియ యవిచారిత భాగము. వేదార్థమున కొక్కొక్కచో మీమాంసాకారుఁడు విపరీతార్థమును

స్ఫురింపఁజేయును. అట్లు భాష్యకారుఁడును వేఱువేఱ యర్థములను వ్రాయును. ఇది వారి తార్కికబలమని తోఁచెడిని. చూడుఁడు:— "తేసాధన్వనాః" అని యొక శ్రుతివాక్యము కలదు. ఆవాక్యమునకు సాయణాచార్యుఁడు తన భాష్యమున "సుధన్వన ఆంగిరసస్య సుధన్వన ఋషేః పుత్రాః" అని యంగిరర్షి పుత్త్రుఁడు సుధన్వ బ్రహ్మర్షి యతని పుత్త్రులు సౌధన్వులని వ్రాసెను. ఆపదమునకే పార్థసారథి మిశ్రుఁడను పేరుగల మీమాంసకుఁడు "సౌధన్వనాః" "సుధన్వనవైశ్యాయాం వ్రాత్యాత్ జాతః కశ్చిత్ సుధన్వానామకో హీనజాతిః తస్య" అని భ్రష్టయగు వైశ్య స్త్రీయందు వ్రాత్యుని (భ్రష్టుని) వలనఁ బుట్టినజాతి సుధన్వజాతి ఆజాతికిఁ బుట్టినవారు సౌధన్వులని, వ్రాసెను. మఱియొకచో మాధవీయ భాష్యకారుఁడే "సుధన్వన ఇంద్రస్య సంబంధినః" అని సుధన్వుఁడింద్రుఁడుగా వ్రాసెను. ఇట్లు యొక సౌధన్వన పదమునకు ఒకచో బ్రహ్మర్షిగను, ఒకచో నీచజాతిగను, ఒకచో నింద్రుఁడుగను నర్థీకరించి విడిచిరి. వేదార్థములు వివరించుటలో మీమాంసాది గ్రంథములు కేవల నామధారకములు గాని వేఱుకాదు. అయ్యవి సత్యధర్మము లుపదేశించుటలో నందందు లోపములుఁ జూపట్టును. ఇదిగాక:—పాద్మమునందు,

శ్లో॥ బహుత్వాదిహశాస్త్రాణాం ధర్మమూలం శ్రుతిః స్మృతిః
శ్రుతిస్మృతి పురాణానాం విరోధోయది దృశ్యతే
శ్రౌతంతత్రప్రమాణం స్యాద్ద్వయోర్ద్వైధే శ్రుతిర్వరా
శ్రుతిద్వైధంతు యత్రస్యాత్తత్ర ధర్మావుభౌస్మృతౌ॥

తా॥ శాస్త్రము లనేకములగుటవలన ధర్మమునకుమూలము శ్రుతి స్మృతులగుచున్నవి. శ్రుతి స్మృతిపురాణములలో విరోధము చూపట్టెనేని శ్రుత్యర్థమునే ప్రమాణముగాఁ దలఁచవలెను. శ్రుతి స్మృతులు రెంటిలోఁగూడ శ్రుతియె ప్రబల ప్రమాణము. శ్రుత్యర్థములు రెండుగా భేదించెనేని రెండునుఁ బ్రమాణములె యగును. అని చెప్పియుండుటచే ధర్మనిర్ధారణమునకు శ్రుతులు ప్రబలతరముగాని వేఱుగావు. ఇక్కడ రథకారబ్రాహ్మణునకుఁజెప్పిన యాధానవిధివాక్యము (పావన వేదవాక్యము) సంకీర్ణరథకారునికని నిర్ధారణమొనర్చిన మీమాంసాకారుని యుద్దేశ మెంతపవిత్రమైనదో యాలోచింపవలసియున్నది.

వేదార్థము వ్యాకులములు; ఋషిమతములు భిన్నములు.

శ్లో॥ ద్వాపరేవ్యాకులీ భూత్వా ప్రణశ్యతికలౌపునః
వర్ణానాం ద్వాపరేధర్మాః సంకీర్యంతే తథాశ్రమాః॥ ౬

ద్వైవిధముత్పద్యతేచైవ యుగేతస్మిన్ శ్రుతౌ స్మృతౌ
ద్విధాశ్రుతిః స్మృతిశ్చైవ నిశ్చయోనాధిగమ్యతే॥ ౭
అనిశ్చయోపగమనాద్ధర్మతత్త్వం నవిద్యతే
ధర్మతత్త్వంహ్య విజ్ఞాతే మతిభేదస్తు జాయతే॥ ౮
పరస్పరం విభిన్నైస్తైర్దృష్టీనాం విభ్రమేణతు
అతోదృష్టివిభిన్నైస్తైః కృతమత్యాకులంత్విదం॥ ౯
ఏకోవేదశ్చతుష్పాదః సంహృత్యతు పునః పునః
సంక్షేపాదాయుషశ్చైవవ్యస్యతే ద్వాపరేత్విహ॥ ౧౦
వేదశ్చైకశ్చతుర్ధాతు వ్యస్యతే ద్వాపరాదిషు
ఋషిపుత్రైః పునర్వేదాభిద్యంతే దృష్టివిభ్రమైః॥ ౧౧
తేతుబ్రాహ్మణవిన్యాసైః సర్వక్రమ విపర్యయైః
సంహృతా ఋగ్యజుస్సామ్నాం సంహితాస్తైర్మహర్షిభిః॥ ౧౨
సామాన్యాద్వైకృతాచ్చైవదృష్టిభిన్నైఃక్వచిత్క్వచిత్
బ్రాహ్మణం కల్పసూత్రాణి భాష్యవిద్యాస్తథైవచ॥ ౧౩
అన్యేతు ప్రస్థితాస్తాన్వైకేచిత్తాన్ప్రత్యవస్థితాః
ద్వాపరేషు ప్రవర్తన్తేభిన్నార్థైస్తైస్స్వదర్శనైః॥ ౧౪
ఏకమాధ్వర్యవం పూర్వమాసీద్ద్వైధంతు తత్పునః
సామాన్య విపరీతార్థైఃకృతం శాస్త్రాకులంత్విదం॥ ౧౫
దురధ్యేతైర్దురధీతైశ్చ దురాచారైర్దురాగమైః
విప్రాణాం కర్మదోషైస్తైః ప్రజానాం జాయతేభయమ్॥ ౧౬

మత్స్యపురాణము అ ౧౪౩.

తా॥ ద్వాపరయుగమునందు ధర్మము వ్యాకులమునంది కలియుగమునందు వెండియు నశించుచున్నది. ద్వాపరమునందుఁగల ధర్మములు నాశ్రమధర్మములును సంకీర్ణతఁ జెందుచున్నవి. శ్రుతులు స్మృతులు వేఱువేఱు భావము లందుచున్నవి. రెండైన శ్రుతిస్మృతుల భావములు నిశ్చయము పొసఁగింపనేరవు. అనిశ్చయమగుట వలన ధర్మతత్వము లభింపదు. ఎప్పుడుధర్మతత్వము నిశ్చయింపఁబడదో భిన్నబుద్ధు లప్పుడేర్పడును. పరస్పరము భిన్నభావము లేర్పడునప్పుడు దృష్టివిభ్రమములుగూడ

నేర్పడును. అందుచే దృష్టి భిన్నులకు నత్యాకులత పొసఁగును. ఒకేవేదము నాలుగు భాగములుగలదై తిరిగితిరిగి తగ్గింపఁబడి ఆయుర్హ్రాసమువలన మఱియు తగ్గింపఁబడును. ఋషిపుత్త్రులచేఁ దిరిగి వేదము దృష్టివిభ్రమములచే భేదింపఁబడును. ఆవేదభాగములు బ్రాహ్మణ విన్యాసములచేతను, స్వరక్రమ విపర్యాసములచేతను, ఆమహర్షులచే వెండియుఁ దగ్గింపఁబడును. సామాన్య వికారము నందుటవలనను, అందందు దృష్టిభిన్నములు గలుగుటవలనను, బ్రాహ్మణములు కల్పసూత్రములు భాష్యములు మఱి యితరమార్గములు బయలుదేరును. మఱియు భిన్నభిన్నార్థములుగల జ్ఞానదృష్టి గలవారలచే నంతయుఁ బ్రవర్తింపఁబడును. ముందొకవిధముగాఁ జెప్పఁబడిన యజ్ఞ విధానము వెనువెంటనే రెండువిధానములుగా నేర్పఱుపఁబడును. సామాన్య విపరీతార్థములచే శాస్త్రములన్నియు నాకులము చేయఁబడును. దుష్టయజ్ఞములచేతను, దుష్టాధ్యయనములచేతను, దురాచారములచేతను బ్రాహ్మణులయొక్క పూర్వోక్త దోషములచేఁ బ్రజలకు భయము జనించును.

అని ద్వాపరాంతముననే వేదశాస్త్రములకు విరోధములు గలిగినటులను విపరీతార్థములు గలిగించు వేదాంగములు వైదికాచారవిరుద్ధములయినటులను, అట్టి భిన్న గమనికచే నిటీవలివారికి మతిభ్రమ లలవడుననియుఁ దేల్చి తెలుపుచున్నది. ఇందులచే ఋషిమతములు వేఱువేఱుగమనిక గలిగినటుల విస్పష్టమగుచున్నది. ఇట్లె వాయు పురాణమునందునుఁ గానఁబడుచున్నది. అందునఁగూడ:—

శ్లో॥ తేషాం విపర్యయశ్చైవభవంతి ద్వాపరేపునః
అవృష్టిర్మరణంచైవ తథైవవ్యాధ్యుపద్రవాః॥
వాఙ్మనఃకర్మజైర్దుః ఖైర్నిర్వేదోజాయతేపునః
ఉత్పద్యంతేహిశాస్త్రాణాం ద్వాపరే పరిపంథినః॥
ఆయుర్వేదవికల్పాశ్చ అంగానాం జ్యోతిషస్యచ
అర్థశాస్త్రవికల్పాశ్చ హేతుశాస్త్ర వికల్పనమ్॥
స్మృతిశాస్త్రప్రభేదాశ్చ ప్రస్థానాని పృథక్ పృథక్
ద్వాపరేష్వభివర్తంతే మతిభేదా స్తథానృణామ్॥

వేదములకు, శాస్త్రములకు, ఆచారములకు భేదములుగలుగుటవలన వర్షము లేకపోవుట, మరణములు వ్యాధులు వాఙ్మనః కర్మలవలనబుట్టిన దుఃఖములు, నిరాశ మున్నగునవి పుట్టును. శాస్త్రములకు విరోధములు పుట్టఁబడును. మఱియు వైద్య శాస్త్రములు, వేదాంగములు, జ్యోతిశ్శాస్త్రములు, అర్థశాస్త్రము, స్మృతులు,

శాస్త్రములు, ప్రస్థానములు, నెల్లయు భేదభేదములు విరోధములుగలిగి ప్రవర్తిల్లును. అందుచే మనుష్యులకు భావభేదము లుత్పత్తిల్లును. అని చెప్పియుండుటచే వేదవాక్యమునకు విరోధముగా మీమాంసాకారుఁడును, ఆ భ్రమచే భాష్యకారుఁడును కాల విపర్యాసముచే వ్రాసినట్లుఁ దోచకమానదు. ఇంతయకాక, స్మృతిమీమాంసా భాష్యాదులు వేదార్థములను స్పష్టీకరించునవియైనను భిన్నార్థము లుత్పన్నములగు నెడల నయ్యవి సమర్థింపఁజాలవు. "శ్రుతిర్లింగం సమాఖ్యాచ వాక్యం ప్రకరణం తథా। పూర్వం పూర్వం బలీయస్యాదితి" అను పారిభాషికవచనమువలన శ్రుతి, సూత్ర, పురాణ, మీమాంసా, భాష్యములలో ననుక్రమముగా నొకటికంటె నొకటి శ్రేష్ఠమగును. అనఁగా భాష్య మన్నిటికంటె శ్రేష్ఠము. భాష్యముకంటె మీమాంస శ్రేష్ఠము. మీమాంసకంటె పురాణము శ్రేష్ఠము. పురాణముకంటెఁ గల్పసూత్రము శ్రేష్ఠము. కల్పసూత్రముకంటె శ్రుతి శ్రేష్ఠము. అని తెలియుచున్నది. ఇద్దానిచేఁ జర్చించితిమేని భాష్యకారోక్తియగు "రథకారస్య సంకీర్ణజాతీయస్య" అను వాక్యమును, ఆభాష్యకారునకు భ్రమకల్పించిన "రూఢేర్వర్ణాంతరంప్రాప్య" యను మీమాంసా వాక్యమును, ఆమీమాంసాకారునకు భ్రమసూచించిన "మాహిష్యేణ కరణ్యాంతు రథకారః ప్రజాయతే" అను యాజ్ఞవల్క్యస్మృతివాక్యమును నిరసించుటకు నధికారముగల "రథకారస్త్రైవర్ణికఏవ" అను నాపస్తంబసూత్రవాక్యము రథకారుఁడు త్రైవర్ణికుఁడేయని యుద్బోధించుచున్నది.

శ్రుతిసూత్రములకంటె మీమాంస బలహీనము.

శ్లో॥ అష్టాదశసువిద్యాసు మీమాంసాఽతిగరీయసీ
తతోఽపితర్కశాస్త్రాణి పురాణంతేభ్యఏవచ॥
తతోఽపిధర్మశాస్త్రాణి తేభ్యోగుర్వీ శ్రుతిర్ద్విజ
తతోఽప్యుపనిషచ్ఛ్రేష్ఠా గాయత్రీచ తతోఽధికా॥

కాశీఖండము.

పదునెనిమిది విద్యలయందు మీమాంసాశాస్త్రము శ్రేష్ఠమయినది. దానికంటెఁ దర్కశాస్త్రములు వానికంటెఁ బురాణములు బురాణములకంటె ధర్మశాస్త్రములు, ధర్మశాస్త్రములకంటె శ్రుతులు బలిష్ఠమైనవి. శ్రుతికంటె నుపనిషత్తు, ఉపనిషత్తుకంటె గాయత్రియుఁ బ్రబలతరములు. అని చెప్పియుండుటచే మీమాంసా శాస్త్రమునకంటె నెన్నిరెట్లో శ్రుతిసూత్రములు బలవత్తరములని తోఁచక

మానదు. ఇదియగాక మీమాంసాదర్శనము రచించినది జైమినిఋషి. యష్టాదశ
పురాణములను రచించిన వేదవ్యాసులశిష్యుఁడు. వేదవ్యాసులచే రచింపఁబడిన
స్కాంద, వాయు, పురాణములలో రథకారులకు ఋషివంశము, బ్రాహ్మణత్వము
నిర్ధారణ మొనర్పఁబడియున్నది. గురువాక్యముఁగూడ నిరసించి "రూఢేర్వర్ణాంతరః
ప్రాప్యతస్య వర్ష ర్తుమిష్యతే॥ యని క్లిష్టవాక్యమును సంధించివిడిచెను. అర్వాచీనమై
వికల్పితమైన మీమాంసాశాస్త్రమునకంటెఁ గల్పారంభమునం దుత్పన్నుఁడై యతి
ప్రాచీనుఁడైన యాపస్తంబమహర్షి యొక్క "వర్షారథకారస్య త్రియాణాం వర్ణానా
మేతత్కర్మ కుర్యుస్తేషామేషకాలః" వర్షాకాలమురథకారునకాధానకాలనియమితము.
త్రైవర్ణికులలో నెవ్వఁడీరథకర్మచేయునో వానికే యీకాలము నియమింపఁబడినది.
అను వాక్యమెంత ప్రబలప్రమాణమో యోజింపఁదగియున్నది. "వేదార్థాన్నిరుక్త
వ్యాకరణాది శ్రవణే నాధిగచ్ఛేత్" అను మితాక్షరీవచనమువలన వేదమునకు నిశ్చ
యార్థము నిర్ణయించునపుడు నిరుక్తము వ్యాకరణము. ఆదిశబ్దమువలన కల్పసూత్రము.
మీమాంసమున్నగువాని సహాయముఁ బొందవలెనని తెలియుచున్నది. సామాన్యతః
పండితులగువారు వ్యాకరణ మీమాంసాది శాస్త్రముల నభ్యసించియె వానిసహాయ
మునుఁ గైకొనియె వేదార్థముల నిష్పన్నములొనర్చెదరు. మఱియు "సర్వంతుసమ
వేక్ష్యేదం నిఖిలంజ్ఞానచక్షుషా। శ్రుతిప్రామాణ్యతోవిద్వాన్ త్స్వధర్మేనివిశేతవై"
అను మనుస్మృతి ద్వితీయాధ్యాయ వచనమును స్మరించుచు శ్రుతిప్రామాణ్యబుద్ధితో
ధర్మనిశ్చయ మొనర్పవలెను గాని శ్రుతి వ్యతిరేకము నొనర్పఁగూడదు.

## సూత్రగ్రంథ ప్రాబల్యము.

స్మృతులకంటె సూత్రగ్రంథములు ప్రబలతరములు. వేదాంగములవలె సూత్ర
గ్రంథముల మన్నించెదరు. "శాస్త్రాదిసూచనాగ్రంథే సూత్రమ్" అను మేదినీకోశ
వచనమువలన మనుయాజ్ఞవల్క్యాది స్మృతులకు మూలగ్రంథములు ఆపస్తంబ, ఆశ్వ
లాయనకల్పసూత్రములని తెలియుచున్నవి. మఱియు విద్యాభూషణమునందలి,
"స్మృతయశ్చపురాణాని సూత్రాణ్యపితతోమతా । న్యపిచాధునికైర్మర్త్యైర్వ్యాఖ్యాతా
న్యంతతఃపరమ్" అను వచనమువలన స్మృతిపురాణములకంటె సూత్రములే మాన్య
ములని విస్పష్టపడుచున్నది.

## యాజ్ఞవల్క్యస్మృతికి విజ్ఞానేశ్వరుని యసంగత వ్యాఖ్యానము.

మునుమున్న యాజ్ఞవల్క్యముని తన ధర్మశాస్త్రమునందు "బ్రహ్మక్షత్రియ
విట్శూద్రావర్ణాస్త్వాద్యాస్త్రయోద్విజాః । నిషేకాదిశ్మశానాంతాః తేషాంవై మంత్ర

తఃక్రియాః” అను వచనముచే బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు శూద్రులు అను నాలుగు కులములు. వారిలో మొదటిముగ్వురు (బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు) మాత్రము ద్విజులు. వారలకే (ఆ ద్విజులకే) గర్భాధానము మొదలు శ్మశానకర్మ వరకుఁజేయు క్రియలన్నియు వేదోక్తమంత్రములతోడనే చేయవలయును. అని వర్ణత్రియమువారికే వేదోక్తమంత్రానుష్ఠానము నియమించెను. ఈస్మృతివాక్యములకు మూలకారణమగు యజుర్బ్రాహ్మణమో “భృగూణాంత్వా”యని బ్రాహ్మణులకు “వరుణస్యత్వా” “ఇంద్రస్యత్వా” యని రాజరాజన్యులకును, “మనోస్త్వా” యని వైశ్యులకును, “ఋభూణాంత్వా” యని రథకారులకు నాధానాధికారము నియమించెను. ఆపస్తంబశ్రుతియు “వర్ణత్రియాణాం వర్ణానామంతర్భూతస్య రథకారస్య” వర్ణత్రియమువారికే యాగాధికారము కలిగినట్లుఁ జెప్పుచున్నది. ఇట్టియనుకూల పరిస్థితులనన్నిఁటిని దూరపరచి “మాహిష్యేణ కరణ్యాంతు రథకారః ప్రజాయతే” అని రథకారజాతియొకటి కన్పట్టినమాత్రమున వేదవచన మీరథకారునకే యాధాన కార్యము నిశ్చయించినదని విజ్ఞానేశ్వరుఁడు అసంగత వ్యాఖ్యానముచేసెను. ఆవ్యాఖ్యానమునందే, “ఏవంబ్రాహ్మణక్షత్రియోత్పన్న మూర్ధావసిక్తమాహిష్యా ద్యను లోమసంకరజాత్యంతరాణా ముపనయనప్రాప్తిశ్చ వేదితవ్యా తయోర్ద్విజత్వాత్” అని బ్రాహ్మణ క్షత్రియులకుఁ బుట్టిన మూర్ధావసిక్తమాహిష్యాదులగు సంకర జాత్యంతరుల కుపనయనముకలదనియు వారు ద్విజులగుదురనియు వివరించెను. కాని కలదని వేదవచనమేదియు నిర్ణయింపఁజాలకపోయెను. వేదవచనము లేకపోయినను సంకీర్ణసంకరజాతియగు (క్షత్రియునిచే వైశ్యస్త్రీవలనఁగలిగినవాఁడు మాహిష్యుఁడు, వైశ్యునిచే శూద్రస్త్రీవలనఁగలిగినది కరణి, వీరిరువురివలనఁగలిగినది) రథకారజాతికి యజ్ఞాధికారము కలిగినప్పుడు ఆజాతి కుత్పాదకారణమగు మాహిష్యకరణుల కుపనయనాధికారము లభింపఁజేసెను. ఇంతయకాక “సంకీర్ణసంకరజాతాశ్చ రథకార నిదర్శనేన దర్శితాః” అని రథకారులు సంకీర్ణసంకరజాతివారని విస్పష్టపరచెను. కాని “తేషాంవై మంత్రితఃక్రియాః” అనిచెప్పిన మూలకర్తృవచనమును గప్పిపుచ్చెను.

## ఆపస్తంబ యాజ్ఞవల్క్యమనువుల యేకాభిప్రాయము.

యాజ్ఞవల్క్యుని యభిప్రాయమునట్లుంచి మనువునాశయముఁగనుగొందము. యద్వైవ హవాహభేషజం తన్మనురబ్రవీత్” అను ఛాందోగ్యోప నిషద్వాక్యమువలనను, “వేదార్థోపనిబంధత్వా త్ప్రాధాన్యంహి మనోస్స్మృతం । మన్వర్థవిపరీతాతు యాస్మృతిస్సానశస్యతే॥ తావచ్ఛాస్త్రాణిశోభంతే తర్కవ్యాకరణానిచ । ధర్మార్థమో

క్షోపదేష్టా మనుర్వ్యానన్నభాషతే॥ అనుబృహస్పతి వచనమువలనను, వేదార్థమననుస రించి సర్వధర్మశాస్త్రములకు ముఖ్యమగునదియె మనుస్మృతి. అట్టిమనుస్మృతికి విరుద్ధములయిన యన్యస్మృతివాక్యములు ప్రసిద్ధములుగావు. ధర్మార్థమోక్షోపదేష్టయగు మనువెంతవఱకు సంభాషించునో యంతవఱకె తర్క-వ్యాకరణ మీమాంసాదులు ప్రకాశించును. అని తెలియనచ్చుటచే మనుస్మృతి ప్రాసిద్ధ్యము వేదార్థానుసరణము తెలియుచున్నది. అట్టి మనుస్మృతియందు జాతివివక్షతనుజేయుచు సవిస్తరణముగా సంకీర్ణసంకరజాతులను వివరించునెడల "హీనాహీనాన్ప్రసూయన్తే వర్ణాః పంచదశైవతత్" అను వచనముచే మూర్ధాభిషిక్తాదికరణ్యాంతమునరకు హీనసంజ్ఞకులనియు హీనులవలనఁ బదునైదుజాతులు హీనాహీనులను సంజ్ఞచే జనించిరనియు వారెల్లరు శూద్రధర్మముచే నడువవలయుననియు వివరించెను. కారణమేమన:—

మనుస్మృతి దశమాధ్యాయమునందె "సజాతిజానన్తరజాః షట్సుతాద్విజధర్మిణః । శూద్రాణాంతు సధర్మాణః సర్వేపధ్వంసజాః స్మృతాః॥" సజాతియందుఁ బుట్టినవారును, ఆత్రైవర్ణికులకుఁ దరువాతి జాతియందుఁ బుట్టినవారు నీయార్గురు ద్విజధర్మముగలవారలగుదురు. అనఁగా నుపనయనము చేయఁదగినవారలగుదురు. ఎల్ల యపధ్వంసజులు (సంకీర్ణసంకరులు ప్రతిలోమజులు) శూద్రధర్మము ననుష్ఠించువారలగుదురు. ఇట్లనుటచే బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు సజాతీయ వివాహిత స్త్రీలయందుఁబుట్టిన మువ్వురును, అనంతరజులగు ననులోమవివాహిత స్త్రీలయందుఁ బుట్టిన మూర్ధాభిషిక్తుఁడు, అంబష్ఠుఁడు, మాహిష్యుఁడు నను మువ్వురును ద్విజధర్మము (ఉపనయనాధికారము) గలవారలగుదురు. అనులోమసంకరులు ప్రతిలోమజులు నగు సూత, వైదేహక, మాగధ, క్షత్ర రథకారాదు లుపనయనాధికారము గలుగనివారలగుదురు. కారణము వీరు ప్రతిలోమజులు ననులోమానంతరజులు నగు సంకీర్ణసంకరులు నగుటవలననే, ముఖ్యస్మృతులయందెక్కడఁ జూచినను సజాతీయానంతర జాతీయులగు ననులోమజులవఱకె ద్విజత్వారోపణము చేసినటులఁ గానిపించుచున్నది. కాని యనులోమజులె సంకీర్ణులు అట్టి సంకీర్ణజాతికి సాంకర్యముగాఁ బుట్టిన సంకీర్ణసంకరజాతికి ద్విజత్వముండినటుల వచనమెక్కడను గానిపించదు. వెండియు నందువలననే "శూద్రజాతత్వేన జాతివైగుణ్యాదనుపనేయాః । ఉత్తరేప్రతిలోమశ్చ" అని శూద్రజాతియగుటవలనను జాతివైగుణ్యమగుటవలనను రథకారాదు లనుపనేయులగుట తెలియుచున్నది. పూర్వోక్త మనుస్మృతిశ్లోకమునకు కుల్లూకభట్టు తన వ్యాఖ్యానమున "తాననంతరజాన్త్వితి యదుక్తం తత్తజ్జాతివ్యపదేశార్థం । సంస్కారార్థమితికస్యచిద్భ్రమస్యాదితి" శంఖాదులగు నన్యస్మృతికర్తలు సంకీర్ణులగు నను

లోమానంతరజులకు ద్విజధర్మముకలదని చెప్పిరి. అది వారిని మోసపుచ్చుటకాని వేఱుకాదు. ఉపనయనాది సంస్కారములు మాత్రి మాయనులోమానంతరజులకుఁ గానిపించవు. సంస్కారములుగలవనిచెప్పుట వారి భ్రాంతివలననే. అని వ్రాసెను. అందువలస మనుస్మృతికి నితరస్మృతులకు భేదాభిప్రాయములేదు. బృహజ్జాతి వివేకముగూడ "మాహిష్యేణకరణ్యాంతురథకారః ప్రజాయతే । నైవోపనయనం తస్య శూద్రధర్మార్హహిష్కృతః" అనియె సంకీర్ణరథకారునకు ఉపనయనాధికారము లేదని వాకుచ్చినది.

అగ్నిహోత్రాధికారముగల రథకారులు త్రైవర్ణికులలోని వారలనుటకు మఱి యొక దృష్టాంతము. మనుస్మృతిదశమాధ్యాయమందలి "విద్యాశిల్పం భృతిస్సేవా గోరక్ష్యం విపణిఃకృషిః । ధృతిర్భైక్ష్యం కుసీదంచ దశజీవనహేతవః" అను శ్లోకము వలనఁ ద్రైవర్ణికుల జీవనములలో శిల్పము (దేవబ్రాహ్మణ సంబంధమగునట్టిదియు, యజ్ఞసంబంధమగునట్టిదియు, రాజసంబంధమగునట్టిదియు) విజ్ఞానముగూడ ముఖ్యమని తెలియుటచే దేవయజ్ఞసంబంధశిల్పమొనర్చు రథకారుఁడు త్రైవర్ణికుఁడనియాపస్తంబ సూత్రోక్తిని బలపరచుచున్నది.

ఆపస్తంబ ప్రమాణమునకు మనుస్మృతి ప్రమాణమునకు భేదమంతగాలేదు. యాజ్ఞవల్క్యస్మృతియుగూడఁ జాలవరకు మనుస్మృతి ననుసరించుచున్నది. యాజ్ఞవల్క్యస్మృతియందు "అసత్సంతస్తువిజ్ఞేయాః ప్రతిలోమానులోమజాః॥ జాత్యుత్కర్షం యుగేజ్ఞేయః పంచమేసప్తమేపివా॥కర్మాణాం వ్యత్యయెసామ్యం పూర్వవచ్చాధరోత్తరమ్॥" ప్రతిలోమజులు కనిష్ఠులు, అనులోమజు లుత్తములు, ఆ యనులోమసంకర జాతీయులు అయిదాఱు తరములు సత్ప్రివర్తనగలిగి యనులోమరీతినె జనియించు చుందురేని యుత్తమజాతిత్వమును బొందఁగలరు. అని చెప్పినను సంకీర్ణసంకరులగు రథకారులొక్క జన్మమునకె వేదోక్తయాగాధికారముగలుగుట యెట్లు లభించును? నీచుఁడగు రథకారునికంటె నుత్తములగు అంబష్ఠ, మాహిష్య, ఉగ్ర, కరణాదులకు లేని యజ్ఞాధికారము నీచరథకారున కొసఁగుటకు వేదవచనమెట్లు పొసఁగును?

మఱియు మనుస్మృతి దశమాధ్యాయమునందలి పదియవశ్లోకమందు "విప్రస్య త్రిషువర్ణేషు నృపతేర్వర్ణయోర్ద్వయోః।వైశ్యస్యవర్ణేచేకస్మిన్ షడేతేపశదాః స్మృతాః" బ్రాహ్మణునకుఁదగ్గిన మూఁడుజాతులయందును, క్షత్రియునకుఁ దనకుఁ దగ్గిన రెండు జాతులయందును, వైశ్యునకుఁ దనకుఁ దగ్గిన యొకజాతియందును పుట్టిన యీయార్వు

రును దనజాతిభార్యలయందుఁ బుట్టినవారలకంటె నికృష్టులుగావున అపశదు (నీచు) లని చెప్పఁబడుచున్నారు. అని చెప్పుటచేత ననులోమప్రతిలోమ సంకీర్ణులందఱును నపశదులెయగుచున్నారు. అపశదులనుటచే "వివర్ణః పామరో నీచః ప్రాకృతశ్చ పృథగ్జనః। విహీనోఽపసదో జాల్మః క్షుల్లకశ్చేతరశ్చసః" అను నామలింగానుశాసన శూద్రవర్గోక్తిచే నపశదులన (అపశీయత ఇత్యపశదః) అపకృష్టుఁడై చెడినవాఁడని యర్థమగుచున్నది. "క్షత్రింహిబ్రహ్మసంభవ" మను నారోక్త్యుక్తిచే మూర్ధాభిషిక్తనామకున కొక్కనికే యోగ్యతగలిగినదికాని తదితరులగు ననులోమ ప్రతిలోమ సంకీర్ణ సంకర జాతులందఱు నపశదు (నీచు) లనియె చెప్పఁబడుదురు. ఇంకను నమరకోశాంతమందలి "శూద్రా శ్చావరవర్ణాశ్చ వృషలాశ్చ జఘన్యజాః। ఆచండాలాస్తు సంకీర్ణా అంబష్ఠకరణాదయః" అంబష్ఠుఁడు, ఉగ్రుఁడు, కరణుఁడు, మాగధుఁడు, మాహిష్యుఁడు, క్షత్త, సూతుఁడు, వైదేహకుఁడు, రథకారుఁడు, పారశవుఁడు, చండాలుఁడు మున్నగు వారలందఱు సంకరజాతి శూద్రులనఁబడుదురని యుండుటచేతను యాజ్ఞవల్క్యోక్తి మనూక్తులకు నాపస్తంబసూత్రోక్తిబాధకము గానిపించదు. సంకీర్ణసంకర రథకారునకు "ఋభూణాంత్వా" యను వేదవచన యాగాధికారముకాదనియు విస్పష్టమగుచున్నది.

## అసంగత విజ్ఞానేశ్వర వ్యాఖ్యానము.

రథకారాధికరణవ్యాఖ్యానమున విజ్ఞానేశ్వరవ్యాఖ్యానమునుఁగూర్చి శంకా సమాధానము లీక్రిందివిధమున వ్రాయఁబడినవి.

శంకా. యచ్చోక్తం విజ్ఞానేశ్వరస్మృతి విరోధాద్రథకారాణాం విశ్వకర్మవంశజత్వం నాస్తీతి.

సమాధానమ్. తదసంగతమ్ "వసంతేబ్రాహ్మణ ఆదధీ" తేతివత్. వర్షాసు రథకారోఽగ్ని నాదధీతేతి రథకారస్యా ప్యాధానకాలస్య వేదవిహితత్వాత్ అవాన్తర. వంశజత్వ ప్రతిపాదకవచనానాం శ్రుతివిరుద్ధత్వాత్ ప్రామాణ్యంనాస్తి. తదుక్తమ్ పూర్వమీమాంసాయాం ప్రథమాధ్యాయే ప్రథమపాదే విరోధాధికరణే "విరోధేత్వనపేక్షం స్యాదసతిహ్యనుమాన" మితిశ్రుతిస్మృత్యోః పరస్పర విరోధే నిరపేక్ష శ్రుతీనామేవ ప్రాబల్యమ్. స్మృతీనాం శ్రుతిమూలకతయా ప్రమాణత్వేన శ్రుతిసాపేక్షత్వాత్ శ్రుతివిరోధే ప్రామాణ్యంనాస్తి. అతఏవోక్తమ్. "అప్రామాణ్యం విరుద్ధానా మశక్యార్థవిధానతః। ఔదుంబరీం నశక్నోతిసర్వాం వేష్టయితుం స్పృశేత్, వేష్టితాంవాపి సంస్పృష్టు మతోఽన్యోఽన్య విరోధత" ఇతిఔదుంబరీం స్పృష్ట్వోద్గా

యేదితిప్రత్యక్ష శ్రుతివిరోధాత్. ఔదుంబరీ సర్వావేష్టయితవ్యేతి సర్వావేష్టనాది స్మృతీనాంప్రత్యక్ష శ్రుతివిరుద్ధానామప్రామాణ్యమ్ రాద్ధాన్తితమ్. ఏవమేవ వర్షాసురథకారోగ్నీ నాదధీతేత్యాధాన విధాయకశ్రుతి విరుద్ధానాం రథకారస్య అనులోమప్రతిపాదక విజ్ఞానేశ్వర వచనానా మప్రామాణ్యమేవ.

తా॥ శం. ఓయీ! విజ్ఞానేశ్వరస్మృతి విరోధంబుకావున రథకారులు విశ్వకర్మ వంశజులుకారని వచించిరి.

ఉత్తరము— అదియు నసంగతము. "వసన్తే బ్రాహ్మణఆదధీత" అనునట్లు "వర్షాసు రథకారోగ్నీ నాదధీత" అని రథకారులకు ఆధానకాలము వేదవిహితమయ్యెంగాన నవాన్తరజాతులుగఁ బ్రతిపాదించునట్టి విజ్ఞానేశ్వరాది స్మృతివచనంబులు శ్రుతి విరుద్ధంబులగుటయు నది యప్రమాణమే. ఇది మీమాంసాప్రథమాధ్యాయములో ప్రథమపాదంబునఁ బ్రతిపాదింపఁబడియున్నది. "విరోధే త్వనపేక్షంస్యాదసతిహ్యనుమాన"మని. అనఁగా శ్రుతి స్మృతులకు విరోధంబుగలిగెనేని నిరపేక్షంబయినశ్రుతియె ప్రబలప్రమాణము. స్మృతులు శ్రుతిమూలకంబుగఁ బ్రమాణంబుగాన శ్రుతి సాపేక్షమగుటయు నది శ్రుతివిరోధంబు గల్గునప్పుడు ప్రమాణంబుగాదు. దానంజేసియె మీమాంసావార్తికంబున "అప్రామాణ్యం విరుద్ధానా"మనుచోట ఉదుంబరశాఖను స్పృశించుచు సర్వంబును బరివేష్టింపఁదగదు. సర్వంబును బరివేష్టించిన స్పర్శంబు దగదు. ఇట్లు పరస్పర విరోధంబుగల్గుటయు శ్రుతివచనంబు ప్రబలంబుగాన నిట్టిశ్రుతి విరుద్ధంబులగు స్మృతులు ప్రమాణంబులుగావని వచింపఁ బడినది. "ఔదుంబరీం స్పృష్ట్వోద్గాయేత్" అనఁగా హోతృప్రస్తోతృప్రతిహర్త్రుద్గాతలలో నుద్గాతసామ గానముసేయునప్పుడు ఔదుంబరశాఖను స్పృశించుచు గానంబు సేయవలయుననునట్టి స్మృతియుం గానంబడియెడి. ఈస్మృతిప్రకారమున నౌదుంబరమ్మును సర్వముంబరివేష్టించెనేని స్పర్శించుచుగానము చేయవలయుననెడిశ్రుతివచనము వ్యర్థముగావలయు. కావునఁ బ్రత్యక్ష శ్రుతివిరుద్ధంబులగు స్మృతులు ప్రమాణంబుకాదని స్మృతులకు అప్రామాణ్యంబు సిద్ధంబయినయట్లు "వర్షాసు రథకారోఽగ్నీనాదధీత" అని రథకారులకు ఆధానంబువిధించు శ్రుతివాక్యమునకు విరుద్ధముగా వారలకు అనులోమ వంశజన్యత్వంబును బ్రతిపాదించునట్టి విజ్ఞానేశ్వరాది వచనంబులు అప్రమాణంబులే యగుఁగాని వారలకు అనులోమవంశజన్యత్వంబు గలుగనేరదు.

ఇట్లు వ్యాఖ్యానమొనర్చుటలో శ్రుతిస్మృతులలో శ్రుతులే బలవత్తరములనియు శ్రుతి విరుద్ధములగు స్మృతు లప్రామాణ్యములనియు శ్రుతివిరుద్ధముగాఁ జేసిన విజ్ఞానేశ్వర వ్యాఖ్యాన మసంగతమనియుఁ దేటతెల్లమగుచున్నది.

## నిషాదస్థపతి సామాన్యనర్హాము.

"నిషాదస్థపతిం యాజయేత్" అను శ్రుతివలన ననులోమజుఁడగు నిషాదస్థపతికి యజ్ఞాధికారము కలదు. అట్లె యనులోమ సంకీర్ణుఁడగు రథకారునికి నాధానాధికారము గలుగఁగూడదా యనుశంక గలుగవచ్చును. గాని ఆశంక కీక్రిందిరీతిని సమాధానముఁ జెప్పవచ్చును. శూద్రస్త్రీయందు బ్రాహ్మణునివలనఁ బుట్టిన యనులోమజుఁడు నిషాదుఁడు వానిలో శ్రేష్ఠుఁడు నిషాదస్థపతి. సంకీర్ణరథకారుఁ డనులోమజులకంటె సంకీర్ణసంకరుఁడు. నిషాదస్థపతికిని సంకీర్ణరథకారునకును జాత్యంతరము కలదు. నిషాదస్థపతికి బీజప్రాధాన్యము నంగీకరించిన (బ్రాహ్మణునకు వివాహిత శూద్రస్త్రీవలనఁ బుట్టినవాఁడు గనుక) వ్యాసఋష్య శృంగాదులకువలె ద్విజత్వము గలుగవచ్చును. వైదికరథకారుఁ డట్లుగాక యుత్తమకులీనుఁడై శ్రేష్ఠవర్తనుఁడై విరాజిల్లును. సంకీర్ణరథకారునికంటె నిషాదస్థపతి యుత్తముఁడు గాని వైదికరథకారునికంటె నికృష్టుఁడు.

ఈ విషయములో రథకారాధికరణమున నిట్లు వ్యాఖ్యానమొనర్పఁబడినది. "కించ. "వర్షాసురథకారోఽగ్నీనాదధీతే" తికర్తృత్వశ్రవణాత్, రథకారస్య ఆధానేస్వతఏవ కర్తృత్వం సిధ్యతి. నిషాదస్థపతిం యాజయేదిత్యత్రితు, ద్వితీయ్యాశ్రుత్యా ప్రయోజకో అన్యఏవప్రయోజ్యకర్మత్వమేవ నిషాదస్థపతేః ప్రతీయ్యతే. నతుయజనకర్తృత్వమ్. యాజయేదితిణిజంతశ్రుత్యా అన్యఏవప్రయోజకోలభ్యతే. తస్మాత్, నిషాదస్థపతిన్యాయోఽత్ర నప్రవర్తతే" మఱియు వర్షాకాలంబున రథకారుఁ డాధానంబు సేయవలయునన్నప్పుడు కర్తృత్వంబు శ్రూయమాణంబగుటయు, వానికి స్వయమాధానకర్తృత్వము సిద్ధించుచున్నయది. నిషాదస్థపతినిగూర్చి యాగంబుసేయించవలయునన్నప్పుడు ద్వితీయాశ్రుతిచే ప్రయోజకకర్త వేఱొకండనియుఁ బ్రయోజ్యకర్త నిషాదస్థపతియనియుఁ బ్రతీయమానంబగుచున్నది. కావున నిషాదస్థపతికి స్వయమాధానంబు సంభవించదు. "యాజయేత్" అన యజ్ఞముసేయించవలయును. అని ణిజంతక్రియాపదంబుచే అన్యుఁడే ప్రయోజకకర్తగ లభించుచున్నాఁడు. కావున నిషాదస్థపతి న్యాయ మీరథకారునకుఁ బ్రవర్తింపదు. అని నిషాదస్థపతికి రథకారునకు భేదము వివక్షించెను.

రథకారుఁ డార్య (బ్రాహ్మణు) డు; నిషాదస్థపతి యనార్య (సంకీర్ణు) డు హిరణ్యకేశి సూత్రమునందలి, "నిషాదరథకారయోరాధానా దగ్నిహోత్రం దర్శపూర్ణమాసౌచ నియమ్యతే" అను వాక్యమునకు వైజయంతీవ్యాఖ్య:—వర్షాసురథ

కారోగ్నీ నాదధీతేతి తథాబుభూణాంత్వా దేవానాం వ్రతపతే వ్రతేనాదధామీతి రథకారస్యేతిచ దర్శనా దాధానం రథకారజాతేః, ఆధానోత్పన్నాగ్నీనాం పరార్థత్వా దగ్నిహోత్రదర్శపూర్ణమాసౌనియమ స్తథాచైతయా నిషాదస్థపతిం యాజయేదితి॥ నిషాదశ్చా సౌస్థపతిశ్చేతి, కర్మధారయాభిప్రాయేణ నిషాదఇత్యుక్తంతేన ఆప స్తంబ సూత్రే నిషాదానాం స్థపతి స్త్రైవర్ణికఏవేతి. తన్నిరాకృత మేతన్న్యాయశాస్త్రప్రసిద్ధమ్. తస్యేష్టివిధానా దాధానమాచార్యోమన్యతే. ఏకస్యాధానమాత్రంనియతం । పరస్య వికృతేష్ట్యుపక్షేప్రమాధానం, ద్వయోరప్యగ్నిహోత్రం దర్శపూర్ణమాసౌచ నియమ్యేతే, న్యాయమతేన నిషాదస్యాధానం తస్యలౌకికాగ్నిషు. వికృతేష్టిమాత్ర మవకీర్ణినోబ్రహ్మచారిణ ఇవగర్దభస్యేతి.

"వర్షా;, బుభూ" అను శ్రుతివలన రథకారనామక బ్రాహ్మణులకు ఆధానము విధించియున్నది. ఆవాక్యము జాతివిశిష్టమైన సముదాయమున కర్థమిచ్చుచున్నది. ఆధానోత్పన్నమైన యగ్నులు పరార్థత్వము (వాజపేయాదియజ్ఞాధికారము) గలుగుటవలన అగ్నిహోత్రదర్శపూర్ణమాసేష్టులు మున్నగు సర్వకర్మలారథకారునకుఁ జేయఁదగియున్నవి. ఆప్రమాణవాక్యమునందె "నిషాదస్థపతిం యాజయేత్" అను శ్రుతివాక్య ముదాహరించి "నిషాదశ్చా సౌస్థపతిశ్చ" నిషాదుఁడైన స్థపతిస్వామియని కర్మధారయసమాసముచే నాస్థపతి నిషాదుఁడెయని నిర్ధారణమొనర్చిరి. కాని యాప స్తంబశ్రౌతసూత్రమునందు "నిషాదానాం స్థపతిః" నిషాదులయొక్క స్థపతి (రాజు) నిషాదస్థపతియని తత్పురుష సమాసమునఁ త్రైవర్ణికుఁడుగాఁ జెప్పఁబడినది. అయ్యది న్యాయశాస్త్రముచే నిరాకరింపఁబడినది. ఆ రథకారునియొక్క యిష్టివిధానమువలన నాధానమాచార్యునిచే మన్నింపఁబడుచున్నది. మొదటఁ జెప్పిన నిషాదునకాధానమాత్రము నియమింపఁబడెను. రెండవవాఁడగు రథకారునికి వికృతేష్టులొనర్చ నిలుపఁబడినది. కాని యుభయులకును నగ్నిహోత్రము దర్శపూర్ణమాసేష్టులు నియమింపఁబడినవి. న్యాయమతముచే నిషాదునకు (వేదోక్తములుగాని) లౌకికాగ్నులయం దాధానముఁ జేయింపవలెను. రథకారునకు నియమితమైన వికృతేష్టిమాత్రము అవకీర్ణులగు బ్రహ్మచారులకు గర్దభేష్టివలె నియమింపఁబడెను.

ఇట్టి తాత్పర్యముగల వైజయంతీవ్యాఖ్యచే రథకారనిషాదస్థపతులయొక్క భేదము స్పష్టీకృతమగుచున్నది. ఇందాప స్తంబుని యభిప్రాయ మొకవిధముగాఁబోయినది. నిషాదస్థపతికి యాగాధికారముకలదని శ్రుతిపలుకుచున్నది "శూద్రాయాం బ్రాహ్మణాజ్జాతః శ్రేయసాచేత్ప్రజాయతే" అను మనూక్తికి వైయర్థ్యమాపాదించు

నేమోయని సందేహము. శూద్రజాతీయనిషాదునకు యజ్ఞాధికారమున్నదనినయెడల "స్త్రీ శూద్రానాధీయాతామ్" అను ప్రత్యక్షశ్రుతికి అనాదరము కలుగుచున్నది. కావున నీయపవాదనిరాకరణమునకు "నిషాదానాంస్థపతిః" నిషాదులయొక్క స్థపతి యని తత్పురుషసమాసమొనర్చి బ్రాహ్మణోద్వాహిత శూద్రస్త్రీవలనఁ గలిగిన నిషాదునకు లౌకికాపవాదము తొలఁగునటులను "పూర్వం పూర్వంబలీయంస్యాత్" అను పరిభాషావచనము వ్యర్థముగానటులను నైయ్యాయికునికంటెఁ బూర్వుఁడగునాపస్తంబ ఋషినిషాదస్థపతి త్రైవర్ణికుఁడుగా నిర్ణయించెను. నైయ్యాయికమతమందులకు వ్యతిరేకమయ్యెను. నిషాదుఁడైనస్థపతి నిషాదస్థపతియను కర్మధారయసమాసము స్థిరపరచి నిషాదస్థపతి సంకీర్ణుఁడగు ననార్యుఁడనుటకుదాహరణముగా లౌకికాగ్నులయందాధాన మాత్రమే చేయఁదగినవాడని విశదపఱచెను. రథకారుఁడో వైదికకర్మానలంబుఁడు నార్యవంశ్యుఁడునయ్యెను. అందుల కుదాహరణము భృగ్వంగిరోదేవతాత్మకమగు ప్రకృతేష్టి నిర్వర్తించుచు రథాదిశిల్పకర్మ సంబంధమగు ఋభుదేవతాత్మకమైన వికృతేష్టి నెఱవేర్చువాఁడు రథకారుఁడగుటయే. త్రైవర్ణికులకు "భృగూణామ్" అను మొదలగు మూఁడుమంత్రములు ప్రకృతులు. (సాధారణములు) వారికె రథకరణాదికార్యములొనర్చినపుడు "ఋభూణామ్" అనునవి వికృతులు. (విశేషములు) నిషాదస్థపతి లౌకికాగ్నియందు హోమముసేయించువాఁడు. రథకారుఁడు శ్రౌతాగ్నియందు స్వయముగా హోమముసేయువాఁడు. కావుననే నిషాదస్థపతి యనార్యుఁడును రథకారుఁ డార్యుఁడు నయ్యెను. అవకీర్ణిబ్రహ్మచారియొక్క గర్దభేష్టిని విచారించుదము.

ఆపస్తంబ ధర్మసూత్రమునందు,

గర్దభేనావకీర్ణీ నిఋృతిం పాకయజ్ఞేన యజేత్॥
(కామతో రేతసస్సేకం వ్రతస్థస్య ద్విజన్మనః
అతిక్రమవ్రతస్యాహుర్ధర్మజ్ఞా బ్రహ్మవాదినః॥
మారుతం పురుహూతంచ గురుం పావకమేనచ
చతురోవ్రతినోభ్యేతిబ్రాహ్మం తేజోవకీర్ణినః॥
తేభ్యోలబ్ధేనమోక్షేణ వర్తయేన్నేక కారికమ్
ఉపస్పృశంస్త్రిషవణం త్వబ్దేన సవిశుధ్యతి॥)

వేదాధ్యయనముఁ జేయుచున్న బ్రాహ్మణుఁడగు బ్రహ్మచారి స్త్రీవాంఛకు లోఁగి రేతస్సేకమొనర్చువాఁడ వకీర్ణియని పేరుగాంచును. అనఁగా భ్రష్టుఁడగును.

వేదాభ్యాసమొనర్చువాని బ్రహ్మతేజమును మారుతుఁడు, ఇంద్రుఁడు, బృహస్పతి, అగ్నియు హరింతురు. ఈమరుదింద్రబృహస్పత్యగ్నులకు నాహుతులొసఁగెనేని ఆయ వకీర్ణి యొకసంవత్సరములో శుద్ధుఁడగును. ఈయాహుతులు గర్దభేష్టియగు నిఋ్రుతియజనమున హోమము సేయవలెను. అతఁడీ వత్సరకాలము భైక్ష్యము త్రిషవణ స్నానములకు సేయుచుండవలెను.

ఈపై ని హిరణ్యకేశి సూత్రవ్యాఖ్యాతవ్రాసిన వ్యాఖ్యాన పంక్తులలో రథ కారుఁడు "ఋభూణామ్" అను వికృతేష్టిచేయుట యవకీర్ణియగు బ్రహ్మచారి తన తేజోపహరణమునకుఁజేయు ప్రాయశ్చిత్తమైన గర్దభేష్టివంటిదని వ్రాసెను. బ్రాహ్మణుఁడగు బ్రహ్మచారి తన తేజస్ఖలనమునకుఁజేసికొను ప్రాయశ్చిత్తమువలెనే బ్రాహ్మణుఁడగు రథకారుఁడు రథాదిశిల్పకర్మలచేఁ దేజోవిహీనతఁ గైకొని యందులకుఁ బ్రాయశ్చిత్తము ఋభ్వాధానమొనర్చి పరిశుద్ధుఁడగుచున్నాఁడు. నిషాదునకట్టి యధికారము లేకుంటచేతనే లౌకికాగ్నులయందు యజ్ఞమితరులచేఁ జేయించుచున్నాఁడు. నిషాదునకు వృత్తినిగూర్చి విచారించెదమేని,

ద్విజశుశ్రూషా ధనధాన్యాధ్యక్షతా రాజసే
వాంతఃపురరక్షాచ పారశవోగ్రకరణానామ్॥

మన్వర్థముక్తావలిః.

పారశవులనగా నిషాదులు వారికి వృత్తి ద్విజ శుశ్రూషాదులని చెప్పియుండుటచే నిషాదవృత్తి ద్విజసేవయనియె తెలియుచున్నది. హీనకులోత్పన్నుఁడగు నిషాదునకును మహాకులోత్పన్నుఁడగు రథకారునకు నెంతభేదమో కనుఁగొనినవారికి నిషాదస్థపతికి రథకారునకును సామ్యమగునని యూహజనింపదు.

రథకారుఁడు మహాకులోత్పన్నుఁడగు బ్రాహ్మణుఁడే.

వైజయంతీ వ్యాఖ్యానకర్త రథకారుఁడు బ్రాహ్మణుఁడని క్లిష్టముగా వివరించెనుగాని రథకారుఁడు మహాకులోత్పన్నుఁడనుటకు నిదర్శనములున్నవాయని ప్రశ్నించెదరేని యున్నవని సమాధానముఁ జెప్పవచ్చును. విశ్వామిత్రాది రాజర్షులవంశమందు జనియించినవారును, ఋష్యశృంగాది తిర్యగ్యోనిప్రసూతులగు మహర్షుల వంశమందుజనియించినవారును బ్రాహ్మణులని ప్రసిద్ధివడయుట లోకవిశదమే. వీరిలో రాజబీజులు కొందఱు రాజవంశీయులు కొందఱు, బీజ్యులగు కులసంభవులు కొందఱు నగుదురు. అట్లుకాక త్వష్ట, భృగ్వాంగిరాది బ్రహ్మర్షిగోత్రోద్భవుఁడు బ్రాహ్మణుఁ

డనియు మహాకులోద్భవుఁడనియు సుప్రసిద్ధిఁ బొందెను. ఆ త్వష్ట్ర విశ్వకర్మజులె రథకారులగుటవలన వారల మహాకులురని చెప్పక తప్పదు. త్వష్టమహాకులుఁ డయి నటులః—

శ్రుతిః॥ ననాందిమచమసంయో మహాకులో గ్నే భ్రాతర్ద్రుణఇద్భూతి మూదిమ॥

ఋగ్వేద అ ౨. ౨. ౨౮. ౧

భాష్యమ్॥ హేఅగ్నే భ్రాతః భ్రాతృవద్భాగార్హః భ్రాతాయథాబలాత్ స్వీయభాగం స్వీకరోతి తద్వత్ సమానరూపమాశ్రిత్య బలాచ్చమసపానాయప్రవృత్తఇతి భ్రాతరిత్యుక్తమ్, హేతాదృశాగ్నే చమసంననాందిమ । అధికః సమాగతఇతిపానమకృత్వా । చమసంనదూషయామః । ణిదికుత్సాయామ్ । ఛందసివేత్తివక్తవ్యమితిద్విపచనాభావః । అదూష్యత్వే కారణమాహ । యచ్చమసో మహాకులః మహాకులోత్పన్నః త్వష్ట్రానిర్మితత్వాత్ । వక్ష్యతిచత్వష్టాగ్న స్వంతర్న్యానజఇతి । అతఃకారణాత్ ద్రూణో వికారే ప్రకృతిశబ్దః । తతశ్చతస్యైతచ్ఛందః । ఇచ్ఛబ్దో ఽవధారణే । దారు వికారచమసస్యభూతిం ప్రాప్తిం మూదిమబ్రూమః । విదేశ్ఛందసేవిటివాచిస్వపీతి సంప్రసారణమ్ । క్రాదినియమాది ॥ఇతి॥

తా॥ భ్రాతయగు నోయగ్నీ! ఇక్కడ భ్రాత యెట్లు బలాత్కారముగా స్వకీయభాగమును స్వీకరించుచున్నాఁడో యట్లు సమానరూపమునుబొంది బలాత్కారముగాఁ జమసపానముకొఱకు బ్రవర్తింపఁబడునని భ్రాతయని చెప్పఁబడెను. అట్టి యోయగ్నీ! అధికముగావచ్చినదని పానముచేయక చమసమును నిందింపము. ఏలనః—ఆచమసపాత్రిమహాకులునివలన నుత్పన్నమయినది. (మహాకులుఁడగు త్వష్ట్రవిశ్వకర్మచే నిర్మింపఁబడుటవలన శ్రేష్ఠమయినది.) అని దారువుతోఁ జేయబడిన చమసపాత్రియొక్క గొప్పతనమును జెప్పుచున్నాము.

ఇటుల నుడువఁబడుటచే రథకారబ్రాహ్మణుని యుత్తమ కులీనత దెలియుచున్నది.

రథకారబ్రాహ్మణులకు అవకీర్ణిసమానదోషములేదు.

హిరణ్యకేశిసూత్రమునందు మహాకులరథకారునికి సంకీర్ణనిషాదునకు నొక్కచోటు ననె నిర్వర్ణించి విభజించినను, రథకారనిషాదులకు భేదస్థానములె నిర్ణీతములయినవి. అనగా రథకారునకు సమంత్రకముగ శ్రౌతాగ్నిగుణకముగను, నిషాదునకునమంత్రక

ముగ లౌకికాగ్నిగుణకముగను విభజింపఁబడినది. కాని శిల్పకర్మోపజీవికులగు రథకార బ్రాహ్మణులకు "అవకీర్ణినో బ్రహ్మచారిణఇవ" అని వైజయంతీవ్యాఖ్యాత. ప్రత్యక్షా వకీర్ణికినలెఁ బ్రాయశ్చిత్తము ఈవిశ్వకర్మేష్టియని కొంతవక్కాణించెను. గాని యీయాయభి ప్రాయము సూత్రకారునికి బొత్తుగాఁ గానిపించదు. వ్యాఖ్యాతమాత్రమొకవిధముగా సూచించెను. అవకీర్ణి ప్రాయశ్చిత్తవిశేషము వ్యక్తివాచకమైయున్నది. మహాకుల రథకారునకో జాతివాచకమనుటకు నిస్సందేహము. జాతివాచకమునకిట్టి ప్రాయ శ్చిత్తము దుర్లభము. వానిలో బ్రాహ్మణజాతికిఁ బ్రాణాయామాది బ్రహ్మకర్మా చరణవలన నిత్యప్రాయశ్చిత్తములు జరుగుచునేయుండును. మఱియు "తేషాం తేజోవిశేషత్వా త్ప్రత్యవాయోన విద్యతే" అను నాపస్తంబసూత్రోక్తివలన నెల్ల వారిలో బ్రాహ్మణజాతి విశేషతేజస్వియగుటవలన నుపజీవికలగు సామాన్యవృత్తు లలోఁ బ్రాయశ్చిత్తము పొసఁగనేరదు. ఇంక వేదోక్తకర్మావశ్యకములును లోకోప కారహేతుకములు నగు పావనరథకారకార్యములకుఁ బ్రాయశ్చిత్తములేల యుదితము లగును? మఱియు మనుస్మృతి నవమాధ్యాయమునందు:—

శ్లో॥ శ్మశానేష్వపి తేజస్వీపావకో నైవ దూష్యతి
హూయమానశ్చ యజ్ఞేషుభూయ ఏవాభివర్ధతే॥
ఏవం యద్యప్యనిష్టేషువర్తతే సర్వకర్మసు
సర్వథాబ్రాహ్మణాః పూజ్యాః పరమందైవతంహితత్॥

అగ్ని సర్వభక్షకమగుటవలనఁ బవిత్రమగుచున్నది. అయ్యది శ్మశానములందు నుండుచున్నను దోషముగనిపించదు. అట్టియగ్నియె హోమముచేయఁబడి తిరిగివృద్ధి పొందుచునేయున్నది. సర్వకర్మలయందుఁ బూజ్యమగునగ్నివలె బ్రాహ్మణుఁడు సర్వ విధములఁ బూజ్యుఁడుగనున్నాఁడు. అని చెప్పియుండుటచేతను బ్రాహ్మణునకుపజీవ వృత్తిచేఁ బ్రత్యవాయముగలుగనేరదు. వానిలో నీరథకారమహాశిల్పము సాక్షాత్పర మేశ్వరునివలన ననుగ్రహింపఁబడుటచేఁ బుణ్యాలబ్ధిలభించునుగాని పాపలబ్ధిలభించుట కెట్లుతోఁపగలుగును. ఇఁకరథకారుఁడాధానమునందు "ఋభూణాం" అనుమంత్ర ముచేఁ జేయునది విశ్వకర్మేష్టిశిల్పకర్మలకుఁ బ్రోత్సాహజనకము. పుత్రకామేష్టిముఖ్య ములగునిష్టులిట్లె ప్రవర్తింపఁబడును. పుత్రకామేష్టిప్రముఖములగు నిష్టులయందెట్లు యజమానులు పుత్రకాములై హవిస్సులహోమములు చేయుదురో, యట్లె రథకార బ్రాహ్మణులు రథకార్యకాములై రథాద్యుపకరణరచనయందు మేధాసంపత్కా

ములై లోకోపకారేచ్ఛాపరతంత్రులై బుభ్వాధానేష్టులనొనర్చెదరు. గాని ప్రత్యవాయముకొఱకుఁగాదు.

రథకారాధానము; బ్రాహ్మణవిశేషత్వబోధకము. రథకారుఁడు బ్రాహ్మణాంతర్భూతుఁడనుటకు నీక్రిందివిధముగను దెలిసికొనవచ్చును.

సూ॥ తత్కారితత్వాద్బ్రాహ్మణ రాజన్యయోర్వైశ్యస్యచ వేదాధ్యయనంలన్నియతమ్.

హిరణ్యకేశిసూత్రము.

వైజయంతీవ్యాఖ్యా॥ ఉపనయనం వసంతాదికాలేషు త్రైవర్ణికానామేవ అతస్తైర్వినాభూతమధ్యయనమపి తేషామేవేతి. ఏవంవర్ణత్రియస్యాధానం నియతమిత్యుక్తం తేనపరిసంగేనమోక్షాద్వినాఫలార్థినా మపిత్రైవర్ణికానా మపినసర్వకర్మానుష్ఠానమితి దర్శయితు మధికారినియమమాహ.

అధ్యాపకులు (వేదముజదువువారు) బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు మాత్రమే. వీరలకే యుపనయనాధికారము కలదు. ఇట్లె యీవర్ణత్రయమువారికి మాత్రమే యాధానాధికారము కలదు. అట్లయినను మోక్షాద్యదృష్టఫలకాంక్షులగు త్రైవర్ణికులకెల్లరకు సర్వకర్మ లనుష్ఠానమొనర్చుటకు నధికారము గానఁబడదు. మఱియు నిందులకు:—

హి. సూ. తేషామేవబ్రాహ్మణ విహితాయజ్ఞాయేషు యజ్ఞకార్త్స్న్యమవిప్రతిషిద్ధం॥

ఈ సూత్రమునకు వ్యాఖ్య మీమాంసారూపకముగ విస్తీర్ణముగ వ్రాయఁబడినది. గ్రంథవిస్తరభీతిచే దానిలో ముఖ్యాంశము మాత్రము వ్రాయఁబడియె.

వై. వ్యాఖ్య. యేషుత్రైవర్ణికేషు యస్యసాంగస్యకార్త్స్న్య విద్వత్త్వార్థవత్త్వసవర్ణస్త్రీపరిగ్రహ ఋత్విగాదిసంపత్తిః । బాహ్యసమగ్రా. తేషామేవ. యజ్ఞానతుపరముఖేన. పృష్టావపికర్తారోభవంతి.........ఏవకారః ఫలకామినామపి శూద్రాణాం అగ్న్యాధానాది ప్రాపకలింగనిరాసార్థః. బ్రాహ్మణేనేతిస్మార్తధర్మాణాం శూద్రోఽపిప్రాప్తినివారణార్థం । బ్రాహ్మణేనవిహితాః శ్రౌతాః ఏతదేవస్ఫుటయితుం యజ్ఞా ఇత్యుక్తం యజ్ఞశబ్దేనశ్రౌతత్వేనోపలక్షితా ఆధానాదయః । అయమర్థఃశ్రూయతే వసంతే బ్రాహ్మణోఽగ్నీనాదధీత గ్రీష్మేరాజన్యః శరదివైశ్యఃఇతి। తేనాధానాభావాదనగ్నిః శూద్రః । సోఽగ్నిసాధ్యైకకర్మణికథం ప్రవర్తిష్యతే । ఆత్మార్థచాధీయాత్

యంతేఽగ్నిమోన। పదార్థా ఆత్మనేపదంహ్యత్రభవత్యాదధీతేతి। తేన బ్రాహ్మణాదయ ఏవాధానే నాగ్నిముత్పాదయితుం సమర్థాః । ఆధానాభావాచ్ఛూద్ర స్యానధికారః యాని పునర్దర్శనాన్యుక్తానితాని రథకార విషయాణి రథకారస్యాహి శూద్ర సంభవాత్ । శూద్రత్వముచ్యతే కరణ్యాంహి సజాతః కరణీ శూద్రీ దుహితేతి తథా నిషాద విషయాణ్యపి శూద్రత్వాత్। అతఏవబ్రాహ్మణ రాజన్య వైశ్యానామేవాధ్యయనం శ్రూయతే వసంతే బ్రాహ్మణమిత్యాది॥

బ్రాహ్మణాది వర్ణత్రయమువారి సజాతి వివాహిత స్త్రీలవలన గలిగిన సంతానమునకు (బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు) మాత్రమే వేదాధ్యయన శ్రౌతాధానాది బ్రహ్మకర్మలయం దధికారముకలదు. మఱియు నీసూత్రమునందలి ఏవకారమువలన శూద్రధర్మలగు నిషాదులకు సంకీర్ణ రథకారులకు నగ్న్యాధానోపదేశములగు స్మృత్యాది ప్రమాణములకు ఖండనముఁ జేసెను. రెండియు నీసూత్రమందలి "బ్రాహ్మణ విహితాః"అను వాక్యమువలన స్మార్తధర్మము శ్రౌతతోవపలక్షణభూతమైన యగ్న్యాధానము వీనియందధికారము శూద్రుల కేమాత్రము గానిపించదు. అందులకు శ్రుతియు నుదాహృతమయ్యెను. అదియె వసంతర్తుమధ్యమమున బ్రాహ్మణుల కనియు, గీష్మర్తుమధ్యమున క్షత్రియులకనియు శరదృతుమధ్యమున వైశ్యులకనియు నాధానకాలముఁ జెప్పుచున్నది. వర్ణత్రయేతరులకు నాధానములేదు. వేయేల అగ్నిసాధ్యకర్మప్రవర్తనమందు శూద్రుని కధికారము గానిపించదు. అగ్న్యాధానకర్మయందు "ఆదధీత" అను క్రియాపదము ఆత్మకర్తృకమైన యాత్మనేపదముగఁ ద్రైవర్ణికులకె శ్రుతియందుఁ జెప్పఁబడినది. (ఇందువలన "వర్షాసు రథకారోఽగ్నీనాదధీత"యను శ్రుతివచనమునందలి "ఆదధీత" యను క్రియాపదము త్రైవర్ణికరథకారునకనియె స్పష్టమగుచున్నది. ఇందుచే బ్రాహ్మణాది త్రైవర్ణికాంతర్భూతుఁడగు రథకారునకే వేదోక్తమగు నగ్న్యాధానాధికారముగాని సంకీర్ణసంకర రథకారునకుఁగాదని కరతలామలకముగ సుబోధకముగాకమానదు. "నిషాదస్థపతిం యాజయేత్" అను వాక్యములోని "యాజయేత్" అను పదము అన్యకర్తృకబోధకమైన పరస్మైపదియగు క్రియాపదము. ఇందువలననే నిషాదునకు స్వయంకర్తృత్వాధికారము లేదనియు, బరులచేఁ జేయింపఁ బడవలెననియుఁ దెల్లమగుచున్నది. ఆ నిషాదుఁడు త్రైవర్ణికులకు బహిర్భూతుఁడనికూడఁ దెలుపుచున్నది. ముఖ్యముగ నీసూత్రకారుని మతమేమన:—సంకీర్ణసంకర రథకారులుగాని, నిషాదులు మున్నగు జాతివారుగాని శూద్రధర్మలగుటచే వీరు వేదోక్తాధానమున కధికారులు గారనియు,

"ఋభూణాం" అను విశేషాధానశ్రుతి వర్ణత్రయాత్మకుఁడగు రథకారునకే చెప్పఁబడినదనియు ముఖ్యాభిప్రాయము.

ఋషిమంత్రలింగములచే రథకారులు బ్రాహ్మణాంతర్భూతులే.

హి. సూ. యేషాంచప్రకృతిలింగాని యజ్ఞః శూద్రియంతేత్రీన్ వృణీతేయథర్షి మంత్రకృతోవృణీత ఇతివిజ్ఞాయతే॥

వై. వ్యా. బ్రాహ్మణో విజ్ఞాయత ఇతిదార్ఢ్యార్థం । ప్రకృతిర్జాతిః తస్యనిర్ణాయకాని లింగాని యజ్ఞా యజ్ఞసాధనాని। నహిప్రవరమన్యేషామస్తి బ్రాహ్మణాదిత్రయవ్యతిరిక్తానాం । తత్రపురోహితాద ప్రవరేణరాజన్య వైశ్యయోర్బ్రాహ్మణస్య స్వతః ప్రవరం స్పష్టం । త్రయాణాం లింగాన్యాహ గాయత్ర్యాబ్రాహ్మణస్య పరిదధ్యాత్త్రిష్టుభారాజన్యస్య జాగత్యావైశ్యస్యేతి। ఇతిశబ్దః ప్రకారే ఏవం ప్రకారాణ్యన్యాన్యపి వేదితవ్యానీత్యర్థః। ఏవమధికారం సంభావ్యేదానీం కర్మసునియతాన్యాహ తేషామగ్నిహోత్రం దర్శ పూర్ణమాసౌచనియతౌ॥

సమంత్రికమగు శ్రౌతాగ్న్యాధానములం దధికారము త్రైవర్ణికులకే చెప్పఁబడినది. ఆ త్రైవర్ణికులకే ఋషిమంత్రఛందోలింగాదులు చెప్పఁబడినవి. కారణము త్రైవర్ణికేతరులకు (శూద్రులకు) ఆర్షేయప్రవరగోత్రాదులులేవు. కావుననే త్రైవర్ణికులలో క్షత్రియ వైశ్యులకుఁ బురోహితప్రవరలే వ్యవహరింపఁబడుచున్నవి. బ్రాహ్మణులకు మాత్రము స్వతః ప్రవరలే సిద్ధమగుచున్నవి. త్రైవర్ణికులకు మంత్రలింగములు విధింపఁబడినవి. వానిలో ఛందోనియమముల విధించుటలో బ్రాహ్మణునికి గాయత్రియు, రాజన్యునికిఁ ద్రిష్టుప్పును, వైశ్యునికి జాగతియు నియమితములయ్యెను. ఈ త్రైవర్ణికులకే యాధానముసేయుట కధికారముకలదని వెల్లడియగుచున్నది. "తేషామగ్నిహోత్రం దర్శపూర్ణమాసౌచనియతౌ" అను సూత్రోక్తిచేఁ త్రైవర్ణికుల కగ్నిహోత్రము దర్శపూర్ణమాసేష్టులు నియతములని తెలుపఁబడుచున్నవి. "నియమ్యతే" అను క్రియాపదమును విచారించితిమేని "సోమేజ్యా బ్రాహ్మణస్య నియమ్యతే" అను సూత్రమువలన విశేషవిధానము చెప్పెడుపట్ల "నియమ్యతే" నియమింపఁబడినది యని చెప్పినటులఁ గనిపించుచున్నది. అగ్నిహోత్ర దర్శపూర్ణమాసేష్టులు అభ్యాసార్థకములుగ నియతములని నుడువఁబడినవి. "కామ్యారంభేస త్యసత్యాంకామనాయా మత్యాగార్థమిదం భవిష్యతి" అను వ్యాఖ్యానోక్తి

"కోరఁదగినకార్యమైనను గాకపోయినను కోరికను విడువకుండుటకాఁగలదు." అను నర్థము విశదీకరించుటచే నియతశబ్ద మభ్యాసజనకోద్దేశమును విడంబించుచున్నది. పూర్వోక్త త్రైవర్ణికులకు లింగబోధకసూత్రములు స్పష్టపడుచుండుటచేతను రథకారులకుఁ బ్రవరర్షిగోత్రచ్ఛందోలింగములు నుడివియుండుటచేతను నీ రథకారులు బ్రాహ్మణాంతర్భూతులని స్పష్టపడక మానరు. "నిషాదరథకారయోః" అను సూత్రవాక్యమునఁ జూడ "కపిజ్ఞాత్యోర్ఢక్" అను పాణిని సూత్రము జ్ఞప్తికివచ్చి కపి (వానరుఁడు) జ్ఞాతి (మానవుఁడు) వీరిరువురికి ఢక్ ప్రత్యయముకొఱకు సూత్రమున సాహచర్యము సంభవించినటులనే సంకీర్ణుఁడగు నిషాదునకు బ్రాహ్మణుఁడగు రథకారునకు లౌకికవైదికాగ్నిభేదగుణకమైనను నొకయాధాన విశేషోక్తిచే సాహచర్యము సంభవించినటులఁ దెలియుచున్నది.

పూర్వోక్తసూత్రమున సమంత్రకముగ ఋష్యాధానమును నిర్వచించి అయ్యది త్రైవర్ణికులకే నిశ్చయింపఁబడినది. ప్రవరార్షేయగోత్రసూత్రాదులులేని త్రైవర్ణికేతరులకు (నిషాదాదులకు) నిశ్చితముగాలేదనియుఁ దెలుపఁబడినది. ఆవిషయమే యీ క్రింది సూత్రమున విస్పష్టముగ విశదీకరించియున్నది.

హిర-సూత్ర,ఆధానప్రశ్న 3. పటల॥౪॥ భృగూణాం త్వాదేవానాం వ్రతపతేవ్రతే నాదధామీతి భార్గవస్యయథర్ష్యాధానం।భార్గవగోత్రస్య యజమానస్య॥ ఆంగిరసా... త్యాంగిరసస్య । గతం ఆదిత్యానాంత్వా... ధామీత్యన్యాసాం బ్రాహ్మణీనా ప్రజానాం॥ భార్గవాంగిరసరిక్తానాం బ్రాహ్మణానాం॥ వరుణస్యత్వా.........మితిరాజ్ఞః । స్పష్టం । ఇంద్రస్యత్వా... ...మీతిరాజన్యస్య॥ క్షత్రియజాతిమాత్రో రాజన్యో రాజ్ఞోజాతౌ యదితిప్రత్యయః. పూర్వస్తురాజ్యాధిపతే రభిషిక్తస్యేత్యర్థః । మనోస్త్వా ......మీతివైశ్యస్య । ఋభూణాం త్వాదేవానాం వ్రతపతే వ్రతే నాదధామీతి రథకారస్య । తపతే మంత్రా యథర్ష్యాధానా నీత్యభిధీయంతే । నిషాదస్యానర్ష్యాధానం। అన్యైరేవమంత్రైరవ శిష్టైరితిజ్ఞేయం గోత్రాభావా దనుపదేశాచ్చమంత్రస్య॥

ఇందు భృగువులకు నంగిరసులకు నితర బ్రాహ్మణులకు రాజులకు రాజన్యులకు వైశ్యులకు రథకారులకు నాధానయాజమాన్యములు చెప్పుచు "తపతేమంత్రా యథర్ష్యాధానానీత్యభిధీయంతే" అని ఆయామంత్రములు ఋషుల నతిక్రమింపని యాధానములుగాఁ జెప్పఁబడినవని చెప్పెను. అందుచే రథకారులు ఋషివంశము వారనియుఁ దక్షనరర్షులు, త్వష్ట, అధర్వుఁడు, అంగిరస్సు, సుధన్వుఁడు, ఆర్భ

వుఁడు, సానగుఁడు, సనాతనుఁడు, వామదేవుఁడు మున్నగు వారనియుఁ దెలిసికొన వచ్చును. ఇఁక శూద్రుఁడగు నిషాదునకు "నిషాదస్యానర్వాధానం అన్యైరేవ మంత్రైరవశిష్టైరితిజ్ఞేయం" అని ఋషివిహీనమగు నాధాన మితర మంత్రములచేతనే తెలిసికొనఁ దగునని యెను. ఇందువలనఁగూడ రథకారునకు "ఆదధీత" యను క్రియాపదము స్వయంకర్తృత్వబోధకమగు నాత్మనేపది విధిలిఙ్ప్రత్యయయుక్తము నయ్యెను. గాన భృగు, ఆంగిరస, ఆదిత్య, వరుణ, ఇంద్ర, మను, ఋభువులను సప్త దేవతల కొక్కవిధముగనే స్వయంకర్తృత్వబోధక క్రియాపదయుక్త యాజమాన్య ములు చెప్పియుండుటఁజేసి రథకారుఁడు త్రైవర్ణికులలోనివాఁడుగను ఆర్షమునలన బ్రాహ్మణుఁడుగను నుండవలెను. "మాహిష్యేణ కరణ్యాంతు రథకారః ప్రజా యతే । నైవోపనయనం తస్యశూద్రధర్మాద్బహిష్కృతః" అను వచనము చొప్పున నుపనయనాధికారములేని సంకీర్ణ రథకారున కీ శ్రుత్యుక్తాధానము గాదని విస్పష్ట మగును. "రథకారస్య" అను పదమునకు "సంకీర్ణజాతీయస్య" అని వ్యాఖ్యాన మొనర్చిన మాధవాచార్యులకుఁ బ్రమాదితానుగత ప్రమాదమనియె చెప్పితీరవలెను. మఱియు సూత్రకారునకు భాష్యమందపేక్ష యెప్పటికిఁగలుగదు. భాష్యకారునకు సూత్రమం దపేక్షయుండితీరును. అందుచే భాష్యకారుఁడు సూత్రము నాశ్రయించియె భాష్యమొనర్పవలెను. ఆపస్తంబ హిరణ్యకేశ్యాది సూత్రముల నతిక్రమించి భాష్యీకరించిన మాధవాచార్యుల భాష్యపంక్తికి సమాధానమొసంగ సాక్షాత్పర మేశ్వరుఁడె సమర్థుఁడు. మఱియు "రథకారస్యాధానే, నియతం చనాభావాదితి వాత్స్యః" అను కాత్యాయన సూత్రమునకు మీమాంసారూపభాష్య మొనర్చిన కర్కస్వామి భాష్యపంక్తియు నిట్టిదె. (నిరాకృతసమాధానమే.)

### రథకారశబ్దమున కష్టవిధశక్తిగ్రహణములు.

ఏశబ్దమునకైనను సామర్థ్యము గ్రహించవలెనని న అష్టవిధ కారణములుండ వలెను. ఆవివర మీ క్రిందిశ్లోకమున,

శ్లో॥ శక్తిగ్రహం వ్యాకరణోపమానకోశాప్త వాక్యాద్వ్యవహారతశ్చ।
వాక్యస్య శేషాద్వివృతేర్వదంతి సాన్నిధ్యతస్సిద్ధపదేనవృద్ధాః॥

పదమున కర్థవివక్షతఁజేయునపుడు, వ్యాకరణము, ఉపమానము, కోశము, ఆప్తవాక్యము, వ్యవహారము, వాక్యశేషము, వివరణము, ప్రసిద్ధపదసాన్నిధ్యము నను

నెనిమిది గుణములుండవలెనని పెద్దలు చెప్పుదురు. కావున నీరథకారశబ్దము బ్రాహ్మణ వర్ణపర్యాయమనుటకు నీ యెనిమిది విధములగు గుణములు సిద్ధముగనున్నవి.

## రథకారుఁడు బ్రాహ్మణుఁడనుటకు వ్యాకరణశక్తి.

మొట్టమొదట వ్యాకరణమునుండి శక్తిగ్రహముఁ బరికించెదము. "ధాతుప్రకృతి ప్రత్యయాదీనాం శక్తిగ్రహో వ్యాకరణాద్భవతి" అను వ్యాకరణసూత్ర వాక్యమువలన ధాతు, మూల, శబ్ద, ప్రత్యయాదులనుండి వ్యాకరణశక్తిగ్రహ మొనర్పవలెనని తెలియుచున్నది. "కుర్వాదిభ్యోణ్యః" అనునది పాణిని సూత్రము ४. ౧. ౧౫౧. సంఖ్యగలది. గణసూత్రము. ఈగణపాదమధ్యమందు కురు, గర్గ, మంగుష, అజమార, రథకార, వావదూక, కలి, మతి, కపింజల, ఇత్యాది ४౭ శబ్దములు కుర్వాది గణాంతములు. మధ్యంగతరథకారశబ్ద పఠితములు. ఇందుచే రథకార శబ్దమునకు బ్రాహ్మణశబ్దముయొక్క శక్తిసాపేక్షతగలుగుచున్నది. రథకారశబ్దపఠితమైన కుర్వాదిగణము బ్రాహ్మణజాతి బోధకమగు 'ణ్య' ప్రత్యయాంత నిపతితమగుటయె యిందులకుఁ గారణము. అనఁగాఁ గురుశబ్దము మొదలుకొని వావదూక్యశబ్దమువరకు నపత్యార్థమునందు ణ్య ప్రత్యయాంత నిపాతితములై బ్రాహ్మణజాతి బోధకములగును.

కుర్వాదిభ్యోణ్యః ४. ౧. ౧౫౧. అపత్యేకౌరవ్యః బ్రాహ్మణాః వావదూక్యాః.

ఉ॥ "కౌరవ్యాః" (కురుకులోత్పన్న బ్రాహ్మణాః) "గార్గ్యాః" (గర్గకులోత్పన్న బ్రాహ్మణాః) "మంగుష్యాః" (మంగుకులోత్పన్న బ్రాహ్మణాః) "అజమర్యాః" (అజమరకులోత్పన్న బ్రాహ్మణాః) "రాథకార్యాః" (రథకారకులోత్పన్న బ్రాహ్మణాః) మాత్యాః, కావ్యాః, కాపింజల్యాః, వావదూక్యాః బ్రాహ్మణాః.

ఈ యుదాహృతవాక్యములనలన రథకారశబ్దము బ్రాహ్మణపర్యాయముగఁ బరిగణింపఁబడుట నిస్సందేహము.

మఱియు,

పా. సూ. శిల్పినిచాకృఞః. ౬. ౨. ౭౬॥ శిల్పివాచిని సమాసేఽణ్ణంతే పరేపూర్వమాద్యుదాత్తమ్, సచేదణ్ కృఞః పరోనభవతి, తంతువాయం, శిల్పినికిం । కాండలావః । అకృఞఃకిం । కుంభకారః.

పా. సూ. సంజ్ఞాయాంచ. ౬. ౨. ౭౭. అణ్ణంతేపరే । తంతువాయోనామకృమిః । అకృఞఇత్యేవ । రథకారోనామబ్రాహ్మణః.

పూర్వోక్తమగు నణ్ ప్రత్యయాంతశబ్దము సంజ్ఞావాచకమై శిల్పివాచకమయ్యె నేని ఆద్యుదాత్తమగును. ఉదాహరణము, తంతువాయః. (ఒకే ప్రకారము తంతు రచనచేయు సాలెపురుగు.) కృఞధాతువు, అణ్ ప్రత్యయాంతము సంజ్ఞార్థకము శిల్పి వాచకమయ్యెనేని యాశబ్దమంతోదాత్తమగును. ఉదాహరణము. రథకారః. (వాజపే యాది యజ్ఞసంబంధియు దేవసంబంధియు ముఖ్యవిధానముగ రథాది శిల్పకర్మరచించు రథకారసంజ్ఞకుఁడగు బ్రాహ్మణజాతి విశిష్టుఁడు) ఇచట "నామ" యను నవ్యయము ప్రకాశార్థకమగును.

కొందఱీశబ్దము సంజ్ఞార్థకమగుటవలన బ్రాహ్మణులలో నొకానొకఁడు రథకా రుఁడను పేరుగలవాఁడనియు నది జాతివాచకపర్యాయము గాదనియు నందురు.

అట్లనుట తగియుండదు. అంతోదాత్తమునచ్చుటకు కృఞధాతువు అణ్ ప్రత్య యము సంజ్ఞార్థకము శిల్పివాచకముగూడ నయియుంౘవలెను. సంజ్ఞార్థకముగాక ప్రత్యేక శిల్పివాచకమయ్యెనేని ఆద్యుదాత్తమగును. ఇఁక మఱియొక సందర్భముగూడ విచా రించుదము. ఈపాణిని సూత్రములు సిద్ధాంతకౌముది స్వరప్రకరణమునందుఁ బ్రయో గింపఁబడినవి. ఈస్వరప్రకరణము వేదములోఁ బ్రయోగించు శబ్దములయొక్క స్వర భేదముల నిర్ణయించునది. కావున నీశబ్దములు వేదములో నుండియే తీరవలెను. వేద భాగమునందు జాతివాచకముగాక రథకారుఁడను పేరుగలవాఁడొకఁడుండినటులఁ గనఁబడదు. జాతివాచకముగ రథకారశబ్దము ప్రయోగించినపట్టుల నంతోదాత్తము గనే (బ్రాహ్మణజాతి విశిష్టస్వరయుక్తమైనదిగనే) కానవచ్చుచున్నది.

ఋభూణాంత్వాదేవానాంవ్రితపతేవ్రితేనాదధామీతిరథకారస్య।

తైత్తిరీయబ్రాహ్మణము.

ఇట్లె మఱికొన్నిచోటులఁగూడఁ బ్రయోగములు గలవు. ఇటుల నంతోదా త్తముగ నుండుటచే బ్రాహ్మణజాతివాచకమగుననుటకు సందేహముండదు. కావున "రథకారోనామబ్రాహ్మణః" అనునది ప్రత్యేకవ్యక్తికి ననుట పొసఁగనేరదు.

వ్యాకరణశాస్త్రముచే రథకారుఁడు బ్రాహ్మణజాతివిశిష్టుఁడగుననుట విస్పష్ట మయ్యెను.

## రథకారబ్రాహ్మణబోధకకోశవాక్యము.

ఇకఁ గోశమును జూచుదము. శ్లో॥ రథకార స్తక్షణిస్యాన్మాహిష్యకరణీసుతే॥
ఇతివిశ్వమేదినీహేమచంద్రిః॥

రథకారుఁడనఁగాఁ దక్షుఁడు, తక్షుఁడనవిశ్వకర్మయె. "శిరఃపశోస్తేదాస్యంతి భాగంయజ్ఞేషుమానవాః । ఏవతేఽనుగ్రిహ స్తక్ష క్షిప్రింకురుమమప్రియమ్॥ ఓతక్షుఁడా (ఓవిశ్వకర్మా!) నీదయయుంచి శీఘ్రిముగా నాకుఁబ్రియ మొనర్పుము. అందుచే మానవులు యజ్ఞములయందుఁ బశువుయొక్క యుత్తమాంగభాగమును నొసంగెదరు. అను భారతప్రయోగమువలనఁ దక్షుఁడు విశ్వకర్మయనియు యజ్ఞభాగార్హుఁడనియు నందుచే బ్రాహ్మణుఁడనియుఁ దెలియుచున్నది. మఱియు,

శ్రుతిః॥ తక్షన్రిథం సువృతం విద్మనాపస్తక్ష హరీ ఇంద్రివాహావృషణ్వ
సూతక్షన్పితృభ్యామృభవః

ఋగ్వే ౧. ౭. ౩౨.

ఈ శృతివలన విశ్వకర్మసంతతీయుఁడను నాథానాధికారుఁడు నగుఋభువు తక్షత్వమున శోభిల్లెనని తెలియుటచేఁ దక్షుఁడన విశ్వకర్మబ్రాహ్మణుఁడని విశదమగుచున్నది. రథకారపదమునకు రెండవయర్థము మాహిష్యకరణీ సుతుఁడగు సంకీర్ణుఁడు. ఇట్లుండుటచే మాహిష్యకరణీ సుతేతరుఁడగు మఱియొక రథకారుఁడుండినటులఁ గోశవాక్యము స్ఫుటీకరించుచున్నది. ఇట్లు కోశమువలనను రథకారుఁడు బ్రాహ్మణుఁడని తెలియవచ్చెను.

మఱియు రథకారుఁడన స్థపతిపర్యాయముగఁ బెక్కుచోటులఁ బ్రయోగము గానవచ్చెడిని. "సగీష్పతీష్ట్యా స్థపతిః" యనియు, విశ్వకర్మ కులోత్పన్నబ్రాహ్మణుఁడు మహాకులుఁడని వక్కాణించి యుండుటచే "మహాకుల కులీనార్య సభ్యసజ్జన సాధవః" అనియుఁ బెక్కు కోశవాక్యములు బ్రాహ్మణజాతి విశేషత్వమును బోధించుచున్నవి.

ఇందులఁగొందఱు రథకారశబ్దము విశ్వకర్మ కులోత్పన్న బ్రాహ్మణునకు, మాహిష్యకరణీసుతునకును నర్థమైనయెడల యాగాధికారముగూడ దేహళీదీపన్యాయమున నుభయులకు నెందులకుండఁగూడదు? అనియందురు.

కాని యట్లనుటతగదని చెప్పవచ్చును. ఏమనిన:— "గోధాతలనిహాయకోః" అను మేదినీకోశమువలన గోధాశబ్దము తలము (వింటిదెబ్బతగులకుండ చేతికిఁదొడుగుకొనెడి అత్తెము) నకు నిహాయకము (నీటియందుండెడి ఉడుము) నకు నర్థమగును. నద్యాంగోధానిమజ్జతి. అనునెడల నదియందు నీటియుడుము మునుఁగుచున్నది యను నర్థమునకు నదియందుచేతికిఁదొడుగుకొనున త్తెము మునుఁగుచున్నది యనిచెప్పిన నెంత శ్లాఘనీయమగునో పృచ్ఛకులే యోజింపవలసియున్నది. "వర్షాసురథకారోఽగ్నీనాదధీత" అను శ్రుతివాక్యమున కర్థమునుజెప్పవలసివచ్చినప్పుడు జాతి (ఆశ్రయ) ఆకృతి (స్వరూప) వ్యక్తులను మూఁడుకారణములను విచారింపవలెను. బ్రాహ్మణాద్యాధానప్రకరణశ్రుతియందు అవ్యవహితత్రైవర్ణికజాతి బోధకమును "ఋభూణాం వర్షాసు" అనుమంత్రోపయోగ మంత్రకాలజ్ఞాపకమునగు నట్టిదియునగు పదమువలననే గాక "ఆదధీత" యను కేవలత్రైవర్ణికసంబంధమైన యజ్ఞక్రియాస్వరూపవిధివాక్యమువలనను, "వర్షాసురథకారోగ్నీనాదధీత" యను శ్రుతివాక్యమందలి రథకారశబ్దము జాతివాచక వ్యక్తివాచకపదమై అగ్నిహోత్రాది బ్రాహ్మణధర్మోచితమగు పావనదేవ రథాదిశిల్పములొనర్చునట్టిదియు, బ్రాహ్మణజాతి విశిష్టమైనదియుఁ, బరమేశ్వరవరప్రసాదలబ్ధపరంపరాగతికవిజ్ఞాన భారముగలదియునై యర్థాత్ విశ్వకర్మకులోత్పన్నమయి విరాజిల్లుచున్నది. అట్టిరాథకార్య బ్రాహ్మణుఁడేడ? సంకీర్ణ సంకరుఁడగు రథకారనామఁడేడ? సంకర రథకారునకేయజ్ఞాధికారముగలదనిన, హరిని స్మరింపుమనినపుడు కోఁతినో కప్పనో స్మరింపవలసివచ్చును.

రథకారబ్రాహ్మణ విషయమగు నుపమానశక్తిగ్రహము.

ఉపమానశక్తిగ్రహము విచారించుదము. ఉపమానమనినఁ బోల్చి చూపుట. చూడుఁడు శిల్పకాండమున నుదాహృతమగు నీక్రింది ఋగ్వేదమంత్రమున రథకారు నెట్లు పోల్చిరో,

శ్రుతిః॥ అస్మాఇదుస్తోమం సంహినోమిరథం నతష్టేవతత్సినాయ ।
గిరశ్చ గిర్వాహసే సువృక్తీంద్రాయ విశ్వమిన్వం మేధిరాయ ॥
ఋగ్వే ౧. ౪. ౨౭.

భాష్యమ్॥ స్తోతృభిః ప్రేషితానిస్తోత్రాణి రథవదింద్రమానయంతి । అతఃకారణాదిత్థేచ్ఛాంకుర్వతే రథకారో రథంకరోతి తద్వదహమిదానీమేవ నత్వన్యదేవాయ స్తోత్రం రచయామి । తత్ స్తోత్రం రథవత్సువ్యక్తి సుసంస్కృతమితి॥

స్తోత్రములుచేయువారిచేఁ బ్రేరేపింపఁబడిన స్తోత్రములు రథమువలె నింద్రుని గూర్చి పంపఁబడుచున్నవి. ఇక్కారణమువలన రథస్వామికొఱకు, రథకారుఁడు రథమును జేయునట్లుగానే నిందునికొఱకు (అన్యదైవతముకొఱకుఁ గాకుండ) స్తోత్రమును రచించుచున్నాను. అ స్తోత్రము రథమువలెఁ జక్కగా సంస్కరింపఁబడిన దగును.

అని వాక్రువ్వఁబడుటచే వేదోక్తమంత్రరూపమగు స్తోత్రమును రథముగాఁ బోల్చిచెప్పుటయు, మంత్రకర్తను రథకారునిగాఁ బోల్చి చెప్పుటయుఁ జూడ వేదకారుఁడువోలె రథకారుఁడు ప్రకాశించుచున్నాఁడని యుక్తమోపమానము నిరూపింపఁ బడుచున్నది.

మఱియు నేకాగ్నికాండమందలి "ఇమగ్గ్ స్తోమమర్హతేజాతవేదసేరథమివసమ్మహేమమనీషయా" అను మంత్రవచనమునకు హరదత్తాచార్యులు "ఇమగ్గ్ స్తోమమిమాంస్తుతిం అర్హతేస్తుత్యర్హాయజాతవేదసేజాతధనాయ జాతప్రజ్ఞాయవాసంమహేమమహిః పూజాయామన్యత్ర, ఇహతుకరోత్యర్థే సంస్కారేవాదిష్టవ్యః కర్తుంసంస్కర్తుంవా శక్నుయామమనీషయా స్వయాబుద్ధ్యారథమివయథాతక్షారథంకరోతి యానకామోవాసంస్కరోతి కింకారణమగ్నేస్తుతిఃక్రియత ఇత్యుచ్యతే" అని, ఈస్తోత్రమును స్తోత్రార్హుఁడైన యగ్నికొఱకు సంస్కరింపసమర్థులమగుచున్నాము. స్వకీయబుద్ధిచే, దక్షుఁడు (రథకారుఁడు) రథమును జక్కగానడుప నెట్లుకోరిచేయుచున్నాఁడో యట్లే యాగ్నేయస్తుతి సేయఁబడుచున్నదని రథకారుఁడువోలె వేదకర్త రచించుచున్నాఁడని వివరించిరి. ఇట్లు విస్పృతమగుటచేతను నసాధారణమహనీయోపమానము రథకారశబ్దమునకు లభించుచున్నది.

మఱియు రథకర్మశిల్పోపలక్షణమైనది. "అశూద్రకృతాం త్రైవర్ణికే నైవ కృతా మగ్నిహోత్రస్థాలీం" అను హిరణ్యకేశి సూత్రమువలన శూద్రకృతములు గాని త్రైవర్ణికకృతములగు నగ్నిహోత్ర స్థాల్యాదులు సంగ్రహింపవలెనని చెప్పుటచే శిల్పకర్మను బోల్చుటలో నశూద్రకర్తృత్వమును బోల్చుట రాథకార్యమున కుపమానమయినది. "అశూద్రకృతాం" అని చెప్పుటవలన శూద్రకృతశిల్పములు కొన్ని కలవనికూడ తెలియుచున్నవి. వానినిగూర్చి కొంతభాగ మిచటవివరింపఁబడును.

ఈవిషయమయి శిల్పకాండమునఁ బూర్ణముగా వివరింపఁబడియె యున్నది. కాని శూద్రశిల్పబ్రాహ్మణ శిల్పభేదములను గొంతనిర్ణయింపవలసియున్నది.

## శిల్ప భేద ములు.

శిల్పకరణముచే సిద్ధమగు వస్తువులెప్పుడును వేదమంత్రములచేఁ జేయునవి వైదికశిల్పము లనఁబడును. అట్లుగాక చేయునవి యవైదికశిల్పము లనఁబడును. వైదికశిల్పములన్నియు బ్రాహ్మణశిల్పములే అవైదికశిల్పములు శూద్రశిల్పములు. వైదికశిల్పవిధానము కశ్యపబ్రహ్మ శిల్పశాస్త్రమునఁ బూర్ణముగా వివరింపఁబడీ యున్నది. అద్దాని సంగ్రహించి కొంత శిల్పకాండమున వ్రాయఁబడియున్నది. విష్ణ్వాది పవిత్రారోపణము, రక్షానిర్మాణము, దర్భకూర్చ నిర్మాణము, వటూప యుక్తములగు మౌంజీమేఖల, కూర్చ, రజ్జువు, దర్భాసనము, శూర్పము, మృగ చర్మవ్యజనము, మఱియు యజ్ఞసంబంధమైన కపాలములు, చరుస్థాలి, ఆజ్యపాత్రి, దేవోపకరణములు, త్రైవర్ణిక గృహనిర్మాణము, దేవాలయము, మఠము, యోగ పీఠము, వాజపేయ యజ్ఞప్రయోగములగు రథములు, యజ్ఞశాల, స్రుక్స్రువాది యజ్ఞ పాత్రములు, దైవతప్రతిష్ఠ, శివవిష్ణుదేవ్యాదిమూర్తులు, వాపీకూపపుణ్యసరస్సులు, దుర్గాదిరచన, క్షేత్రరచన, గ్రామరచన, తపోవనాద్యారామ రచనము, త్రైవర్ణిక వివాహహోపనయన వేదికలు, చయనయజ్ఞమండలి మంత్రియుక్తమగు ప్రాణభృత్తు, అపానభృత్తు, ఇష్టకోపధానము, పక్ష్యాకృతి యజ్ఞకుండరచనము, పార్థివగణపతి, పార్థివలింగము, సర్వతోభద్రమండలాది రచనము, అధర్వవేదోక్త మంత్రరచనము లగు శస్త్రాస్త్రములు, ధనుస్సు, బాణము ఖడ్గము, చక్రము, వజ్రము, త్రిశూలము, గద, పాశము, మంగళసూత్రము, శ్రోత్రకుండలములు మున్నగునవి యన్నియు బ్రాహ్మణశిల్పములే. వీని రచించుసమయములయందు శాస్త్రోక్తములగు తత్తద్వేద మంత్రములఁ బఠింపవలెను. వానిలో ముఖ్యముగ "అగ్నిస్స్పష్టిః" "జాతవేదసే" "పావకానస్సరస్వతీ" "ఆయుష్యం వర్చస్యం" అను మంత్రములను స్మరింపుచుఁ దత్తద్దేవతాక మంత్రోపాసనము లాచరింపుచు రచింపవలెను. ఈ పై శిల్పములన్నియు నయో, దారు, తామ్ర, శిలా, సువర్ణాదులచే రచింపవలసినవే యగును.

ఇఁక దక్కఁగల శిల్పములన్నియు శూద్రశిల్పములు. అనఁగా నసంస్కార్య ములగు నిండ్లు, బంగలా, డాబా, మోటుబండ్లు, తాంగా, యవనరాజుల భవనములు, అసురప్రతిమలు, బందూక, చూరుకత్తులు, వృక్షాదులు ఛేదించు పరశువు, ఖలీనము, నీచజాతివారలర్చించు మృత్తికాప్రతిమలు మున్నగునవన్నియు శూద్రశిల్పములు.

పూర్వోక్తములగు పంచశిల్పములు విశ్వబ్రాహ్మణులచేఁ జేయఁదగినవనియు నయ్యవి యజ్ఞోపయోగము లయినటుల,

శ్లో॥ అయస్కృతిర్మనూనాంచ మయానాం దారుకర్మచ
త్వష్ట్రాణాం తామ్రికర్మాణి శిలాకర్మచ శిల్పినామ్
సౌవర్ణం తక్షకానాంచ పంచకర్మాణి తానివై
ఏతేపంచరూపాశ్చ యజ్ఞకర్మపరాస్మృతాః

స్కాందపురాణము, నాగరఖండము, విశ్వకర్మోపాఖ్యానము,

౬ అధ్యాయము.

సానగగోత్రోత్పన్న మనువులకు నాయసకర్మయు, సనాతనగోత్రోత్పన్నులగు మయులకు దారుకర్మయు, అహభూనసగోత్రోత్పన్నులగు త్వష్టలకు తామ్రకర్మయు, ప్రత్నగోత్రోద్భవులగు శిల్పులకు శిలాకర్మయు, సువర్ణగోత్రజాతులగు తక్షులకు సువర్ణకర్మయు నిష్పన్న మొనర్పఁబడినది. ఈ యైదుకర్మలు యజ్ఞోపయోగములుగాఁ దలఁచవలెను. అని పంచశిల్పములు యజ్ఞసాధనములుగా జెప్పఁబడెను.

ఉత్తమశిల్పముల కవ్యవస్థ.

ఇట్లు వక్కాణించిన విషయములో నొక్కసందేహము గలుగఁగలదు. అదే మన:—విశ్వకర్మబ్రహ్మర్షి వంశ్యులగు నీసానగాది ఋషిగోత్రులగు బ్రాహ్మణు లుత్తమశిల్పముల (బ్రాహ్మణశిల్పముల)నే చేయక శూద్రశిల్పములు (నీచశిల్పములు) గూడఁ జేయుచు సామాన్యజనములఁవలనగూడ క్షుద్రప్రతిగ్రహములకుఁ బాల్పడుచు నిప్పటికాలమునఁ జాలమంది మెలంగుచున్నారే! అందులకు గతమెయ్యది? ఇట్టివారిని నుత్తమజాతి పరిగణనీయులుగఁ దలఁచుకొనవచ్చునా? యను సందేహమే.

ఇట్టి సందేహము గలుగవలసినదే. ఈసందేహమెుక్క విశ్వబ్రాహ్మణశాఖ వారికే గాక మన భరతఖండమందుండిన యావద్బ్రాహ్మణ శాఖలవారినిగూర్చియు సందేహించి విచారింపవలసినదే యగును. సానగాది పంచబ్రహ్మవంశస్థులగు విశ్వబ్రాహ్మణులు పూర్వకాలమున బ్రాహ్మణశిల్పములే చేయుటకుఁ బూర్ణావకాశముండెడిది. భరతఖండమందలి యన్నిశాఖల బ్రాహ్మణులును "యశ్చవేదశ్చ వేదీచవిచ్ఛిద్యేతే త్రిపూరుషం । సవై దుర్బ్రాహ్మణోనామ సర్వకర్మ బహిష్కృతః" ఎవ్వఁడు వేదమును వేదికాలంకరణమును ద్రిపూరుషులలోగా విచ్ఛిన్న మొనర్చునో వాఁడు సర్వకర్మలను బహిష్కరించిన దుర్బ్రాహ్మణుఁడగు నను స్మృతివాక్యమునకు భయపడుచుండెడివారు. అట్లు భయపడుచుండుటచే యాగాదులు తరుచుగాఁ

జేయుచుండెడివారు. అందువలననే రథకారబ్రాహ్మణులకు నుత్తమశిల్పములొనర్ప నవకాశముండెడిది. మఱియుఁ బ్రజలయందాస్తిక్యబుద్ధి యతిశయించి దేవతాయతనములు మెండుగా నొనర్పించుచు దైవతప్రతిష్ఠలు తఱచుగాఁ జేయించుచుండెడివారు. అందుచేతను విశ్వబ్రాహ్మణులకే శిల్పరచనమొనర్ప మిక్కిలి యవకాశము గలుగుచుండెడిది. ప్రభువులును ఉత్తమ క్షత్రియసంభూతులగుటచేఁ దమ వరణనిర్మాణమునందును, హర్మ్యనిర్మాణమునందును విజయరథాది నిర్మాణమునందును, ధనురస్త్రశస్త్రాది నిర్మితియందును శిల్పివరేణ్యులగు నీపౌరుషేయులకే ప్రాధాన్య మొసఁగి చేయించుచుండెడివారు. ఇట్లుండియుండ యవనప్రభువులు భరతఖండము నావరించిన వెనువెంటనే యన్నిశాఖల బ్రాహ్మణులును, క్రమక్రమముగా వేదోక్త బ్రహ్మకర్మలు దగ్గించి యాగాద్యుత్తమక్రియల నిరసించి కుక్షింభరులై "శ్వవృత్తిర్నకదాచన" యను బ్రాహ్మణనీతినిఁ ద్రోసిపుచ్చి యవనరాజకులసేవకులై దాదాఁపుగా వారి వేషభాషలనే స్వీకరించి వారి మన్ననలే తమకు గమ్యార్థములుగాఁ దలఁచికొని నామమాత్రులై వఱలుచుండిరి. ఇందువలన శిల్పిబ్రాహ్మణులకు నుత్తమశిల్పములే రచింపనవకాశము దొరకక కలికాలమగుటచే నుదరపోషణకు గ్రామ్యశిల్పములను గూడఁ జేయుటకు దొరకొనిరి. కాని తమ సంధ్యాది నిత్యకర్మలను, యజనాది జన్మషట్కర్మలను విడువక, యభక్ష్య భక్షణములొనర్పక, యన్యశాఖలవారి యన్నోదకములను బొత్తుగా స్వీకరింపక, లభించిన యుత్తమశిల్పములఁ జేయుచు, లేనిచో గ్రామ్యశిల్పములొనర్చి లోకోపకారమొనర్చుచుఁ బూర్వాచారములను బొత్తుగా వదలక యనాగరికులవలె మెలంగుచున్నారు. మఱియుఁ బంచశిల్పసంహితల యధ్యయన మంతయు వీరలే చేయుచున్నారు. శాస్త్రజ్ఞులెల్లరు దైవతప్రతిష్ఠాపనాది ముఖ్యకర్మలయందు వీరలనే పూజింపుచున్నారు. కాని వీరలలోఁ గొందఱైనను ద్రవ్యలుబ్ధులై కర్మభ్రష్టులై కుక్షింభరులై నీచసేవనులై నీచశిల్పము లొనర్పఁ బాల్పడుచున్నారని చెప్పకతప్పదు. అందులచే వారి జాతిగౌరవమెల్లయుఁ బోయినదనుట సమంజసముగాదు. "బ్రాహ్మణోహీనసేవయా" యను వచనమువలన నీచులసేవ యుత్తమమార్గము కాదనియు, భ్రష్టత్వమున కర్హమయినదని తెలిసియు నితరబ్రాహ్మణులలో బహు సంఖ్యాకులు సేవావృత్తికై కడంగుచుండిరి. అందువలన నాబ్రాహ్మణులు భ్రష్టులైరనుటకు సందేహముండునా? పంచాలశిల్పులు కుక్షింభరత్వమునకుఁ గాయక్లేశమునోర్చి కాష్ఠలోహాది కష్టశిల్పములొనర్చుటలో భ్రష్టులైరనుట యోగ్యమా? కర్మభ్రష్టులనఁగా వ్రాత్యులు కలియుగమునం దనేకదేశములలోని బ్రాహ్మణులు వ్రాత్యులైనటులః—

శ్లో॥ సౌరాష్ట్రావంత్యా భీరాశ్చశూర అర్బుదమాలవాః
వ్రాత్యాద్విజాభవిష్యంతి శూద్రప్రాయాజనాధిపాః॥

భాగవతము. ౧౨ స్కంధము. ౧ అధ్యాయము. శ్లో ౩౮

* సౌరాష్ట్రము (సూరతుప్రాంతము) అవంతి (ఉజ్జయనిప్రాంతము) ఆభీరము, (వనాడవగ్గైరా) శూరము, (రాజపుత్రస్థానము) అర్బుద (అబూపర్వతప్రాంతదేశము) మాళవదేశము, ఈ దేశములయందు సర్వప్రకారములను బ్రాహ్మణులు వ్రాత్యులు (ఉపనయనాది సంస్కారభ్రష్టులు, ఆచారభ్రష్టులు) కాఁగలరు. రాజులు శూద్రతుల్యులగుదురు. ఈవాక్యము ద్వాపరయుగాంతమునందుఁ గలియుగమున నిట్లు కాఁగలరని వ్రాయఁబడెను. కావున బ్రాహ్మణులెందఱో వ్రాత్యులై సరగిరఁనుటకు నిస్సందేహము. ఇదిగాక "సంస్కారహీనాభట మారవన్నరా వ్రాత్యా భవంత్యుత్తమవంశజాఽఅపి" అను ముహూర్తమాలోక్తివలన భటమారులన లోకములో నసంస్కారులే. వారిప్పు డుత్తమబ్రాహ్మణులుగ వ్యవహరింపఁబడుచున్నారు. ఇదంతయు బ్రాహ్మణులయొక్క యభిమానమె తప్ప వేఱుకాదు. విశ్వబ్రాహ్మణులపైన నితర ఋషిబ్రాహ్మణుల కభిమానమంతగాఁ గానిపించదు. ఇందులకుఁగారణములు చాలఁగలవు. అవియెల్ల స్థలాంతరంబునఁ బ్రకటింపఁబడు. బ్రాహ్మణులకు నొకప్పుడు వ్రాత్యత్వము సంభవించినను వ్రాత్యస్తోమమను యజ్ఞమొకటిచేసి పావనతఁబొంది వెలయవచ్చును.

---

* బ్రాహ్మణభేదములు వారి యాచారములనుగూర్చి యొకవార్తాపత్రిక యీక్రిందివిధముగాఁ బ్రకటించినది.

మహారాష్ట్రదేశమందలి బ్రాహ్మణజనుల భేదములు కర్ణాటదేశమునందును మద్రాసు ప్రాంతమందును నంతగాలేవు. గుజరాతుదేశమందు మిక్కిలి భేదములుకలవు. అట్లే దాక్షిణాత్యసారస్వతబ్రాహ్మణులయందును మిక్కిలి భేదములు కలవు. వంగ కాశ్మీరదేశములందు బ్రాహ్మణులలో ననేక భేదములు కలవు. బ్రాహ్మణులయందందఱిలోను వేషభాషలు నాచారములు సమానముగాలేవు. బ్రాహ్మణులయొక్క చరిత్రమును బ్రకటించితిమేని దానినిచూచి యెల్లరు సంతోషపడియెదరు. వంగదేశీయులు మాంసమును భక్షించెదరు. గృహమునందు స్పర్శభేదము దోషములేదు. కాశ్మీరబ్రాహ్మణుల గృహములందు మహమ్మదీయులు గృహకార్యముల నిర్వర్తించెదరు. పంజాబుబ్రాహ్మణులు అంగీలు తలగుడ్డలుపెట్టుకొని మంచములపైన భోజనములఁ జేసెదరు. వారి వేషస్థితికి మహమ్మదీయుల వేషస్థితికి భేదములేదు. వారిలోఁగొందఱు మాంసమును దినెదరు. కొందఱు తినరు. కాశియందు శూద్రస్పర్శదోషములేదు. ఘూర్జరులు కాపువారియిండ్లలో జలపానముఁ జేసెదరు. బొంబాయియందుఁ గొందఱు సారస్వతులు వైశ్యగృహములయందు భోజనముఁ జేసెదరు. బెల్గాం, ధార్వాడ, మల్బారు ప్రాంతములందలి బ్రాహ్మణులు స్పర్శదోషమును మిక్కిలిగాఁ జూచెదరు. అదే ధర్మమని తలఁచెదరు-

శూద్రాచరణీయమైనను శిల్పమునకు దోషములేదు. దేవమూర్త్యాది పవిత్ర శిల్పములు విశ్వబ్రాహ్మణులకు వృత్తియగుట శాస్త్రసమ్మతమే. కాని ప్రాకృతజనులు చాలమంది వేదబాహ్యులగు శూద్రయవనాదులచే శిల్పములఁ జేయించుకొనుచున్నారు. అందుచే నాశిల్పమున కపవిత్రతవచ్చియుండదా? వారితో సమానముగ బ్రాహ్మణశిల్పులుగూడఁ జేయుటచే వీరికిఁగూడ కళంక మాపాదింపఁబడదా? యని కొంద ఱందురు.

అయిన నదియు విచారింపఁదగినదే. కలికాలమహిమవలనను మహర్షుల శాపమహిమలవలనను శిల్పములు నీచులస్వాధీనములయినవి. శాపపీడితము లపూజితములని సందేహింప నవసరములేదు. దేవతలలోను రాజులలోను శాపపీడితులెందరో పూజ్యులై వఱలుచున్నారు. ఇంద్రుఁడు సర్వదేవతలకు రాజు. అతఁడట్లైనను శాపపీడితుఁడై దేహమెల్ల యోనులచే నిండించుకొనియెను. చంద్రుఁ డమృతసాగరుఁడు. అయినను శాపవశ మతనినిఁ గళంకితుఁగాఁ జేసెను. విష్ణువు త్రైలోక్యాధిపతి. అతఁడట్లైనను శాపబద్ధుఁడై యనేకావతారములెత్తెను. శివుఁడు దేవాదిదేవుఁడు. అయినను ఋషిశాప మాయనను నరకపాలధారినిఁగాఁ జేసెను. మఱియుఁ బెక్కండ్రు వేలుపులు శాపతప్తులై యంకితులయ్యు లోకపూజ్యతకు నోసరిల్లలేదు. పుడమిఱేం

---

మల్బారునందలి నంబూద్రీబ్రాహ్మణులు, దాక్షిణాత్యుల భోజనములఁజేయరు. వారికి మిశాళజంతువులను పేరుకలదు. ఆదేశీయ బ్రాహ్మణులు నాయరు స్త్రీలతో రమించెదరు. రామేశ్వర సమీపమందు స్పర్శదోషములేదు. మహారాష్ట్రమందలి విధవలు భర్తపోయినతరువాత పది పదిరెండుసంవత్సరముల వరకు వపనము జేసికొనరు. కొంకణసులు భర్తపోయిన వెంటనే వపనమును జేసికొనియెదరు. మహారాష్ట్రిలలో గృహస్థులకు, భిక్షులకు భేదములేదు. భిక్షువులు (గ్రామయాజకులు) మహారాష్ట్రిలు అన్యోన్యవివాహము జేసికొనియెదరు. ద్రావిడాంధ్రులలో నీమార్గములేదు. నంబూదీ బ్రాహ్మణులు క్షత్రియుల యన్నమును దినియెదరు. నంబూద్రీలలో జ్యేష్ఠుఁడు తనభార్యతోనుండును. తక్కిన సహోదరులందఱు నాయరు స్త్రీలతో నుండెదరు. ముట్టడు, ఎల్లెడు నను నంబూద్రీలలో భేదజాతివారు వారిగృహములయందు శస్త్రక్రియలఁజేసెదరు. వారికిని నంబూద్రీలకును సంబంధబాంధవ్యములు లేవు. మార్వారీ, శ్రీమాళీ బ్రాహ్మణులయందు నెవ్వరు పౌరోహిత్యముచేసెదరో వారు నట్లే సింధువారసారస్వతబ్రాహ్మణులందును విధవా వివాహములను బూర్వకాలమునుండియు జేసికొనుచున్నారు. అనిల్వాడా పట్టణమునుండి మూలరాజ నుపేంద్రునిచే నుత్తరహిందూస్థానమునకు వేయిమందిబ్రాహ్మణులు పంపఁబడిరి. వారందఱు ఒకేశాఖవారైరి. వారిని ఔదీచ్య సహస్రులందురు. గుజరాతులలో నొక్కొక్క తెగయందే భిన్నవేదములు పఠించెదరు. వారిలో గొందఱు నొకరొకరు వివాహము జేసికొనియెదరు. ద్రావిడాంధ్రులలోను నిట్టిభేదమును గొందఱు పాటించరు. గుజరాతు దేశమునకు గౌడులు కొందఱువచ్చిరి. వారు మాంసమును ద్యజించి కొన్నాళ్లు గుజరాతులోనిలిచిరి. వారుపంచగౌడులలో జేరినవారా? పంచద్రావిడులలో జేరినవారా? యని విచారింపఁబడిరి. కొందఱు షట్కర్మలలోని

ష్లును నల్లై మెందఱో శాపాంకితులై లోకపూజితులుగనే పరగుచుండిరి. దుర్వాసో ముని శాపమువలన శిల్పములు నీచాచరణములయ్యె నందురు. అయినను శాస్త్రీయములగు శిల్పములుగాని శాస్త్రములుగాని యింతవరకు నీచులపాలుగాలేదు. వేదోక్తశిల్పకార్యములయందు నింతవరకు శిల్పివరేణ్యులగు విశ్వబ్రాహ్మణులు పూజింపఁబడుచునేయున్నారు. శిల్పములు నీచులచే నాచరింపఁబడు మాత్రమున వాని పూజ్యతనుఁ గొఱంత రాఁజాలదు. భగవతియగు విద్యాదేవి జగదేకపూజ్యురాలు. ఆ సరస్వతి శాపమూలముననో, కాలవశముననో యీ చండాలపర్యంతము వ్యాప్తి జెందుచున్నది. అట్టి వాణీమహాదేవి నపూజ్యయనుటకు నెవ్వరికి నోరాడును?

మఱియొక యుదాహరణము,

సంగీతపారిజాతే ॥శ్లో॥ సంగీతం వైదికైర్వాక్యైర్బోధితం బ్రాహ్మణాస్సదా
కృత్వైహికం తథామోక్షం ప్రాప్నువంతిత్వరాన్వితాః
అగ్నిహోత్రం తథాకార్యం గానకార్యంతథైవహి
వేదోక్తత్వాత్స్మృతి ప్రోక్తకర్తవ్యత్వాన్మనీషిభిః ॥౪॥

సామవేదసంహితాయాం నవమాధ్యాయే ద్వితీయపాదే ప్రథమాధికరణే ప్రథమవర్ణకే సామశబ్దస్య గానమాత్రవాచిత్వం స్మరితమితిభాష్యమ్. సామశబ్ద వాచ్యస్య

---

ప్రతిగ్రహమును గ్రహించినవారిని బహిష్కరించెదరు. ఆసవాల బ్రాహ్మణులు గృహస్థులయిండ్లలో పౌరోహిత్యాముల వర్తించెదరు. వారు జైనులకు గురువులయ్యెదరు. పంజాబులోని గౌడ, సారస్వత బ్రాహ్మణులు హీనజాతిస్త్రీలను వివాహముఁజేసికొనియెదరు. వారే ధర్మపత్నులు. పంజాబులోని కొందఱు గౌడబ్రాహ్మణులు విధవలను వేశ్యలవలెఁజూచెదరు. సింధు, రాజపుత్రదేశములలోని బ్రాహ్మణులు మాలాకారనాపిత గృహములలో (మంగలి గృహములలో) భోజనములుచేసెదరు. వీరికిబ్రాహ్మణ్యముకలదా? ఢిల్లీప్రాంత్య బ్రాహ్మణులు, స్త్రీలు పురుషులతో సమానముగా వ్యవసాయము (కృషి) చేయుదురు. మార్వారదేశీయచరణ బ్రాహ్మణులకు రజపుత స్త్రీలను వివాహముజేసికొను పద్ధతికలదు. నేపాళీయ బ్రాహ్మణులలోని విధవలు వేశ్యలవలెఁ బ్రవర్తించెదరు. వారు శూద్ర స్త్రీలను వివాహము జేసికొనియెదరు. వారి సంతానము క్షత్రియులని వ్యవహరించెదరు. వంగదేశములోని భంగకులీన బ్రాహ్మణులు బహు స్త్రీలను వివాహము జేసికొనియెదరు. వారిలో నొక్కొక్కరు పది,పదునైదు, ఇరువది, నలువది, పర్యంతము స్త్రీలను వివాహము జేసికొనియెదరు. ఒరిస్సా బ్రాహ్మణులు శూద్రుల చేతియన్నమును భుజించెదరు. ఇట్టిభేదము లనేకములుగలవు.

పూనాసుధారక్

1—1—1901

మహారాష్ట్రభాషనుండి యాంధ్రీకృతము.

గానమస్యస్వరూప మృగక్షు రేషుక్రుష్టాదిభిః సప్తభిః స్వరైః । అక్షరవికారాదిభిశ్చ నిష్పద్యతే । క్రుష్టః ౧ ప్రథమః ౨ ద్వితీయః ౩ తృతీయః ౪ చతుర్థః ౫ పంచమః ౬ షష్ఠ ౭ శ్చేత్యేతే సప్తస్వరాఇతి.

ఇట్లు వైదికవాక్యము స్పష్టమగుచున్నది. సంగీతవిద్యయు, అగ్నిహోత్రి కర్మయుఁ బ్రత్యేకము బ్రాహ్మణులే యభ్యాసమొనర్పవలెనని విశదమగుచున్నది. వానిలో సంగీతవిద్య సామగాయకులేగాక చాలకాలమునుండి బహు సంఖ్యాకు లనేక క్షుద్రజాతులవారును యవనాదులును వంశపరంపరగా నుపజీవికవృత్తిగా గానము నభ్యాసమొనర్చుచునే యున్నారు. అందుచే గానవిద్య భ్రష్టమైనదా? సామగాయకులగు బ్రాహ్మణులు భ్రష్టులైరా? సామవేదమునకుఁ గళంకమాపాదితమయినదా?

మఱియు జ్యోతిర్నిబంధమునందు,

శ్లో॥ వేదస్యచక్షుః కిలశాస్త్రమే తత్ప్రధానతాంగేషు తతోఽర్థజాతః
అధ్యేతవ్యం బ్రాహ్మణై రేవతస్మాత్ జ్యోతిః శ్శాస్త్రం పుణ్యమేతద్రహస్యం॥

అని వేదాంగములలో జ్యోతిశ్శాస్త్రము ప్రధానత్వమువహించి కేవలము వేదమునకుఁ జక్షువయి ప్రవర్తింపఁబడుచున్నది. అట్టి జ్యోతిశ్శాస్త్రము నిపుడు శూద్రులలో నెందఱో యభ్యాసమొనర్చి వ్యవహరించుచున్నారు. అందువలన జ్యోతిశ్శాస్త్రమున కేమైన లోటువచ్చినదా? జ్యోతిశ్శాస్త్రమునందు సుప్రసిద్ధులగు బ్రాహ్మణుల కేమైనఁ గొఱఁతసంభవించినదా ? అందుచే గ్రామయాజకుల కేమైన బహిష్కారము వచ్చినదా? ఇంకను యూరపుఖండమున జర్మని మున్నగు దేశములయందు హిందూ మతదూరులయినను భట్టమోక్షమూలర్, భట్టకిలహారన్ మున్నగు ప్రసిద్ధపండితులు ఋగ్వేదసంహితను, తద్భాష్యమును గూలంకషముగాఁ జదివి, స్వభాషలో భాషాంతరీకరించి ఆఋగ్వేదసంహిత నన్నిభాగముల నాగరలిపిలో ముద్రణమొనర్చిరి. అంతమాత్రమున నావేదములకు గౌరవము తగ్గినదా? ప్రస్తుతము మన భరతఖండమున ఋగ్వేదసంహితాభ్యాసులగు పండితతల్లజులకు గౌరవము తగ్గినదా? వేదవేదాంగములకున్న గౌరవ మెప్పటికిఁ దగ్గనేరదు. వేదాంగపఠనము బ్రాహ్మణయోగ్యమె. అథర్వవేదమున కుపవేదముగా శిల్పవేదము పుట్టినదని శిల్పకాండమున వివరింపఁబడియె యున్నది. శిల్పవిద్య వేదాంగసమానమనియుఁగూడ,

అణృగయనాదిభ్యః ౪. ౩. ౭౩. ఇతిపాణినీసూత్రగణపాఠె ఋగయన, పదవ్యాఖ్యాన, ఛందోమాన, ఛందోభాషా, ఛందోవిచ్ఛిత్తి, న్యాయ, పునరుక్త,

నిరుక్త, వ్యాకరణ, నిగమ, వాస్తువిద్యా, క్షత్రవిద్యా, అంగవిద్యా, విద్యా, ఉత్పాత, ఉత్పాద, ఉద్యావ, సంవత్సర, ముహూర్త, ఉపనిషద్, నిమిత్త, శిక్షా, భిక్షా, ఇత్యన్యగయనాదిః ,

అని వేదాంగపాఠనముతోఁబాటు వాస్తువిద్య, (శిల్పవిద్య) నభ్యసింపఁదగినటులఁ బాణిన్యాచార్యులు వచించియున్నారు. వేదాంగములాఱు వానిలో, పాదములు చందస్సు, హస్తములు కల్పములు, నేత్రములు జ్యోతిశ్శాస్త్రము, కర్ణములు నిరుక్తము, నాసిక శిక్ష, ముఖము వ్యాకరణము, అని యంగవిభాగములు చేయఁబడినవి. శిల్పమనునది రూపనిర్మాణము. అట్టి రూపమును గ్రహించునది నేత్రేంద్రియము. నేత్రస్వరూపకమయినది జ్యోతిశ్శాస్త్రము. అనగా శిల్పశాస్త్రము జోతిశ్శాస్త్రాత్మకమైనది. శిల్పశాస్త్రజ్ఞులు వేదాంగజ్ఞులనుటకు సందేహముండదుగదా? ఇంతయేకాక జోతిశ్శాస్త్రజ్ఞులకు దైవజ్ఞులని పేరు. శిల్పజ్ఞులకుఁగూడ దైవజ్ఞనామము లోకప్రసిద్ధమేకదా? ఎవరెట్లు విచారించినను శిల్పవేద ముపవేదము, శిల్పశాస్త్రము వేదాంగము, శిల్పజ్ఞుఁడు దైవజ్ఞుఁడు. (బ్రాహ్మణప్రవరుఁడు.) అట్టి శిల్పతత్వము నెవ్వరెట్లు అభ్యసించినను, నెవ్వరెట్లు తగ్గించఁబ్రయత్నించినను, అద్దానికి గౌరవభంగమే మాత్రముకాఁజాలదు. ఆశిల్పివరేణ్యు లేమాత్రము గౌరవహీనులు కాఁజాలరు.

## రథకారశబ్దమునకాప్తవాక్యము.

ఇంక మఱియు రథకారశబ్దమునకు నాప్తవాక్యమెట్లున్నదో విచారించుదము. "ఆప్తస్తుయథార్థవక్తా" అనున్యాయోక్తిచే ఆప్తుఁడనగా యథార్థవాదిగదా? వేదార్థమును సత్యబద్ధతచే వివరించువాఁడనియె యాప్తశబ్దమునకు నిర్వచనము. వారిలోఁ బ్రాచీనకాలమున యథార్థవక్తలలో సుప్రసిద్ధిఁజెందినవారిని నిశ్చయించుదము. స్మృతులు ప్రాచీనములు. వానికంటె సూత్రములు మిక్కిలిప్రాచీనములు. ఆసూత్రకర్తలలోఁ బ్రసిద్ధుఁడును యథార్థవక్తయునగుమేటి యాపస్తంబమహాఋషి. ఆమహాఋషి యథార్థవక్తృతకునిదర్శనముగ మత్స్యపురాణసప్తమాధ్యాయమున "ఆపస్తంబస్తతశ్చకేప్రి పుత్రేప్రిష్టిందప్రవిణాధికాం" అనువాక్యమువలన నాపస్తంబుఁడు పుత్రకామేష్టియొనర్చి మరుద్గణముల నుదయింపఁజేసినటులఁ దెలియుచున్నది. ఆఋషి తల్లజుఁడు రథకారశబ్దమునుగూర్చి, తనశ్రౌతసూత్రమున నాధానప్రకరణమున:—

కృత్తికాసుబ్రాహ్మణ ఆదధీతముఖ్యో బ్రహ్మవర్చసీభవతి ।
వసంతే బ్రాహ్మణస్య । గీష్మేరాజన్యస్య । హేమంతేవా ।

శరద్వైశ్యస్య । వర్షారథకారస్య । యేత్రయాణాం
వర్ణానామేతత్కర్మకుర్యుస్తేషామేషకాలః॥

ధూర్తస్వామి భాష్యమ్॥ ఇదానీంత్వయ మభిప్రాయసూత్రకారస్య। త్రయాణా మంతర్భూతాయే కుర్వంతి రథకరణం తేరథకారాః.

ఈ భాష్యానుసారముగ నిప్పుడు సూత్రకారుని యభిప్రాయమేమనగా:— బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులను త్రైవర్ణికులలో నెవ్వరీ రథకరణమును జేయుదురో వారే రథకారులు. అని యాపస్తంబ మహర్షి వ్రాయుచ్చుటచే యథార్థవక్తయగు నీ యాపస్తంబుని యాప్తవాక్య ముగ్గడింపఁబడుచున్నది. కావునఁ ద్రైవర్ణికుఁడు రథకారుఁడనుట విస్పష్టమయ్యెను. ఇంతయెకాక,

కర్కదేవయాజ్ఞికోద్దేశ నిరాకరణము.

కాత్యాయనీ సూత్రమందలి "రథకార స్యాధానేనియతంచ నాభావాదితి వాత్స్యః" యను వాక్యమునకు యథార్థవాదియగు వాత్స్యముని యుద్దేశమునకు విరుద్ధముగాఁ గర్కదేవయాజ్ఞికులు "రథకారస్యాధా నేనియతంచ" అని విభాగ మొనర్చి (రథకారునికి నాధారము నియమింపఁబడినదిగాని) యను నర్థముఁజేసి "నాభావాత్" అను వాక్యమునకు "అభావాత్ నత్రైవర్ణికో రథకారః" అని (లేకపోవుట వలనఁ ద్రైవర్ణికుఁడు రథకారుఁడు కాఁడని) వ్యాఖ్యానమొనర్చిరి. వాత్స్యమునికిఁ ద్రైవర్ణికుఁడు కాఁడని యుద్దేశములేదు. పెక్కండ్రు వ్యాఖ్యాతలు పెక్కువాఖ్యానములయందు మూలములకు విరుద్ధములుగా వ్రాయుటయుఁ బ్రసిద్ధవ్యాఖ్యాతలు మూలమునుఁ జక్కగా గుర్తించి వ్రాయుటయుఁ బెక్కుచోటులఁ గానిపించుచున్నది. ఇట్లె "యథాత్రియాణాం" అను మనుస్మృతి. దశమాధ్యాయమందలి యిరువది యెనిమిదవ శ్లోకమునకు "ద్విజాద్యుత్పన్న ప్రతిలోమప్రాశస్త్యార్థమిద"మ్మని కుల్లూకభట్టు ద్విజాదులవలనఁ గలిగిన ప్రతిలోముల ప్రసిద్ధికొఱకిది యను నర్థము గలుగునట్లు వ్రాయఁగా మేధాతిథియను నతఁడు "ద్విజత్వప్రతిపాదకమేతదేషాం వచనముపనయనార్థ"మ్మని, యీప్రతిలోములకు ద్విజత్వప్రతిపాదకమైన యీవచన ముపనయనముకొఱకని వ్రాసెను. ప్రతిలోములగు శూద్రుల కుపనయనాధికారము లేదని మూలానుసరణముగాఁ గుల్లూకభట్టును బ్రతిలోముల కుపనయనాధికారము గలదని మూలాతిక్రమణముగా మేధాతిథియును వ్రాసిరి. వీనిలోఁ గుల్లూకభట్టు "ప్రతిలోమజాస్తు ధర్మహీనాః" అను గౌతమోక్తి ననుసరించి ప్రతిలోము లుపనయనాది ధర్మహీనులని నిర్ధారణమొనర్చెను. మరియుఁ బ్రతిలోముఁడు శూద్రుఁడు వానికుపనయనాధికారము

గలదనుట భ్రిమప్రిమాదము. కాత్యాయనీ సూత్రిమునందు "శూద్రస్య వేదాక్షర శ్రవణే ఉచ్చారణే ధారణే చప్రాయశ్చిత్తస్య దర్శనాత్ | శ్రవణేత్రపు జతుభ్యాం శ్రోత్ర పూరణం ఉచ్చారణేజిహ్వాచ్ఛేదః ధారణేచ శరీరభేదఇతి" అనిశూద్రునకు వేదాక్షరము వినుటయందును, బలుకుటయందును, ధరించుటయందును బ్రాయశ్చిత్తముండుట వలన వినినచో సీసముచేతను లక్కచేతను జెవులుపూరించుటయుఁ బలికిన జిహ్వాచ్ఛేదనమును, ధరించిన శరీరచ్ఛేదనమును జేయవలెనని మహాభయంకరమైన యింతటి యసహ్యాకరమగు కఠినశాసనము నిర్మింపఁబడియున్నదే! ప్రితిలోమునకెట్లు వేదాధికారము పొసఁగును? అందువలననే "మాహిష్యేణకరణ్యాంతు రథకారః ప్రిజాయతే | నైవోపనయానంతస్య శూద్రిధర్మాద్బహిష్కృతః" అని మాహిష్యకరణీసుతుఁడైన సంకీర్ణసంకరరథకారునికి ఉపనయనాధికారము కలుగనేరదని స్మృత్యంతర వాక్యముగానిపించుచున్నది. సంకరరథకారునకు "వర్షాబుభూణా" మనునాధానాధికారవాక్యముగలిగినదనుట కేవలమసంభావ్యవాక్యముగాని వేఱుగాదు. కారణమేమన:—అనధికారమగు త్రైవర్ణికబహిర్భూతజాతికి, అనన్వితవిశిష్టవిధానము నిర్ణయించుట కేవలమసంభావ్యమేగదా? ఇట్టియసంభావ్యములు పెక్కుచోట్లకలవు. వానిలో సంకీర్ణసంకరరథకారజాతికి "ఇజ్యోపనయనవాస్తుశాస్త్రాధ్యయనతాచేతి" యని యజ్ఞము, ఉపనయనము, వాస్తుశాస్త్రాధ్యయనముగలదనిచెప్పుటయు "శూద్రా వాజిసనేయకాః" యని శూద్రులు వాజిసనేయకులనుటయు నిట్టివియె. శ్రుతులకవిరోధముగఁ బూర్వసూత్రిమునకెట్లు వ్యాఖ్యానముఁ వ్రాయఁబడియున్నదోచూడుఁడు.

కాత్యాయనీసూత్రివ్యాఖ్యానర్షా—బుభూ—స్వేతిశ్రుత్యాసమర్థస్య రథకారస్యాధానే అధికారోభవతీతినియతం | చకారాత్పుష్ఠాంతరం తేన స్మృత్యుక్తసంకీర్ణ రథకారాభిధస్యోద్దేశేనతత్పదంపునః పఠిత్వా | అభావాత్ సంకీర్ణజాతీయస్యసామర్థ్యాభావాత్ | అధికారోనభవతీతివాత్స్యః॥ అనగా—"వర్షాసురథకారోఽగ్నీనాదధీత"

---

The Katyayana Sutra has had many Commentators as ............ Karka and Devayajnika or Yajnikadeva.... The works of the last three and that of Karka are however, the only ones that seem to have been preserved. Its statements may for the most part be correct but it is extremely incomplete and from beginning to end is evidently quite a modern compilation."

"There exhibit as to style, some differences from the original wording, resulting from abbreviations; the extracts come from the scholium of Karka and from an anonymous epitome (Samkshiptasara) of Deva, the M. S. of which dates from Samvat 1609. None of these commentaries is complete."

యనియు, "ఋభూణాంత్వానిత్రపతే నిత్రే నాదధామీతిరథకారస్య" యనియు విశుత్రిమములగు శ్రుతివాక్యములచే సమర్థుఁడగురథకారునకు నాధానమునందధికారము గలదని నియమింపఁబడినది. చకారమువలనఁ బక్షాంతరముగా నాస్మృత్యుక్తసంకీర్ణ రథకారాభిధానునియొక్క యుద్దేశముచే నాపదమును దిరిగిపఠించి సంకీర్ణరథకారునికి సామర్థ్యాభావమువలన నధికారముగలుగదని వాత్స్యమునివాకు్రిచ్చినట్లు తెలియు చున్నది. ఇట్లె యాపస్తంబసూత్రిభాష్యకర్తయగు రుద్రిదత్తాచార్యులు "యేత్రియాణాం వర్ణానామేతత్కర్మకుర్యుస్తేషామేషకాల" యని త్రైవర్ణికులలో నెవ్వరీ కర్మచేయుదురో వారికీకాలమనియు, నిట్లే ధూర్తస్వామి తనభాష్యమునందును, బోధాయనసూత్రిమందలి సుబోధినీవృత్తియందును, యేత్రియాణాం వర్ణానామంత ర్గతా ఏతత్కర్మకుర్యుస్తేషామేషకాలఇతిసమర్థానాం త్రైవర్ణికానామయంకాలః" యని త్రైవర్ణికాంతర్గతులగు నెవ్వరీకర్మఁజేయుదురో వారికీకాలమని సమర్థులగు త్రైవర్ణికులకేయీవర్షాకాలమనియుఁ దెలిపిరి. సమర్థులనఁగారథనిర్మాణచతురిమయందు సమర్థతగలవారలనితోఁచెడిని. కాఁబట్టి కల్పసూత్రికారులెల్లరు నేకాభిప్రాయము తోడనే రథకారుని త్రైవర్ణికునిగానిర్ణయించిరి. వ్యాఖ్యాతలలోఁ గర్కదేవయాజ్ఞికులే తమతార్కికోహలఁబెంచి పెద్దవిగాఁజేసి యయథార్థకల్పనలలో మిన్నలైరి. *

ఇంకయు నిట్లేకొందఱు కర్కదేవయాజ్ఞికుల వ్యాఖ్యానమె యోగ్యమైనది. సంకీర్ణరథకారునికే యీయాధానాధికారము కలిగియుండవచ్చును; గారణమేమనఁ ద్రైవర్ణికునకెచ్చటనైన శిల్పోపజీవనము కల్పింపఁబడియుండకపోవుటయెయని నిశ్చ యింతురు. వారియూహదూరదృష్టిలేక భ్రిమప్రిమాదావృతమైనదని చెప్పవచ్చును.

---

* కర్కుఁడు...... దేవయాజ్ఞికుఁడు లేక యాజ్ఞికదేవుఁడు మున్నగువారనేకులు కాత్యాయన సూత్రమునకు వ్యాఖ్యాతలు గలరు. ఐనను కడపటి మువ్వురయొక్కయుఁ గర్కునియొక్కయు వ్యాఖ్యానములుమాత్రమే భద్రపఱచఁబడినట్లు తోఁచుచున్నది. అందుఁజెప్పఁబడిన విషయములు చాల వఱకు సక్రమములుగానుండవచ్చునుగానియయ్యది యెంతయు నసమగ్రము. మఱియు నాద్యంతము ఆధునికరచనయైనట్లు స్పష్టముగాఁగనబడుచున్నది.

మూలమునందు సంక్షిప్తశబ్దములుండు కారణమున ఈ వివిధవ్యాఖ్యానములందును గొన్నిశబ్దభేదములు కనుపించుచున్నవి. (ఇందుదహరింపఁబడినవ్యాఖ్యాన) భాగములు కర్కునియొక్కయు అనామికుండెవని చేతనో సంక్షిప్తసారము అనుపేర సంగ్రహింపఁబడిన (దేవయాజ్ఞికు)ని యొక్కయు వ్యాఖ్యానములనుండి గైకొనఁబడినవి. దేవయాజ్ఞికువ్యాఖ్య. 1609వ సంవత్సరమునుండి ప్రచారములో నుండెను. ఇందొక్కవ్యాఖ్యయైనను సంపూర్ణముగాలేదు.

హిష్టరీఆఫ్ యిండియన్ లిటరేచర్

(ఎ. వెబ్బర్ గారిచే చేయబడినది.)

పేజీలు- 141-142.

## త్రైవర్ణికులకు శిల్పోపజీవన మనిషిద్ధము.

బ్రాహ్మణాది వర్ణత్రయమువారికిఁ దపస్సు, ప్రజాపాలనము, కృషివాణిజ్యాది కము విధ్యుక్తధర్మములు క్రమముగాఁ జెప్పఁబడినవి. వానిలో బ్రాహ్మణులకు యజన, యాజ, నాధ్యయ, నాధ్యాపక, దాన, ప్రతిగ్రహములను నాఱుకర్మలుఁ పోనియమానుకూల్యములు. యజన, యాజనములన, యజ్ఞములుచేయుట, వానినిఁ జేయించుటయు నగును. బ్రాహ్మణ్య ప్రథమ ధర్మములగు యజన యాజన ములలో నంతర్భూతములగునవియే శిల్పములు. శిల్పకృియేతరముగ యాజనకార్యము మాత్రముగా నెరవేరదు. కారణమేమన, యజ్ఞరథ, యజ్ఞపాత్ర, యజ్ఞవేది ప్రముఖ సాధనములు శిల్పములుగదా? వానిని నిరసించి యాజనకర్మమెట్లు సాకల్యమందును? వాజపేయయాగము రథప్రధానకార్యము. వాజపేయ యజ్ఞవిషయములో,

శ్రు॥ సవాఏషబ్రాహ్మణస్య చైవరాజన్యస్య యజ్ఞః । తంవాఏతం వాజ పేయఇత్యాహుః॥

తై॥ బ్రా॥ ౧. ౭. ౭.

భా॥ సబృహస్పతినా అనుష్ఠిత ఏషఇంద్రేణానుష్ఠితః॥ దేవానాం మధ్యే బృహ స్పతిర్బ్రాహ్మణజాత్యభిమానీ । ఇంద్రః క్షత్రియజాత్యభిమానీ । తాభ్యా మేవానుష్ఠి తత్వాన్మనుష్యే ష్వపిబ్రాహ్మణరాజన్యయోర్వాత్రాధికారో నతువైశ్యస్య॥

తా॥ ఆ వాజపేయయజ్ఞము బృహస్పతిచే ననుష్ఠింపఁబడి యదియె యింద్రు నిచే ననుష్ఠింపఁబడినది. బృహస్పతి బ్రాహ్మణజాతియం దభిమానముగలవాఁడు. ఇంద్రుఁడు క్షత్రియకులాభిమాని. వారిరువురిచేతనే యనుష్ఠింపఁబడుటవలన మను ష్యులయందును బ్రాహ్మణ క్షత్రియులకే యధికారము గలదుగాని, హిరణ్యకేశి సూత్రములో నాధాన తృతీయ ప్రశ్నయందలి సప్తమ పటల పాత్రనిర్మాణప్రకరణ మున "అశూద్రకృతామ్" అను వాక్యమునకు "శూద్రవ్యతిరిక్తేన త్రైవర్ణికే నైవకృతాం" అని పాత్రనిర్మాణము శూద్రవ్యతిరిక్తునకే విధింపఁబడి యుండినను, వైశ్యున కీవాజపేయయజ్ఞ కర్తృత్వమునం దధికారములేదు.

అనియిట్లునుడువఁబడియుండుటచే రథవిషయికవాజపేయ యజ్ఞకర్తృత్వము బ్రాహ్మణ క్షత్రియులకే నిర్ణయింపఁబడినది. ఇందువలననే యాపస్తంబకల్పసూత్ర మున "శరదివాజపేయేనయజేత బ్రాహ్మణోరాజన్యో వృద్ధికామః" యని శరత్కాల మున వాజపేయ యజ్ఞము బ్రాహ్మణ క్షత్రియులకే విధింపఁబడినది.

ఇఁక వైశ్యులకు వాజపేయ యజ్ఞాధికారము లేదుగనుక బ్రాహ్మణ క్షత్రి యులకే రథకారవాజపేయ యజ్ఞాధికారముండుటచే, బ్రాహ్మణ క్షత్రియులకే రథాదిశిల్పకార్య మత్యంతావశ్యకమయి, చేయ విధాయకమయియున్నది. మఱియు,

శ్రు॥ రథచక్రం పరివర్తయతి । మనుష్యరథే నైవ దేవరథం ప్రత్యవరోహతి॥

తై॥ బ్రా॥ అ ౧. ౧. ౬.

భా॥ గార్హపత్యాదాహవనీయం ప్రత్యగ్నేః ప్రణయనకాలే రథచక్రస్య పరివర్తనం। అనేన మనుష్య రథపరివర్తనేననీయమానాగ్న్యర్థః దేవరథఏవ ప్రవర్తితో భవతి॥ ఈమంత్రస్థిత బ్రాహ్మణానువాకమునం దెల్లయెడల రథపరివర్తనమును గూర్చియె చెప్పఁబడినది. ఈవాజపేయ రథప్రవర్తనము గార్హపత్యమునుండి యాహవనీయము వరకుఁ బ్రవర్తింపఁబడుచున్నది. ఈమనుష్యరథము వర్తింపఁజేయు టచే దేవరథముగనే పరివర్తింపఁబడుచున్నది. కావున వాజపేయ యజ్ఞము రథ కారప్రధానవిషయికమనియు, అందలి రథము మనుష్యరథమయ్యును దేవరథముగనే పరివర్తించుచున్నదనియుఁ బర్యవసితమగుచున్నది. ఈరథప్రముఖ నిర్మాణకార్యము ముఖ్యముగా బ్రాహ్మణులకు క్షత్రియులకు నత్యావసరమెకాని వారిలో బ్రాహ్మణు లకే యత్యంతావశ్యమని తేలుచున్నది. పూర్వోక్తవాజపేయయజ్ఞమునందుఁ బ్రప్ర థమకర్తయగు బృహస్పతి తాను మున్ముందుగ రథనిర్మాణమొనర్చి తరువాత నింద్రు నిచేఁ జేయించుటలో రథకర్తృత్వముమాత్రము తానెవహించి యార్త్విజ్యము నెఱ వేర్చినటుల సూచన యగపడుచున్నది. అందుచే నింద్రపాలితులగు క్షత్రియుల కంటె బృహస్పతి పాలితులగు బ్రాహ్మణులకు రథనిర్మాణాది యాజ్ఞికశిల్పము ముఖ్యా వశ్యక విధాయకమయియున్నదనుటలో సంశయమేమియుఁ గానరాదు. మఱియు, రథపాత్రాది నిర్మాణశిల్పమంతయు యాజనధర్మములోఁ జేరినదిగాని యజనధర్మము గానేరదు. "త్రయోధర్మానివర్తంతే బ్రాహ్మణాత్ క్షత్రియంప్రతి । అధ్యాపనం యాజనంచ తృతీయశ్చ ప్రతిగ్రహః" (మను. అ ౧౦. ౭౭) అను స్మృతివాక్యము వలన బ్రాహ్మణునికంటె క్షత్రియునకు నధ్యాపనము, యాజనము, ప్రతిగ్రహము నను మూఁడు ధర్మములు మఱలింపఁబడినవని తెలియుటచే క్షత్రియునకు యాజన ధర్మమునందధికారములేదు. యాజనాధికారములేని క్షత్రియునకు శిల్పమునందధి కారము గానిపింపమి విస్పష్టమయ్యెను. కావున నీయాజనశిల్పము బ్రాహ్మణునకే పూర్ణాధికారముగలదు.

## శిల్పము త్రైవర్ణికులలో బ్రాహ్మణులకే ముఖ్యవిధి.

కల్పసూత్రము (ఆపస్తంబకాత్యాయనాదు)లలో రథాదినిర్మాణకార్యము వర్ణత్రయసాముదాయికముగా విధింపఁబడియుండుటచేఁ ద్రైవర్ణికులును, జేయవలసియుండునుగదా? యనియుఁ గల్పసూత్రములలో బ్రహ్మక్షత్రియవైశ్యులలో నెవ్వరీరథమును జేయుదురో వారికే యీయాధానాధికారమని నిర్వచించియుండుటచే రథకారుఁడొకజాతివాఁడు కాకపోవుచున్నాఁడుగదా? యనియుఁ బ్రశ్నింపనవకాశము గలుగుచున్నది.

ఈప్రశ్నకు సమాధానము పూర్వోక్తశీర్షికక్రిందనే కొంతవ్రాయఁబడియె యున్నది. కాని మఱికొంతవివరించుట యావశ్యకము. కల్పసూత్రకర్తలును, వ్యాఖ్యాతలును, రథకారులు త్రైవర్ణికులని సామాన్యముగానిర్ణయించినను, వారు ద్విజులని ముఖ్యాభిప్రాయము. సంకీర్ణజాతీయేతరత్వమును నిర్ధారణమొనర్చుటకుఁ ద్రైవర్ణికులనినుడివిరి. కాని వీరు త్రైవర్ణికసామాన్యులుగ నిర్ణీతులయ్యును ద్రైవర్ణికులలో బ్రాహ్మణులైనటుల పెక్కులుదాహరణములు గానవచ్చుచున్నవి. మఱియు నిట్లుగాక ద్విజసామాన్యముగ నిర్ధారణమొనర్పఁబడి ద్విజులలో జాతిభేదము పరిగణింపఁబడకపోవుటచేత ద్విజులలో నెవ్వరనియుఁగూడ విచారితమగును ఆచారార్కమయూఖమందలి "యత్రదిఙ్నియమోనాస్తి తత్రప్రాచీసమాహృతా" యను వాక్యముచే నెక్కడదిక్కుయొక్కనియమము చెప్పఁబడదో యక్కడఁబ్రాగ్దిక్కనియే నిర్ణయించవలెనని తెలియవచ్చుటచేతను, ఆశ్వలాయనపరిశిష్టమునందు "అనాదేశే ఆజ్యమ్" అనినుడివియుండుటంజేసి హననకర్మయందు హోమద్రవ్యమును నిర్ధారణచేయకుండుటచే నాహోమద్రవ్యము నాజ్యముగనే నిర్ణయింపవలెనని విశదపడుటవలనను, సామాన్యతః త్రైవర్ణికుఁడని సాముదాయికోక్తిప్రకటితమై ప్రత్యేకజాతి నిర్ధారితముగాకుండుటచే బ్రాహ్మణుఁడని చెప్పకతప్పదు. ఇంకను విచారించిన "బ్రహ్మక్షత్రియ విట్ఛూద్రవర్ణాస్త్వాద్యాస్త్రయోద్విజాః" అను యాజ్ఞవల్క్యస్మృతివాక్యముచే బ్రాహ్మణక్షత్రియవైశ్యులనువారలు ద్విజులని విశదపడుచున్నది. అట్లయినను, "ద్విజాన్ సంతోషయేత్సుధీః" అనుపట్టున ద్విజులనునెడల బ్రాహ్మణులనియె నిర్ణయించుచున్నారు. ద్విజశబ్దము బ్రాహ్మణపర్యాయముగ వేలకొలంది-చోటులఁ బ్రసిద్ధముగవాడుచున్నారు. కావున రథకారుఁడు త్రైవర్ణికుఁడని సూత్రకర్తలు సామాన్యతః ప్రతిపాదించినను, రథకారులని నిర్ధారితులగువారలెల్లరు బ్రాహ్మణేతరు (క్షత్రియవైశ్యు)లుకాక బ్రాహ్మణులనియె నిర్ణయించితీరవలెను.

"శిల్పమధ్యయనం నామ వృత్తం బ్రాహ్మణలక్షణ" మ్మను భారతేతిహాసోక్తి (అ 32.) శిల్పవేదాధ్యయనములు బ్రాహ్మణచిహ్నములనియుఁగూడఁ బూర్వోక్త నిర్ణయమును బలపఱచుచున్నది.

వెండియుఁజూచిన సృష్టివిద్యాపరాయణులును, బ్రపంచయజ్ఞపోషకులునగు నీరథకారవర్యులు బ్రాహ్మణులనియు, ద్విజులనియు, నేతశులనియు, విప్రులనియు, కవులనియు, గగనఘంటాపథక్రమమున శ్రుతిస్మృతిపురాణేతిహాసాదులచే నుద్ఘోషింపఁబడినట్లితఃపూర్వమునఁ బెక్కుప్రమాణములుదాహరింపఁబడియుండినను, వానిలోఁ గొన్ని సంగ్రహవాక్యములు చర్విత చర్వణముగ నీక్రిందనుదాహరింపఁబడినవి.

యఇమావిశ్వాభువనానిజుహ్వదృషిర్హోతానిషసాదపితానః॥ యజుఃకాం ౪.

ఈసమస్తభువనములను విశ్వకర్మ తనయందాహుతిగవేసికొని ఋషియై మాకు జనకుఁడై నిలిచెను. (ఋషియనుటచే జితేంద్రియుఁడగు బ్రాహ్మణుఁడని నిర్ధారణ మగుచున్నది.)

శ్లో॥ విశ్వకర్మాసమాగత్యతతోమస్తకమండనమ్
చకారబ్రాహ్మణశ్రేష్ఠోనాగరాణాంమతేస్థితః॥ స్కం.నా.౧౩౧.

బ్రాహ్మణశ్రేష్ఠుఁడగు విశ్వకర్మవచ్చి మస్తకభూషణమును జేసెను.

శ్రు॥ శిశీతేనూనంపరశుంస్వాయసంయేనవృశ్చాదేతశోబ్రహ్మణస్పతిః॥
ఋక్. వ. ౧.

ఏతశ(బ్రాహ్మణ) వర్ణుఁడగు త్వష్టపాత్రాదినిర్మాణశిల్పమున కధిపతియగును. ఆత్వష్టబలిష్ఠమగు న్యాయసపరశువును హవిరగ్నియందుఁదీక్ష్ణమైనదానినిఁగాజేసెను.

శ్లో॥ వృణీమహేత్వోపాధ్యాయం బ్రహ్మిష్ఠం బ్రాహ్మణంగురుం.
భాగస్కం. ౬.

(త్వష్టృపుత్రుఁడగు విశ్వరూపాచార్యునిగూర్చి దేవతలనుట) బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁడును బ్రాహ్మణుఁడునగు నిన్నుగురువుగను నుపాధ్యాయునిగను వరించుచున్నాము. మఱియు, "తద్విశ్వరూపం భజతాశువిప్రంతపస్వినం త్వాష్ట్రమథాత్మవంతమ్" భాగ॥ (బ్రహ్మదేవుఁడు దేవతలతోఁజెప్పునది) ఆహేతువువలనఁ ద్వష్ట్రపుత్రుఁడును నిశ్చలతపోనిష్ఠాగరిష్ఠుండును, బ్రాహ్మణుఁడునగు విశ్వరూపు నాచార్యునిగాసేవింపుఁడు.

"కుర్యాదింద్రియమంత్రేణ బ్రాహ్మణశ్శిల్పిసత్తమః" } కశ్యపబ్రహ్మ
"విధిస్స్యాత్సర్వదావిప్రశ్శిల్పీభూయాత్సుదీక్షితః" } శిల్పశాస్త్రము

ఇంద్రియమంత్రముచేత బ్రాహ్మణుఁడగు శిల్పివరేణ్యుఁడు శిల్పమును రచింపవలెను. ఎల్లప్పుడును దీక్షాగరిష్ఠుఁడై బ్రాహ్మణుఁడగు శిల్పియనుష్ఠానము జేయవలెను.

"చితోఽగ్నిర్బ్రాహ్మణైస్తత్రకుశలైశ్శిల్పకర్మణి" (వా॥ రామాయణము) శిల్పకర్మయందు నేర్పరులగు బ్రాహ్మణులచే గరుడాకృతినిర్మింపఁబడినది. "అగ్నయె బ్రహ్మఋభవః" ఋక్ న. ౩.౧౨. భాష్యమ్. అగ్నయె బ్రహ్మఋభవో మేధావిన స్తతక్షుః" మేధావులగు ఋభువులగ్నికొఱకు స్తోత్రమునురచించిరి.

"విప్రాయ" ఋక్ ౬.౮.౧౧. భా॥ విప్రాయమేధావినే. విప్రుఁడైన (మేధావియైన) రథకారునికొఱకు,

ప్రాసాదంప్రవిశేచ్ఛిల్పీరథకారద్విజోత్తమః" పద్మసంహితాక్రియాపాదేప్రతిష్ఠావిధా॥ రథకారబ్రాహ్మణుఁడు ముందుగఁ బ్రాసాదమును బ్రవేశింపవలయును.

"ఇదంతృతీయం సవనం కవీనామృతేనయేచమసమైరయంత"

నై.డ.ష.దే.కాం.

భా॥ యేమనుష్యాః ఋతేన సత్యేన యజ్ఞేనవా చమసం ఐరయంత ప్రణీతవంతః। తేషాంకవీనాం క్రాంతప్రజ్ఞానాం కారూణాం ఋభూణాం ఇదం తృతీయం సవనం భవతీతి చైతదర్థః॥

ఏమనుష్యులు సత్యముచేతను (యజ్ఞముచేతను) చమసపాత్రను జేసిరో, అట్టి కవు (క్రాంతప్రజ్ఞు)లును శిల్పులునగు ఋభువులకు నీతృతీయ సవన (సాయంకాలహోమ) మగుచున్నది. "సౌధన్వనా ఋభవస్సూరచక్షసః" యను ఋగ్వేదవచనమునకు "సుధన్వన అంగీరసస్య ఋషేః పుత్రాః" యని అంగిరః పుత్రుఁడగు సుధన్వ ఋషికి ఋభువులగు రథకారులు కుమారులని భాష్యకర్త యన్వయ నిరూఢి.

ఈసంగ్రహవాక్యములు గ్రంథ విస్తృతిభీతిచే స్థాలీపులాక న్యాయముగా నుదాహరించి సంక్షేపింపఁబడియె. ఇంతయెకాక, విశ్వకర్మ ప్రజాపతి ముఖోద్భూతులును, రథకారబ్రాహ్మణ వంశమునకు మూలపురుషులు నగు మనుమయాది బ్రహ్మపంచకమునకుఁ గ్రమముగా బూర్వోదాహృతమగు "అయస్కృతిర్మనూనాంచ, మయానాందారుకర్మచ, త్వష్టా కాంస్యాదిలోహానాం కర్తా శూరస్సపండితః।శిల్పీ సర్వ

శిలాభేదీ బ్రహ్మాది సురకల్పకః। దైవజ్ఞో హేమకృద్భోగీ నానాభూషణనైపుణః। దక్ష స్సర్వకులశ్రేష్ఠో నానావిద్యాగురుః ప్రభుః" అని స్కందపురాణ నాగరఖండ విశ్వకర్మో పాఖ్యానమునందు మనువున కాయసకర్మయు, మయునకు దారుక్రియయు, శూరుఁడును బండితుఁడునగు త్వష్టకుఁ గాంస్యాది (కంచు మొదలుగాగల) లోహకార్యమును, శిల్పికి సమస్తశిలావృత్తియు, సమర్థుడును నానాభూషణ కార్యములయందు నేర్పరియు సమస్త కులశ్రేష్ఠుఁడును సర్వవిద్యలకు నాచార్యుఁడు నగు దైవజ్ఞ ప్రభువునకు సువర్ణ నిర్మాణమును విశ్వకర్మపరమేశ్వరునిచే నిర్ధారణ మొనర్పఁ బడినటులఁ దెలియనచ్చుట చేతను, ఇట్లె "అయసాంచమనుఃకర్తా కాష్ఠకారో మయస్స్మృతః। త్వష్టృకః కాంస్యకర్తాచ శిలాకర్తాచ శిల్పికః। దైవజ్ఞస్స్వర్ణకారశ్చ పంచానాం పంచకర్మకమ్। యో వేదపంచకర్మాణి సర్వపాపైః సముచ్యతే" అను శైవాగమోక్తివలన, అయస్కర్త మనువనియు, దారుకారుఁడు మయుఁడనియు, కాంస్యకారుఁడు త్వష్టయనియు, శిలాకారుడు శిల్పియనియు, హేమకారుఁడు విశ్వజ్ఞుఁడనియు నీమైదువృత్తులు స్మరించుట చేత సమస్తపాపములు క్షయించునని విశదపడుటచేతను, బ్రహ్మలును బ్రాహ్మణులు నగు మను, మయ, త్వష్టృ, శిల్పి, విశ్వజ్ఞులను నేఁగురురథకారవర్యులకు నాయసాది శిల్పకర్మము విధాయక కార్యమని లోకోత్తరముగ స్పష్టపడుచున్నది. మఱియుఁ ద్వష్టృప్రజాపతి పుత్రుఁడును బ్రహ్మచారియునగు విశ్వకర్మ బాలకుఁడు గురుకులమున విద్యాభ్యాస మొనర్చి గురుకుటుంబము గోరిన శిల్పోప కరణముల నిర్మింపఁ బరమేశ్వరునిఁ బ్రసన్నునిగా నొనర్చినపుడా సదాశివుఁడను గ్రహించిన విధానము నంతయు శిల్పకాండమున (౧౪౨) పుటయందు వ్రాయఁబడియె యున్నది. అచట విశ్వేశ్వరానుగ్రహ వాక్యములు సంపూర్ణముగా వివరించి యున్నవి. వానిలో "సర్వనైపథ్యరచనాః సర్వహేమ్నశ్చ సంస్కృతీః। సర్వాణి శిల్పకార్యాణి తౌర్యత్రిక మథాపివా। సర్వం జ్ఞాస్యసికర్తుం త్వం ద్వితీయఇవ పద్మభూః" అని సర్వాలంకార రచనలును; సర్వసువర్ణ సంస్కారములును, సమస్త శిల్పకర్మములు రచించుటలో రెండవ బ్రహ్మవగుదువని చెప్పుటచే ద్వష్టృపుత్రుఁడగు విశ్వకర్మ, బ్రాహ్మణుఁడని బోధపడుటయెగాక యమ్మహనీయుని శిల్పకర్మమంతయు బ్రహ్మసృష్టికి సమానమై బ్రాహ్మణులకు విధాయకవృత్తియని వ్యక్తపఱచుచున్నది. కావున రథకార వృత్తియగు పవిత్రశిల్పము రాథకార్య బ్రాహ్మణుల పావన జీవనముగ విధింపఁబడిన దనుటలోను, ఆశిల్పము బ్రాహ్మణులకు ముఖ్యవిధియనుటలోను, బూరోద్దామాహాత్మ్య ప్రమాణవచనామృత ధారానిష్యంద సందర్భమునవలన ననుమాన సంతాపనివారణము కాఁగలదని పర్యవసించుచున్నది.

అను లోమాదులకుఁ బావనశిల్ప మనర్హము.

శ్లో॥ దేవోభక్త పరాధీనః సర్వేషామభయందదా
సౌమ్యం మనోహరం రూపంధృత్వా కామానపూరయత్॥
కృతిర్మార్చాతు హైమాదిధాతుభీ రత్నదారుభిః
విలోమ హీనజాతిభ్యో వ్రాత్యేభ్యః ప్రతిలోమతః॥
పతితేభ్యో దేవతానాం విగ్రహంనైవ కారయేత్
నపూజయేచ్చ మోహాద్దైవపూజాం కుర్యాన్నరాధిపః॥
సతతం దుఃఖమాప్నోతి నరకంచ సమశ్నుతే
రాష్ట్రభంగో భవేద్రాజ్ఞా మయశః పాపసంచయః॥
ప్రజానష్టో హ్యనావృష్టిర్దుర్భిక్షం మరణంభయమ్
ఏవమాది సముత్పన్నా-చోత్పాతా దుఃఖదాసదా॥
జ్ఞాత్వా ప్రారంభం కుర్వీత హ్యకుర్వాణో వినశ్యతి
శిల్పవతంసే పంచమ తరంగే ద్వాదశపృష్టే,

కించ, షష్టతరంగే, శ్లో॥ మాతాశిల్పీ పితాశాస్త్రమరూపం రూపమానయత్
శిల్పీసంతుష్యతి యదా బింబ సతుష్టముచ్యతే॥

తా॥ భక్తపరాధీనుఁడైన పరమేశ్వరుఁడు సర్వజనులకు నభయప్రదాన మొనర్చెను. శాంతయుక్తమైన మనోహరాకారమును ధరించి కోరికలొసంగెను. సువర్ణాది ధాతువులచేతను, రత్నములచేతను, దారువులచేతను గల్పిత విగ్రహములఁ జేయింపవలెను. ఆదేవతా విగ్రహము లవిలోములు మున్నగు హీనజాతుల వలనను, గర్మభ్రష్టులగు వ్రాత్యుల వలనను, ప్రతిలోముల వలనను, బతితుల వలనను, జేయింపఁగూడదు. అట్లను లోమాదులచే నిర్మింపఁబడిన విగ్రహమును బూజింపఁగూడదు. అట్టి విలోమాదికృత విగ్రహమును బ్రజాపాలకుఁ డజ్ఞానమునఁ బూజించెనేని యెల్లప్పుడును దుఃఖమునొందును. పాపలోకము గూడ ననుభవించును. మఱియు రాజులకు రాష్ట్రభంగము, నపయశస్సు, పాపసంపాదనము, సంభవించును. ప్రజలకు నష్టము గలుగును. వర్షరహితమై భూమియందు సస్యాదులు ఫలింపక కాటకమేర్పడి మరణభయము లేర్పడును. ఈమున్నగు నుత్పాతములు జనించినభూమి దుఃఖభూయిష్ఠమై తనరారును. కావున విగ్రహనిర్మాతల నెఱిఁగి చేయింపవలెను. అట్లెఱిఁగి చేయింపని నరపాలుఁడు నశించును. అనియు,

విగ్రహమునకుఁ దల్లిశిల్పియుఁ దండ్రిశాస్త్రమయగు-రూపరహితమగు పదార్థమునకు రూపమును శిల్పికల్పించును. అందుచే నెప్పుడు శిల్పిసంతోషించునో విగ్రహముగూడ సంతుష్టిఁజెందును. అనియు నుడువుటచే ననులోమవిలోమసంకీర్ణ సంకర జాతులకు నుత్తమశిల్పరచనమనర్హమని నిర్ధారణమగుచున్నది. హిరణ్యకేశిసూత్రము గూడ "అశూద్రకృతా" మని పాత్రిరచనము శూద్రేతరుని (త్రైవర్ణికుని)చేఁ జేయించవలెనని ప్రకటితమగుటచేఁ బూర్వోక్తినే బలపఱచుచున్నది. మఱియు "నశ్వవృత్తిఃకదాచన" యని మనుస్మృతికారుఁడు సేవకవృత్తిచేయఁగూడదని యొకచోఁ జెప్పియు వృత్తులుకల్పించుపట్టున, "విద్యాశిల్పం భృతిస్సేవాగోరక్షం విపణిఃకృషిః। ధృతిర్భైక్షంకుసీదంచదశజీవనహేతవః"అని విద్యయు, శిల్పము, రాజసేవయు, గోరక్షణము, వాణిజ్యము, వ్యవసాయము, ధైర్యము, భిక్షమెత్తుట, వడ్డీతీయుట యీ పదియు జీవనమునకుఁ గారణములగునని నిర్ధారణమొనర్చెను. ఈకారణముచేనైనను బ్రాహ్మణుఁడు శిల్పజీవనమొనర్చునదియని నిర్ధారణమగుచున్నది.

## స్వర్ణస్తేయదోషాపవాదము; తన్నిరాకరణము.

శిల్పము బ్రాహ్మణానుష్ఠేయమని నిర్ధారణ పఱచినను, రథకార బ్రాహ్మణ జనసామాన్యముగా ననేకులు ప్రస్తుతకాలమున సువర్ణశిల్పము (బంగారుపని) నే చేయుచుండుటచే స్వర్ణస్తేయ మహాదోషము వీరికిఁ బ్రాప్తించుననియు, నందుచే"సర్వకంటక పాపిష్ఠం హేమకారంతు పార్థివ" యను మున్నగు స్మృతిపురాణ వచనములు గూడ స్వర్ణకారులను దోషభూయిష్ఠులుగాఁ బ్రత్యేకించుననియు, స్వర్ణకారులకుఁ గొందఱు నిందారోపణ మొనర్చెదరు. ఇదియు విచారింపఁ దగినదే; సర్వకంటకములచేఁ బాపిష్ఠుఁడైన హేమకారునిగూర్చి నిందారోపణము సేయబడినదిగాని, పవిత్రహేమకారుని కీదోషారోపణ మొనర్చుట యవివేకమయగు. స్వర్ణస్తేయ మహాదోషము స్వర్ణకారులకేగాక స్వర్ణస్తేయ మొనరించు ప్రతిమానవునకు నారోపింపఁ దగియెయున్నది. స్తేయమన దొంగతనము. సామాన్య మనుష్యుఁడు లభించినయెడల స్వర్ణాకర్షణమునకు వెనుదీయఁడు. బ్రహ్మదేవుఁడు కాంతలయందును గనకమునందును నత్యంత భ్రమకల్పించినటుల "వేధాద్వేధాభ్రమం చక్రేకాంతాసుకనకేషుచ"యను ప్రమాణము పలుకుచున్నది. స్తేయారోపణ మొక్కసువర్ణకారునియందే యారోపించుట పొసఁగనేరదు. రాజకీయోద్యోగముల యందుఁ గొందఱు ప్రవేశించి దాంభిక వృత్తిచేఁ బ్రభుప్రజాద్రోహ పూరితులై స్వర్ణస్తేయమునకుఁ బాల్పడుచున్నారు. గ్రామపురోహితులు, దైవతార్చకులు మున్నగునారు స్వర్ణాభిలాషచే నేదోయొక

మిషపన్ని కాపట్యముచేతనే స్వర్ణాకర్షణమొనర్చుచున్నారు. ఇంకను ననేకు లనేక విధములం గృత్రిమవిధానముననే ధనసంగ్రహణ మొనర్చుచున్నారు. ఇదంతయు స్వర్ణచౌర్యము గాదా? స్వర్ణస్తేయమహాదోషము సహ్యాద్రిఖండ మంజులేశ్వర మాహాత్మ్యమునందలి "సర్వకర్మబహిస్థాశ్చ సర్వధర్మబహిష్కృతాః । చండాలాబ్రాహ్మణాశ్చైన నగృహ్ణీయాచ్చతజ్జలమ్ । సువర్ణస్తేయనిరతా గ్రామేషునగరేషుచ॥" యను శ్లోకపంక్తిచే సర్వకర్మలనుండియు, సమస్త ధర్మములనుండియు బహిష్కరింపంబడిన వారునునై చండాలురుగాని బ్రాహ్మణులుగాని యెల్లవేళల సువర్ణచౌర్యమునకులోనగు వారిని గ్రామములయందైనను బట్టణములయందైనను బహిష్కృతులుగాం జేయ వలెను. వారి జలమెవ్వరును గ్రహింపంగూడదని వ్రాయంబడుటవలన సర్వజనులకు నిందితమనియె ప్రసిద్ధమగుచున్నది. స్వర్ణస్తేయము మహాదోషమే. ఈదోషము పవిత్ర స్వర్ణకారులయందారోపించుట కేవల సాహసకార్యము. ఈసాహసకార్యము సువర్ణ చోరుల నెల్లరయెడ నారోపించవలెను. సువర్ణస్తేయమున కవకాశము స్వర్ణకారులకె మిక్కిలి దక్కునని కొందఱు నిర్ధారణపఱచినను, అయ్యది క్షుద్రబుద్ధులయెడ విశ్వసింపవలెనుగాని పవిత్రహృదయుల విషయమై స్థిరపఱుపంగూడదు. స్వర్ణస్తేయ దోషము నాపాదించి స్వర్ణశిల్పమును బరిత్యజింపంగూడదు. పావనహృదయుండగు హేమకారునింగూడ విడువంగూడదు. అట్లు విడుచుటవలనం బవిత్ర కార్యములకు ననర్థము చేకూరును. "పయసాపుష్యతేవపుః" అని క్షీరముచే శరీరమువృద్ధి యగునని సిద్ధాంతము గలదు. కాని జ్వరితున కాసిద్ధాంతము విపరీతమగును. జ్వరితునకు విపరీతమగుననుబుద్ధిచే క్షీరపానమెవ్వండైన నిషేధించువాండుగలడా? మఱియు నశ్లేశుృతి "యన్మేమాతాప్రలులోభచరత్యననువ్రితా । తన్మేరేతః పితా వృఙ్క్తామాభురన్యోవపద్యతామమృష్మైస్వాహా" అని (యేరేతస్సును నాతల్లిపాతివ్రిత్యమునువిడిచి సంగ్రహింపనిచ్ఛించెనో, యారేతస్సును నాతండ్రిస్వీకరించుంగాక! మానసవ్యభిచారనిమిత్తరేతస్సుచే సాంకర్యమును బొందకుండుంగాక; అను నర్థముగల మంత్రముచే) శ్రాద్ధాదులయందుం బ్రితియజమానుండును హోమకార్యమునొనర్చుచున్నాండు. ఇట్లె పితామహిని, ప్రపితామహినిగూడ నుద్దేశించి హవనమొనర్పంబడుచున్నది. ఈహోమకార్యముచే మాతృపితామహి ప్రపితామహులయొక్క పాతివ్రత్యభంగమును దెలిసికొనుచున్నాండు. పారంపరీకముగ స్త్రీలకిట్టియసవితృత గలదని తెలిసికొన్నమానవుండు తిరిగి తానొకయువతినిజేపట్టుట నింద్యకార్యముగదా? ఏలనం దానుగేల్పట్టినచెలువగాని తానుగనంబోవు పుత్రికామతల్లులుగాని వ్యభిచారి

ణులనకతప్పదు. అట్టి వ్యభిచారిణీవృత్తిని బెంచుటయె తనవివాహమున కాదర్శకము గదా? ఈవ్యభిచారిణీత్వభీతిచే వివాహమునువమానుకొనిన బుద్ధిమంతుఁడు ప్రపంచమున నుండనోపునా? అట్లుండనోపఁడు. మాతృపితామహీ ప్రపితామహులయెడ నీదోషారోపణమునేయుట భ్రమముగాని వేఱుగాదు. భ్రమచే దోషభూయిష్ఠలగా నను మానపడి నిమిత్తమాత్రముగా ననుమానమును దీర్చుకొనుచున్నాఁడు. కావున నావిధముననే స్వర్ణస్తేయభీతిచే భ్రమంపడి యనుమానమున స్వర్ణశిల్పావశ్యకత దూరమొనర్చుట యవివేకకార్యముగాక వేఱుగాదు. "కస్యదోషఃకులేనాస్తి?" యనునటుల నెట్టికులమునకైన దోషముగానిపించదా? నూఁడుఁడు "నవదేద్యావనీం భాషాం ప్రాణైః కంఠగతైరపి" అని కంఠగతప్రాణములచేతనైనను యవనభాషను మాటలాడఁగూడదనియు, "యోఽసత్ప్రతిగ్రహ గ్రాహీనిత్యం యశ్చప్రతిగ్రహీ। గ్రహసూచక దూతౌచ పిత్ర్యకార్యేషు వర్జితాః" అని యసత్ప్రతిగ్రహమును గ్రహించువాఁడును, నిత్యము ప్రతిగ్రహధనముచే జీవించువాఁడును, గ్రహసూచకములను జెప్పువాఁడును, దూతవృత్తి నవలంబించువాఁడును, పిత్రుశ్రాద్ధాదులయందు వర్జనీయుఁడనియు, "యావతస్సంస్ప్రుశేదంగై ర్బ్రాహ్మణాన్ శూద్రయాజకః। తావతాంనభవేద్దాతుః ఫలందానస్య పౌర్తికం" అని శూద్రునకు యాజనముచేయించినవాఁడు, ఏపంక్తిలో భోజనమునకు గూర్చుండి యెందఱిని స్పృశించినవాఁడగునో, ఆ యందఱికిని జేసిన యన్నదానమునకు ఫలములేదనియు, "వేదవిచ్చాపి విప్రోఽస్యలోభాత్కృత్వా ప్రతిగ్రహం। వినాశం వ్రజతిక్షిప్రమా మపాత్రమివాంభసి" వేదమును జక్కఁగా జదివినవాఁడైనను, దురాశవలన దుష్ప్రతిగ్రహమునుఁ బ్రతిగ్రహించి యుదకమం దపక్వమృత్పాత్రలు వోలె శీఘ్రముగా వినాశమునుఁ బొందుచున్నాఁడనియు, "అవాహ్యకాదేవలకానాక్షత్రా గ్రామయాజకాః। ఏతేబ్రాహ్మణ చండాలా మహాపథికపంచమః" అని యసత్ప్రతిగ్రహములు గ్రహించువాఁడును, భృతికి దైవతార్చనములు చేయువాఁడును, నక్షత్రప్రతిగ్రహము లొనర్చువాఁడును, గ్రామపౌరోహిత్యము సేయువాఁడును, మిక్కిలి తిరుగువాఁడును, నను నీయేఁగురు బ్రాహ్మణచండాలురుగా నిర్ణయింపఁబడుదురు. అను నేతద్ధర్మనిర్ణయ వాక్యములు పరాశర, మను, రాజధర్మ ప్రముఖధర్మశాస్త్రములు ఘోషించుచున్నవి. ఇట్లుఘోషింపఁబడు దోషభూయిష్ఠకార్యములొనర్చిన ద్విజులను బ్రాహ్మణవర్గములోఁ జేర్చుకొనుచునేయున్నారు. దోషరహితప్రవర్తనమే కులమునందును గానరాదు? అటులనైనను పావనసువర్ణశిల్పమట్టి దూష్యభాజనము గానేరదు. స్తేయబుద్ధి దుర్వర్తనమనుట లోకవిదితమని పూర్వమే వక్కాణింపఁబడినది. అ స్తేయబుద్ధిచే రచించు

నదే పవిత్రకార్యము. అట్టి పవిత్రకార్యమనియె, "సౌవర్ణం రాజతంతామ్రం లోహం పాషాణదారవం" అని విశ్వకర్మ పరమేశ్వరునిచే మనుమయాదులకుఁ దద్వంశము వారికి సౌవర్ణాది శిల్పములు నిర్దేశింపఁబడియున్నవి. మఱియు, గాలనైపరీత్యమున సంశయించెదరేమోయని "యావద్వేదోఽస్తిలోకేస్మిం స్తావచ్ఛుభవతః ప్రజా। వినం దతివరం శిల్పంత్వద్రైవేనం భవిష్యతి" (ప. భూ) అను శివవిష్ణూక్తులచే విశ్వకర్మ బ్రాహ్మణులయందు, ఈలోకమునందు వేదమెంతకాలము నిలిచియుండునో, అంత కాలము శ్రేష్ఠమగు శిల్పము నిలిచియుండునని నిర్దేశితమయినట్లుఁ దెలియుచున్నది. మఱియు హిరణ్యశబ్దమును నిర్వచించుచు నిరుక్తపూర్వషట్కసప్త మాధ్యాయము నందు "హిరణ్యనామాన్యుత్తరాణి పంచదశ హిరణ్యంతస్మాత్ హ్రియతం ఆయమ్య మానమితభాష్యే, ఆయమ్యమానం హ్రియతేఏవశిల్పిభిః కటకరుచకస్వస్తికాదిభావేన విస్తీర్యమాణమ్" అని హిరణ్యమన శిల్పులచేఁ గడియము, గంఠాభరణము, మంగళసూత్రము మున్నగు నాభరణధర్మములచే విస్తరింపఁజేయఁబడునది యని వ్రాయుటచే హిరణ్యమునకుఁ గటకాద్యాభరణసృష్టియు, కేశవాది మూర్తిరచనయు, నిష్టకాది వేదనిర్మాణమును, స్రుక్స్రువాది పాత్రక్రియయు, సహజసిద్ధములుగనె కను పట్టుచున్నవి. సువర్ణశిల్పపవిత్రతనుగూర్చియుఁ, దదావశ్యకతఁగూర్చియు శిల్పకాండ మున నుదాహరింపఁబడియె యున్నది. ఇట్టి పావనహిరణ్యశిల్పమునకుఁ జౌర్యావ కాశ మున్నదని నిందించుచుఁ దద్వస్తునికాయమునకావశ్యకత సంభవించినపుడు శిర సావహించి పూజించు బుద్ధిమంతుల వేనోళ్ళఁ గొనియాడవలసియె యున్నది. ఏది యెట్లున్నను, స్తేయాభావమైన పావనహేమకారత్వము పూజనీయమనుటలో సందేహ మేమాత్రము గానరాదు.

స్వర్ణకారగ్రామయాజకులకు సామాన్యాపవాదము; తన్నిరసనము యాజ్ఞ వల్క్యస్మృతియం దాచారకాండమున నభోజ్యాన్నుల నిర్ణయించుచు, శ్లో॥ అవీరా స్త్రీస్వర్ణకారస్త్రీజితగ్రామయాజినామ్ । శస్త్రవిక్రియకర్మారతంతువాయశ్వవృత్తి నామ్॥" అని పురుషాధిపత్యములేక స్వతంత్రురాలగుస్త్రీయు, (వ్యభిచారములేక పతిపుత్రరహితయగు స్త్రీయనికొందఱు) సువర్ణమునకు మఱియొకరూపమును గల్పిం చెడు స్వర్ణకారుఁడును, స్త్రీవశవర్తియగువాఁడును, గ్రామమునందందఱికి యాజనమును జేయించువాఁడును, కత్తులనమ్మువాఁడును, ఇనుముమొదలగు లోహవికారకార్యము లొనర్చువాఁడును, గుట్టుపనిచే జీవించువాఁడును, సేవకవృత్తినిఁజేయువాఁడునునగు వీరలయొక్క యన్నమును భుజింపఁగూడదని నిర్ణయించెను. ఈనిర్ణయములో బూర్వ మునఁ గదర్యాదులను బరమున నృశంసాదులనుజేర్చి యభోజ్యాన్నులనుగా నిర్ధారణ

మొనర్చెను. ఇట్లు నిర్ణయించుటలో భాష్యకర్త "సర్వేచేతేకదర్యాదయోద్విజా ఏవ కదర్యత్వాది దోషదుష్టాఅభోజ్యాన్నాః" ఈకదర్యాదులందఱు ద్విజులే (బ్రాహ్మణులే) కదర్యత్వ (లుబ్ధత్వ)ము మున్నగుదోషములచే దుష్టులగుటవలన భుజింపఁదగని యన్నముగలవారయిరని వివరించెను.

ఈవివరణమునందు గ్రామయాజకుఁడు, స్వర్ణకారుఁడు, కర్మారుఁడు నను ముువ్వురను మఱికొందఱను, నేకీభవింపఁజేసెను. గ్రామమునందన్ని కులములవారికి యాజనమొనర్చుటచే దుర్దానప్రతిగ్రహమొనర్పవలెనను ననుమానముతో గ్రామ పురోహితుని, స్వర్ణస్తేయ మొనర్పవలెనను ననుమానముతో స్వర్ణకారుని, నిరపరాధుఁడైనను లోహాదికర్కశధాతువులతో నిర్మితియొనర్పవలెనను ననుమానముతోఁ గర్మారుని నభోజ్యాన్నులనుగా నిర్ణయముఁజేసెను. గ్రామయాజకునికి దుర్దానములు పరిగ్రహించుట తప్పనిసరి. నిగ్రహశీలుఁడై పవిత్రహృదయుఁడైన స్వర్ణకారునికి సువర్ణస్తేయకార్యము మిక్కిలి యేహ్యమై హేయమగుననుట నిర్వివాదాంశము. కర్మారుఁడును గఠినకృత్యములగు లోహకారకార్యములయందు మగ్నుఁడగుటచే నిత్యనైమిత్తికాదికర్మముల విడుచుననుటగూడ నవిచారితనిర్ణయమె. పావనతరములగు సువర్ణాదులగు యావల్లోహముల శిల్పనిర్మాణములొనర్చు శిల్పివరేణ్యులకు నిత్యనైమిత్తికకార్యకర్మానుష్ఠానములను విధాయకకృత్యములుగా నిర్వర్తించవలయునను విశేషశాసనవాక్యములుండినటుల స్థలాంతరములఁ బ్రకటితములయియె యున్నవి. ఆయసాదికఠినలోహసృష్టినిగూర్చి "పరశుంస్వాయ సంయేనవృశ్చాదేతశో బ్రహ్మణస్పతిః" ఇత్యాది ప్రముఖవేదవచనములను విచారించిన నయ్యది బ్రాహ్మణరచితమై యత్యంత పవిత్రమైనటులఁ గన్పట్టును. కావున పావనహృదయములును సదనుష్ఠానతత్పరులును నిరంతరవిశ్వకర్మపరమేశ్వర పూజాతత్పరులునగు స్వర్ణకారకర్మారులు గ్రామపురోహితులవలెఁగాక యత్యంతపవిత్రులనుటలో సందేహమేమాత్రము గానరాదు. పై శ్లోక వ్యాఖ్యానమున స్వర్ణకారశబ్దము నిర్వచించుటలో "సువర్ణస్య వికారాంతరకృత్" అని సువర్ణమునకు భేదరూపములను సృజించువాఁడని యర్థీకరణ మొనర్చెను. గాని సువర్ణమునందు నితరలోహముల మిశ్రమొనర్చువాఁడని యస్వర్థమొనర్చి యుండలేదు. అందువలనను స్తేయదోషము గానిపించదు.

కదర్యాజాదులు ద్విజులని వ్యాఖ్యాత వివరించుటచే స్వర్ణకారుఁడు ద్విజమాత్రుఁడని కొందఱుద్దేశించినను గ్రామయాజకుఁడగు వైదికబ్రాహ్మణగణములోఁ జేర్చుటచేనైన బ్రాహ్మణుఁడని నిర్ణయించుటలో వివాదాంశ మదృశ్యమగును. ఇంతయెగాక గ్రామయాజకాది నిర్ణయమంతయు వ్యక్తిపర్యాయముగాని జాతిపర్యా

గానేరదు. అందుచే "కర్మణ్యేవాపకృష్టత్వం । జాతావపకృష్టత్వం నార్యసమ్మత" మ్మను నార్యోక్తిచేఁ జేయుపనియందే నీచత గానిపించునుగాని, జాతియందు నీచత నారోపించుట యార్యులొప్పుకొనరను వాక్యమువలన, నీచకర్మచేసినవానినె నీచత్వా రోపణ మొనర్పఁదగియుండును. స్తేయాభావుఁడై పరమపవిత్రుఁడైన స్వర్ణకారుని కానంతయుఁ గొఱంతరానేరదు. మఱియుఁ, గైముత్యన్యాయమున యజ్ఞకుండ, యజ్ఞమండప, యజ్ఞవేదికా, యజ్ఞపాత్ర, దేవమూర్తి, దేవరథ, కటక, ముకుట, భూషణాది పవిత్రవైదిక క్రియలొనర్చుటలోను, నీదేవశిల్పక్రియలొనర్చుటలోను, విశ్వబ్రాహ్మణులకు శ్రౌతస్మార్తక్రియాధురీణతకు నభ్యంతరముండనేరదు. పవిత్ర శిల్పోపజీవనమయు క్తముగానేరదు. ఇంతయెగాక చయనరథ, దేవప్రతిమా, యజ్ఞ పాత్రాదికములు దేవతాప్రీతిజనకము లగుటవలన, దైవతానుగ్రహమున సకలైశ్వర్య సిద్ధియుఁ, బుణ్యలోకప్రాప్తియు సంభవించును.

## రథకారబ్రాహ్మణునకు రూఢిశక్తి.

"రథం కరోతీతి రథకార" యను శబ్దార్థముచేఁ ద్రైవర్ణికుఁడౌ రథకారుఁడ నియు నాత్రైవర్ణికరథకారునకు యోగశక్తిచే రథకారనామము గలుగుచున్నది. గాని సంకీర్ణజాతీయుఁడగు రథకారునికి రూఢిశక్తిచే రథకారనామము గలుగుచున్నది. కావున యోగశక్తికంటె రూఢిశక్తి బలిష్ఠమయినది. అందుచే "వర్షాసు రథకారోఽగ్నీనాదధీత" యను పూర్వోక్తవాక్యమునకు సంకీర్ణరథకారునికే అగ్న్యధికారము గల దని కొందఱనుటకవకాశము గలుగుచున్నది. ఇయ్యది కేవల మవిచారితవాక్యము. ధర్మసిద్ధాంతముచేయుటలో యథార్థదృష్టి వినియోగించి గుర్తించవలెను; సిద్ధాంతీ కరించవలెను. ఒక్క యుదాహరణముఁ జూతము,

"పయస్స్యాత్క్షీరనీరయోః" అను మేదినీకోశవాక్యమువలనఁ బయశ్శబ్దము క్షీరమునందును, నీరమునందును, నర్థమగును. అట్లయినచో "పయసాజుహోతి" యనుపట్టున క్షీరముచే హోమముఁ జేయవలెననుటకుఁగాను నీటిచే హోమముఁజేసిన నెంతయోగ్యత గానిపించునో యోచింపవలసియున్నది. పయశ్శబ్దమునకు జలపర్యా యముగ నర్థముండినను నీటిచే హోమముఁజేయుట కేవలము దూష్యము. అట్లె "వర్షాసురథకారోఽగ్నీ నాదధీత" యను శ్రుతివాక్యమునందలి 'ఆదధీత' యను యజ్ఞవిధాయక శబ్దము త్రైవర్ణికాంతర్గత బ్రాహ్మణ రథకారునకే రూఢియగు చున్నది. కారణమేమన; శూద్రాంతర్గత సంకీర్ణసంకర రథకారునకు "ఆదధీత"

యను యజ్ఞవిధాయక క్రియాపద మనుపపత్తియగును. ఇంతియకాక, "ఋభూణా" మనుయాజమాన్యమంత్రము బ్రాహ్మణాది త్రైవర్ణికులకే యజ్ఞాధికారమును సమర్థించునుగాని అసమర్థులగు సంకీర్ణులకు గూఢార్థమును సమర్థింపఁజాలదు.

మఱియుఁ దైవర్ణికులలో రథకారుఁడు బ్రాహ్మణుఁడనుటకుఁగూడ గూఢార్థమునే ప్రతిపాదించుచున్నది. వ్యాసోక్తియగు నీక్రింది పురాణవాక్యము జూఁడుఁడు.

శ్లో॥ సద్యోజాతాది పంచభ్యో ముఖేభ్యః పంచనిర్మమె
విశ్వకర్మసుతాహ్యేతే రథకారస్తు పంచచ॥
తస్మిన్ కాలే మహాభాగః పరమోమమరూపభాక్
పాషాణదారుకం టంకం సౌవర్ణం దశకంతథా॥
కాష్ఠంచ నవలోహాని రథకృద్భ్యో దదావిభుః
రథకారా స్తథాచక్రుః పంచకృత్యాణిసర్వదా॥
షడ్దర్శనాద్యనుష్ఠానం షట్కర్మ నిరతాశ్చయే॥

స్కందపురాణ నాగరఖండ విశ్వకర్మోపాఖ్యానమ్. అధ్యాయ. ౬.

తా॥ కుమారస్వామితో నీశ్వరుఁడు చెప్పుచున్నాఁడు. ఓకుమారా! విశ్వకర్మ ప్రజాపతికి సద్యోజాత వామదే వాఘోరతత్పురుషేశానము లను నైదుముఖములు నాకువలె వెలుఁగొందు; నాయైదుముఖముల తేజస్సులవలనఁ గ్రమముగా మనువు, మయుఁడు, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞుఁడు, అను నేగురు రథకారులు జనించిరి. ప్రభువగు నా విశ్వకర్మ ప్రజాపతియె వారికిఁ పాషాణాదులను భేదించునట్టియు, లోహాదులను నిర్మించునట్టియు నుపకరణములఁ బదింటినిచ్చి లోకనిర్మాణమున కానతియిచ్చెను. వారును పారంపరికముగా షడ్దర్శనాదుల నభ్యసించుచు యజనాది షట్కర్మనిరతులై ప్రకాశించుచున్నారు. అని చెప్పుటలో విశ్వకర్మబ్రహ్మ యొక్క ముఖతేజోభూతులగు మనుమయాదులు రథకారులని యుగ్గడింపఁ బడిరి. ఇందువలన "బ్రాహ్మణోస్య ముఖమాసీ" త్తను శ్రుతియొక్క యర్థ ప్రతిపాదకమునలన మనుమయాదులగు రథకారులు తద్వంశ్యులు బ్రాహ్మణులనుట నిర్వివాదాంశము.

## బ్రాహ్మణోత్పత్తి.

ఇఁక బ్రాహ్మణోత్పత్తినిఁగూర్చి వివరించుటయందుఁ బరమేశ్వరుని ముఖము బ్రాహ్మణుఁడుగాని ముఖమందు బ్రాహ్మణుఁడు జనించెననుట సందేహము స్ఫురించు

చున్నదని కొందఱనవచ్చును. ఈసందేహమును నివారించుటకే విద్యారణ్యస్వామి తన భాష్యమునందు "బ్రాహ్మణోస్య ముఖమాసీ" త్తను వాక్యమునకు "అస్య ప్రజాపతే ర్బ్రహ్మణో బ్రాహ్మణత్వజాతి విశిష్టః, పురుషోముఖమాసీత్, ముఖాదుత్పన్న ఇత్యర్థః" ప్రజాపతియగు నాదిబ్రహ్మ (విశ్వకర్మ) ముఖమునుండి బ్రాహ్మణత్వజాతి విశిష్టమైన పురుషుఁడు (సర్వబ్రాహ్మణజాతికి సముదాయ రూపమైన పురుషుఁడు) జన్మించెనని వివరించెను. ఇందుచే బ్రాహ్మణజాతి బ్రహ్మముఖోత్పన్నమైనదనుట నిస్సందేహమయ్యెను. మఱియు భాగవత ద్వితీయస్కంధ పంచమాధ్యాయమునందలి "పురుషస్య ముఖాద్బ్రహ్మ క్షత్రమేతస్య బాహుతః, ఊర్వోర్వైశ్యోఽభవచ్చాథ పద్భ్యాంశూద్రోఽభ్యజాయత" యను వాక్యమున విరాట్పురుషుని ముఖమునుండి బ్రాహ్మణుఁడును, బాహువులనుండి క్షత్రియుఁడును, ఊరువులనుండి వైశ్యుఁడును, పాదములనుండి శూద్రుఁడును, కలిగెనని చెప్పఁబడి యుండుటచేఁ బూర్వోక్త విద్యారణ్య భాష్యభావమును సంపూర్ణముగా స్థిరీకరించుచున్నది. కాని, దీనికిఁ గొంత వ్యాఖ్యాత కభిప్రాయ భేదముండినను ఏతద్భాగవత తృతీయస్కంధ షష్ఠాధ్యాయమందు "ముఖతోఽవర్తత బ్రహ్మపురుషస్య కురూద్వహ। యస్తూన్ముఖత్వాద్వర్ణానాం ముఖ్యోఽభూద్బ్రాహ్మణోగురుః" అను శ్లోకమునకు శ్రీధరీయవ్యాఖ్యానము "బ్రహ్మవేదః పురుషస్య భగవతః ముఖతోఽవర్తత ముఖాత్ ప్రవృత్తం యస్తూన్ముఖత్వాత్ ముఖోద్భవత్వాత్ వర్ణానాం ముఖ్యోముఖమిన ప్రథమోఽభూత్ గురుశ్చాభూత్ సోపిముఖతోఽవర్తతే త్యనుషంగః, అధ్యాపనాదినా బ్రాహ్మణస్య వేదోవృత్తిః, తయావృత్త్యా సహబ్రాహ్మణోముఖతోజాత ఇత్యర్థః, ఏవముత్తరత్రివర్ణ త్రయేపిజ్ఞాతవ్యమ్" అని వివరించుటచే వేదము పరమేష్ఠియొక్క ముఖమువలనఁ గలిగెననియు ముఖమువలన జనించుటవలన వర్ణములకు ముఖ్యుఁడుగను, ప్రథముఁడుగను, శ్రేష్ఠుఁడుగను బ్రాహ్మణుఁడగుననియు, అధ్యాపనాదులే బ్రాహ్మణునకువృత్తిగనుక నావృత్తితోఁగూడ బ్రాహ్మణుఁడు ముఖమువలనఁ బుట్టెననియు నిట్లే కడమముగ్గురకుఁ దెలిసికొనవలెననియుఁ దెలియుచున్నది.

ఇంకను దీనికనుకూలముగనే మనుస్మృతి ప్రథమాధ్యాయమునందలి "శ్లో॥ ఉత్తమాంగోద్భవాజ్జ్యైష్ఠ్యాద్బ్రహ్మణశ్చైవధారణాత్ । సర్వస్యైవాస్యసర్గస్య ధర్మతో బ్రాహ్మణఃప్రభుః" అను శ్లోకమువలన నుత్తమాంగమగు ముఖమువలనఁ బుట్టుట వలనను, క్షత్రియాది జాతులకంటె ముందుగాఁ బుట్టుటవలనను, వేదధారణమువల

నను సమస్తజగత్తునకు ధర్మశాసనమగుటచే బ్రాహ్మణుఁడు ప్రభువగుచున్నాఁడను నర్థముఁ దెలియనచ్చుటచేతను బ్రాహ్మణునకు ముఖోద్భవత్వము స్థిరీకృతమగుచున్నది.

మఱియు బ్రాహ్మణశబ్దము తద్ధితవృత్తియగుటచే "అణ్" ప్రత్యయము వచ్చును. ఇందుకు 'తస్యాపత్యమ్. ౪. ౧. ౮౨ తత్రభవః ౪. 3. ౫3 ప్రభవతి ౪. 3 ౮3" అను పాణినీయసూత్రములవలనఁ గలుఁగుచున్నది. "(పంచ) బ్రహ్మణామపత్యాని=బ్రహ్మసుభవావా=బ్రహ్మభ్యః ప్రభవతివా=పంచబ్రాహ్మణాః (సానగాదయః పంచ)" యను వ్యుత్పత్త్యర్థముచే విశ్వకర్మముఖమువలన నేఁగురు బ్రహ్మలు, ఋషులు, వారివలన బ్రాహ్మణసముదాయముఁ గలిగినటులను దెలియుచున్నది. ఇంకను, స్కాంధపురాణ నాగరఖండ విశ్వకర్మోపాఖ్యానషష్ఠాధ్యాయమందలి "మనుఃపూర్వముఖోద్భూతో మయోయాన్యముఖోద్భవః । పశ్చిమాస్యేఽభవత్త్వష్టాశిల్పీచైవోత్తరాస్యతః । విశ్వజ్ఞఊర్ధ్వసంజాతః పంచగర్భమునీశ్వరాః" అను వాక్యమువలన మన్వాదులు విశ్వకర్మ ముఖోద్భవులై మునీశ్వరనామములతోఁ బ్రసిద్ధినొందినటులను "అథైషాందేవతాః పంచ విశ్వకర్మముఖోద్భవాః । మనుర్మయస్తథా త్వష్టాశిల్పికశ్చతథైవచ । దైవజ్ఞః పంచమఃప్రోక్తా స్వర్గస్థాయజ్ఞపోషకాః" అను శైవాగమ వచనమువలన విశ్వకర్మ ముఖోద్భవులగు మనుమయ త్వష్టృశిల్పిదైవజ్ఞ (విశ్వజ్ఞ) నామములుగల నేఁగురు దేవతలు స్వర్గస్థులై యజ్ఞపోషకులగుచున్నారనియుఁ బూర్వోక్తినే బలపఱచుచున్నది. ఇక్కడ స్వర్గస్థయజ్ఞపోషకత్వము గలుగుటచే దేవత్వము సంభవించుచున్నది. కావున, దేవతలు మానుషత్వ మంగీకరించిన బ్రాహ్మణజాతికిఁ గూటస్థులైరనుట యసంభవమని యోజింపఁగూఁడదు. ఏమనినః- వాయుపురాణోత్తరభాగ ప్రథమాధ్యాయమందలి "ఋషీణాం దేవతాఃపుత్రాః పితరోదేవసూనవః । ఋషయో దేవపుత్రాశ్చ ఇతి శాస్త్రవినిశ్చయః" (౨౦) అను శ్లోకముచే ఋషులకు దేవతలు పుత్రులనియు, పితలు దేవకుమారులనియు ఋషులు దేవపుత్రులనియు దేవర్షి పితృగణములు ముగ్గురును అన్యోన్యసంతతివారని చక్కఁగాఁ దెలియవచ్చుచున్నది. అందువలన దేవతాపుత్రులు ఋషులగుటకు సందేహమించుకయుఁ గానిపించదు. ఇంతయేకాక "బ్రహ్మదేవతా బృహస్పతిర్దేవతా" (యజుః కాం ౪. 33) అను శ్రుతివాక్యముచే బ్రహ్మయు బృహస్పతియు దేవతలుగనే పరిగణింపఁబడిరి. బృహస్పతి దేవపురోహితుఁడయ్యెను. అట్లే బృహస్పతి వంశోద్భవులగు ఆంగీరస భార్గవ బార్హస్పత్య గోత్రోద్భవులు మానవగణములోఁ బరిగణింపఁబడుచున్నారు. మన్వాదులు బ్రహ్మగణమును ఋషిగణము నగుటయేకాక వారి

గోత్రర్షులగు సానగాదులను విచారించినయెడల శిల్పకాండమునందు జెప్పఁబడిన బ్రహ్మాండపురాణాదుల ప్రమాణవచనములుగాక,

శౌనకఉవాచ॥ శ్లో॥ తన్ముఖేషు యథాజాతా స్సానగాద్యామహర్షయః
తత్ప్రశంసకథంలోకె వర్తమానె చరంతితే॥ ౧౨

వశిష్ఠఉవాచ॥ సుపర్ణస్సానగశ్చైవ సనాతన ఇతిస్మృతః
గురు శ్రేష్ఠోఽహభూనశ్చ ప్రత్నోఽధాత్రీ సురక్షకః॥ ౧౩

విశ్వకర్మముఖోద్భూతా బ్రాహ్మణాః పంచకీర్తితాః
సద్యోజాతముఖేజాతః సానగోవిశ్వకర్మణః॥ ౧౪

వామదేవ ముఖేజాతో బ్రహ్మర్షి స్తుసనాతనః
అఘోరముఖసంజాతోఽహభూనో వైశ్వకర్మణః॥ ౧౫

తత్పురుషేముఖేజాతః ప్రత్నోఽసౌ వైశ్వకర్మణః
తస్యేశానముఖేజాత స్సుపర్ణో వైశ్వకర్మణః॥ ౧౬

వశిష్ఠపురాణ కాండ 3. అ ౬.

ఈ వశిష్ఠపురాణోక్తిని విచారించితిమేని విశ్వకర్మముఖములగు సద్యోజాత వామదేవాఘోరతత్పురుషేశానములనుండి వరుసగా సానగ సనాతనాహభూన ప్రత్న సుపర్ణులను నేగురు బ్రహ్మర్షులు జనించిరి. వారలే బ్రాహ్మణవర్యులై వఱలిరని తెలియుటచే శిల్పకాండమునందలి యిష్టకోపథానమున వివరించిన "ప్రాచీదిశా"మను నైదుమంత్రములు నైదుదిక్కుల ననువదించుటచే సానగాది ఋషు లేగురు నైదు దిఙ్ముఖముల జనించిరని చెప్పుటలో శ్రుతివాక్యముఁ బురాణవాక్యమునకు మూల సూత్రముగనే యున్నది. మఱియు "విశ్వతోముఖ" యను శ్రుతిసూక్తికిని సర్వతొ యైదుదిక్కులఁ బూర్వదక్షిణ పశ్చిమోత్తరోర్ధ్వదిశల ముఖములు, విశ్వకర్మ పరమేశ్వరునకుఁ గలవనుటఁగూడ శ్రుత్యర్థము ననుసరించియె యున్నది. "సపంచధా పంచాత్మా" అను యాజుషీశ్రుతియు దీనిని బలపరచుచునే యున్నది. ఇట్లుండుటచే మనుమయాది బ్రహ్మలయొక్కయు, సానగాది బ్రహ్మర్షులయొక్కయుఁ బారంపరీక వంశము వారలకెల్లరకు యోగరూఢి రథకారత్వము స్థిరలభ్యమగుటయేకాక రథకారులు బ్రాహ్మణులగుట నిర్వివాదముగ స్థిరీకరింపఁబడుచున్నది. వేదవిదితులగు విశ్వకర్మ, త్వష్ట్ర, బృహస్పతి ఋభ్వాదులకు యోగరూఢులచేఁగూడ రథకారత్వమెట్లు లభ్యపడి

సదో యస్మై తత్పారం పరీక్షులకు రథకారత్వప్రాప్తి, యోగరూఢులచేఁగూడ లభింపఁ బడినదనుటలో ననుమాన మిసుమంతయుఁ గానరాదు.

రథకార గృహమున వైదికహోమము.

తృతీయసవన మధ్యమమున సాయంకాల హోమము రథకార గృహమునందుఁ జేయవలయునటుల నీక్రింది శ్రుతి ప్రమాణము గానిపించుచున్నది.

ఈశ్వరోనా అశ్వః ప్రముక్తాః పరాం పరావతంగంతో।
ఇహధృతిః స్వాహావిధృతిః స్వాహారంతిః స్వాహా
రమతిః స్వాహేతి చతృషు పత్సుజుహూతి॥

యజుర్వేద బ్రాహ్మణము అ 3 ప్ర ౮ అను ౧౨.

భాష్యమ్॥ యదుక్తం సూత్రకారేణ "రథకారకులేవసతి భవతీ హధృతిః స్వాహేతి సాయమశ్వస్య చతుర్షుపత్సుచతస్రో ధృతీర్జుహోతి" తదిదంవిధత్తే। ఈశ్వరోవాఅశ్వః ప్రముక్తః। స్వేచ్ఛాసంచారాయ ప్రముక్తోఽశ్వః పరంపరావతం అత్యంత దూరంగతోః ఈశ్వరోగంతుం సమర్థః। అతోరాత్రౌ రక్షకేషు రాజపుత్రేషు యత్ర క్వాపిగమిష్యతీతి భీత్యా సాయంకాలేతమశ్వం రథకారగృహే స్థాపయిత్వా।తదీయేషు చతుర్షుపదేషు చతుర్భిర్మంత్రై ర్జుహుయాత్॥

తా॥ అశ్వమేధ యజ్ఞారంభమునుండి సమాప్తి పర్యంతము యజ్ఞయాభిమంత్రితమైన యశ్వము నశ్వరక్షకులగు రాజపుత్రులు వెంబడించ దేశసంచారమును జేయించుచున్నారు. సాయంకాల మగుసరికి ఇతరత్ర సంచరించునేమోయను భీతిచే రథకారగృహమున నారాత్రినిలిపి యాయశ్వముయొక్క నాలుగు పదములయందును, "ఓం ఇహధృతిస్వాహా"యను నాలుగు మంత్రములను హోమముఁ జేయవలెనని చెప్పియున్నది. ఇందుచే "హోతవ్యం దీక్షితస్యగృహా౩ ఇతి" అను యజురారణ్యక పంచమప్రపాఠక ద్వితీయానువాకాంత వాక్యమును విచారించితిమేని దీక్షితగృహమందుఁదప్ప నన్యగృహమునందు హోమముఁజేయఁ దగనిదని తెలియుచున్నది. దీక్షితుఁడనఁగాఁ త్రేతాగ్ని స్థాపకుఁడగు నగ్నిహోత్రి। రథకారుఁడట్టియజ్వ గనుకనే యాశ్రోత్రియుని గృహమున హోమమొనర్ప వలెనని కల్పసూత్రకారుని యభిప్రాయము. ఇందుచే రథకారుని వైదికకర్మార్హత విస్పష్టమగుచున్నది. పైభాష్య

పంక్తిలోని "రథకారకులే వసతి" యనుపట్టున కులమనఁగా "కాభూమహాలీయతేతి గృహమ్, అన్యేభ్యోపీతిడః" అను వ్యుత్పత్తిచే గృహమని యర్థము ప్రతిపాదిత మగుచున్నది.

సాయంకాలహోమము రథకారగృహమునఁ జేయుటకుఁ గారణమేమనిన:— ప్రాతఃకాల మధ్యాహ్నకాల సాయంకాల హోమములకు వరుసగా ప్రథమ ద్వితీయ తృతీయ సవనములని నామధేయములు కలవు. వానిలోని తృతీయ సవనమునుగూర్చి,

శ్రుతిః॥ ఇదంతృతీయగ్ం సవనం కవీనామృతేనయే చమసమైరయంత।
తేసాధన్వనాః సువరానశానాః స్విష్టింనోఽభివసీయోనయంతు॥

యజుః కాం 3 ప్ర ౧ అ ౯ ప ౨

భాష్యమ్॥ కవీనాం (విదుషాం ఋత్విజామ్) సంబంధియదిదం తృతీయం సవనం తదిదం దేవాః వసేయః వసుమత్తరం కృత్వానః అస్మాకం యాస్విష్టిం శోభనో యాగః తాంస్విష్టిం అభి అభిలక్ష్యనయంతు ప్రాపయంతు।కీదృశో దేవాః తదుచ్యంతే। చమసంచమసగణం। ఐరయంతప్రేరితవంతః। తేదేవాః సౌధన్వనః సుధన్వన ఇంద్రస్య సంబంధినః ఋభునామానః సువరానశానాః స్వర్గం ప్రాప్నువంతః తాదృశో దేవానయంతు ఇత్యన్వయః॥

తా॥ విద్వాంసులగు ఋత్విజుల సంబధమగు నీతృతీయ సవనమును దేవతలు తేజోవంతముగాఁజేసి మాయాగములెయ్యవియో వానిని శుభకరములుగాఁ బొందించుఁగాత! ఆదేవత లెవ్వారలనిన సుధన్వుఁడను నింద్రుని సంబంధులై ఋభువులనుపేరులు గలిగి స్వర్గమున దేవత్వములను గాంచినవారు. వారు చమసపాత్రసముదాయమును ప్రేరేపించుదురుగాత! (నిర్మించుదురుగాత!)

ఇట్లనుటచే రథాది శిల్పోపకర్తలగు రథకారబ్రాహ్మణులు యజ్ఞపాత్ర నిర్మాణముకొఱకుఁ తృతీయ సవనగత మంత్రములచేఁ బ్రార్థింపఁబడిరి. ఈప్రార్థింపఁబడిన ఋభుదేవతలు హవనకర్తలును, రథకారులును, విద్వాంసులును, ఋత్విజసంజ్ఞలచే నిత్యాగ్నిహోత్రులై చమసాదిపాత్ర నిర్మాణములొనర్చువారు నగుట విస్పష్టమగుచున్నది. ఇదిగాక యీ పైశ్రుతివలనఁ దృతీయసవనహోమము ఋభుసంబంధమైనదని తెలియుచున్నది. ఈతృతీయసవన (సాయంకాల) హోమమున హవిర్భాగమును

స్వీకరించువారలు ఋభుదేవతలగు రథకారులే. వారికి హవిర్భాగస్వీకారము ప్రథమ ద్వితీయ తృతీయ సవనములయందును గలదుకాని ఋగ్వేదమందలి (అ ౨. ౬. ౫) "ఇదముదకం పిబతేత్యబ్రవీతనేదం వాద్యాపిబతా ముంజనేజనం । సౌధన్వనాయది తన్నేవహార్యథత్రృతీయేష్వాసవనే మాదయాధ్వై" అను శ్రుతివలనఁ బ్రాప్తదేవత్వులును సుధన్వఋషిపుత్త్రులునగు ఋభువులు ప్రథమ సవనమునందు సోమమును బాన మొనర్పవలెను. అట్లె ద్వితీయసవనమునందును తృతీయసవనమునందును సోమరసమును స్వీకరించవలెను. వానిలోఁ దృతీయసవనమందలి సోమరసస్వీకారముచే సంపూర్ణానందమును బొందవలయునని వివరింపఁబడుటచే, సాయంకాల తృతీయసవనహోమముచే రథకారబ్రాహ్మణు లానందితులగుట విస్పష్టమగుచున్నది. అందుచేతనే సాయంకాలహోమము రథకారబ్రాహ్మణ గృహమునందు జేయుటకు ముఖ్యకారణము గానిపించుచున్నది.

శబ్దకల్పద్రుమోదాహృత మహీధరుని విపరీత భాష్యము, తన్నిరసనము.

శ్రుతి॥ స్త్రీషఖం ప్రమదేకుమారీపుత్రం। మేధాయై రథకారం ధైర్యాయతక్షాణమ్॥

వాజసనేయ సంహితాయామ్॥ 30। ౬॥

ఈ శ్రుతివాక్యమునకు మహీధరుఁడు వ్యాఖ్యాన మొనర్చుచు రథకారశబ్దమునకు "రథకారం మాహిష్యేణకరణ్యాం జాతమ్" అని రథకారుని మాహిష్యకరణీజాతునిగా నిశ్చయించి యర్థీకరించెను. స్త్రీసఖుఁడైనట్టియు, మేధకొఱకు రథకారుఁడైనట్టియు, ధైర్యముకొఱకు తక్షుఁడైనట్టి కుమారుని గాంచుమని వేదకారుని యభిప్రాయము. సంకీర్ణ సంకరుఁడైన రథకారునివంటి పుత్త్రుని గోరికొనుమనుటలో వేదకర్త కేవలము బుద్ధిహీనుఁడైనఁ గావలయును. లేదా మహామేధావియగు రథకార బ్రాహ్మణునివంటి వానినైనఁ గోరికొని యుండవలయును. మేధావియనుటకు "అగ్నయే బ్రహ్మఋభవః" అను (ఋక్సంహితా ౮. 3. ౧౨) వాక్యమునకు "అగ్నయే బ్రహ్మస్తోత్రం ఋభవో మేధావిన స్తతక్షుః" అని సాయణభాష్య వచనముండుటచే రథకారులగు ఋభువులు మేధావులై ఆగ్నేయస్తోత్రములు చేసినటుల చెప్పియుండుటవలన రథకారులనఁబడు ఋభువులే మహామేధావులు. అట్టి మేధావియగు పుత్త్రుఁడు కావలెనని వేదకర్తయొక్క యభిప్రాయముగాని సంకీర్ణ సంకర రథకారునివంటి కుమారుఁడనుటలో భాష్యకర్త భ్రమప్రమాదము తేటతెల్లమగుచున్నది. మఱియు, తక్షుఁడుగూడ నతిధైర్యవంతుఁడే. ఏలన నింద్రుఁడు జీవోత్క్రమణ మొనర్చిన వృత్రునిజూచి భయపడి తక్షుని శరణుఁజొచ్చి "శిరఃపశోస్తే

దాస్యంతి'' అని యిఁకనుండి యజ్ఞాదులయందు యజ్ఞపశువుయొక్క శిరస్సు (ముఖ్య భాగము) నీ కాహుతిగా నియ్యఁబడును. నీవావృత్రి భీకరాకారము నుపసంహారింపుమని వేడుకొనుటయు నాతక్షుఁడందుల కంగీకరించి యట్లుసేయుటచే నాతఁడతి ధైర్యవంతుఁడని పొగడ్తగాంచుటయు నియ్యది లోకప్రసిద్ధి కలిగియున్నది. ఈగాథ భారతేతిహాసమున వ్రాసియున్నటుల నితఃపూర్వమునఁ బ్రకటితమయియున్నది. ఇదిగాక, "ఆప్తేనత్వష్ట్రాభిషజేవ తత్క్షణం ప్రచక్రిమే లంఘదపూర్వకః క్రమః" (మాఘే ౧౨. ౨౫)అను కావ్యోక్తిచేఁ దక్షుఁడుమహాప్తుఁడగు భిషజుఁడుగా వర్ణింపఁ బడియున్నాఁడు. మఱియు వేదవాక్యములఁ బెక్కింటిలోఁ దక్షుని యుత్తమత్వము ప్రతిపాదించుచున్నది. తక్షుఁడనఁ ద్వష్టయనికూడ కోశము దెలుపుచున్నది. "అస్మాఽఇదు త్వష్టా తక్షద్వజ్రం స్వపస్తమం స్వర్యంరణాయ" (ఋక్ ౧. ౪. ౨౮. ౧.)అను మొదలగు శ్రుతులలోఁ దక్షుని యుత్తమత్వముఁ బ్రకటించుచున్నది. ఇట్టి యుత్తమమేధా ధైర్యవంతులగు రథకారతక్షుల నీచులని నిర్ణయించుటచే మహీధరుని మేధాధైర్యములు భ్రమప్రమాదాంధకారమున మునిఁగినవనుట నిర్వివాదాంశము.

## ద్వివిధ బ్రాహ్మణవిభాగము.

ప్రపంచముననున్న బ్రాహ్మణ వర్గమంతయు మొట్టమొదట రెండుభేదములుగ సృజింపఁ బడినవని యీక్రింది పురాణవచనము పలుకుచున్నది.

శ్లో॥ బ్రాహ్మణానాం కులం పూర్వం ద్వేధావిరచితంసురైః
ఆర్షేయంచ పౌరుషేయం కర్మజన్మ విశేషతః॥
ఆర్షేయంచ వసిష్ఠాది హ్యాముష్మి న్నృపసత్తమ।
యద్విశ్వకర్మణశ్చాస్య పురుషస్య ముఖోద్భవమ్॥
పౌరుషేయ మితిఖ్యాతం పంచగోత్రం మహత్కులమ్॥

విశ్వకర్మ పురాణము, అ ౨౦.

బ్రాహ్మణకులము రెండుగా దేవతలచే నిర్మింపఁ బడినది. అయ్యది యార్షేయ మనియుఁ బౌరుషేయ మనియుఁ గర్మజన్మముల విశేషములవలన నిరూపణ మేర్పడుచున్నది. వసిష్ఠాది గోత్రములచేఁ బ్రవర్ధమానమగునదియ యార్షేయమగును. ఎయ్యది విరాట్పురుషుండగు విశ్వకర్మయొక్క ముఖమునలన జననమయి పంచగోత్రములచే విస్తృతమయ్యెనో యయ్యది పౌరుషేయమని విఖ్యాతిఁబొందెను. అని

యిట్లు నుడివియుండుటచేతను, "సామాన్యతః ప్రజాః ద్వివిధాః । విశ్వకర్మ బ్రహ్మ నిర్మితాః కశ్యపబ్రహ్మ నిర్మితాశ్చ । యద్యపి, బ్రాహ్మణోఽస్య ముఖమాసీదిత్యాది నావిరాడంగత్వం ప్రతీయతే తథాపి ఆకాశాద్వాయురిత్యాదివత్ పరంపరయాతజ్జన్యత్వంబోధ్యం । ఆద్యాః పంచవిధాః ద్వితీయాశ్చతుర్విధాః" అని యిట్లు కాశీక్షేత్రస్థ విద్వజ్జనులు బహుగ్రంథ శోధనచేసి, ప్రజలు సామాన్యముగా నిరుతెగలుగానున్నారు. వారు విశ్వకర్మయను బ్రహ్మచే నిర్మింపఁబడిన వారలును, గశ్యపుఁడను బ్రహ్మచే నిర్మింపఁబడిన వారలు నగుదురు. అట్లయినను నావిరాట్పురుషుని ముఖమువలన బ్రాహ్మణుఁడు జన్మించెనను మొదలగు శ్రుతివాక్యములచే విరాట్పురుషు నవయవోద్భవత్వ మూహింపఁబడుచున్నను, ఆకాశమువలన వాయువు దానివలన నగ్న్యాదులు జనింపఁబడెనను మొదలగు వేదసూక్తులవలనఁ బరంపరాజననత్వముఁ దెలిసికొనఁ దగినది. ఆ యిరుతెగలలో మొదటివారైన విశ్వకర్మ బ్రహ్మచే నిర్మితులగు ప్రజలైదు విధములుగాను, కశ్యప బ్రహ్మచే నిర్మితులైన ప్రజలు నాలుగు విధములుగాను నుందురు. అని వివరించుటచేతను, బ్రాహ్మణకులము ద్వివిధముగా నేర్పడినట్టుల వివక్షిత మగుచున్నది. వానిలోని పౌరుషేయ బ్రాహ్మణ శాఖవారలే పంచాల బ్రాహ్మణులనియు, విశ్వకర్మ బ్రాహ్మణులనియు, విశ్వబ్రాహ్మణులనియు, శిల్పిబ్రాహ్మణులనియు, రథకారబ్రాహ్మణులనియు, వర్ధకి (బడయి) బ్రాహ్మణులనియు, లోహకార (లుహార) బ్రాహ్మణులనియు మఱియు దేశభేదములచే వేఱువేఱు నామములచేతను గొన్నియెడల వృత్తిప్రధాన నామములతోడను వెలయుచున్నారు.

ఇట్లు ప్రసిద్ధికెక్కియుండుటచేఁ బౌరుషేయుల కార్షేయత్వము లభింపదనఁ గూడదు. పౌరుషేయులకు సానగాద్యార్షేయత్వము పారంపరీకముగ లభించుచునే యున్నది; గాని శాఖావిభేదము సూచింపవలసినప్పు డార్షేయులలోఁ బౌరుషేయ సంజ్ఞ ప్రసిద్ధికెక్కుచున్నది. "ముఖేభ్యస్తస్య పంచభ్యః కుమారాః పంచజజ్ఞిరే, శతంచవింశతిః పంచవంశజా విశ్వకర్మణః । తద్వంశసంభవాస్సర్వే పంచపంచాస్య సంభవాః । జాయంతేఽను యుగం లోకేసృష్టిసంతానతత్పరాః॥" అను స్కంద పురాణోక్తివలన నూటయిరువదియైదుగురు ఋషులవలన నీవిశ్వకర్మవంశము విస్తృతమైనటుల నార్షేయము ప్రతిపాదితమగుచునేయున్నది. మూలపురుషులగు విశ్వకర్మాదులకు ఋషిత్వము నిర్ధారితమగునటుల విశ్వకర్మకాండమున విశదమగుచునేయున్నది. అట్లేకాక నవిశ్వకర్మర్షి ముఖోద్భవులగు సానగసనాతన అహభూన ప్రత్న సుపర్ణ ఋషులు వరుసగా,

శ్లో॥ మనుస్సానగగోత్రశ్చ సనాతనమయ స్తథా;
అహభూనస్తు త్వష్టుస్స్యాత్ ప్రత్నస్స్యాచ్ఛిల్పిన స్తథా
తక్షశ్చాపిసుపర్ణశ్చ హ్యేవంగోత్రముదీరితమ్॥
స్కా॥ నా॥ విశ్వకర్మోపాఖ్యాన ౧౨. అ.

మనువంశమువారికి సానగర్షిగోత్రమనియు, మయవంశమువారికి సనాతనర్షి గోత్రమనియు, త్వష్టృవంశమువారికి నహభూనర్షిగోత్రమనియు, శిల్పివంశమువారికి ప్రత్నర్షిగోత్రమనియు, విశ్వజ్ఞవంశమువారికి సుపర్ణర్షిగోత్రమనియుఁ జెప్పఁబడెను. సానగాది ఋషిప్రశంసగల "ప్రాచీదిశా" మను యాజుషీశ్రుతి శిల్పకాండమునఁ బ్రచురితమయియెయున్నది. మఱియు గోత్రర్షులగు నీ యేఁగురకు నొక్కొక్కనికి నేఁగురు చొప్పున నిరువదియేఁగురు జనించి వారివలన నూటయిరువదియేఁగురు గోత్రర్షులు జనించిరి. వీరలే క్రమముగాఁ బ్రవరర్షులు గోత్రర్షులునై వఱలిరి. ఈగోత్రర్షుల వివరమంతయు వసిష్ఠోప పురాణమునందును, విశ్వబ్రహ్మోపనిషత్తునందును, గార్గ్యపీయ గోత్రకాండమునందును, దైవజ్ఞస్మృతియందును, వివరింపఁబడియున్నది. వానిలోఁ గించిద్భేదములుండినను నవ్వవి దేశభేదములచే రూఢియగుచున్నవి. గోత్రర్షి వివరమును గ్రంథాంతమున నిరూపింపఁబడును. పంచవింశత్యుత్తర శత గోత్రవిస్తృతార్షేయ వంశమున నుద్భవించినను నీవిశ్వబ్రాహ్మణు లార్షేయనామ ధురంధరులగుటయేగాక, పౌరుషేయులను బ్రత్యేకసంజ్ఞతోఁగూడఁ బ్రబలిరి.

## రథకారబ్రాహ్మణులకు వివృతవ్యవహార శక్తులు.

రథకారబ్రాహ్మణునకు వ్యాకరణోపమానాదిశక్తు లిదివఱకు రూఢిపఱుపఁబడినవి. వివృతవ్యవహారశక్తులనుగూర్చి వివరింపనున్నది. రథకారబ్రాహ్మణులు ప్రకృత మీభారతదేశమునఁ బంచాలురనియు, నాచార్యులనియు, విశ్వకర్మబ్రాహ్మణులనియు, విశ్వబ్రాహ్మణులనియు, విశ్వకర్మలనియు, శిల్పిబ్రాహ్మణులనియు, పౌరుషేయబ్రాహ్మణులనియు, స్థపతులనియు, దైవజ్ఞులనియు, మఱియు దేశభేదములచే భేదనామములతో వ్యవహరింపఁబడుచున్నారు.

## పంచాలబ్రాహ్మణ ప్రసిద్ధి.

విశ్వబ్రాహ్మణులు తరుచుగా మహారాష్ట్రదేశమునను, అందందు ఘూర్జర, కర్ణాటాంధ్ర ద్రావిడదేశములందును, బంచాలనామమునఁ బ్రసిద్ధికెక్కుచున్నారు. ఈ పంచాలశబ్దము పెక్కుగ్రంథముల రథకారశబ్ద పర్యాయముగా నాడఁబడుటయె

గాక వ్యాకరణశాస్త్రములందు బ్రాహ్మణగోత్రవాచిగాఁ జెప్పఁబడినది. "పంచభిస్స్వర్ణాదిశిల్పైః అలతివిశ్వంస పంచాలోనామ విశ్వకర్మా దేవశిల్పీ, అల్ భూషణాదౌ" అను వ్యుత్పత్త్యర్థముచే స్వర్ణాది పంచశిల్పములచే లోకము నలంకరించువాఁడు పంచాలుఁడనఁబరగు. ఆవిశ్వకర్మయె దేవశిల్పియనఁబడునను నర్థము ప్రతిపాదించుచున్నది. మఱియు, "నడాదిభ్యఃఫక్" (౪. ౧. ౯౯) అను పాణినీసూత్రముచే బ్రహ్మర్షి గోత్ర బోధకమగు నడాదిగణమునందంతర్గతమై విరాజిల్లుచున్నది. నడ, చర, శలంక, మిత్ర, ద్విప, కాశ్యప, కృష్ణ, రణౌ, శకట, జలంధర, అధ్వర, పంచాల, చమసిన్, బ్రాహ్మణ, బదర, అశ్వల, బ్రహ్మదత్త, ఉదుంబర, ఇత్యాదులు నడాదులు. పై సూత్రమువలన గోత్రప్రత్యయమగుటచే నాడాయణ, చారాయణ, మైత్రాయణ, ద్వైపాయన, కార్ష్ణాయణ, శాకటాయన, జాలంధరాయణ, పాంచాలాయన, చామసినాయన, బ్రాహ్మణాయణ, బాదరాయణ, అశ్వలాయన ఇత్యాదు లార్షేయగోత్రవాచకములై బ్రాహ్మణజాతి విశిష్టములై నరలుచున్నవి. వీనిలోఁ బంచాలశబ్దము పంచవిధ శిల్పకర్తయగు బ్రాహ్మణ పర్యాయమై యొప్పెసఁగుచున్నది. మఱియు, గణరత్నమహోదధియందలి వర్ధమాన విరచిత వ్యాఖ్యయందు, "అశ్వలాయనః, అగ్నిశర్మాయణః, పంచాలో బ్రాహ్మణ గోత్రవాచీతస్య పాంచాలాయనః॥ క్షత్రియవాచినస్తు పాంచాలః" అని పంచాల శబ్దము బ్రాహ్మణగోత్రవాచకమనియు, దత్సంబంధాపత్యార్థకమునందుఁ బాంచాలాయనుఁ డగుననియు, క్షత్రియవాచకమగునేని పాంచాలుఁడగుననియు వివరింపఁబడినది. కావునఁ బంచాలుఁడు బ్రహ్మణగోత్రవాచ్యుఁడగుట విస్పష్టమయ్యెను. ఇంతయకాక, రథకారపంచాలుర కభేదాధ్యవసాయముగ,

శ్లో॥ శిల్పిబ్రాహ్మణ నామానః పంచాలాః పరికీర్తితాః
ఏతేషాం పంచగోత్రాణి పంచచప్రవరాస్మృతాః॥

శైవాగమము, సప్తమాధ్యాయము.

పంచాలురు శిల్పిబ్రాహ్మణులని ప్రసిద్ధివడసినవారు. వీరి కైదుగోత్రము, లైదుప్రవరలు చెప్పఁబడినవి. అనియు,

శివఉవాచ, శ్లో॥ శివేమనుర్మయ స్త్వష్టా తక్షాశిల్పీచపంచమః
విశ్వకర్మసుతానేతాన్ విద్ధిశిల్పప్రవర్తకాన్॥
ఏతేషాంపుత్రపౌత్రామె యఏతేశిల్పినోభువి
పంచాలానామవిజ్ఞేయాః పంచభేదాహి తేమతాః॥

రుద్రయామలము, వాస్తుతంత్రము.

ఓపార్వతీ! మనుమయత్వష్టృతక్షశిల్పులను నీయేఁగురిని శిల్పప్రవర్తకులగు విశ్వకర్మకుమారులనుగాఁ దెలిసికొనుము. వీరి పుత్రపౌత్రులు శిల్పులుగను, పంచ భేదములతోనున్న పంచాలురుగను ప్రసిద్ధులైరి. అనియు,

శ్లో॥ అథర్వణస్యోపవేదః శిల్పవేదః ప్రకీర్తితః
తస్మాదాథర్వణః ప్రోక్తాః సర్వేశిల్పినఏవచ॥
పంచాలానాంచ సర్వేషాం శాఖాస్యాత్॥

కౌసలాగమము. తృతీయాధ్యాయము.

అథర్వవేదమున కుపవేదముగా శిల్పవేదము చెప్పఁబడినది. అందువలననే సర్వశిల్పులు నాథర్వణులుగాఁ జెప్పఁబడిరి. పంచాలురగు వారికెల్లరకు నాథర్వణ శాఖయగుననియుఁ జెప్పియుండుటచేఁ బంచాలబ్రాహ్మణులనియు, శిల్పిబ్రాహ్మణు లనియు, బర్యాయముగ వ్యవహరింపఁబడునటుల విస్పష్టమగుచున్నది. ఇంకయు, "బ్రాహ్మణే తద్విశేషగ్రహణ" మ్మను భట్టోజీ దీక్షితవ్యాఖ్యాన వాక్యానుసరణము గనే తద్విశేషమెగాక, పంచాలబ్రాహ్మణధర్మము లీక్రిందివిధముగ నియమింపఁ బడినవి.

శ్లో॥ పంచాలానాంచసర్వేషా మాచారఇతిగీయతే
అష్టాంగయోగఃకర్మషట్ పంచయజ్ఞా ఇతిశ్రుతః॥
యజనం యాజనంచైవ తథాచాధ్యయనం స్మృతమ్॥
అధ్యాపనంతతఃప్రోక్తం తథాదానం ప్రతిగ్రహః॥
స్నానం సంధ్యాత్రికాలేషు అగ్నిహోత్రం తథైవచ
షట్కర్మాణ్యేవమేతాని పంచాలానాం స్మృతానిచ॥
నిత్యం నైమిత్తికంకర్మ ద్విజాతీనాం యథాక్రమమ్
పితృయజ్ఞం భూతయజ్ఞం దైవయజ్ఞం తథైవచ॥
జపయజ్ఞం బ్రహ్మయజ్ఞం పంచయజ్ఞాః స్మరంతివై
ఏవం త్రివిధఆచారః కర్తార స్తే ద్విజాతయః॥

తా॥ ఎల్లపంచాలురయొక్క యాచారములు చెప్పఁబడినవి. యమనియమా ద్యష్టాంగయోగములు యజనాది షట్కర్మములు. దేవపితృయజ్ఞాది పంచమహాయజ్ఞ ములు చేయవలెను. వీనిలో యజనము (యజ్ఞముచేయుట) యాజనము (యజ్ఞములఁ జేయించుట) అధ్యయనము (వేదముచదువుట) అధ్యాపనము (వేదముచెప్పుట) దానము (ధనాదులిచ్చుట) ప్రతిగ్రహము (యోగ్యదానముల గ్రహించుట)

ఈ యాఱు జన్మషట్కర్మములును, త్రికాల స్నానసంధ్యాద్యనుష్ఠానములు నగ్నిహోత్రాదికర్మలు మున్నగు నిత్యకర్మషష్టకమును జేయఁదగినవి. నిత్యనైమిత్తికకర్మములు బ్రాహ్మణులగు నాపంచాలురకుఁ గ్రిమము మీఱకుండ విధాయక ధర్మములు. మఱియుఁ బితృయజ్ఞము, భూతయజ్ఞము, దైవయజ్ఞము, జపయజ్ఞము, బ్రహ్మయజ్ఞము నను పంచమహాయజ్ఞములు సేయువలెను. ఇటుల నాపంచాల బ్రాహ్మణులు త్రివిధాచారములుగఁ జేయవలెనని నుడువఁబడెను.

ఇచ్చటఁ ద్రివిధాచారము లనువాక్యమునకు యజనాధ్యయన దానము లను మూఁడు విధములగు కర్మములకుమాత్రమె యధికారముగలదని కొందఱు వక్కాణించిరి. పై శ్లోకవాక్యములలో యజనాది షట్కర్మలు విధ్యుక్తములగుచుండ గర్మత్రయాధికారులనుట కేవల మవిచారితముగాక వేఱుగాదు. త్రివిధములనఁ బ్రాతర్మధ్యాహ్న సాయంకాల విధానము లగుచున్నవి. ఇట్టి త్రికాలాచారములె త్రివిధాచారములగుచున్నవి. ఇట్లుగాక, దేవపౌరోహిత్యాది ప్రసిద్ధయాజనకర్మము లొనరించి కీర్తిగాంచిన విశ్వకర్మ త్వష్ట్ర విశ్వరూపాది మహర్షులయొక్క సంశమువారలగు నీరథకారపంచాల విశ్వబ్రాహ్మణులకు యాజనాధికారము మృగ్యమనుటచే విచార శూన్యత ప్రతిఫలింపకతప్పదు.

## పంచాలురెల్లరు నుపబ్రాహ్మణులా?

కురుక్షేత్రమండలి శ్రీమతి గౌడమహాసభలోని సభ్యుఁడు (ఎగ్జూటివు కమిటీ మెంబరు) శ్రోత్రియ ఛోటీలాల్ శర్మాగౌడగారు ప్రకటించిన "బ్రాహ్మణమీమాంస" యను హిందీగ్రంథమునఁ బంచాలాది బ్రాహ్మణు లందఱు నుపబ్రాహ్మణసంజ్ఞగలవారని విశదీకరించిరి. ఇట్లు విశదీకరించుటగూడ నవిచారితభాగమనియె నిర్ధారణ మొనర్పవలసియున్నది. పంచాలబ్రాహ్మణవృత్తాంతము చెప్పఁబడిన శైవాగమగ్రంథమునఁ బంచాలురు శైవపంచాలురనియు, బ్రహ్మపంచాలురనియు, నుపపంచాలురనియు మూఁడుతెగలుగ విభజింపఁబడి వారిముప్పురివ్యుత్పత్తులను భేదరీతిగవివరింపఁబడియె. పరమేశ్వరపంచముఖములవలన జనించినమను, మయ, త్వష్ట్ర, శిల్పి, దైవజ్ఞులనునేగురు శైవపంచాలురకూటస్థులనియు, విశ్వకర్మాజ్ఞచే వైరాజప్రజాపతి ముఖము వలన స్వాయంభువమనువను బ్రాహ్మణుఁ డుద్భవించి యధర్వాది షట్పుత్త్రిలను గాంచ నాపరంపర బ్రహ్మపంచాలురుగాఁ బ్రసిద్ధిగాంచిరనియు, శైవపంచాల బ్రహ్మపంచాలురు ఋగ్యజుస్సామాధర్వ వేదములఁ బఠింప నధికారము గలవారలగుటచే వారెల్లరు ముఖ్యబ్రాహ్మణులనియు, స్వాయంభువ మనుపుత్త్రిలగు శిల్పాయనాదులు

నలువురు నాయుర్వేద ధనుర్వేద గాంధర్వవేద శిల్పవేదములను నాలుగుపవేదములనుఁ బఠించువారగుటచే వారు నలువు రుపబ్రాహ్మణ సంజ్ఞగలవారనియు విశదీకృత మయ్యెను. మఱియు నాశైవాగమమునందె, "పంచాలానాంచ సర్వేషాం శాఖా వై వైశ్వకర్మణీ। తేషాం వై పంచగోత్రాణాం ప్రవరం పంచకం స్మృతం। తేషాంవై రుద్రదైవత్యం త్రిష్టుప్ఛందస్తథైవచ। ముఖ్యానాం బ్రాహ్మణానాంచ పంచాలానాం తథైవచ" అను సూక్తివివదించుటచే సర్వపంచాలురకు వైశ్యకర్మణీశాఖ యనియు, సానగ సనాత నాహభూన ప్రత్న సుపర్ణఋషివంతములగు పంచగోత్రములనియు, సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానము లనునైదు ప్రవరములనియు, రుద్రదైవత్యము త్రిష్టుప్ ఛందస్సనియు, నివి ముఖ్యపంచాలబ్రాహ్మణులకు విధాయకకృత్యములనియు నిర్ధారణ మేర్పరుపఁబడియె.

ఇఁక నుపపంచాల బ్రాహ్మణులగు నలువురును వారి సంతానమును మనుమయాదుల శిష్యులై ధాతువేదాదు లభ్యసించిరనియు వారును ముఖ్యపంచాల బ్రాహ్మణులవలె యజనాది షట్కర్మలు గలవారలెయనియు నా శైవాగమమునందె చెప్పఁబడియుండెను.

ఇట్టి స్థితిలోఁ బంచాలబ్రాహ్మణు లందఱును వారి పర్యాయసంజ్ఞగల వర్ధకి లోహకారాది బ్రాహ్మణులెల్లరును, ఉపబ్రాహ్మణ సంజ్ఞులనుట పాక్షికదృష్టిప్రసారముగఁ బ్రత్యేకము గన్పట్టుచున్నది. వేదశాస్త్రలౌకికపారంగతుఁడగు నీబ్రాహ్మణ మీమాంసా గ్రంథకర్తయొక్క న్యాయదృష్టి యిచట ప్రాస్వీకరించినందులకు మిగుల విచారితమగుచున్నది. కావునఁ బంచాలురెల్లరు నుపబ్రాహ్మణసంజ్ఞులు గానేరరు.

## రథకారుల కాచారవిధి.

స్మృతులయందు సామాన్యతః బ్రాహ్మణవిధులు నిర్దేశింపఁబడినను రథకారబ్రాహ్మణులకుఁ బ్రత్యేకించి యీక్రింది విధాయకములు నిర్దిష్టములయ్యెను.

ఈశ్వరఉవాచ॥ మనుర్మయశ్చ త్వష్టాచ శిల్పీవిశ్వజ్ఞ ఏవచ

పంచైతేదేవ ఋషయోవిశ్వకర్మముఖోద్భవాః॥
సృష్టి ప్రవర్తకాహ్యేతే రథకారాస్తు పంచచ
శతంచ వింశతిః పంచవంశజా విశ్వకర్మణః॥

తద్వంశసంభవాస్సర్వే పంచపంచాస్య సంభవాః
జాయంతేఽనుయుగంలోకే సృష్టిసంత్రాణతత్పరాః॥

కృతేతుమనసాసృష్టి స్త్రేతాయాం దృష్టిసాధనం
ద్వాపరేమంత్రితస్సృష్టిః కలాతుకరసాధనం॥
వైదికేనైవమార్గేణ తద్వంశ్యానాం విశేషతః
గర్భాధానంనిషేకంతు తుర్యేపుంసవనాక్రియా॥
మాసేష్టమేహిసీమంతో జాతేవై జాతకర్మచ
అహన్యేకాదశేనామ షష్ఠేమాస్యన్నభోజనం॥
వర్షే తృతీయేచౌలం స్యాదష్టమేచోపనాయనం
వేదవ్రతచతుష్కంతు గోదానంషోడశేతథా॥
వత్సరేస్నాతకంకర్మ వైవాహంపైతృమేధికం
ఇతిషోడశకర్మాణి వంశ్యానాం విశ్వకర్మణః॥
కర్తవ్యంతద్విశేషేణ హ్యాచార్యేణసమాధినా
పునర్జననరూపాసా చోపనీతిక్రియామతా॥
పుణ్యాహవాచనంపూర్వం వేదఘోషపురస్సరం
పూర్వేద్యురేవకర్తవ్యం నాందీముఖమతఃపరం॥
అపరేద్యుఃప్రభాతేతు మంగలస్నానమాచరేత్
ధారయిత్వానవంసూత్రం పుణ్యాహంవాచయేత్తతః॥
అగ్నిమాదాయ విధివత్ సమ్యక్ శాస్త్రోక్తమార్గతః
స్థాపయిత్వాచరుంపూర్వం హోమంకుర్యాద్విధానతః॥
ఉపనీయ తతఃపశ్చాదాచార్యః సమిధాహుతీః
హోనయిత్వా థశిష్యేణ హస్తగ్రహణ పూర్వకం॥
తతోమౌంజీపరీధానం కృష్ణాజినపురస్సరం
ఉపదిశ్యతతః పశ్చాద్గాయత్రీ మపిదేవతాం॥
అగ్నికార్యం తతఃపశ్చాత్ కృత్వాహోమం సమాచరేత్
స్విష్టకృద్ధోమమారభ్య పూర్ణాహుతిమతఃపరం॥
దద్యాదేవంచవిధివత్ త్రిసంధ్యం హోమమాచరేత్
ఏవంసమాప్యవిధివ దుపనీతం విశేషతః॥
ఆచార్యస్తుతతః పశ్చాచ్ఛిష్యమధ్యాపయేత్తవై
ఋగ్వేదంచ యజుర్వేదం సామవేదం విశేషతః॥
అధర్వాంగిరసశ్చైవ లక్షణానిపృథక్పృథక్
అష్టాదశపురాణాని తథాషడ్దర్శనానిచ॥

జ్యోతిశ్శాస్త్రవిశేషేణ శిల్పశాస్త్రంతథైవచ
చతుష్షష్టికలాశ్చాపి ధర్మశాస్త్రం విశేషతః॥ (ఇత్యాది)
(అగ్రేపి) గృహస్యేశానదిగ్భాగే కారయేద్యాగ మండపం॥

స్కాందపురాణే నాగరఖండే. ౫. అ ౧౩.

తా॥ విశ్వకర్మ ముఖోద్భవులగు మను మయ త్వష్ట్ర శిల్పి విశ్వజ్ఞులను నీ యేవురును దేవర్షులును సృష్టిప్రవర్తకులును నగు రథకారబ్రాహ్మణులు. మఱియు నావిశ్వకర్మవంశోద్భవులు నూటయిరువదేఁగురు కలరు. పై యేఁగురుఋషులు నాతని సద్యోజాతాది ముఖసంభూతులె. వీరలు సృష్టిరక్షణ తత్పరులై క్రమముగా నుద్భవిల్లిరి. కృతయుగంబునఁ జేయఁబడు సృష్టి మనస్సుచేతను త్రేతాయుగంబున దృష్టిసాధనచేతను ద్వాపరంబున మంత్రముచేతను గలియుగమ్మునఁ గరసాధనంబునను గల్పితములగును. విశేషముగాఁ దద్వంశ్యులగు బ్రాహ్మణులకుఁ జేయబడు గర్భాధాన జాతకర్మాది క్రియలు వైదికమార్గంబుననె జరుపవలయును. ఎనిమిదవ మాసంబునఁ బుంసవనంబును జననానంతరము జాతకర్మయుఁ, బదునొకండవ దినమున నామకరణమును, ఆఱవమాసంబున నన్నప్రాశనయుఁ, దృతీయవత్సరంబునఁ జౌలమును, అష్టమవర్షంబున నుపనయనంబును, అనంతరము వేదవ్రతాదికంబును నావల స్నాతక వైవాహిక పితృమేధంబులును నిట్లు షోడశకర్మలును, విశ్వకర్మబ్రాహ్మణులకుఁ జేయవలయును. అందును విశేషంబుగా నియమితచిత్తుఁడగు నాచార్యునిచేఁ బునర్జన్మరూపమగు నుపనీతక్రియఁ బుణ్యాహవాచన పూర్వకంబుగా వేదఘోషలు మ్రోయ విధిగాఁ జేయఁదగినది. పూర్వదినంబున నాందీముఖంబును ననంతరము రెండవనాఁటి ప్రాతఃకాలమున మంగళస్నానమునుఁ జేయవలయును. నవసూత్రమును ధరింపఁజేసి పుణ్యాహమును నచింపవలయును. శాస్త్రోక్తవిధి ననుసరించి యగ్నింబ్రతిష్ఠించి చరుపూర్వకముగా హోమముఁజేయవలయును. ఉపనయనానంతర మాచార్యుఁడు హస్తగ్రహణ పూర్వకముగా సమిధాహుతులను హోమము శిష్యునిచేఁ జేయించి మౌంజీపరిధాన కృష్ణాజినముల నీయవలయును. ఆవల గాయత్రి నుపదేశించి యగ్నికార్యాదికమును స్విష్టకృద్ధోమాదిగఁ బూర్ణాహుతి పర్యంతముఁ జేయవలయును. మఱియు మూఁడువేళల హోమంబునుజేసి సమాప్తికావల నాచార్యుఁడు శిష్యునికధ్యయనముఁ బ్రారంభింపవలయును. ఋగ్యజుస్సామాథర్వంబులు నష్టాదశ పురాణంబులు, దర్శనములు, జ్యోతిరాది శాస్త్రములు మఱియు నన్నిట విశేషముగా శిల్పశాస్త్రంబును, ధర్మశాస్త్రమును, చతుష్షష్టి కళలును నభ్యసింపఁ జేయవలయును.

గృహమున కీశాన్యభాగమున యాగమండపమును నిర్మింపవలయును. ఇట్లె శిల్పశాస్త్రములయందును, విశ్వకర్మపురాణ, మూలస్తంభపురాణ, ప్రభాసఖండాదులయందును జెప్పఁబడియున్నవి. గ్రంథవిస్తరభీతిచే నిలుపఁబడెను.

## ఆచార్యస్థపత్యాదినామముల వ్యవహారసిద్ధి.

రథకార పర్యాయనామములగు విశ్వబ్రాహ్మణులకు నాచార్యచిహ్నిత నామము లోకప్రసిద్ధి కలిగియెయున్నది. "మంత్రభాష్య కృదాచార్యః" యను నమరకోశవాక్యములోని 'యాచార్య' శబ్దమునకుఁడీకాకర్త 'ఆచారంగ్రాహయతీత్యాచార్యః' యని సంప్రదాయమును గ్రహింపఁ జేయువాఁడాచార్యుఁడని యర్థమును వ్రాసెచ్చెను. ఇందులకు మనుధర్మశాస్త్రమున "ఉపనీయతు యశ్శిష్యం వేదమధ్యాపయేద్ద్విజః । సాంగంచ సరహస్యంచ తమాచార్యం విదుర్బుధాః" ఎవ్వఁడుపయనమొనర్చి శిష్యునకు షడంగములతోడను రహస్యములతోడను వేదమును జెప్పుచున్నాఁడో యాబ్రాహ్మణుఁడాచార్యుఁడు గాఁబడునని చెప్పఁబడియుండుటచే వేదవేదాంగాద్యధ్యయనములనుజెప్పి కులాచార సాంప్రదాయకముల గ్రహింపఁజేయువాఁడె యాచార్యుఁడని దృఢపడుచున్నది. "స్వధర్మస్థాపకాయేస్యు రాచర్యాస్తే ప్రకీర్తితాః" యను స్మృత్యంతరవాక్యముగూడ స్వధర్మమును స్థాపించువారెవ్వరో వారె యాచార్యులని పూర్వోక్తార్థమునే బలపరచుచున్నది.

ఇట్టి ధర్మస్థాపనార్థమునే దృఢీకరించు నాచార్యనామము నుపచిహ్నముగ ధరించుట విరాట్పురుషుఁడగు విశ్వకర్మ ప్రజాపతినుండి నేఁటివఱకుఁ దద్వంశ్యులకు లోకప్రసిద్ధి కలిగియున్నటులఁ బెక్కుప్రమాణములు గానవచ్చుచున్నవి. వానిలో నీక్రిందివి కొన్ని యుదాహృతములు.

" దేవాచార్యస్తుమహాతోధీమతోవిశ్వకర్మణః " అను వాయుపురాణోక్తి, మహాత్ముఁడును ధీశాలియునగు విశ్వకర్మ దేవతల కాచార్యుఁడైనటుల విశేషింపఁబడెను.

" వస్తోరాంగిరసఃపుత్రో విశ్వకర్మాకృతేఃపతిః " అను భాగవత షష్ఠస్కంధోక్తికి శ్రీధరీయ వ్యాఖ్యానమున " ఆకృతేఃపతిః శిల్పాచార్యః " అని విశ్వకర్మ శిల్పాచార్యుఁడుగా వర్ణింపఁబడెను.

" ఆచార్యోవిశ్వకర్మాచై వాదిబ్రహ్మకులాధిపః । దేశికోరథకారాణాం విశ్వకర్మామహాతపాః "అని స్కందపురాణ నాగరఖండోక్తి, ఆదిబ్రహ్మ కులాధిపుఁడైన

విశ్వకర్మ యాచార్యుఁడును, రథకారులకు నుపాధ్యాయుఁడును, మహాతపశ్శాలియునగు నని చెప్పెను.

“ తచ్ఛ్రుతశ్చైవానుష్ఠిత మశేషశిల్పాచార్య స్త్వష్టా తస్మైదర్శితవాన్” అని విష్ణుపురాణ చతుర్థాంశ ద్వితీయాధ్యాయ వచనము, అట్లు యొనర్పఁబడిన యాపుర మును, సమస్త శిల్పులకు నాచార్యుఁడగుత్వష్ట యాసౌభరి కొఱకుఁ జూపించెనని వచించెను.

“మనువంశే సుజాతానామాచార్య ఇతిసంలిఖేత్” అని మను విశ్వకర్మవంశ మునందుఁ బుట్టినవారికెల్లరకు నాచార్యచిహ్నితముగా నామము లిఖించవలయునని విశ్వకర్మపురాణమున నిరువదినాల్గవ యధ్యాయమున శాసించుటయె గాక, మఱియు నిరువదిమూఁడవ యధ్యాయమున “ఆహూయ బ్రాహ్మణాన్ సర్వాన్ నాచార్యాన్ విశ్వకర్మణః । కృత్వాభ్యుదయికం కర్మబ్రాహ్మణైస్సహ భోజయేత్” అని విశ్వకర్మ సంబంధులును బ్రాహ్మణులు నగు నెల్లర యాచార్యులను బిలిచి, ఆభ్యుదయిక కర్మ చేసి యాబ్రాహ్మణులతోఁగూడి భోజన మొనర్పవలెననియు నుడువఁబడెను.

“ కలౌతు భూబలాచార్యో దేశికాచార్య ఏవచ । మన్యుశ్చ రథకారశ్చ చత్వారో నాయకాఃస్మృతాః” అని మూలస్తంభపురాణ వాక్యము కలియుగమున భూబలాచార్యుఁడు, దేశికాచార్యుఁడు, మన్యువు, రథకారుఁడు నను నలువురు నాయకులుగాఁగలరని విశ్వకర్మబ్రహ్మవంశచరిత వివరమున వక్కాణించెను.

“ అతఏవప్రతిష్ఠాయాం స్థపతే ర్ముఖ్యకారణం । తస్మాత్తద్వంశ జాతానా మాచార్యత్వం ప్రచక్షతే” అని గార్గేయాగమమున శిల్పివినా యే ప్రతిష్ఠాకార్యమును జేయఁగూడదు గావున నందులకు స్థపతియె ముఖ్యకారణభూతుఁడగుటచే నావంశము నందుఁ బుట్టినవారి కాచార్యత్వము చెప్పఁబడుచున్నది.

“ మనుసూత్రాది శాస్త్రజ్ఞో గుణవాన్ సత్యవాచకః । ఏవం గుణగణై ర్యుక్తః శిల్పాచార్య స్సదోచ్యతే” మయవాక్యమున మనుసూత్రాది శాస్త్రములు చదివి గుణవంతుఁడై సత్యశీలుఁడై పూర్వోక్తగుణయుక్తుఁడగు నతఁడు శిల్పాచార్యుఁ డుగాఁ జెప్పఁబడుచున్నాఁడు.

ఇట్లుకాక ప్రసిద్ధులగు నెల్ల విశ్వబ్రాహ్మణులకు నీ యాంధ్ర ద్రావిడ కర్ణాట దేశముల నీయాచార్య శబ్దము పురాతనమునుండి వ్యవహరింపఁబడుచునే యున్నది.

ఈయాచార్యశబ్ద వ్యవహారము పూర్వశిలాతామ్రశాసనములయందుఁ బెక్కుగఁ గాని పించుచున్నవి. గ్రంథవిస్తృతిభీతి నొక్కటి నుదాహరింపఁబడినది. "తద్వంశే తత్సమోజాతో ఉల్లపాచార్య సంజ్ఞకః । బాణాచార్య సుతస్తస్య తద్వంశాంభోధి చంద్రిమాః । నాగాచార్య సుతస్తస్య సూత్రధారీ శుభావహః । ద్వితీయఃపోక నాఖ్యస్తు తృతీయః త్రిపురాంతకః" అని యిప్పటికి నేడునూర్ల సంవత్సరములక్రిందటి కారెంపూడి సమీప పాడుగ్రామ శిలాశాసనమున నప్పటి విశ్వకర్మబ్రహ్మ వంశ్యు లగు శిల్పవర్యులకు నాచార్యశబ్దము చిహ్నితమయియె యున్నది.

ఇట్లు నుడువఁబడు నుదాహరణము లనంతములుగలవు. ముఖ్యముగా ద్రావి డాంధ్ర కర్ణాటదేశములయందెల్ల విశ్వబ్రాహ్మణులకు నీ యాచార్యశబ్దము నామ చిహ్నితముగ వ్యవహరింపఁబడుచు యోగరూఢులచే వన్నెకెక్కుచుండ నుదాహరణ ములచే నిరూపింపఁ గేవల మనావశ్యకమ యగును.

## ఆచార్యపీఠము.

విశ్వబ్రాహ్మణుల కాచార్యశబ్దప్రాచుర్యమెగాక పురాతనమునుండి యా చార్య (గురు) పీఠములుగలవు. పురాణాంతరగతమగు "కృతేతువేంకటాచార్య స్త్రేతాయాంనరకేసరీ । ద్వాపరేచోడవిఖ్యాతః కాలహస్తికలౌయుగే" అను వచన ముచేఁ గృతయుగమున వేంకటాచార్యస్వామియుఁ ద్రేతాయుగమున నరసింహాచార్య స్వామియు, ద్వాపరయుగమునందుఁ జోడాచార్యస్వామియు, గలియుగమునఁ గాళ హస్త్యాచార్యస్వామియు నాచార్యత్వము స్వీకరించినటులఁ దెలియుచున్నది. ఇటుల నత్యంతప్రాచీనమని తెలియుటకు యుగాంతర పరిస్థితులచే వర్ణింపఁబడిరనితోఁచెడిని. వారిలోఁ గాళహస్త్యాచార్యస్వామి యాచార్యపీఠమునకుఁ బ్రప్రథమమూర్తిగఁ గన్పట్టుచున్నాఁడు. తత్పూర్వుల చరిత్రగ్రంథములు మృగ్యములు. "కుశాస్త్ర ఖండనార్థాయ సచ్ఛాస్త్రస్థాపనాయచ । జాతోఽయం మనువంశేఽస్మిన్ కాళహస్తి మునిస్స్వయం" అను విశ్వకర్మ పురాణవచనమువలనఁ గుత్సితధర్మశాస్త్రముల ఖండించుటకు శ్రేష్ఠధర్మశాస్త్రముల స్థాపించుటకు విశ్వకర్మ బ్రహ్మవంశమునఁ గాళ హస్తి మునీంద్రుఁ డుదయించెనని తెలియుచున్నది. మఱియు నీయాచార్యవర్య ప్రాదుర్భావమునుగురించి "భస్మాసురవధార్థాయ విష్ణుఃస్త్రీరూపతాంగతః। హరస్సంగ మనంచక్రే పురాతన్మో హవిహ్వలః । గౌరీజ్ఞాత్వాతతోరోషా త్త్వాహైవంన్యభి చారిణం । యతీంద్రోభవ భూలోకే నరరూపేణశంకరమ్॥" అను శ్లోకపంక్తిచే

భస్మాసురవధకొఱకు విష్ణువు స్త్రీరూపము నవధరించ, నా యాకారమును జూచి శంకరుఁడు మోహాంధుఁడై యా చెలువతోఁ గవయుఁడు, నావిషయమెఱింగిన గౌరి రోషాయత్తమై భూలోకమునఁ గొంతకాలము యతీంద్రుఁడవై పరగుమని వాకుృివ్వ నవ్వాక్యాను సరణమున గౌరీధవుఁడు కాళహస్తి యతీశ్వరావతారమున విశ్వకర్మాన్వయచంద్రుఁడై నరలోకమున నుదయించెనని విశదమగుచున్నది. వీరి చరిత్ర మంతయు "నాచార్య (గురు) పరంపర" యను సంస్కృతగ్రంథమునఁ గన్నడ లిపిలో ముద్రితమయి యున్నది. ఈ మహామహుఁడు కాశీక్షేత్రమందుఁ దపస్సానరించుచుండ సుప్రతమహారా జచ్చటకేగి యా యతీంద్రునివలన ధర్మబోధలు పెక్కులు వినినటులను, ఆ ధర్మబోధక గ్రంథములలో నొకటియగు నదియ విశ్వకర్మపురాణమ యనియు నాపురాణ ప్రథమ శ్లోకములచే విశదపడుచున్నది. ఈ కాళహస్తిస్వామి తన తపశ్శక్తిచేతను, విద్యాసంపదచేతను, ధర్మైకబోధనలచేతను, ఆసేతుశీతాచల భారతభూమినంతయుఁ బరిభ్రమించి కాశీ శృంగగిరి విద్యానగరాదిస్థానముల మఠములను స్థాపించి సుప్రసిద్ధిగాంచెను. వానిలో విద్యానగరమఠము విద్యా (విజయ) నగర ప్రతిష్ఠారంభమునుండి పారంపరీకముగ వచ్చుచున్నదని యచ్చటి శిలాతామ్ర శాసనములు వాకుృిచ్చుచున్నవి. (౧) శ్రీపరమహంస పరివ్రాజకాచార్య కాళహస్త్యాచార్యస్వామి (౨) తత్కరకమల సంజాత శ్రీరాఘాచార్యస్వామి (౩) తత్కరకమల సంజాత శ్రీవేంకటాచార్యస్వామి (౪) తత్కర..........శ్రీకాలాచార్యస్వామి (౫) తత్కర............శ్రీనృసింహాచార్యస్వామి (౬) తత్కర............శ్రీపూర్వాచార్యస్వామి (౭) తత్కర..........శ్రీకృష్ణాచార్యస్వామి (౮) తత్కరక...............శ్రీబుభ్వాచార్యస్వామి (౯) తత్కరక............శ్రీనరసింహాచార్యస్వామి దశమపురుషుఁడు గృహస్థాశ్రమమున నాచార్య పీఠము నధిష్ఠించెను. ఈ కరకమల సంజాతులలో నొక పరంపర "కాలహస్త్యాచార్యనామా పురుషోత్తమ గురుర్భవేత్ । వేంకటాచార్య విఖ్యాతః మనుసూత్రకృదగ్రణీః" అను వచనవిధమున శ్రీకాళహస్త్యాచార్య, శ్రీపురుషోత్తమాచార్య, శ్రీవేంకటాచార్యస్వామి త్రితయము సావిత్రీ సరస్వతీ గాయత్రీ పీఠముల నధిష్ఠించి నటులఁ గొన్ని గురుపరంపరా చరిత్రలు నుడువుచున్నవి. నవస్వామ్యవధికముగ యత్యాశ్రమ మవలంబించిన యీ యాచార్య పరంపరలో దశమపురుషుఁడు కలిమహిమచే దుర్భరేంద్రియగ్రామమునకు భయపడి, యత్యాశ్రమమున నేమాత్రమైన నింద్రియలోలత సంభవించెనేని భ్రష్టతలభించుననియు ధర్మప్రవర్ధనమునకు గృహస్థాశ్రమము తగుననియుఁ దలంచి కాఁబోలు గృహస్థాశ్రమాచార్యత్వమునణె పీఠాధిష్ఠితుఁ

డమ్యెను. పూర్వోక్త పీఠత్రయమువారును విద్యానగర శిథిలానంతరము స్థానాంతరముల నధిష్ఠితులైరి. వారలలో నింకను శాఖాపీఠము లేర్పడెను. ఆ శాఖాపీఠములందంద మఠస్థానము లేర్పఱచుకొని యాచార్య ధర్మముల నెఱవేర్చుచున్నారు.

### విశ్వకర్మబ్రాహ్మణ విశ్వబ్రాహ్మణ ప్రసిద్ధి.

విశ్వకర్మ సంబంధులైన యీరథకారబ్రాహ్మణులకు విశ్వకర్మబ్రాహ్మణులనియు, విశ్వబ్రాహ్మణులనియు నాసేతుహిమాచల భారతభూమియందు సుప్రసిద్ధి కలిగియున్నది. విశ్వకర్మ బ్రాహ్మణులనుటలో "విశ్వకర్మణః బ్రాహ్మణా" యని షష్ఠీతత్పురుషరూపమున వ్యస్తపదములుగఁ గొన్నియెడలఁ బ్రయోగములుగలవు. వానిలో నీక్రింది ప్రమాణమొకటి.

శ్లో॥ ఆచారంకృతవాన్ దేవః స్వసుతానామనుక్రమాత్
స్వస్తికాద్యాసనోపేతాః ప్రాణాయామపరాయణాః॥ ౩౧
ప్రత్యాహారరతానిత్యంధారణ ధ్యానసంయుతాః
సమాధినిరతాస్సమ్యక్ స్థిరభక్తి పరాయణాః॥ ౩౨
శివార్చనరతా నిత్యం వేదమార్గప్రతిష్ఠితాః
తీర్థసేవాపరానిత్యం మునిశుశ్రూషణేరతాః॥ ౩౩
పితృశుశ్రూషణోపేతాః సర్వ దాతిథిపూజకాః
అభ్యాగతానాం సర్వేషాం రక్షణే కృతబుద్ధయః॥ ౩౪
కామక్రోధమదాసూయా రోషశోకవివర్జితాః
లోభమోహావినిర్ముక్తా దాంభికవ్యాధివర్జితాః॥ ౩౫
కుత్సితాచారనిర్ముక్తాః కుశాస్త్రార్థపరాఙ్ముఖాః
పరార్థఘటనాదక్షా పరద్రోహావివర్జితాః॥ ౩౬
సుతర్కసహితానిత్యం కుతర్కవిముఖాస్తథా
నిద్రాలస్యాది నిర్ముక్తా నిర్గర్వానిరుపద్రవాః॥ ౩౭
నిరస్తదోషసర్వాశ్చ సమస్తగుణభాజనాః
శిఖాజటాదిశిరసో బ్రహ్మతేజో విరాజితాః॥ ౩౮
అగ్నిరిత్యాదిభిర్మంత్రైర్భస్మదిగ్ధతనూరుహాః
త్రిపుండ్రావళిభిర్దీప్తా రుద్రాక్షాభరణాంకితాః॥ ౩౯

రుద్రప్రణామసంపన్నా సర్వలోకోత్తమోత్తమాః
ఏవంభూతాః ప్రకుర్వంతు బ్రాహ్మణా విశ్వకర్మణః॥ ౪౦

* స్కాందపురాణ నాగరఖండ విశ్వకర్మోపాఖ్యాన ౫ సర్గము.

తా॥ విశ్వకర్మప్రజాపతి తనకుమారులగు మనుమయాదులగు నేఁగురు బ్రహ్మలకు నాచారవిధులాదేశించి, స్వస్తికాద్యాసనములతోనుండువారుగను, ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణాద్యష్టాంగయోగ నిరతులుగను, స్థిరభక్తిరతులుగను, వేదమార్గమునందుఁ బ్రతిష్ఠింపఁబడినవారుగను, మునులను, పితరులను, నతిథులను, శుశ్రూషచేసి పూజించువారుగను, నభ్యాగతుల నెల్లపుడు రక్షించువారుగను, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను నరివర్గమునకు దూరముగ నుండువారుగను, డాంబికములేక యుండువారుగను, గుటిలాచారములను విడిచి కుత్సితశాస్త్రములకుఁ బరాఙ్ముఖులయి పరులకు ద్రోహమొనర్పక పరోపకారమొనర్ప దక్షులయి యుండువారుగను, సుతర్కములను గ్రహించి, కుతర్కములకు దూరులయి, నిద్రాలస్యాది మాంద్యగుణముల విడిచి, సమస్తదోషముల విదళించి, సకలగుణభాజనులై విలసిల్లువారుగను, శిఖాజటలచే భాసిల్లుచు బ్రహ్మతేజోవిరాజితులై యగ్నిరిత్యాది మంత్రపఠనమొనర్చుచు, భస్మపూతశరీరులై త్రిపుండ్రమును, రుద్రాక్షాదికమునుదాల్చి రుద్రమంత్రపాఠకులుగను విశ్వకర్మ సంబంధులైన బ్రాహ్మణులు దేజరిల్లుదురుగాక యని నిర్దిష్టమొనరించెను.

ఈపై శ్లోకముచివర, "బ్రాహ్మణావిశ్వకర్మణః"యనుచోట విశ్వకర్మయొక్క సంబంధులైన బ్రాహ్మణులని యర్థమగుచున్నది. ఇట్లె మఱియొకచోట మూలస్తంభపురాణమునందు "త్రిసంధ్యావందనజ్ఞశ్చ గాయత్రీవేదపాఠకః । ఓంకారకర్తామోభూమా బ్రాహ్మణో విశ్వకర్మణః"అని సంధ్యావందనత్రయమును దెలిసికొని గాయత్రీవేదపాఠములఁ బఠించుచు నోంకారమను ప్రణవమంత్రమునకుయొక్క రహస్యమును దెలిసినట్టివాఁడు విశ్వకర్మసంబంధి బ్రాహ్మణుఁడగునట్లుఁ దెలియుటచే నిచటను సంబంధషష్ఠీరూపమున నిరూపితమగుచున్నది. అట్లయినను, పూర్వోక్తమూలస్తంభపురాణమునందే చెప్పఁబడిన "కర్మద్వయంతదూర్ధ్వంస్యాత్కర్మాణ్యేతాని షోడశ । విశ్వ

*ఈస్కాందపురాణ నాగరఖండ విశ్వకర్మోపాఖ్యానమును తురగా రామకవి, ఆయ్యంకి బాలసరస్వతియను కవులిరువురు పద్యకావ్యముగ నాంధ్రీకరించిరి. కృతిపతి ధవళేశ్వరపు మార్కండేయ మహాప్రభువు. ఈవిశ్వబ్రాహ్మణప్రభుసత్తముఁడు క్రీస్తుశకము ౧౫౭౦ సంవత్సరము మొదలుకొని ౧౬౧౦ వరకు బెజవాడపురమున రాజ్యమొనర్చెను, అందుచే నీయాంధ్ర నాగరఖండము మున్నూట ముప్పది సంవత్సరముల క్రిందటనే తెనిఁగింపఁబడినదిగాఁ దెలియుచున్నది.

కర్మబ్రాహ్మణానాం నిర్దిష్టం కర్మషోడశ" అను వాక్యమువలన గుహ్యగర్భాధానాది షోడశకర్మములు విశ్వకర్మబ్రాహ్మణులకని నిర్దేశించి చెప్పఁబడెను. విశ్వకర్మబ్రాహ్మణుఁడనిసమాసరూపముననుడువఁబడుటచే నీసమాసరూపము నిరూపితముగానలసివచ్చినది. విశ్వానిసమస్తాన్యయోదారు తామ్రశిలా సువర్ణసంబంధీని పంచకర్మాణి యస్యాసౌ విశ్వకర్మా, శిల్పీతియావత్, విశ్వకర్మాచాసౌ బ్రాహ్మణశ్చ విశ్వకర్మబ్రాహ్మణః, శిల్పిబ్రాహ్మణః ఇతివత్. అని, విశ్వ (సమస్త) ములగు నయోదారు తామ్రశిలా సువర్ణసంబంధములగు పంచకర్మ లెవనికిఁ గలవో యతఁడు విశ్వకర్మ యనఁబడును. శిల్పియని నిశ్చితార్థము. విశ్వకర్మ (శిల్పి) యగు బ్రాహ్మణుఁడు గాన విశ్వకర్మ బ్రాహ్మణుఁడని చెప్పఁబడెను. ఇది శిల్పిబ్రాహ్మణుఁ డనునటులఁ బ్రసిద్ధి గానవచ్చుచున్నది. నామలింగానుశాసన నానార్థవర్గమందు "విశ్వకర్మార్క సురశిల్పినోః" అను వాక్యముచే విశ్వకర్మశబ్దము సూర్యునకు దేవశిల్పికి నన్వయించునదియని వివరించెను. అందులకుఁ డీకాకారుఁడు "విశ్వం కర్మాఽస్యేతి విశ్వకర్మా" యని రూపనిష్పత్తి యొనర్చెను. ఇందువలనఁగూడ సమస్త శిల్పకళలు గలవాఁడు విశ్వకర్మయని తెలియుచున్నది. ఇట్టి నేర్పరియె సురశిల్పియనికూడఁ దెలియవచ్చినది. విశ్వకర్మశబ్దము పరమేశ్వరునియందును, బ్రజాపతియందును, శిల్పియందును, ఆచార్యాదులయందును నర్థమగునని * విశ్వకర్మకాండమున నిరూపింపఁబడియేయున్నది. ఇచట సురశిల్పియనుటలో సురలోకముననుండు శిల్పియగుటయెగాక "సురాణాం శివవిష్ణ్వాదీనాం రూపాణాం శిల్పీరచయితా" సురలైన శివుఁడు విష్ణువు మొదలగు వారియొక్క రూపనిర్మాణము లొనర్చుశిల్పి సురశిల్పియనియు నర్థము వ్యక్తమగుచున్నది. "మనుష్యరథేనైవ దేవరథం ప్రత్యవరోహతి" యను తైత్తిరీయ బ్రాహ్మణ వచనమువలన మనుష్యరథమె దేవరథముగాఁ బ్రవర్తింపఁబడుచున్నదని బోధపడుటచే సురశిల్పియనిన మానుషశిల్పియనికూడ నర్థమగుచున్నది. సురశిల్పి యని ప్రసిద్ధినడసిన విశ్వకర్మ మానవలోకమునఁ బెక్కుశిల్పముల రచించినటుల ననేక పురాణములు నుడువుచుండుటచేతను, మానవశిల్పి దేవశిల్పులయందు విశ్వకర్మ శబ్దము సామానాధికరణ్యమగుననుటలో నిస్సందేహ నిర్ధారణము గానవచ్చును. మఱియు, "బ్రహ్మ విప్రః ప్రజాపతిః" యను నమరకోశవాక్యము బ్రహ్మశబ్దము బ్రాహ్మణునియందును బ్రజాపతియందును నన్వయించునని చెప్పినటులనే విశ్వకర్మ శబ్దము ప్రజాపతియందును శిల్పియందును నన్వయించుటలో నప్రయుక్తా సమర్థాది దోషసూచనమేమియుఁ గానిపించదు. కావున నిచట విశ్వకర్మ (శిల్పి) యగు

* చూడుఁడు విశ్వకర్మకాండము ౭౧ వ పుట.

బ్రాహ్మణుఁడు విశ్వకర్మబ్రాహ్మణుఁడనుట యన్వర్థముఁ జక్కఁగాఁ బొసఁగించుచున్నది. విశ్వకర్మబ్రాహ్మణశబ్దమె విశ్వబ్రాహ్మణశబ్దముగా "అర్థమాత్రాలాఘవేన వైయాకరణాః పుత్రోత్సవం మన్యంతే" యను న్యాయమున వ్యాకరణశాస్త్రజ్ఞులొక్క యర్థమాత్ర తక్కువమైన సంతోషింతురను ప్రతీతిచే మధ్యంగత కర్మశబ్దములుప్తమై వఱలినది. ఇయ్యది, క్తేననఞ్వి శిష్టేనానఞ్" (౨. ౧. ౬౦) అను పాణినీయ సూత్రముయొక్క వార్తికమందలి "శాకపార్థివాదీనాం సిద్ధయే ఉత్తరపద లోపస్యోపసంఖ్యానమ్" అను వాక్యమునకు వివరింపఁబడిన బాలమనోరమా వ్యాఖ్యానము ననుసరించి, విశ్వానికర్మాణియస్యాసౌ విశ్వకర్మా, విశ్వకర్మాచాసౌ బ్రాహ్మణశ్చ విశ్వబ్రాహ్మణః। 'వాకర్మణః'ఇతికర్మన్ శబ్దస్య పరనిపాతః। విశ్వకర్మాచాసౌ బ్రాహ్మణశ్చ ఇతివిగ్రహో బహువ్రీహిగర్భో విశేషణసమాసః। తత్రపూర్వఖండే బహువ్రీహౌ ఉత్తరపదస్య కర్మన్శబ్దస్య లోపః। యథా, శాకః ప్రియః యస్యాసౌ శాకప్రియః। శాకప్రియశ్చాసౌ పార్థివశ్చ శాకపార్థివః। దేవాః ప్రియాః యస్యాసౌ దేవప్రియః। సచాసౌ బ్రాహ్మణశ్చ దేవబ్రాహ్మణః ఇతి॥ అని విశ్వములైన యయోదార్వాది పంచకర్మ లెవ్వనికిఁగలవో యతఁడు విశ్వకర్మయనఁబడును. అట్టి విశ్వకర్మ (శిల్పి) యగు బ్రాహ్మణుఁడు విశ్వబ్రాహ్మణుఁడు నాఁజను. ఇచ్చట మధ్యంగత కర్మశబ్దము లుప్తమయ్యెను. ఈ మధ్యంగతశబ్దము లోపించుట శాకపార్థివాదులలో శాకప్రియుఁడైన పార్థివుఁడు శాకపార్థివుఁడై నటులను, దేవప్రియుడైన బ్రాహ్మణుఁడు దేవబ్రాహ్మణుఁడై నటులను దటస్థించెను. ఇట్టి నిర్వచనముచే విశ్వబ్రాహ్మణశబ్దమునకు రూపసిద్ధి ప్రస్ఫుటీకరించుచున్నది. ఈ విశ్వబ్రాహ్మణశబ్దమునకుఁ గొందఱు విపరీతవాదులు రూపసిద్ధియె గలుగదని కువాదములొనర్చిరిగాని వానికన్నిటికి వేఱుగ సమాధానములు వ్రాయ ననావశ్యకమని తోఁచెడిని. వెండియు, "సత్యవాక్ బ్రహ్మచారీచ శుద్ధాత్మా విజితేంద్రియః। సర్వజీవదయాధుర్యస్స విశ్వబ్రాహ్మణోభవేత్" అని మూలస్తంభపురాణ వచనమునవలన విశేషింపఁబడిన విశ్వబ్రాహ్మణుఁడు సత్యనిరతుఁడు, బ్రహ్మచారియుఁ, బరిశుద్ధాంతఃకరణుఁడు, నింద్రియములను జయించినవాఁడును, సర్వభూతములయందు దయగలవాఁడును నగుచుండవలయునని ప్రయోగసిద్ధి కన్పట్టుచున్నది. ఇట్టి ప్రయోగములు పెక్కులు గలవు. మఱియు, "రూఢిర్యోగమపహరతి" యను వాక్యమువలన యోగశక్తిని రూఢిశక్తి హరించునను న్యాయముచే నాసేతుహిమాచలపరీతభూమండలమున విశేష రూఢివహించిన విశ్వబ్రాహ్మణశబ్దమునకు యోగశక్తిని విచారింపబూనుట పిష్టపేషణ న్యాయమ యగును. యోగశక్తియుఁ బూర్ణబలవత్తరమె. సాముదాయికముగా

బ్రాహ్మణశబ్దము వ్యవహారయోగ్యమగుచుండ నీ విశేషసంజ్ఞవలని ఫలమేమి? యని యడుగ నవకాశము గలుగుచున్నది; గాని "బ్రాహ్మణేతద్విశేషగ్రహణ" మ్మను వ్యాఖ్యానవాక్యము ననుసరించి బ్రాహ్మణునియందు విశేషగ్రహణముండవలెనని స్పష్టపడుటయెగాక శాఖాభేదములు విశదీకరింప నీవిశేషసంజ్ఞ రూఢికెక్కుచున్నది. కురువంశమునందుఁ బుట్టినవారెల్లరు కౌరవసంజ్ఞతోడనే ప్రసిద్ధివడయుచున్నారు. వారిలోఁ బాండురాజు కుమారులకుఁ బాండవసంజ్ఞవచ్చినది. పాండవులు మాత్రము కురువంశమునందుఁ బుట్టినవారు గాదా? పాండవనామ మేలవచ్చినదన నంతర్విభాగముఁ జూపట్టుటకె యనవచ్చును. శతాధిక సంఖ్యాక శాఖావిభక్తమగు బ్రాహ్మణ సముదాయము విభేదములు గనిపెట్టుటకు నుపనామములు ప్రకటితములుగాకున్న దుర్జ్ఞేయములగునుగదా?

## విశ్వకర్మ, శిల్పిబ్రాహ్మణ, పౌరుషేయబ్రాహ్మణ ప్రాసిధ్యము.

బ్రాహ్మణుని బ్రహ్మయనునటులనే విశ్వబ్రాహ్మణుని విశ్వకర్మయని కొన్నియెడల వాడుకొనుచున్నారు. ఇయ్యది వంశమూలపురుషుని నామమగుటచే జాతినామ మొకవిధముగా మఱుగుపడఁ జొచ్చినను, బ్రత్యేకవ్యక్తిసంజ్ఞగ నిరూపింపఁబడుచుండినను, వృత్తిప్రధానతచే నీవిశ్వకర్మనామము ప్రసిద్ధికి వచ్చినటులఁ దోఁచుచున్నది. ఈ నామప్రసిద్ధి తఱుచు గానిపించక కాదా చిక్కముగాఁ గనిపించుటచే నిద్దాని నంతగా విచారింప ననావశ్యకము.

ఇఁక "శిల్పిబ్రాహ్మణ నామానః" "పౌరుషేయ మితిఖ్యాతం పంచగోత్రం మహత్కులమ్" అను పూర్వోక్త ప్రమాణవాక్యములచే శిల్పిబ్రాహ్మణులయొక్కయు, పౌరుషేయ బ్రాహ్మణులయొక్కయుఁ బ్రాసిధ్యము వెల్లడియగుచునే యున్నది. జగత్ప్రసిద్ధములగు నీ సంజ్ఞావిభేదముల నెక్కువగా నిర్వర్ణింపఁదలంపక స్థాలీపులాకముగఁ బ్రదర్శించినఁజాలునను సంతృప్తిచే నిప్పటి కీవిషయము విరమితమయ్యెను.

## స్థపతినామ ప్రసిద్ధి.

స్థపతిశబ్దమునుగూర్చి యీ కాండాదియందలి బృహస్పతికి శిల్పకర్తృత్వ నిర్ణయమునందును, స్థాపత్యవేదాది నిర్ణయమునందును జక్కగా వివరింపఁబడియెయున్నది. "తిష్ఠన్త్యస్మిన్నర్థా ఇతిస్థః । స్థశ్చాసౌ పతిశ్చస్థపతిః" అను వ్యుత్పత్తిచే సమస్త ప్రయోజనములు దనయందుండు నాయకుఁడగుటవలన స్థపతియని యన్వర్థమగు

చున్నది. సమస్త శిల్పకార్య ధురంధరుఁడనియు, శిల్పిగణపాలకుఁడనియుఁ బర్యవ
సాన మేర్పడుచున్నది. ఈ వ్యుత్పత్త్యర్థము ననుకూలించియె,

శ్లో॥ తేషామేవస్థపత్యాఖ్యో విశ్వకర్మేతి సంస్కృతః
ఏభిర్వినాహిసర్వేషాం కర్మకర్తుం నశక్యతే॥
తస్మాదేతే సదాపూజ్యాః స్థపత్యాద్యాశ్చ పంచవై
ఏభిః స్థపత్యాదిభిరత్రలోకే వినాగృహీతుం సుకృతం నశక్యతే
తైరేవసార్థం గురుభిశ్చ తస్మాద్భవంతి మోక్షం భవతాంతు మర్త్యాః॥

శిల్పమయ మతము. అ ౫.

అను శిల్పశాస్త్రప్రవచనము, ఆరథకార బ్రాహ్మణులలో స్థపతియను ప్రఖ్యాత పురుషుఁడు విశ్వకర్మయని సంస్కరింపఁబడుచున్నాఁడు. ఈ స్థపతులతోఁగాక యెల్లరకు నేశిల్పికార్యము సాధ్యముగానేరదు. అందువలన నీ స్థపత్యాదులగు నేఁగురు నెల్లప్పుడు పూజింపఁదగినవారు. ఓ మర్త్యులారా! ఈ స్థపత్యాదులగు పంచబ్రహ్మలతోఁగాకయే చక్కని శిల్పకార్యము నీలోకమున నెఱవేరదు. గావున గురువులగు నీ స్థపతులతోడనె సుశిల్పమంతయు సంపూర్తియొనర్పఁడు. అద్దాన మీకు మోక్షము లభించును. అని పలుకుటచే స్థపతియొక్క సంపూర్ణగౌరవ భారము విశదీకృతమగుచున్నది. మఱియు నీస్థపతి, జీవేష్టియాజకుఁడగుటయెగాక ప్రత్యక్ష విశ్వకర్మప్రవచనీయుఁడైనటులఁ బూర్వోక్త ప్రమాణవచనములెగాక యీశిల్పశాస్త్రోక్తియుఁ బ్రకటీకరించుచున్నది. ఇంకను నీ స్థపతిశబ్దము శిల్పాచార్య పర్యాయముగాఁ బ్రయుక్తమయినటుల గార్గేయాగమ మానసార విశ్వకర్మ శిల్పాదులయందలి ప్రమాణవచనములు శిల్పకాండమున నుదాహరింపఁబడియున్నవి. వీనికంటె నెక్కువ ప్రమాణము లుదాహరింప ననావశ్యకము. స్థపతులను నుపనామములతో దాక్షిణాత్య విశ్వబ్రాహ్మణులు పెక్కండ్రు ప్రసిద్ధి వడయుచున్నారు. స్థపతియన విశ్వబ్రాహ్మణుఁడని యందఱుఁ దెలిసికొనుచున్నారు. అద్వితీయముగ నీస్థపతిశబ్ద ప్రసిద్ధి విశ్వబ్రాహ్మణులు వడయుచున్నారనుటలో నతిశయోక్తి యిసుమంతయుఁ గానరాదు.

## దైవజ్ఞనామ ప్రసిద్ధి.

ఈ దైవజ్ఞ బ్రాహ్మణనామ ప్రసిద్ధి మహారాష్ట్రదేశమునఁ దఱుచుగాఁ గానిపించుచున్నది. "శిల్పం ద్వివిధం దైవం మానుషంచేతి" యను భాష్యకారుని

వచనమువలన దైవమన దైవశిల్పమని యర్థమగుచున్నది. "దైవం జానాతీతి దైవజ్ఞః" అను వ్యుత్పత్తిచే దైవశిల్పమును దెలిసినవాఁడు దైవజ్ఞుఁడు నాఁబడును. "దైవజ్ఞః పంచమః ప్రోక్తాః స్వర్ణస్థాయజ్ఞపోషకాః" అను శైవాగమోక్తిచే విశ్వకర్మ బ్రహ్మనన సంజాతులగు వారిలోఁ గడపటియాతఁడు దైవజ్ఞుఁడనియు నిమ్మహర్షియె స్వర్ణకారుఁడనియు నీహిరణ్యవిజ్ఞునికె విశ్వజ్ఞుఁడని నామాంతరముగలదనియుఁ దెలియవచ్చుచున్నది. దైవజ్ఞబ్రహ్మవృత్తి ననుసరించు నతఁడు దైవజ్ఞనామము వహించుసంతలో వింతగానిపించదు. "దైవం శుభాశుభం జానాతీతి దైవజ్ఞో జ్యోతిషికః" యనునటుల శుభాశుభములఁ దెలిసిన జ్యోతిషికుఁడు దైవజ్ఞుఁడని మఱియొక యర్థము నిర్ధారణమొనర్చినను, జ్యోతిశ్శిల్పశాస్త్రము లభేదాధ్యవసాయములుగనే ప్రవర్తింపఁబడుచున్నవి. ఏలన:—జ్యోతిశ్శాస్త్ర వేదపురుషుని నయనాంగము, శిల్పశాస్త్రమో సమస్త దైవతాది రూపనిర్మాణములకు విజ్ఞానచక్షువు. (నేత్రజ్ఞానముచే సమస్తావయవముల సౌందర్యాతిశయములు గనుగొనునది) ఇంతయెగాక జ్యోతిశ్శాస్త్రాంతర్గతమె శిల్పశాస్త్రమని ప్రాయశః వాడఁబడుచున్నది. ఎటుల విచారించినను దైవజ్ఞనామము శిల్పవర్యులకుఁ దగియెయున్నది. అర్థాద్వా దైవజ్ఞ బ్రాహ్మణులనిన శిల్పిబ్రాహ్మణులను నటుల వ్యవహృతమగుచునె యున్నది. వీరలే విశ్వబ్రాహ్మణులని చెప్పుటలో సందేహమేమియుఁ గానిపించదు.

ఇటుల నీ రథకారపర్యాయములగు పంచాలబ్రాహ్మణ విశ్వకర్మబ్రాహ్మణ విశ్వబ్రాహ్మణాది ప్రసిద్ధనామములును ఆచార్య స్థపత్యాద్యుపనామములును, వివృతములై వ్యవహృతములై ప్రకాశించుటచే బ్రాహ్మణ్యావబోధక వివృతవ్యవహారశక్తులు రథకారునికిఁ బ్రత్యక్షమగుచున్నది.

## రథకారశబ్దమునకు వాక్యశేషసిద్ధపదసాన్నిధ్య శక్తులు.

రథకారశబ్దమునకు బ్రాహ్మణత్వావ బోధకములగు వ్యాకరణము, ఉపమానము, కోశము, ఆప్తవాక్యము, వివృతము, వ్యవహారము నను నాలుశక్తులు పూర్వోక్త ప్రమాణములచే విశదీకరింపఁబడినవి. వాక్యశేషమును విచారింపఁగా:—

శ్రుతిః॥ ఋభూణాంత్వాదేవానాంవ్రతపతే వ్రతేనాదధామీతి రథకారస్య॥ యను పూర్వోక్త యజుర్బ్రాహ్మణ వాక్యమె, "కర్మస్వామి యగు నోయగ్నీ! ఋభుదేవతల సంబంధమైన కర్మవిశేషముచే నీయాయతనమందు నిన్ను నిల్పుచున్నా" నని చెప్పి "యిట్లు రథకారుస" కని వాక్యము శేషించుటచే, బ్రాహ్మణులగు ఋభు

వులు రథకారఋషి దేవతలగుటవలనఁ దత్సంబంధమగు బ్రాహ్మణత్వావబోధక కర్మ విశేషమున నీ రథకారున కధికారము గల్పింపఁబడుచున్నది. ఋభురథకారుల కుభయులకు నవినాభావ బ్రాహ్మణత్వసంబంధ మేర్పడుచున్నది. కావున నీ బ్రాహ్మణ శ్రుతివాక్యము రథకారునకు వాక్యశేషమువలన బ్రాహ్మణత్వ ముజ్జీవింపఁజేయుచున్నది.

ఇఁక సిద్ధపదసాన్నిధ్యము గుర్తింపనగును. సిద్ధపదమనఁ బ్రస్తుతము బ్రాహ్మణత్వావబోధకమగు ప్రసిద్ధపదము. అట్టి ప్రసిద్ధపదమునకు సాన్నిధ్యమునందుటయె సిద్ధపదసాన్నిధ్యము. "రథకారో నామబ్రాహ్మణః" అను పాణినీసూత్ర వ్యాఖ్యాన వాక్యముచే సిద్ధపదమగు బ్రాహ్మణశబ్దమునకు సాన్నిధ్యము తటస్థించుచున్నది. మఱియు, పంచరాత్రమహోపనిషత్క్రియా పాదశూలస్థాపనవిధి ౭౮ పృష్ఠమందలి, "తస్మిన్ కాలే సమాహూయ రథకారద్విజోత్తమమ్ ప్రేషయేత్తోషయేచ్చాపి యజమానోధనైర్భృశమ్" అను ప్రమాణవాక్యమున నాకాలమునందు రథకారబ్రాహ్మణునిఁ బిలిచి యజమానుఁడు ధనములచే మిక్కిలిగా సంతోషింపఁజేసి పంపవలెనని నొడువుటలో "రథకారద్విజోత్తమమ్"అని రథకారశబ్దము ద్విజోత్తమ (బ్రాహ్మణశ్రేష్ఠ) శబ్దమునకు సాన్నిధ్యసిద్ధి యొనఁగూర్పఁబడినది. ఇంకను నట్లే పూర్వోక్తమగు పద్మసంహితాక్రియా పాదప్రతిష్ఠావిధియందలి "ప్రాసాదంప్రవిశేచ్ఛిల్పీ రథకారద్విజోత్తమః" అను వాక్యమునందుఁగూడ ద్విజోత్తమ (బ్రాహ్మణోత్తమ) శబ్దమునకు రథకారశబ్దమునకు సాన్నిధ్యసంసిద్ధి చేకూర్పఁబడినది. కావున రథకారునకు బ్రాహ్మణ్యావబోధక సిద్ధపదసాన్నిధ్య సంసిద్ధికిఁ గొఱఁత గానిపించదు.

ఇతఃపూర్వ విచక్షణాప్రదర్శితమగు నష్టవిధశక్తిగ్రహబోధకముచే నిస్సందేహముగ నిరాఘాటముగ రథకారుఁడు బ్రాహ్మణుఁడగుచున్నాఁడు.

ఇఁక రథకారులకు యథార్థదైవతములగు ఋభువుల పవిత్రచరితము విశదీకృతమగును.

## ఋభు చరిత్రము.

సౌధన్వనఋభువులవిషయమై మీమాంసకుల భ్రాంతి; తన్నివారణము.

"వర్షాసురథకారోగ్నీనాదధీత" అను శ్రుతివలన నాధానాధికారి త్రైవర్ణికరథకారుఁడని తెలియుచున్నది. కాని, పార్థసారథి మిశ్రాదులు వ్రాసిన మీమాంసక భాష్యాదులయందును త్రైవర్ణికేతరులుగా రథకారులు నిర్ధారింపఁబడిరి. ఇందులకుఁ గారణము "సౌధన్వనాఋభవస్సూరచక్షసః" అను శ్రుతిలో ఋభువులు సుధన్వపుత్రులయినటులఁ దెలియుచున్నది. ఆసుధన్వుఁడు "వ్రాత్యాత్తుజాయతే వైశ్యా

త్సుధన్వాచార్య ఏవచ । భారూషశ్చ విజన్మాచ మైత్రస్సాత్వతఏవచ” అను మను స్మృతివాక్యమువలన వ్రాత్యవైశ్యునివలన సుధన్వుఁడు జనియించె నట్టి కొడుకులే ఋభువులగుటచే “వ్రాత్యోత్పన్నా శ్శూద్రసమాః” యను వాక్యమున కనుకూల ముగఁ ద్రైవర్ణికేతరులుగ ఋభువులుగూఁడఁ బరిగణింపఁబడినటుల మీమాంసా కర్తలకునుఁ దోఁచినది. అందువలననే “సౌధన్వనాహీనత్వాత్” అని సౌధన్వులను హీనులనుగా నిర్ణయించిరి. కాని,యియ్యది వారిభ్రమప్రమాదము. రథకారులు శూద్రసములైరేని వారికి నుపనయనాదిసంస్కారము లెచ్చటనుండి రాఁగలవు? సంస్కారములకే యనర్హులయినప్పుడు “ఆధానస్యసర్వశేషత్వాత్” అను సూత్రవాక్యాను సంధానముగ సర్వకర్మ విశిష్టమయిన యాధానాధికార మెట్లు పొసఁగును?

‘సౌధన్వనాఋభవ స్సూరచక్షసః’ అను శ్రుతివలన సుధన్వుని పుత్రులు ఋభువులయినటులఁ దెలియుచున్నది. కాని, ఆమనుస్మృత్యుక్తుడగు సుధన్వుని కొడుకులే ఋభువులైరని మీమాంసకులభ్రాంతి. ఈ భ్రమమే వేదభాష్యకర్తలను గూడ నొక్కొక్కయెడఁ బ్రమాదాంధమున ముంచివైచినది. వ్రాత్యవైశ్య పుత్రుఁడగు సుధన్వునకుఁ గొడుకులున్నటులను, వారే ఋభువులైనటులను శ్రుతి యందెక్కడఁ గానిపించకపోవుటయేగాక, ఏస్మృతియందైనను ఏపురాణమందైనను మఱియెక్కడనైన నీవాక్యము గానిపించదు. కారణము హీనజాతి సుధన్వునికి బ్రహ్మిష్ఠులగు ఋభువులు సుతులగుట యసంభవమగుటవలననే. ఇట్టి యయథార్థవాదనమునే “తదభావవతి తత్ప్రకా రానుభావోఽయథార్థః సఏవభ్రమ ఇత్యుచ్యతే” అయ్యది లేకపోవుచుండగా నవ్విధానము నూహించుటయె యయథార్థ మయ్యదియె భ్రమ మని నైయాయికులు నుడివిరి. ఆ ప్రమాదమునే మీమాంసా వ్యాఖ్యాతలుపొంది అంగిరోవంశ్యుఁడగు సుధన్వుని వ్రాత్యవైశ్యపుత్రునిగా భ్రమించిరనుట నిర్వివాదాంశము. అట్లు కానిచో “అగ్నినాసించేదితివత్ నప్రమాణం యోగ్యతావిరహాత్” అగ్నిచేఁ జల్లవలె ననుటవలె యోగ్యత లేకపోవుటవలనఁ బ్రమాణము గానేరదను వాక్య మప్రమాణమగును. ఈ భ్రమము భాష్యకర్తలకు “వ్రాత్యాత్తుజాయతే వైశ్యాత్సుధన్వా” యను ప్రత్యేకస్మృతివచనమొకటియే ప్రమాదమున ముంచి వైచినదిగాఁ దోఁచఁబడుచున్నది. పూర్వోక్త పార్థసారథి మిశ్ర కర్కదేవయాజ్ఞిక ప్రముఖులగు భాష్యకారులు వ్రాత్యవైశ్యుఁడును బుత్రహీనుఁడు నగు సుధన్వునకు ఋభువులు పుత్త్రులని కేవల తార్కికమతరీతిగనే వక్కాణించుచుఁ బ్రమాణరహితగతినే గమనించిరి. ఇట్టి భ్రమప్రమాదములు భాష్యకర్తలకు “తిప్ర ధాతుః అనిట్ సన్ అయంసేట్ ఇతిబభ్రామ” “సంస్కారార్థ మితి కస్యచిద్భ్రమః

స్యాత్" అను మున్నగు పెక్కుచోటులఁ గలిగినటులఁ బుష్కలములగు నుదాహరణములు కనుపట్టుచున్నవి. అట్లైనను బూర్వోక్త గ్రంథకారులను దూషణీయులుగఁ దలంపఁగూడదు. ధాన్యరాశివలె వారి వాఙ్మయ మత్యంత శ్లాఘాపాత్రమేయగును. పొల్లులువోలె దోసఁగులందందయుండిన రాశినంతను గర్హింపఁదగునా? విమర్శక వాచావాతూలమునఁ దూర్పెత్తి స్థిరరాశిఁజేసి లెక్కింపఁదగును.కావున నెప్పుడైన గుణస్వీకారమే యోగ్యధర్మము. ఇఁక నిచట వేదపురాణప్రమాణములచే సుధన్వుఁ డెవ్వఁడు? ఆతనికి ఋభువులు పుత్త్రులెట్లు? అని విచారించుదము.

## సుధన్వుఁ డాంగిరసుఁడగు బ్రాహ్మణుఁడు.

"భారతః పంచమోవేదః" యను వాక్యముచే భారతేతి హాసము లోకోత్తర ప్రమాణమయినదేకదా? అట్టి భారతమున ననుశాసన పర్వలమందలి (౮౩) వ అధ్యాయమున.

శ్లో॥ అష్టౌ చాంగిరసః పుత్రాః ఆగ్నేయా స్తే ప్యుదాహృతాః।
బృహస్పతిరుతథ్యశ్చ పయస్య శ్శాంతిరేవచ
ఘోరో విరూపస్సంవర్త స్సుధన్వా చాష్టమస్మృతః॥

తా॥ అంగిరో బ్రహ్మర్షికి నెనమండుగురు పుత్త్రులు వారికి బృహస్పతి, ఉతథ్యుఁడు, పయస్యుఁడు, శాంతి, ఘోరుఁడు, విరూపుఁడు, సంవర్తుఁడు, నెనిమిదవవాఁడు సుధన్వుఁడునని చెప్పఁబడుదురు. అని యుండుటచే సుధన్వుఁ డంగిరస్సునకుఁ బుత్త్రుడైనటుల విస్పష్టపడినది.

మఱియు నుద్యోగపర్వ మధ్యమున,

శ్లో॥ కిం బ్రాహ్మణాస్స్విచ్ఛ్రేయాం సోదితిజాస్స్విద్విరోచన।
అథకే నాస్మపర్యంకం సుధన్వా నాధిరోహతి॥

ప్రహ్లాదఉవాచ॥ మత్తః శ్రేయానంగిరా వై సుధన్వా త్వత్తఏవచ
మాతాస్య శ్రేయసీ మాతు స్తస్మాత్త్వంతేన వై జితః॥
విరోచన సుధన్వాయం ప్రాణానా మీశ్వర స్తవ
సుధన్వన్ పునరిచ్ఛామి మయాదత్తం విరోచనమ్.

సుధన్వోవాచ॥ ఏషప్రహ్లాద పుత్ర స్తే మయాదత్తో విరోచనః
పాదప్రక్షాళనం కుర్యాత్కుమార్యాః సన్నిధౌమమ॥

నీలకంఠటీకాయాం॥ సుధన్వా బ్రాహ్మణః పర్యంకం అధిరోహత్యేన త్వంతునీచ దైత్యఃసర్వాకిమర్థం ప్రత్యాఖ్యానం కరోషీతిభావః అంగిరాః సుధన్వనఃపితా.

తా॥ అంగిర స్తనూజుఁడగు సుధన్వుఁడు ప్రహ్లాదసూనుఁడు విరోచనుఁడు నిరువురుం దగవులాడి నేను గొప్పవాఁడను నేఁగొప్పవాఁడనని వివదించికొని విషయ నిర్ధారణము కొఱకు విష్ణుభక్తుఁడు సత్యవ్రతుఁడు నగు ప్రహ్లాదునకు నివేదింప నాతండు ధర్మజ్ఞుండు గావునఁ గుమారా! విరోచనా! శ్రేష్ఠులు బ్రాహ్మణులా! దైత్యులా! యని ప్రశ్న కల్గినదా? దీనిచేతనా నేఁడు సుధన్వుఁడు పీఠమధిష్ఠింపలేదు; సుధన్వుని తండ్రి యంగిరోమహర్షి నాకంటెను, సుధన్వునితల్లి నీతల్లికన్నను, బ్రాహ్మణుఁడగు సుధన్వుఁడు నీకంటెను నధికులు. మఱియు నీసుధన్వుఁడు నీప్రాణముల కధీశ్వరుఁడు గాన నీవోడి పోయితివని చెప్పి సుధన్వా! నాచే నొసఁగఁబడిన నీవిరోచనుని మఱలఁ గామించెద ననియెను. అంత సుధన్వుఁడు ఓ ప్రహ్లాదా? నీకుమారుఁడగు నీవిరోచనుఁడు నాచే నియ్యఁబడెను. కుమారీ సన్నిధానమున నాకుఁ బాదప్రక్షాళనముఁ జేయవలెననియె. ఈపై భారతవచనముచే సుధన్వుఁ డంగిరఃపుత్త్రుఁ డైనటులను బ్రాహ్మణుఁ డైనటులను విస్పష్టముగాఁ గానవచ్చెడిని.

బుభువు లాంగిరస సుధన్వపుత్త్రులు.

విష్ట్వీశమీ తరణిత్వేనవాఘతోమర్తాసస్సన్తో అమృతత్వమానశుః । సౌధన్వనా బుభవఃసూరచక్షసః సంవత్సరే సమపృచ్యంతధీతిభిః॥

బు॥ ౧.౭-౩౦౪.

సత్యార్థోపదేశకయాస్క మునిప్రణీత వేదాంగనిరుక్త ఉత్తరషట్క అధ్యాయ ౫ బుక్ ౧౬ కృత్వాకర్మాణి క్షిప్రత్వేనవోఢారో మేధావినోవామర్త్యాసః సంతోఽమృతత్వమానశిరె సౌధన్వనా బుభవః సూరాఖ్యానావా సూరప్రజ్ఞానావా సంవత్సరె సమపృచ్యంత ధీతిభిః కర్మభిః । బుభురృభ్వావాజఇతి సుధన్వనఆంగిరసస్యత్రయః పుత్రాబభూవుస్తేషాం ప్రథమోత్తమాభ్యాం బహవోనిగమాభవంతి । నమధ్యమేన తదేతదృభోశ్చ । బహువచనేన చమసస్యచ సంస్తవేన బహూనిదశతయీషు సూక్తాని భవంత్యాదిత్యరశ్మయో ప్యృభవఉచ్యన్తే॥

ఈ బుక్కునకు సత్యార్థోపదేశికుఁడైన యాస్కమునిచేఁ బ్రణీతమయిన వేదాంగనిరుక్తమున నర్థమిట్లు చెప్పఁబడినది.

శీఘ్రముగా శిల్పములనొనర్చి ప్రవీణులును, మేధావంతులునగు బుభువులు మర్త్యులయ్యు నమర్త్యత్వమునుఁ బొందిరి. ఆంగిరోమహర్షి కుమారుఁడగు సుధన్వ

నికి ఋభువు, విభ్వ, వాజుఁడునను ముగ్గురు పుత్త్రులుకలరు. వారు ఋభువులు నాఁబరగిరి. వారిలోఁ బ్రథమ తృతీయుల (ఋభువు, వాజుడనునువారల) వలనఁ బెక్కులు శ్రుతులు కలిగినవి. మఱియు నా యీ ఋభువులనలన బహువచనమైన చమసస్తుతిచే బహుసూక్తములు కలిగినవి. వారు సూర్యప్రజ్ఞాధురీణులగుదురు. ఏలన సంవత్సరాత్మకమైన వసంతాదికాలములందుఁ గర్మములఁ (శిల్పములఁ) జేకూర్చిరి. అందువలన నమర్త్యత్వమునుఁ బొందిరి. వారలే సూర్యకిరణములుగాఁ జెప్పఁబడిరి. ఇట్లనుటచే నాంగిరస సుధన్వపుత్రులు ఋభువులుగా స్పష్టపడిరి. మఱియు,

అభోగయం ప్రయదిచ్ఛంత ఐతనపాకాః ప్రాంచోమమ కేచిదాపయః।
సౌధన్వనాసశ్చరితస్య భూమనాగచ్ఛత సవితుర్దాశుషోగృహం॥

ఋగ్వేద అ ౭-౩౦-౨

భా॥ హేసౌధన్వనాసః ఆంగిరస్తస్యసుధన్వనః పుత్రాఋభవః హేమమ పూర్వభూతాయదా ఆప్తహవిష్కం దేవత్వం జిగమిషవోయూయం సుచరితమాచరితుం ప్రవృత్తాస్తదామహాంతి చరితాని పిత్రోః పునర్యౌవనదానాదిరూపాణి కృత్వా సూర్యలోకంగతా ఇతిభావః॥

తా॥ ఆంగిరస సుధన్వుని పుత్రులగు నో ఋభువులారా! సంప్రాప్తహవిష్కమైన దేవత్వమునుబొంద నిచ్ఛించినమీరు ఎప్పుడు సచ్చరిత్రమాచరించుచున్నారో అప్పుడే తల్లిదండ్రులకుఁ బునర్యౌవనదానాదిరూపములైన గొప్పచరిత్రము లొనర్చి సూర్యలోకమును బొందినవారలైతిరి.

అనఁగా ఋభువులు సత్కర్మములనుజేసి దేవత్వమునుఁబొంద నిచ్ఛించి వృద్ధులైన తలిదండ్రులకు యౌవనమును బొందించిరి. మఱియు యజ్ఞపాత్రాదులను సృజించిరి. ఇంకనుఁ బెక్కుపనులనుజేసిరి. దానిచే దేవత్వమును బొందుటయే కాక సూర్యతేజస్సులోని కళారూపమును బొందిరి. దీనిచే ఋభునిర్మితములైన శిల్పముల యొక్క యుత్కృష్టత యుగ్గడింపఁ బడుచున్నది.

ఋభువు లుత్వష్ట్రృశిష్యులే.

శ్రుతిః॥ సతోనూనంకవయః సంశిశీతవాశీభిర్యాభిరమృతాయతక్షథ।
విద్వాంసః పదాగుహ్యానికర్తనయేన దేవాసో అమృతత్వమానశుః॥

ఋక్ అ ౮. అ౧౮. ౧౪. ౧౦.

భాష్యమ్॥ హేకనయః మేధావినః త్వష్టుర్మమశిష్యాః ఋభవస్సతః సంత ఇత్యర్థః। ప్రశస్తాయూయం నూనమిదానీం సంశిశిత అత్యర్థం తీక్ష్ణీకురుతవాశీః యాభి ర్వాశీభిః పాత్రాణ్యమృతాయ సోమాయతత్వానా యేత్యర్థః। యద్వాయుష్మాక మమృతత్వాయ తదర్థం తక్షథ సంపాదయథ। హేకవయో విద్వాంసోయూయం గుహ్యాది గోపనీయాని పదాపదాని నివాసస్థానాని కర్తనకురుత యేనస్థానకరణేన దేవాసోదేవాః యూయమమృ తత్వమానశః ప్రాప్తాయూయం ఏవం స్వశిష్యానాహ॥

తా॥ త్వష్ట తనశిష్యులగు ఋభువులనుఁగూర్చి చెప్పుచున్నాఁడు, మేధావు లగు నాశిష్యులారా! ఋభువులగుచుఁ బ్రసిద్ధివడసినమీరు ఏవాసులచే సమృత (సోమ) పానముకొఱకుఁ బాత్రలను చేయుచున్నారో అట్టివాసు (బాడెస) లను త్వరగా నుప యోగించుట కొఱకు పదునుగలవానినిఁగాఁ జేయుఁడు ఓ విద్వాంసులారా! ఏనివాస ములను సృజించుటచేత మీరమృతత్వమునుఁ బొందితిరో అట్టి రక్షణీయములైన నివాసములను జేయుఁడు.

అని చెప్పియుండుటచేఁ ద్వష్టృశిష్యులై పాత్రనివాసాదులను సృజించిన ఋభువులు దేవత్వమునుఁ బొందినటుల విస్పష్టమగుచున్నది. మఱియు నింకొక-చోట,

శ్రుతిః జ్యేష్ఠ ఆహచమసాద్వాకరోతిక నీయాన్ త్రీన్ కృణవామేత్యాహ కని ష్ఠఆహ చతురస్కరోతి త్వష్టఋభవ స్తత్పన యద్వ-చోనరి॥

ఋక్ అ ౩ అధ్యా ౭ వ ౨ ఋ ౬.

భాష్యమ్॥ "ఏకం చమసంచతురః కృణోతన" ఋ ౧-౧౬ ౧-౨ ఇతి యదాదేవదత్తోగ్ని ఋభూనాహ దేవత్వం పాప్తిప్త్యర్థకేన తదాతేషు మధ్యే దేవత్వ పాప్తిప్త్యర్థ ఏకోజ్యేష్ఠ ఋభురితరావాహకిమితి ఉచ్యతే। చమసాద్వాకరోతి ఏకమే వచ మసంతంద్వా కృణావామేతి। కనియాన్ తదనంతరో విభ్వాత్రీన్ కృణవామ కరవామేత్యాహ తదవరః కనిష్ఠోవాజశ్చతురః కర చతుర్ధా కరవామేత్యాహ। తదేవ చతుష్కరణ రూపం హేఋభవః త్వష్టాయుష్మద్గురుః పనయత్ అస్తౌత్ అంగీచ కార్యేత్యర్థః.

తా॥ "ఏకంచమసంచతురః కృణోతన" యను ఋక్కు-వలన నగ్నిదైవతము వలన ఋభువులు దేవత్వమునుఁ బొందినటులఁ జెప్పబడిరి. దేవత్వమును బ్రాప్తించిన వారిలో జ్యేష్ఠుఁడగు ఋభువితరులగు విభ్వావాజులలో మొదటివాఁడగు విభ్వతో నొక్క-చమసపాత్రను రెండుగాఁ జేయుఁడని చెప్పిన నతఁడు మూఁడుగాఁ జేయుదు ననియె. తదనంతరము కనిష్ఠుఁడగు వాజునితో నాలుగుగాఁ జేయుమనిన నతఁడును

నట్లియనెను. అందువలనఁ జతుష్కరణ రూపమయ్యెను. కావున నోఋభువులారా! మీగురువగు త్వష్ట్రప్రజాపతి యంగీకరించెనని యర్థమగుచున్నది.

కావున త్వష్ట్ర శిష్యులగు ఋభువులు పాత్రనిర్మాణమునొనర్చి యజ్ఞకార్యనిర్వాహకులై లోకోపకారకరణధురీణులును దేవతాస్తుతి పాత్రులునైనటుల శ్రుత్యర్థములు ప్రతిపాదించుచున్నది.

## త్వష్ట్ర మహాకులోత్పన్నుఁడు.

శ్రుతిః॥ననాందిమచమసంయో మహాకులోఽగ్నే భ్రాతర్దృణఇద్భూతిమూదిమ
ఋక్ ౨. ౨. ౨౮. ౧.

సా॥ భా॥ హేఽగ్నే భ్రాతః భ్రాతృవద్భాగార్హః భ్రాతాయథాబలాత్ యథా స్వకీయభాగం స్వీకరోతితద్వత్ సమానరూపమాశ్రిత్య బలాచ్చమసపానాయప్రవృత్త ఇతిభ్రాతరిత్యుక్తమ్, హేతాదృశాగ్నే చమసం ననిందిమ అధికః సమాగత ఇతిపానమ కృత్వాచమసం నదూషయామః। ణిదికుత్సాయామ్. ఛందసివేత్తివక్తవ్యమితి ద్వివచనాభావః అదూష్యత్వేకారణమాహ। యచ్చమసోమహాకులః మహాకులోత్పన్నః త్వష్ట్రా నిర్మితత్వాత్, వక్ష్యతిచత్వష్టాగ్నా స్వతర్నాక్ష్యనజఇతి, అతఃకారణాత్ ద్రుణోవికారే ప్రకృతిశబ్దః తతశ్చ తస్యేతచ్ఛబ్దః ఇచ్ఛబ్దోఽన ధారణేదారునికారచమసస్య భూతిం ప్రాప్తిం మూదిమబ్రూమః విదేశ్ఛాందసేలిటివచ స్వపీతిసంప్రసారణం, క్రాదినియమాదిట్ ఇతి॥

తా॥ సహోదరుఁడవగు నో యగ్నీ! (ఇచ్చట సహోదరుఁడువలె భాగించు కొనుట కర్హుఁడననియు సోదరుఁడెట్లు బలవంతముగాఁ దనభాగమును స్వీకరించునో యట్లె సమానరూపమునుఁబొంది బలవంతముగాఁ జమసపానముకొఱకుఁ బ్రవర్తింపు మనియు భ్రాతృశబ్ద ప్రయోజనము) మిక్కిలిగా వచ్చినదని చమసపానమొనర్పక నిందింపము. నిందింపనికారణ మిట్లుచెప్పెను. ఏకారణముచేఁ జమసపాత్ర త్వష్టచే నిర్మింపఁబడెనో యందుచే నయ్యది మహాకులోత్పన్నమయినది. దారువుచేఁ జేయఁబడిన చమసపాత్రమునకు నైశ్వర్యము గలిగినదనిఁ జెప్పుచున్నాము. అని చెప్పఁబడుటచేఁ త్వష్ట్రమహాకులోత్పన్నత చాటుచున్నది.

## ఋభువుల తండ్రి ప్రజాపతియె.

ప్రజాపతిర్వైపిత ఋభూన్మర్త్యాన్సతోఽ మర్త్యాన్కృత్వా తృతీయసవన ఆభజత్తస్మాన్నాఽఽర్భవీషుస్తువతేఽథాఽఽర్భవః పవమాన ఇత్యాచక్షతే. (ఇతి)
ఐతరేయబ్రాహ్మణమ్. అ ౨౭ ఖం ౮.

సా॥ భా॥ పురాప్రజాపతిః పితాభూత్వా మర్త్యాన్మనుష్యాన్సత ఋభూన మర్త్యాన్ దేవాన్కృత్వా తృతీయసవన అభజద్భాగినోఽకరోత్. తదిదముపాఖ్యాన మార్భవం శంసతీత్యత్ర పరిదర్శితమ్.

తా॥ ప్రజాపతితండ్రియై మర్త్య (మరణధర్మముగలవార) లగు ఋభువులను అమర్త్య (మరణధర్మము లేనివార) లనుగాఁజేసి తృతీయసవన (సాయంకాలహోమ) మున హవిర్భాగార్హులనుగాఁ జేసెను. ఆ యీ యుపాఖ్యానమును ఋభుసంబంధ మైనదానిగాఁ జెప్పుచున్నది. అద్దాని నిక్కడఁ బరిదర్శింపఁబడినది, అని వివరించు టచే ఋభువులకుఁ బితయగు సుధన్వుఁడు మహర్షియగుటయే కాక, ప్రజాపతియయి నటుల శ్రుతి పలుకుచున్నది. "సుధన్వావిశ్వకర్మణి" యను మేదినీకోశవాక్యాను సారముగ విచారించినచో సుధన్వుఁడన విశ్వకర్మ ప్రజాపతియే యగుననుట నిస్సం దేహము.

మఱియు నింతయెకాక, వాయుపురాణ చతుర్థాధ్యాయమందు నంగిరోవంశము వివరించుచు "ధిష్ణుః పుత్రస్సుధన్వాచ ఋభవశ్చ సుధన్వనః। రథకారాస్స్మృతాదేవా ఋషయో యేపరిశ్రుతాః" అని యంగిరస్సుయొక్క పుత్రుఁడు సుధన్వుఁడనియు సుధన్వపుత్రులు ఋభువులనియు వారలే ఋషులును దేవతలు నగుదురనియు వారలే రథకారులనియుఁ జెప్పఁబడినది. ఇంకయు ఋగ్వేద సప్తమాష్టక తృతీయ మండల మందు "ఋషిర్విపఃపుర ఏతాజనానామృభు ర్ధీరః" యని వక్కాణించుటచే ఋషియు, బ్రాహ్మణుఁడును ధీరుఁడునగు ఋభువు ప్రజలలో గొప్పవాఁడని వివరింపఁ బడుచున్నది. ఇట్లు ఋభువుల వంశ వైభవ ముత్తమ బ్రాహ్మణ్యమని లోకైక విశదమగుచుండ "సాధన్వనా హీనత్వాత్" అను మీమాంసాకారుని వాక్యము హీనత్వ మగుటలో సందేహమేమి గానిపించును?

వెండియు సాధన్వన శబ్దమునుగూర్చి,

1 శ్రు॥ విష్ట్వీశమీతరణిత్వే నవాఘతో మర్తాసస్సంతో అమృతత్వమానశుః।
సాధన్వనా ఋభవస్సూరచక్షసః సంవత్సరేసమపృచ్యంతధీతిభిః॥

ఋగ్వే ౧. ౭. 3౦,

* తా॥ సాధన్వులన సుధన్వఋషిపుత్రులు. ఆఋభువులు తాము మరణ ధర్మముగల వారలయ్యు నొక చమసము నాలుగుచమసములు చేయుట మున్నగు దేవతలు చెప్పిన పనులు శీఘ్రముగఁజేసి దేవత్వమును బొందిరి. తరువాత నాసుధన్వ

* ఈశ్రుతి భాష్యమును శిల్పకాండము ౧౧3 పుటను జూడుఁడు. 1 పునరుక్తము.

పుత్రులు సూర్యునితో సమానమైన తేజస్సుగలిగి సంవత్సర భాగమైన వసంతాది కాలములయందు జేయదగిన యగిష్టోమాది కార్యములయందు హవిర్భాగమునకు నర్హులయిరి. అనిచెప్పుటయె గాక యీయర్థమును బ్రతిపాదించియె నిరుక్తకారుఁడు బలవత్తరముగా వ్రాసియున్నాఁడు. మఱియుఁ బెక్కుశ్రుతులు సౌధన్వనశబ్దము సుధన్వర్షి పుత్త్రులుగానె వివరించుచున్నవి. ఇట్టి విషయములో శ్రుత్యర్థ విరుద్ధముగా మీమాంసాకారులుఁ, దదనుసారులును వచించుట లోకవిరుద్ధము గాదనుటకు నోరాడునా?

ఋభువులు రథకారులే.

ఋక్॥ ఇంద్రో॒హరీ॑యుయు॒జే అ॒శ్వినా॒రథం॑ బృహ॒స్పతి॑ర్వి॒శ్వరూ॑పా॒ముపా॑జత।
ఋ॒భుర్వి॒భ్వా॑వాజో॒దేవా॒ అ॑గచ్ఛత॒ స్వప॑సో॒య॒జ్ఞియం॑ భా॒గమై॑తన॥

భాష్యమ్॥ ఇంద్రో హరీయుయుజే । ఋభుభిర్నిర్మితౌ హరిద్వర్ణౌ వశ్వౌస్వ రథేయోజయతి । అశ్వినా । అశ్వినౌయుయుజాతే । ఋభుభిఃకృతం రథంయోజయతః బృహస్పతిః విశ్వరూపామేతన్నామికా మృభుభిః కృతాంగా ముపాజత స్వీకరోతి । అతః । ఋభుర్విభ్వావాజఇతి ఋభవోదేవా నాగచ్ఛతదేవత్వం ప్రాపసు అపసః సుకర్మాణోఽశ్వరథగవాది పరమాద్భుత కర్మణాం కర్తారోయూయం యజ్ఞియం భాగమైతన యజ్ఞేనప్రాప్య తస్యహవిషో భాగంప్రాప్తవంతఃస్థ॥

ఇంద్రుఁ డశ్వములనుగూర్చెను. ఋభువులచేఁ జేయఁబడిన పచ్చనివన్నెలుగల గుఱ్ఱములను రథమునందుగూర్చెను. అశ్వినీ దేవతలు ఋభువులచేఁ జేయఁబడిన రథమును సంయోజన మొనర్చిరి. బృహస్పతి విశ్వరూపయను పేరుగల ఋభునిర్మితమగు గోవును స్వీకరించెను. ఇందువలన ఋభువు, విభ్వ, వాజుఁడు నను పేరులుగల ఋభువులు దేవత్వమును బొందిరి.

ఋగ్వేద ౩. ౪. ౮. యె యె అ॒శ్వినా॒యె పి॒తరాయ ఊ॒తీధే॒నుం త॑త॒క్షు ఋ॒భవో॒యెఅశ్వా॑॥

భాష్యే॥ యఋభవో అశ్వినాశ్వినా వూతీఊత్యా క్రియయా రథనిర్మాణ రూపయాప్రణయన్।

తా॥ ఋభువులు రథనిర్మాణరూపమగు నూతిక్రియచే రథమును సృజించి సంతోషపెట్టిరి.

ఋగ్వేద. ౩. ౮. ౨. ౭. రథం యేచక్రుః సువృతాం సుచేతసోవిహ్వారంతం మనసస్పరిధ్యయా॥ తాండున్వస్యసవనస్య పీతయఆవోవాజా ఋభవో వేదయామసి॥

భాష్యే. యఋభవః సువృత్తం శోభనం రథం చక్రుః॥

తా॥ ఋభువులు చక్కని శుభయుక్తమగు రథమును జేసిరి.

తక్షన్‌రథం సువృతం విద్మనాప స్తక్షన్హరీ ఇంద్రవావ వృషన్వసూ।
తక్షన్ పితృభ్యా మృభవో యునద్వయస్తక్షన్వత్సాయమాతరం సబాభువమ్॥
ఋ ౧. ౭. ౩౨. ౧.

భా॥ తా॥ ఉత్కృష్టజ్ఞానసాధ్యములగు కర్మములుగల ఋభువులు అశ్వినీ దేవత లెక్కుటకు గట్టి చక్రములుగల రథమునుజేసిరి. అట్లే యింద్రుని వాహనము లైన హరిసంజ్ఞగల బలవదశ్వములనుజేసిరి. మఱియు వృద్ధులైన తమ తల్లిదండ్రుల కొఱకు యౌవనముతోఁగూడిన యాయుష్యమును ఋభువులుచేసిరి. ఆలాగే లేగల కొఱకు తల్లియైన గోవుకూడ నుండునట్లుచేసిరి.

యఇంద్రాయ వచోయుజాతత క్షుర్మనసాహరీశమీభిర్యజ్ఞమాశత॥
ఋ ౧. ౨. ౧. ౧. ౫.

భా॥ తా॥ మాటను దెలిసికొని రథమునకుఁ దమంత వచ్చిచేరునట్టి గుఱ్ఱముల నింద్రునికొఱకు సృజించిన ఋభుదేవతలు చమసాది నిర్మాణరూపకార్యములచే మా యజ్ఞములఁ బొందిరి. అనఁగా సహాయులుగా వచ్చి చమసాదిరూపనిర్మాణ కార్యములఁ జేసిరి.

తక్షన్నాసత్యాభ్యాం పరిజ్మానం సుఖం రథమ్ । తక్షన్ధేనుం సర్వదుఘామ్
ఋగ్వే ౧. ౨౯ ౧. మం ౧.

ఋభుదేవత లశ్వినీదేవతలకొఱకు నిర్బంధములేక యంతట సంచరించునట్టిదియుఁ బైనగూర్చుండుటకు సుఖకరమగునట్టిదియు నైన రథమును పాలుపితుకుటకొకానొక యావును సంకల్పమాత్రముచే సృజించిరి. ఇటుల నుడివియుంటచే ఋభువులు రథము లొనర్చి రథకారనామము వహించి యోగరూఢులచే రథకారులయినటుల విస్పష్ట పడినది. ఋభు రథకారత్వమునుగూర్చి పెక్కుశ్రుతు లనువదించుచున్నను గ్రంథ విస్తరభీతిచే విరమింపఁబడినవి. "ఋభూణాంత్వా............రథకారస్య" యను

శ్రుతివాక్యము ఋభువులు రథకారులు కానియెడల రథకారుల యాధానమునందు ఋభువుల నాహ్వానించుటకు విధిఁబలుకునా? వేయేల రథకారులకుఁ గూటస్థదైవత ర్షులు ఋభువులనుటలో సంశయలేశమేమియుఁ గనుపట్టదు.

మర్త్యులగు ఋభువు లమర్త్యులగుట.

ఋగ్వేద అ. 3. ౮. ౭. 3. ఇంద్రస్యసఖ్యమృభవః । సమానశుర్మనోర్న పాతో అపసోదధన్విరే॥ సౌధన్వానాసో అమృతత్వమేరిరే విష్ట్వీశమిభిః సుకృతః సుకృత్యయా॥

భాష్యం॥ మనోర్నపాతో మనుష్యస్యాంగిరసః పుత్రాః అపసోయాగాది లక్షణకర్మవంత ఋభవ ఇంద్రస్యసఖ్యం సమానఖ్యాత్వం సమానశుః।సమ్యక్ ప్రాప్నువన్ తథేంద్రస్యసఖ్యాం ప్రాప్తః తఽఋభవోదధన్విరే । పూర్వం మనుష్యత్వేన మరణయోగ్యాఅపీదానీందస్య సఖ్యేన ప్రాణాన్ధారయంతి । తథామంత్రః ।అధారయంతవహ్నయః (ఋ. అ. ౧. ౨౦. వ ౮) ఇతి సౌధన్వానాసః సుధన్వనామకస్యర్షేః పుత్రాఋభవః సుకృతాః శోభనకర్మాణః సంతః ప్రభూతైః శమీభిర్దేవత్వప్రాప్తి ప్రతిబంధ నివారణేహేతుభిః కర్మభిః సుకృత్యయా శోభనేన కర్మణాచ విష్ట్వీవ్యాప్యామృతత్వమేరిరే । దేవత్వంప్రాపుః।

తా॥ మనుష్యులు నంగిరో వంశసంభవులునగు ఋభువులు యాగాది లక్షణములగు కర్మ (శిల్ప) ములుచేసినవారై యింద్రుని సఖ్యమును సంపాదించిరి. పూర్వపు మనుష్యత్వముచే మరణింపఁ దగినవారైనను, నాఋభువు లింద్రసఖ్యముచేతనే మరణధర్మము లేనివారైరి. మఱియు సుధన్వనామక ఋషిపుత్రులగు ఋభువులు, దేవత్వ ప్రాప్తికిఁ బ్రతిబంధముల నివారించుటకు హేతువులైన కర్మము లొనర్చుటచే దేవత్వమునుబొందిరి. మృతినందుటను వదలిరి. ఇట్లుక్తమగుటచే పవిత్రములగు శిల్పకర్మము లొనర్చిన ఋభువు లమర్త్యులైనటులఁ బ్రత్యక్షప్రమాణ ముగ్గడించుచున్నది. ఈశ్రుతియందలి 'సుకృత' శబ్దము "సుకర్మా విశ్వకర్మణి" యను కోశవాక్యము ననుసరించి విశ్వకర్మ ద్యోతకమగుచున్నది. మఱియుఁ గర్మశబ్దముగూడ శిల్పపర్యాయమనుట నిస్సందేహమే.

ఋభువులు మాతాపితలకు యౌవనమిచ్చుట.

శ్రుతిః॥ పునర్యేచక్రుః పితరాయువానాసనాయూపేవ జరణాశయానా । తేవాజోవిభ్వాఋభురింద్రవంతో మధుప్సరసోనోవంతు యజ్ఞం॥3॥

ఋక్ అ 3 అ ౭ వ ౧ ఋ౧

భాష్యమ్॥ యఽఋభవః పితరామాతా పితరౌయూపేవ ఛిత్రిస్థాణూ ఇవ. జరణాజీర్ణౌసయానౌపునః సనాసదాయువానౌ చక్రుకుఃనిత్య తరుణావకుర్వన్ । తేవాజో విభ్వాబుభుశ్చ ఏతన్నామకా స్త్రీయస్సుధన్వన ఆంగిరసస్యపుత్రా ఋషయ ఇంద్రి వంతోఽనుగ్రాహకేనాఽస్మదీయం యజ్ఞమవంతు॥

తా॥ యజ్ఞకర్త ప్రార్థన చేయుచున్నాఁడేమనిన:—ఏఋభువులు తల్లిదండ్రులు చిత్రస్థాణువులువోలె జీర్ణశరీరులై యుండ వారల నెప్పటియట్ల సంపూర్ణయౌవనులఁగా జేసిరో, అట్టి ఋభువిభ్వావాజులను నాంగీరస సుధన్వుని పుత్రులగు బ్రహ్మర్షు లింద్రు నకుఁ బ్రియమొనర్చి యనుగ్రహముతో నన్ను రక్షించుదురు గాత! అని యుండుటచే ఋభువులు తమ శిల్పమహిమచే వృద్ధపితలఁ బరిపూర్ణ యౌవనులఁగాఁ జేయుటయె గాక యాభిజన్య మార్షప్రతిపాదకమయి నటులఁ బ్రకాశమగుచున్నది. మఱియు నార్షప్రసిద్ధికి నైరుక్తదేవతా కాండమందలి యీక్రింది శ్రుతిఁగాంచిన,

అంగిరసానః పితరోనవగ్వాఅథర్వాణో భృగవః సోమ్యాసః॥

ఋ ౧ ౭ ౬ ౧౫ ౧౭

భాష్యే॥ మాధ్యమికోదేవ గణాఇతినైరుక్తాః । ఋభవః । అంగిరసః । భృగవః । అథర్వాణః ఇతిస్తుత్యుపపత్తే దేవతాపద మధ్యే సమామ్నాతా ఏకైకశ ఏషాం దేవగణ ఇతి నైరుక్తామన్యంతే । పితర ఇతిఆఖ్యాతం । పితరఇత్యుక్తే ఋభ్వాంగిరసః భృగ్వథర్వాణోబుధ్యంత ఇత్యర్థః కోవిశేషః అగ్న్యాది। ఋభవః అంగిరసః భృగవః ఇత్యేవ మాదీనాం అభిధానానాం ఋషిషుప్రసిద్ధేః॥

భా॥ తా॥ ఋభువులు, నంగిరసులు, భృగువులు, నథర్వులు వీరందఱు దేవతాపద మధ్యమందుఁ జెప్పఁబడినను, ఋభ్వంగిరో భృగువులు మున్నగు వారందఱు ఋషులయందుఁ బ్రసిద్ధులనుట లోకవిదితమెయగును అని చెప్పుచున్నది.

ఋభువుల సోమపానాధికారము.

ఋ ౧. ౭, ౩౦ ౨—ఆభోగయంప్రయదిచ్ఛంత నాపాకాః ప్రాఞ్చో మమకేచిదాపయః॥ సౌధన్వనాసశ్చరితస్య భూమనాగచ్ఛతస-వితుర్దాశుషోగృహమ్॥

భాష్యం॥ హేసౌధన్వనాసః ఆంగిరసస్య సుధన్వనః పుత్రాః ఋభవః హేమమపూర్వభూతా యదాఆప్తహవిష్కం దేవత్వం జిగమిషవో యూయంసుచరితమాచరితుం ప్రవృత్తాస్తదామహాంతీ చరితాని । పిత్రోః పునర్యావన దానాదిరూపాణి

కృత్వా సూర్యలోకంగతా ఇతిభావః॥ హేఋభవః అపాకాః పరిపక్వజ్ఞానాః ప్రాంచః పూర్వకాలీనామమ ఆపయః ప్రాపయితారోమదీయాజ్ఞాతయః కేచిత్ ఏవంభూతాయే కేచనయూాయం ఆభోగయం ఉపభోగ్యం సామం ఇచ్ఛంతః యద్యదాపై్రితన। తప శ్చరితుమరణ్యాం గతవంతఋభవోహిసుధన్వన ఆంగిరసస్యత్రయః పుత్రాబభూవురితి। కుత్సస్యాంగిరస అతస్తేనమదీయాజ్ఞాతయ ఇత్యుక్తమ్॥ సం. పాన్ ౪౭. ౪౮.

తా॥ (కుత్సఋష్యుక్తమయినది) ఓ ఋభువులారా! పరిపక్వజ్ఞానములేని నాకుఁ బూర్వకాలపువారును ప్రాపకులు జ్ఞాతులు నగు మీ రనుభవింపఁదగిన సోమమును గోరుచు నెపుడు తపస్సానర్చుటకు నరణ్యమునుబొందితిరో (ఋభువు లంగిరసగోత్ర మునఁ బుట్టిన సుధన్వుని కొడుకులు, కుత్సుతుఁడును, ఆంగిరసుఁడె కనుక నాజ్ఞాతు లనెను.) ఓ సుధన్వపుత్రులారా! అపుడు చేయఁబడిన తపముయొక్క యతిశయమున హోమద్రవ్యములిచ్చి సోమరసమునుదీసిన యజమానుని యజ్ఞగృహమును బొందితిరి. అనివేదసూక్తి వఃలుటచే ఋభువులు తపోవిశేషముచే సోమపానమున కధికారులగు టయెగాక యంగిరోవంశాభ్యుదయులగుట దెలుపుచున్నది.

ప్రపంచమున వర్షర్తువునకుఁ బ్రాముఖ్యత.

శ్రుతి॥ విశ్వరూపాణివాసాగ్ంసి। ఆదిత్యానాం నిబోధత।
సంవత్సరీణం కర్మఫలం। వర్షాభిర్దదతాగ్ంసహ।
అదుఃఖో దుఃఖచక్షురివ। తద్మాపీత ఇవదృశ్యతే।
శీతేనావ్యథయన్నివ। రురుదక్ష ఇవదృశ్యతే।
హ్లాదయతే జ్వలతశ్చైవ। శామ్యతశ్చాస్య చక్షుషీ।
యావై ప్రజాభ్రగ్గ్శ్యన్తె। సంవత్సరాత్తా భ్రగ్గ్శ్యన్తె।
యాఃపరితిష్ఠన్తి సంవత్సరెతాః ప్రతితిష్ఠన్తి। వర్షాభ్య ఇత్యర్థః।
తైత్తిరీయారణ్యకె ప్ర ౧ అ3 ౯ ౧3

ఈమంత్రముల విద్యారణ్య భాష్యానుసరణ తాత్పర్యము "సంవత్సరంబునఁ దదవరకు ననుభవింపఁదగిన కృషికర్మ ఫలంబులగు వ్రీహ్యాదులెవ్విగలవో వానినన్ని టిని సంపూర్ణముగ నాదిత్యాది దేవతలు వర్షర్తువుతో నేకీభవించి యొసంగుదురు

గాత! అటులనొసఁగు నాదిత్యాది దేవతలయొక్క వస్త్రములు విచిత్రరూపములని తెలిసికొనుఁడు. అనగా వర్షర్తువునఁ జేయు కృష్యాదులెవ్విగలవో, యవియవి సంపూర్ణముగ ఫలించి రాఁబోవు వర్షర్తువుదనుక ప్రాణు లనుభవించుటకు సమృద్ధిగ నున్నయవి. అట్టిఫలము వర్షర్తుస్వాములగు నాదిత్యాదిదేవతలచే నొసఁగబడుచున్న యది. అట్టి యాదిత్యాది దేవతలు విచిత్రవస్త్రంబులు ధరించినవారని తాత్పర్యము. మఱియు నీవర్షర్తువురాఁగనే యెల్లప్రాణులకును సంతసంబును గలుగఁ జేయుచున్నది. ఎటులననఁగా నహోదేవుఁడు మంచివర్షము కురిసెను. మనకు సర్వసస్యమునుఫలించి చేకూరునని యెల్లవారికిని బరితోషము. ఈఋతువున నెల్లపదార్థములు నొందుసంకటము లేకశాంతములుగ నున్నయవికావున నీవర్షర్తువుయొక్క ప్రసిద్ధచక్షుస్సులో సకల పదార్థములును శాంతంబులుగ నున్నయవి. ప్రజనెవ్వరైన నీవర్షర్తువునందు క్షేత్రముల బీజావాపనముసేయక విడుచుచున్నవార లగుదురేని యాప్రజలందఱు నాఋతువునందు భ్రష్టులగుటయెకాక యాసంవత్సరాంతమువఱకు భ్రష్టులగుదురు. రాఁబోవు వర్షర్తువు పర్యంతము నన్నాదులచే భ్రష్టులగుటయె యిందులకుఁ గారణము. ప్రజలీ ఋతువునందు క్షేత్రములలో బీజావాపమునొసర్చి సంవత్సరాంతము సులభాన్నపరులై ప్రతిష్ఠితులగుచున్నారు. ఇట్లు వివరింపఁ బడుటచే వర్షర్తువు ప్రపంచమునకుఁ బ్రాముఖ్యత వహించినటులఁ దెలియుచున్నది. ఇంతయెకాక యాదిత్యాదిదేవతలు వర్షర్తువుతో నేకీభవింప వలెనని చెప్పుటచే ఋభువు లాదిత్యులలోఁ గలియుట పెక్కు శ్రుతులు వక్కాణించుచున్నవి. కావున వర్షర్తువునకుఁ గారణభూతులు ఋభువు లయినటుల సిద్ధాంత మేర్పడుచున్నది.

వర్షర్తువునందె ఋభువుల యాధానమునకుఁ గారణము.

శ్రుతిః॥ సమ్మీల్యయ ద్భువనా పర్యసర్పత క్వస్విత్తాత్యా పితరావఆసతుః ।
అశపతయః కరస్నంవ ఆదదేయః ప్రాబ్రవీత్రోప్రతస్మాఉఅబ్రవీతన॥
ఋక్ ౧౨.

భాష్యమ్॥ హేఋభవో రశ్మయోయూయం యద్యదాభువనా భూతజాతాని సమ్మీల్యసమ్మీలనంకృత్వా జలధరపటలైరాచ్ఛాద్యపర్యసర్పత పరితః సర్పణం కురుథ । వర్షయేత్యర్థః । తాత్యాతాతౌతాయమానే వృష్ట్యుదకే యద్వాతాత్యాతా సువర్షాసు ఛందసస్త్యప్రత్యయోదకారత్వంచ । అథవాపితృవిశేషణం । తాత్యాతత్కాలీన పితరౌ జగతః పాలకౌ సూర్యాచంద్రమసౌ క్వస్విదాసతుః । కుత్రఖలు

తిష్ఠతుః । అహోరాత్రా విభాగేన ప్రవర్షయథేత్యర్థః । కించకీదృశానోృయుష్మాన్యః కోపివృష్టిప్రతిబంధకారీ రాక్షసాదిః కరస్నం బాహునామైతత్ । కరస్నౌ బాహూ ఇత్యుక్తత్వా దత్రతత్వకారాంతం యుష్మదీయం । హస్తమాదదే గృహ్ణాతి ప్రతిరోధం కరోతి తమశపతనాశయథ । యశ్చ ప్రబ్రవీత్ప్రకర్షేణ వాచానిరుంధే । తస్మైప్రో షైరివాబ్రవీతన ప్రకర్షేణ భర్త్సనాదిశబ్దం కురుథ । యద్వాయోనూనంస్తౌతి । తం ప్రకర్షేణ స్తుతేత్యర్థఇతి॥

తా॥ రశ్మిరూపములనందిన యోఋభువులారా! మీరు భూతజాతములను కన్నులుమూసి మేఘసముదాయములచేఁగప్పి యంతటఁదిరిగి వర్షింపుడు. జగత్పాలకులును దత్కాలీన పితలునగు సూర్యచంద్రులెక్కడనుందురని యూహచే నహోరాత్ర విభాగముచే వర్షించుము. వృష్టిప్రతిబంధకారులగు రాక్షసాదు లెవ్వరైన నడ్డగించి నీబాహువుల గ్రహించుచున్నయెడల వారిని శపించి నాశమొనర్పుఁడు. ఎవ్వఁడైన నఱచి యడ్డగించెనేని వానికి భయముగలుగునటుల ధ్వనియొనర్పుఁడు. మఱియు మిక్కిలిగా స్తుతియొనర్చువానిని జక్కగా స్తుతియొనర్పుఁడు. అనిచెప్పఁబడుటయెగాక మఱియు,

శ్రుతి॥ ఉద్వత్స్వస్మా అకృణోతనాతృణం నీవత్స్వపః స్వపస్యయానరః
అగోహ్యస్య యదస స్తనాగృహేత దద్యోమృభవో నానుగచ్ఛత॥

ఋక్ ౧. ౩. ౬.

భా॥ పురాణప్రసిద్ధాన్ సుధన్వనః పుత్రాన్ కర్మణాదేవత్వం ప్రాప్తవంత ఋభూం స్తుత్వావేదప్రసిద్ధ్యా సూర్యరశ్మిరూపా నిదానీంస్తౌతి। హేఋభవః ఉరు ప్రభూతం భాసమానా ఋతేనాదిత్యేన భాసమానావా ఋతేనోదకేనోదకార్థ ముత్ప న్నావా। రశ్మీనాముదుభాసమానం ప్రసిద్ధం తథాదిత్యాదుత్పత్తిరపి । ఉదకార్థంచవన మపి । రశ్మీనాం ఘర్మకాలే భూమిగతం సారమాదాయ పునర్వర్షాకాలే ప్రవర్షంతీతి ప్రసిద్ధం । ఆదిత్యాజ్జాయతే వృష్టిరితి । శాస్త్రాత్ । తథావిధానరః ప్రకాశవృష్ట్యాద కాదేర్నేతారోయూయం సద్వత్సున్నతేషు ప్రదేశేషు మేర్వాదిషు తృణం వ్రీహియ వాదిరూపమస్మై ప్రాణిజాతాయోపకారార్థం అకృణోతనకృతవంతస్థ । ఉపసర్గా చ్ఛందసిధాత్వర్థేవాతి । తథానివత్సు ప్రవణదేశేష్వస్మా ఏవాపఉదకా న్యకృణోతన అకుర్వత । కిం స్వభోగార్థం నేత్యాహ । స్వపస్యయా శోభనకర్మేచ్ఛయా శోభన కర్మభిః కృతమితి యథాయజమానాః స్తువంతితదిచ్ఛయేత్యర్థః । కించయూయమ

గోహ్యస్యాదిత్యస్య గృహే మండలే యద్యావత్కాలమసస్తన ససుప్తనంతస్స । రాత్రౌ నిర్వాప్యపారాస్తిష్ఠథ । షసస్వప్నే అస్మాల్లజి. పూర్వవత్తస్య తనవాదేశః । అదాది త్వాచ్ఛపోలుక్ తత్తావంతం కాలమద్యాహనీద మిదానీం నానుగచ్ఛథ । అనుసృత్యన గచ్ఛథ । యావంతం కాలం రాత్రౌ సూర్యేనిగూఢా వర్తధ్వే తావంత మేవకాలమహ న్యపినానుగచ్ఛథేత్యర్థః । యద్వాఽగోపనీయస్య గృహేంతరిక్షే యద్యావంతం కాల మసస్తనవృష్టి ఘదత్వాస్వాపమకురుత । తత్తావంతం కాలమద్యేదానీం నర్షసమయే ఇర్దసస్యాభివర్ధనసృష్టి ప్రవాహరూపం కర్మనానుగచ్ఛథ । అనుసృత్యనపాప్నుథ । యావంతం కాలం వివర్షథ । తావంతమేవకాలం ప్రవర్షయేత్యర్థః.

తా॥ కుత్సుఁడనుఋషి పురాణప్రసిద్ధులును సుధన్వుని పుత్త్రులును కర్మచే దేవత్వమునొందిన ఋభువులను స్తోత్రమొనర్చి వేదప్రసిద్ధిచే సూర్యరశ్మి రూపమందిన యాఋభువుల నిపుడు స్తుతించుచున్నాఁడు. ఓఋభువులారా! మీరాదిత్య రశ్మి రూపములనుబొంది గ్రీష్మకాలమునందు భూమిగతమైన స్థిరాంశమును గ్రహించి తిరిగి వర్షాకాలమునందు వర్షించుదురని లోకప్రసిద్ధి కలదు. "ఆదిత్యాజ్జాయతేవృష్టిః" యని శాస్త్రవచనముగూడ దీని ననుసరించుచున్నది. అట్టి ప్రకాశవృష్ట్యుదకాదులఁ గల్పించు మీరు మేరువు మొదలగు నున్నతప్రదేశములయందును, ప్రాణిసముదాయ ముల యుపకారముకొఱకు తృణవ్రీహియవాదుల నుత్పత్తుల నొనర్పుఁడు. అట్లె పల్లపుఁబ్రదేశముల వ్యాపించునట్లు చేయుఁడు. ఇటుల నొనర్చుట స్వకీయభోగముల కొఱకు గాక శుభకర్మేచ్ఛచే యజమానులు స్తుతించెదరు గావున వారి యిచ్ఛదీర్చు టకు నటులఁ జేయుఁడు. ఇంతయెగాక మీరెంతకాలము సూర్యమండలమున (దాఁగుటకు వలనుగాని యాకాశమున) నిద్రించెదరో యంతకాలము మాత్రము సస్యాభివృద్ధికర్మయగు వర్షపాతము నొనర్పకుఁడు. ఎంతకాలము వర్షింపకుండెదరో యంతకాలము తిరిగి వర్షింపుఁడు. అనియుఁ జెప్పఁబడుటచే వర్షోత్పాదకారకులు ఋభువులయినటులను, వారలే సస్యాభివృద్ధి యొనరించి లోకకల్యాణముల వృద్ధిసేయు నటులను దెలియవచ్చినది. అందుచే సద్యస్కాలఫలము నపేక్షించుట లోకసంప్ర దాయకమున కవిరుద్ధముగాన ఋభువుల యాధానకాలము వర్షర్తువుగ నిశ్చయించుట సంపూర్ణఫలహేతువు గానిపించుచున్నది.

వెండియు,

"విశ్వేషాం వై దేవానామృభుమతాం తృతీయసవనం యద్వైశ్వదేవం ద్వాద శకపాలం నిర్వపంతి॥" (యజుః ప్ర ౭. అ ౨. ప ౩.) అను యాజుషీశ్రుతి ఋభు

వులుగల విశ్వదేవతలకు తృతీయ (సాయంకాల) యజ్ఞమునందు ద్వాదశకపాలముచేఁ బురోడాశమునుబచనమొనర్పవలెననిచెప్పుచు, "అగ్నయేగాయత్రాయత్రివృతేరాథంతరాయవాసంతా యాష్టాకపాల ఇంద్రాయత్రైష్టుభాయ । గ్రైష్మాయైకాదశకపాలో విశ్వేభ్యోదేవేభ్యోజాగతీభ్యః సప్తదశేభ్యో వైరూపేభ్యోవార్షికేభ్యోద్వాదశకపాలః॥" (అను ౧౪, ప ౧) అని యగ్నిదేవతకు గాయత్రీఛందోమంత్రమును, త్రివృత్స్తోమమును, వసంతఋతువును, అష్టాకపాలములపైఁ బురోడాశపచనము చేయవలెననియు, ఇంద్రదేవతకుఁ త్రైష్టుభఛందోమంత్రములును, బంచదశస్తోమమును, గ్రీష్మఋతువును, ఏకాదశకపాలములపైఁ బురోడాశపచనముఁ జేయవలెననియు, ఋభుసమేతులగు విశ్వేదేవతలకు జాగతీఛందోమంత్రములును, సప్తదశస్తోమమును, వర్షర్తువును, ద్వాదశకపాలములపైఁ బురోడాశపచనమును జేయవలెననియుఁ, జెప్పియుండుటచే ఋభువుల యాధానము వర్షర్తువగుటసంపూర్ణఫలదాయకము విధ్యుక్తము ననుటలోసందేహము గానిపించదు. ఇట్టి లోకోపకార పారీణులగు ఋభుమహర్షుల శిల్పచాతురీమహిమ యద్వితీయమనిపూర్వోక్తపరిమాణములె వేనోళ్ల నుగ్గడించుచున్నవి.

## విశ్వేదేవతలు విశ్వకర్మ వంశ్యులే.

"విశ్వేషాం వై దేవానామృభుమతా" మను పూర్వోక్తయాజుషీశ్రుతి ననుసరించి విశ్వకర్మవంశ్యులగు ఋభువులకును, విశ్వేదేవతలకును నవినాభావసంబంధ మీయజ్ఞాదులయందుఁ గలుగుటవలన, విశ్వేదేవత లెవ్వరనివిచారించినను, శిల్పకాండమునం దుదాహరించిన "ప్రాచీదిశా" మను యాజుషీశ్రుతియందలి "ప్రతీచీదిశాంవర్షా ఋతూనాం విశ్వే దేవాదేవతా విట్ ద్రవిణగ్ం సప్తదశస్తోమః సఉవేకవిగ్ంశ వర్తనిస్త్రినవత్సోనవయో ద్వాపరోయానాంపశ్చాద్వాతోవాతోహభూనఋషిః" అను వచనమువలన సహభూనర్షి (విశ్వకర్మాపత్యము) విశ్వేదేవతాస్వరూప మవధరించినటులను, వర్షర్తువము సప్తదశస్తోమముగలిగినటులను, బ్రసిద్ధపడుటచే ఋభుసంబంధులగు విశ్వేదేవతల స్వరూపమును సహభూనర్షి వహించుటవలన విశ్వేదేవాత్మకత్వము విశ్వకర్మవంశీయతను బ్రతిపాదించుచున్నది. ఇందున కనుకూలముగనే "వస్తోరాంగీరసః పుత్రోవిశ్వకర్మాకృతేఃపతిః । తతోమనుశ్చాక్షుషో భూద్విశ్వేసాధ్యామనోస్సుచితాః" యను భాగవత షష్ఠస్కంధ షష్ఠాధ్యాయోక్తి, వస్తుపుత్రుఁడగు

విశ్వకర్మయను శిల్పాచార్యునకుఁ జాక్షుఁడను మనువు జనించినటులను, ఆచాక్షుష మనువువలన విశ్వేదేవతలు సాధ్యులు జనించినటులను బలుకుచున్నది. ఇద్దానివలనను గూడ విశ్వేదేవతలకు విశ్వకర్మవంశజత్వము చాటుచున్నది. సాకల్యజగత్సర్జనాతిశేకుఁడగు విశ్వకర్మ పరమేశుఁడు కాలాంతరములయం దవతారభేదములచే మూర్తీభవించి దేవర్షి మానవగణముల నభివృద్ధిసేయుట స్వాభావికకృత్యముకదా?

## స్మృతిపురాణాదుల భిన్నగతులు; పరస్పర విరుద్ధములు.

ధర్మములన్నియు వేదైకమూలములనియుఁ, దదనుకూలములగు స్మృతులు మాత్రమే ప్రమాణములనియుఁ బెక్కు ధర్మశాస్త్రము లుగ్గడించునటుల నితఃపూర్వమునఁ జెప్పఁబడియె యున్నది. వాని నటులనునిచి మఱికొన్నిచోటుల విచారించితిమేని స్మృతులు భిన్నమార్గముల ననుసరించి పరస్పరవిరుద్ధములుగూడ ననువదించుచున్నవి. మనుస్మృతియందు "పుత్రాయేనంతరాస్త్రీజాః క్రమేణోక్తాద్విజన్మనామ్। తాననంతరనామ్నాతు మాతృదోషాత్ప్రచక్షతే" (అ ౧౦. ౧౪) ద్విజాతులకుఁ దక్కిన జాతులయందు నను లోమముగఁ బుట్టిన బిడ్డలు తల్లియొక్క జాతిని బొందుచున్నారు. కావున మాతృజాతికి విధించిన సంస్కారములు చేయఁదగినవారు. అని యొకచోఁ జెప్పఁబడినవిధి మఱియొకచోట "అక్షమాలావశిష్ఠేన సంయుక్తాధమయోనిజా। సారంగీమందపాలేన జగామాభ్యర్హణీయతామ్" (అ ౯. ౨౩) వశిష్ఠమునిచేఁ బరిణయముఁ జేసికొనఁబడిన యక్షమాలయును, మందపాలమునిచే వివాహము చేసికొనఁబడిన సారంగియు, నధమజాతివారుగా నుండినను మునులయొక్క గుణమునే పొంది పూజింపఁదగినవారలైరి. అని పూర్వోక్తికి విరుద్ధముగా నిచట మాతృజాతిధర్మమును బొందకుండ వశిష్ఠసంతానమునకు యోగ్యత తీసికొని రాఁబడినది. మఱియు గౌతమధర్మసూత్రవృత్తియగు మితాక్షరయందు "వశిష్ఠశ్చాండాలీమక్షమాలామ్" అని యక్షమాల కేవల చండాలవనితగాఁ బ్రవచింపఁబడియె. నిట్టి హీనజాతి స్త్రీకిఁ బురుషమహిమయె యున్నతిని బొందుటకుఁ గారణమయినట్టులఁ దెలియుచున్నది. ఇట్లె స్వవచనవ్యాఘాతముగ "విశిష్టంకుత్రచిద్బీజం స్త్రీయోనిస్త్వేవకుత్రచిత్।ఉభయంతు సమం యత్రసాప్రసూతిః ప్రశస్యతే"(అ౯.౩౪) కొన్నిచోటుల బీజము ప్రధానముగా నున్నది. జనకధర్మములను బుత్రుఁడు బొంది యున్నాఁడు. ఇందులకు దృష్టాంతము పరాశరుఁడు లుబ్ధకస్త్రీయందు వ్యాసునిఁ గాంచెను. ఈ వ్యాసుఁడు బీజప్రాధాన్యమునె యంగీకరించెను. మఱియు ఋష్యశృంగుఁడు నట్లె బీజప్రాధాన్యప్రాప్తి లభించుకొనియెను. మఱికొన్నిచోటుల క్షేత్రప్రాధా

న్యమును బొందుచున్నది. ఇందులకు దృష్టాంతము వ్యాససంతానమగు ధృతరాష్ట్ర పాండురాజ విదురాదికము. ధృతరాష్ట్రాదులు జనకమహిమను నమ్ముఁజేసి కేవలమాత్రు జాతి ధర్మమునే పొందిరి. దీనినన్నింటికంటె మాతాపితలు సమానజాతులయి రేని తత్సంతానమె యుత్కృష్టతఁబొందునని ముఖ్యార్థము. ఇట్టిమనుస్మృతి వచనము లన్యోన్యవిరుద్ధములగుటయెగాక జాతినిర్ణయమునందుఁ గ్లిష్టపరిస్థితుల దాటిపోవుట కుపాయములు పన్నినటులఁ గానిపించుచున్నవి. మఱియు నిట్లే రథకారజాత్యుత్పత్తిని స్మృతులు భిన్నభిన్నగతులఁ బేర్కొనినవి. "బ్రాహ్మణ్యాం క్షత్రియాచ్చౌర్యా ద్రథకారః ప్రజాయతే। వృత్తంచ శూద్రవృత్తంచ ద్విజత్వంప్రతిషిధ్యతే॥ (ఔశనస్మృతి ౫) బ్రాహ్మణ స్త్రీయందు క్షత్రియపురుషునివలన రథకారుఁడు జనిజయించెను. ఆతనికి ద్విజత్వశూన్యమైన శూద్రవర్తనమె. అని యౌశనస్మృతి వాకొని యాజ్ఞవల్క్య స్మృతికి విరుద్ధముగా నడచినది. వెండియు, "వైశ్యాచ్ఛూద్రాయాంరథకారః" అని బోధాయనస్మృతి ప్రథమప్రశ్ననవమాధ్యాయవాక్యము, ఔశన యాజ్ఞవల్క్యస్మృతులకు విరుద్ధముగా శూద్రస్త్రీయందు వైశ్యునివలన రథకారోత్పత్తిగలిగెనని వాకొనుచున్నది. ఔశనస్మృతి మఱియొకచో "సూచికాద్విప్రకన్యాయాం జాత స్తక్షకఉచ్యతే। శిల్పకర్మాణిచాన్యాని ప్రాసాదలక్షణంతథా" అని బ్రాహ్మణకన్యయందు సూచికుని వలనఁ దక్షకుఁడు జనియించెననియు నాతక్షకునికి శిల్పకర్మములు జీవనములనియుఁ దెలుపుచున్నది. వెండియు వ్యాసస్మృతిప్రథమాధ్యాయమునందలి పదియవశ్లోకము మొదలుకొని మూఁడుశ్లోకములు బ్రాహ్మణస్త్రీయందు శూద్రునివలన వర్ధక, నాపిత, గోప, ఆశయ, కుంభకారక, వణిక్, కిరాత, కాయస్థ, మాలాకార, కుటుంబి, వేరట, మేధ, చాండాల, దాస, శ్వపచ, కూటకాదులగు జాతులు గలిగినటులఁ బలుకుచు నీజాతులన్నియుఁ గేవల నీచజాతులుగాఁ జెప్పుచున్నవి. ఇంకయు, సూతసంహితయందు "విప్రాయాం క్షత్రియాజ్జాతః సూత ఇత్యుచ్యతేబుధైః। చౌర్యేణాస్యామనేనోఢోరథకారఇతిస్మృతః" (అ ౧౨. ౧౨.) విప్రస్త్రీయందు క్షత్రియునివలనఁ బుట్టినవాఁడు సూతుఁడనియు, ఆవిప్రస్త్రీయందె చౌర్యముగాఁ బుట్టినవాఁడు రథకారుఁడనియు విస్పష్టముగాvrాసి యందులకు విరుద్ధముగా "కరణాయాంతు విప్రేంద్రామాహిష్యాద్యో విజాయతే। సతక్షారథకారశ్చ ప్రోక్తశ్శిల్పీచ వర్ధకీ। లోహకారశ్చకర్మార ఇతివేదార్థవేదిభిః। విప్రాయాముగ్రతోజాతః తక్షవృత్తిఃప్రకీర్తితః" (౧౨. ౩౦.) అని,యాజ్ఞవల్క్యునకు ననుసరణముగా మాహిష్య కరణలవలన తక్షరథకారశిల్పివర్ధకి లోహకారకర్మాదులు గలిగినటుల లిఖించియున్నది. వీనినిబట్టియే రథకార బ్రాహ్మణుల కపోహలుగల్పించి కొందఱు నిందారంభమును

లోనగుచున్నారు. బ్రాహ్మణరథకారజాతిగాక సంకీర్ణరథకారజాతియొకటి యుత్పన్న మైనదని నిశ్చితమగుఁగాక, అనిశ్చితమెంతవరకు యాథార్థ్యమును స్ఫురింపఁజేయు చున్నదోఁ విచారింపఁదగియున్నది. మనుస్మృతికర్తకుఁ గానరాని సంకీర్ణరథకారజాతికి వ్యుత్పత్తిస్థానమొక్కచో స్థిరపరుపఁబడక యాజ్ఞవల్క్యుఁడొక్కవిధమునను, ఔశనుఁడు మఱొక్కవిధమునను, బోధాయనుఁడు వేఱొక్కవిధమునను, విభజించి పలికిరి. పరస్పర భేదములుగానుండిన యీవ్యుత్పత్తిస్థానము నేస్మృతివాక్యముచే నిశ్చితమొనర్పవచ్చును? మఱియు వ్యాసస్మృతి తక్షోత్పత్తివేఱు, రథకారోత్పత్తిని విద్విధముగా నుడివిన సూతసంహితాతక్షోత్పత్తి వేఱు. ఇఁక బౌద్ధామరునికోశము రథకారోత్పత్తిస్థానమును యాజ్ఞవల్క్యుక్తినే యనుసరించి పలికి, "తక్షాతువర్ధకి స్త్వష్టారథకారస్తు కాష్ఠతట్" అని తక్షవర్ధకి త్వష్టృరథకారాదులు పర్యాయపదములుగా నిర్వచించెను. తక్షరథకారవర్ధకిపదములు పర్యాయపదములైనయెడలఁ బూర్వోక్తస్మృతి పురాణములు తక్షరథకారవర్ధకుల జన్మస్థానములు భిన్నభిన్నములుగాఁ జెప్పుటచేఁ గోశవాక్య నిర్ధారణమెట్లు పొసఁగును?

ఇచట నమరసింహోక్తి పర్యాయపదములఁ దెలిసికొనుటవరకే ప్రమాణమగును గాని ధర్మనిర్ధారణయందయ్యది ప్రమాణము గాదని "శాక్యోక్తాహిం సతా ధర్మోనవా ధర్మకృతత్వతః । సధర్మస్సహిపూతం స్యాద్గోక్షీరం శ్వదృతౌధృతమ్"అని మీమాంసోక్తివేదబాహ్యుఁడగు శాక్యుండు సెప్పినది ధర్మంబయినను, జండాలవాటికల నుండెడి యావుపాలుంబోలె గ్రాహ్యంబు కాదని నిషేధించుటవలన వేదాప్రామాణ్యవాదులు చార్వాకతుల్యులునగు నమరసింహాదుల వాక్యము ప్రమాణమనుట కవకాశము లేదుగదా?

"సగీష్పతీష్ట్యాస్థపతిః" అను మొదలగు వాక్యములఁ బ్రామాణ్యములుగ నీకాండాదియం దంగీకరింపఁబడినవని యఃహగఁబూనినను, శ్రుత్యనుకూలములగు నీస్థపతి శబ్దాదుల నిర్వచనముల నిట్టి దోషము లాపాదింపఁబడవు. మఱియు రథకారశబ్దము జాతివాచకముగా నిర్ధారణమొనర్చి, తత్పర్యాయపదములుగఁ ద్వష్టృవర్ధక్యాదులఁ జేర్చుటలోఁ ద్వష్టృజాత్యుత్పత్తి నేస్మృతియు నేపురాణమును వాకొనియుండలేదు. ఇఁకజాతివాచకపర్యాయముగ నెట్లు స్థిరపరుపవచ్చును? ఇంతయొకాక నిగమాగమ పురాణేతిహాసాదుల సుప్రసిద్ధివడసిన విశ్వకర్మత్వష్టృస్థపతి, విశ్వకృత్సుధన్వదేవశిల్ప్యాది పర్యాయపదములు స్వర్గవర్గమునందు వివరింపకుండుట యీ యమరసింహుని శబ్దాసకల్యతకుఁ గొంత నాపాదింపక తప్పదు.

ఇఁక సంకీర్ణరథకారాద్యుత్పత్తి స్థానముల వివిధములుగ స్మృతులు పలుకుచుండినను, మాతృజాతిధర్మమునే రథకారునకు నిర్ధారణ మొనర్చి, యుండకపోవుట మనుస్మృతివాక్యమునకు విరోధమగుటయె కాక పితృజాతిధర్మమైన నిర్ధారణమొనర్పకుండుట చాల యాశ్చర్యకరము. ఈ సంకీర్ణరథకారాదులకు శిల్పవృత్తి మాతృజాతి పరంపరనుండి వచ్చినదా? పితృజాతి పరంపరనుండి వచ్చినదా? ఈ విధానము నేస్మృతియైనఁ బలుకనేర్చినదా? పితృమాతృపరంపరలనుండి రానేని యీ శిల్పవృత్తి మఱియొకరి దెవ్వరిదైనఁ దెచ్చి కల్పించియుండనచ్చును. సంకీర్ణజాతులుత్పత్తిగాకమున్న శిల్పము లోకప్రచారము గాకుండినచో లోకసృష్టికిని లోకోపకరణసృష్టికిని నభ్యంతరము కలిగియె యుండును. కావున సృష్ట్యాదినుండియు శిల్పము శిల్పకర్తయు నుండియె తీఱవలెను. ఈ యూహ జ్ఞానగంధముగల యెవ్వానికైనఁ జనియింపక తప్పదు. కావున వేదకాలమునుండియు శిల్పవృత్తి ప్రత్యేకవ్యక్తులొనర్చుచుండినటుల నుదాహరణ బాహుళ్యము ప్రత్యక్షమగుచునేయున్నది. అట్టి వేదకాలశిల్పర్షివంశ పరంపర విచ్ఛిన్నమయినటుల యాదవవంశమునలెఁ బరస్పర విరోధముచేత నశించినదనిగాని, జైనాదులువోలె నొకరాజుచే హతులైరనికాని, పరశురామునిచే క్షత్రియ నంశంబువోలె క్షీణించినదని కాని యే ప్రమాణవాక్యము గానిపించదు. మఱియు నీనంశము శ్రుత్యుక్తగోత్రర్షి పరంపరయుఁ బ్రవరర్షిసాంప్రదాయకము సంపూర్తిగా సుప్రసిద్ధిగాఁ గానవచ్చుచున్నది.। ।కావున సంకీర్ణరథకారాదివంశము మధ్యకాలమునఁ గల్పితమయినదని బోధపడక మానదు.

ఇఁక నిట్లు మధ్యంగతజాతికల్పనకు గతంబెయ్యది? యని విచారింపవలెను. స్మృతికర్తలగు ఋషులతీంద్రియద్రష్టలు, లోకజ్ఞానధురీణులు, న్యాయైకదీక్షాధురంధరులు నగుదురు. వారిశాసనవాక్యము లనవద్యములు. వారియుద్దేశము లూహాతీతములు. ఇయ్యవి నిస్సందేహములే యయినను, దివ్యదృష్టిప్రసన్నులగు నీఋషితల్లజులకు భిన్నోద్దేశము లుదయించుటకుఁ గారణమెయ్యది? రథకారాది జాత్యుత్పత్తిస్థానమొకఋషికి నూహాపుట్టినట్లు మఱియొక ఋషికిఁ బొడగట్టకపోవుట యాశ్చర్యజనకముగాదా? ప్రసన్నహృదయులు సత్యైకనిర్ధారణులునగు శాసననిర్మాతలకు భిన్నభావములుదయించుట యథార్థవిశ్వాసముల దూరపఱచును. కావున నీభిన్నోత్పత్తిస్థానముల నిర్ణయించు స్మృతివాక్యములు ప్రక్షిప్తములని సత్యజిజ్ఞాసువులకుఁ దోఁచుటకవకాశము గలుగుచున్నది. సుప్రసిద్ధమగువిశ్వకర్మ బ్రహ్మవంశము పావనరీతిఁ బ్రకాశించుండ నసూయాగ్రస్తులీ సుప్రసిద్ధికి నోర్వఁజాలక సంకీర్ణశిల్పివంశము గల్పించిన

బ్రసిద్ధవంశమున కపఖ్యాతిరాఁగలదని ప్రక్షిప్తవాక్యములందంద పొందుపఱచిరని పెక్కుండ్ర కూహగలిగియున్నది. జాతిరత్నము లోకైకకాంతులు వెదఁజల్లుచుండఁ గృత్రిమరత్నము లిటీవల సృష్టించి సహజరత్నముల గౌరవస్థానమును దగ్గింపఁజేసినటుల నీవిధానము స్పష్టపఱచుచున్నది.

మఱియుఁ గేవలాధ్యాత్మిక తత్వముఁదోబ్ధింపఁదలపెట్టిన సూతసంహితయందు జాతివిభాగములు నిర్ధారణ పరచుటయు వానిలోఁ బరస్పర విరుద్ధముగా రథకారోత్పత్తిని విశదీకరించుటయుఁ బూర్వోక్తమగు ప్రక్షిప్తాభిప్రాయమునే దోఁపఁజేయుచున్నది.

ఇఁకఁ బితృధర్మమువలన శిల్పవృత్తి నిర్ధారణము గావించుటకొక యుదాహరణమును శబ్దకల్పద్రుమకారుఁడీక్రింది బ్రహ్మవైవర్తపురాణశ్లోకముల లిఖించెను. “విశ్వకర్మాచ శూద్రాయాం వీర్యాధానం చకారసః । తతోబభూవుః పుత్రాశ్చనవేతే శిల్పకారిణః । మాలాకారఃకర్మకారః శంఖకారః కువిందకః । కుంభకారః కంసకారః షడేతే శిల్పినాంవరాః । సూత్రధారశ్చిత్రకారః స్వర్ణకారస్తథైవచ । పతితాస్తే బ్రహ్మశాపాదజాత్యావర్ణసంకరాః।స్వర్ణకారః స్వర్ణచౌర్యాత్ బ్రాహ్మణానాం ద్విజోత్తమ।బభూవసద్యః పతితో బ్రహ్మశాపేన కర్మణా”విశ్వకర్మయొకప్పుడు శూద్రస్త్రీయందు వీర్యాధానమొనర్ప నాస్త్రీయందుఁ దొమ్మండుగురు శిల్పకారులుజనించిరి. మాలాకారుఁడు, కర్మకారుఁడు, శంఖకారుఁడు, కువిందకుఁడు, కుంభకారుఁడు, కంసకారుఁడు, వీరలార్గురు నుత్తములు. సూత్రధార చిత్రకార స్వర్ణకారులు ముఁవ్వురు బ్రాహ్మణశాపముచేఁ బతితులై వర్ణసంకరులైరి. వారిలోస్వర్ణకారుఁడు బ్రాహ్మణులసువర్ణమును హరించుటచే బ్రహ్మశాపగ్రస్తుఁడై సద్యఃపతితుఁడయ్యెనని తెలుపుచున్నది. ఇందులకుఁ బూర్వగాథగలదు. నాకమున నొక్కపరి విశ్వకర్మఘృతాచియను నప్సరోవనితను గాంచి మోహింప నయ్యచ్చరకాంత కోపించి నరలోకంబునఁ బుట్టుమని శపించెనఁట! అందుచే నవ్విశ్వకర్మ కినుక వొడమి శూద్రజాతిం బుట్టుమని ఘృతాచిందిరిగి శపించి తనమానుషీజన్మకు వెఱచి విధాతతో మొఱవెట్టెనఁట! అందున కవ్విరించియు నీవు బ్రాహ్మణయోనిం జన్మించి తపస్వివై కాలంబుగడపి కొలఁదికాలములోననె నీస్థానంబున నలంకరింపుమనెనఁట. అందులకావిశ్వకృత్తు తద్వాక్యానుసారముగ బ్రాహ్మణుఁడై యవతరించి తపోవృత్తి గాలము వెడలించుచుండెనఁట! అంత ఘృతాచియు శూద్రయై జనించి మహాతపస్వియగు విశ్వకర్మబ్రాహ్మణుకడకురాఁ బూర్వవాసనా-

నశంబున నిరువురకుఁ గలయిక గలుగ నీ మాలాకారాదులు జన్మించిరఁట. ఈగాధ యంతయు బ్రహ్మవైవర్తపురాణము నందేయున్నది.

పురాణవచన ప్రాబల్యమున నీగాథ యథార్థమనియె నమ్మవలసివచ్చినను, ఎక్కడనో యొక్కచోఁ బ్రాపంచిక వ్యవహారమెంతకాలమో గడచినతరువాత జరిగిన నీ యవాంతర జాత్యుత్పత్తి ప్రపంచమున కంతకు సంబంధించినదనుట సందర్భశుద్ధిపొసఁగనేరదు. అట్లయినను స్మృతివాక్యములకు విరుద్ధముగ నీకుంభకారస్వర్ణకారాదుల యుత్పత్తిగలిగినది. అందుచే నిదియె యథార్థమగుట కవకాశముగలుగదు. అథవా యొకవేళ నిదియె సత్యమని యూహగలిగినను, దేవాంశసంభూతుఁడై మహాతపస్వియగు విశ్వకర్మబ్రాహ్మణుని బీజము, అప్సరోంశసంభూతమగు నొకశాపనిమిత్త శూద్రజాతిక్షేత్రమున జనించినమాత్రమున "తపోబీజప్రభావేన తిర్యగ్జా ఋషయోభవన్" అను మనుస్మృతివాక్యమునకు వ్యతిరేకముగ సత్యహీనమగునా అట్లయ్యేనేని, ఊర్వశీక్షేత్రదర్శనమాత్రగళితములై స్థలజలంబులఁ బతితములయిన మిత్రావరుణులబీజంబులు వశిష్ఠాగస్త్యుల జననకారణములెట్లగును? ఘృతాచీదర్శనకారణమున ద్రోణగత భరద్వాజబీజము ద్రోణోత్పత్తికిఁ గారణమెట్లు పొసఁగును? శాపకారణమున మృగీరూపమవధరించిన నిర్జరకాంతయొక్క గర్భోదయమునకుఁ గారణమయిన విభాండకఋషిబీజము ఋష్యశృంగోత్పత్తికి హేతువెట్లుకాగలదు? ఇట్టి వివిధక్షేత్రములఁ బతితములయిన తపోబలతేజస్సులు మహర్షులుగా నవతరించుట లోకైకవిదితమేకదా? ఇఁక మహాతపస్వియగు విశ్వకర్మబ్రాహ్మణునికా? తేజోవిహీనత. ఆతాపసవరుని తేజోబలమునకు విఫలత సేకూరుననికాఁబోలు సూత్రధారచిత్రకారస్వర్ణకారులకు శాపాపరాధమొకటి నిశ్చయింపఁబడినది. శాపములబలములెంతగా నుపకరించునోగాని యిట్టి రథకార స్వర్ణకారవర్ధకి తక్షకాదులకు సాంకర్య ప్రతిపాదన మొనర్చిన స్మృతిపురాణవచనములన్నియు శాపరీతులుగనే కానవచ్చుచున్నవి. కోపించినపుడు స్త్రీపురుషులు ప్రత్యేకప్రత్యేకముగ వేఱువేఱుస్థలముల వేఱువేఱువిధములఁ దిట్టఁదలఁచినచో స్థానము, యోగ్యత, సందర్భము, మున్నగునవేమైనఁ గానిపించునా? అట్లే యీస్మృతిపురాణవాక్యములుగూడ స్థానాస్థానములు దెలియక శాపరీతిగనే నిందించినట్లు స్పష్టపడుచున్నవి. లేనిచో నుత్పత్తిస్థానములఁ భిన్నగతికకుఁ గారణమెయ్యది? ఆర్షవాక్యములయం దన్యోన్యవిరుద్ధములగుటకు గతమెయ్యది? ఇఁకశాపములబలమును శప్తులనిందాపాత్రతనుగూర్చి యీకాండయం దొక్కచో వ్రాయఁబడిమెయున్నది. శప్తుఁడుగాని నిర్జరుఁడును, శపింపఁబడనిజాతియు, బురాణములయందుఁ గానరాదు. వారిపూజ్యతకు నిసుమంతయుఁ గొంకువాటిల్లదు. ప్రత్యేకవ్యక్తి శపింపఁ

బడినచో నావ్యక్తికే దోషమారోపింపఁబడునుగాని జాతికంతకు దోషారోపణమొన ర్చుట ధర్మవిరుద్ధము. ఇంతదూర మీవిషయము చర్చించుటకుఁ గారణము స్మృతి పురాణవాక్యములోకకొన్ని న్యస్తభ్యస్తభానములతోఁ జూపట్టుచు నుత్తమజాతికిఁ గళంక మాపాదింప నవకతవకలుగా సంకీర్ణజాతి నిర్ణయమొనర్చుటయె. బ్రహ్మవైవర్తపురా ణమునందలి విశ్వకర్మసంతానమునకు జాతినిర్ధారణ మొనర్చిన విధానము ముఖ్యముగా నట్లియున్నది.

ప్రకృతిరత్నములయున్నతి నడంపఁ గృత్రిమరత్నములఁ గల్పించినట్లుత్తమ విశ్వ కర్మబ్రాహ్మణుల గౌరవముఁ గుంటువడ వృత్తినామకసంకీర్ణజాతి గల్పింపఁబడినను, అజ్ఞులొక కొందఱీకల్పనమే సత్యమని నమ్మినను, అజ్ఞానబోధలచే లోకుల నమ్మింపఁ జొచ్చినను, సృష్ట్యాదినుండియు నవిచ్ఛిన్నముగఁ బ్రవర్తించుచు వేదశాస్త్రపురాణ నిగదితమై సుప్రసిద్ధివిరాజిల్లు నీ పవిత్రవంశమునకుఁ గళంక మాపాదింపనేరదు.

మఱియు, "తతస్తస్మిన్ యుగే సర్వేవర్ణా ఏకీభవంతివై। తద్వై నతవసంతత్యాం భవితా వర్ణసంకరః" అను పద్మపురాణభూఖండ వచనమువలన లోకమందలి యావద్వర్ణములు సంకీర్ణతఁబొందినఁగాని నీవిశ్వకర్మవంశము సంకీర్ణత బొందనేరదనియు, నప్పద్మపురాణ భూఖండమునందె శివవిష్ణువులిరువురు విశ్వకర్మనుగూర్చి "కలౌప్రాప్తేపి యావన్న వర్ణానాం సంకరోభవేత్ । తావత్త్వదీయ సంతత్యాం వేదమార్గఃస్థిరోభవేత్॥ అని యనువదించిన కలియుగము సంభవించినను నెంతవరకు కులములకు సంకరము గలుగ కుండునో యంతవరకు నీవంశము వేదమార్గమునందు స్థిరమైయుండుననువాక్యముచే నీవిశ్వబ్రాహ్మణవంశము వేదమార్గమున సుస్థిరమయియుండుననుటకు సందేహము గానిపించదు.

రథకారవిషయికచర్చ యింకయు విపరింపఁదగియెయున్నది; కాని గ్రంథాతి విస్తరభయముచేఁ బ్రస్తుతము విరమింపఁబడియెను.

శ్లో॥ విశ్వకర్మబ్రాహ్మణానాం వంశాగమకృతా వితి
కాండోయం రథకారస్య రాధకార్యపరిష్కృతః॥

రథకారకాండము సమాప్తము.

---

విశ్వకర్మబ్రాహ్మణ వంశాగమము.

# శాసనకాండము.

ప్రస్తుతగుంటూరుమండల కారెంపూడి సమీపస్థ శిలాశాసనము.

పాదుగ్రామే బదితటాక దక్షిణభాగే ఆదిత్యనిర్మిత దేవప్రాసాదాయ నాపోజు లపోకోజు తిప్పోజునామ్నే శిల్పికాచార్యాయ దేవప్రతిష్ఠా వేలాయాం సింధుమాన్య రూపతయానివర్తనషష్ఠిపరిమితాం ప్రాదాత్॥

శ్లో॥ బ్రహ్మాబ్రహ్మసుతః ప్రయోగనిపుణా జీవంతి యద్విద్యయా
విశ్వం యాస్యబభూవకర్మసతతో యోవిశ్వకర్మాఽభవత్
తిగ్మాంశోశ్శ్వశురస్తమేవతరణిం సంరోప్యచక్రభ్రమా
చక్రే చక్రముఖామరాయుధవరా ణ్యాచ్ఛిన్నతత్తేజసా॥

తద్వంశేతత్సమోజాతోల్లపాచార్య సంజ్ఞకః
బాణాచార్యస్సుతస్తస్య తద్వంశాంబోధిచంద్రమాః॥

నాగాచార్యస్సుతస్తస్య సూత్రధారీ శుభావహః
ద్వితీయః పోకనాఖ్యస్తు తృతీయస్త్రిపురాంతకః॥

లింగేథప్రతిమాసు చాది నిపుణాస్తత్ప్రయోగేషుచ
ప్రాసాదేషు చతుర్విధేష్వథనిజైర్భేదైరసంఖ్యేష్వపి
వాస్తుక్షేత్రవిదః ప్రశస్తవచసశ్శ్రీభద్రహస్తాశ్శుభాః
నిర్వోఢారఇమే త్రయోపి సతతం ప్రారబ్ధకార్యావలైః॥

పోలమోజన జిల్లోజనఘాత్రరుసాపోజునుం తిప్పోజునుమిల్లియ సూత్రధారిగళ్॥

శ్లో॥ శాకాబ్దే శరవహ్నికేందు గణితే జ్యేష్ఠాభిధేవైజయే
మాసేనాగ దినేసితే భృగుయుగేమేడాంబికానందనే
పృథ్వీంశాసతి వీరకామనృపతౌ శక్రేందుతుల్యక్రమే
నాగస్తంభ సమున్నతాం సదుచితామాదిత్యనా మాకరోత్॥

నాపోజు తిప్పోజు సూత్రధారౌ

పాదుగ్రామముయొక్క బదితటాక దక్షిణభాగమునం దాదిత్యనిర్మిత దేవ ప్రాసాదమూర్తి ప్రతిష్ఠాసమయమున నాపోజు లపోకోజు తిప్పోజు నామకశిల్పాచార్యు నకు సింధుమాన్యరూపముగ నరువది యెకరముల భూమి యొసంగఁబడెను.

బ్రహ్మయు, బ్రహ్మపుత్రుఁడు, సమస్తప్రాణి జీవనాధార శిల్పకలాకుశలుఁడు, జగత్సృష్టికర్తయు, సూర్యునిమామయునగు విశ్వకర్మ సూర్యుని సానఁబట్టి తత్కిరణ లేశములవలన శూలచక్రాది దివ్యాయుధముల నిర్మించెనో యట్టి విశ్వకర్మయొక్క వంశసంభవుఁడుఁ దత్తుల్యుఁడు నగు ఉల్లపాచార్యుఁడు వర్ధిల్లె. వీని సూనుఁడు బాణాచార్యుఁడు వీని యాత్మజులు నాగాచార్యుఁడు, పోకనాఖ్యుఁడు, త్రిపురాంతకుఁడు వీరలు ముప్వురు శివకేశవమూర్తి రచనాచతురులు, తత్తన్మూర్తిస్థాపన ప్రయోగకుశలురు, చతుర్విధప్రాసాదనిర్మాణదక్షులు, వాస్తుశాస్త్రవిశారదులు, ప్రశస్తవచస్కులు, శుభకరహస్తులు, ప్రారబ్ధకార్యపరంపరల నిర్వహింప సమర్థులునై విలసిల్లిరి. శాలివాహన శకము ౧౧౩౪ విజయసంవత్సర జ్యేష్ఠశుక్లచతుర్థి శుక్రవారమునందు మేడాంబికానందనుఁడు వీరకామరాజు రాజ్యమేలుకాలమున ఆదిత్యుఁడు నాగస్తంభము స్థాపించెను. ఈ శాసనమువలన క్రీస్తుశకము ౧౨౦౭ వత్సరములనుండియు విశ్వకర్మబ్రహ్మవంశ్యులాచార్యత్వ ప్రసిద్ధులై మూర్తిప్రతిష్ఠాకాలమున నృపాలురచే మాన్యక్షేత్రాది సన్మానముల స్వీకరించి సంపూజితులైనటుల స్పష్టపడుచున్నది.

## శ్రీక్షేత్రకాశీస్థ విద్వజ్జనుల సమ్మతిపత్రిము.

శ్రుతిస్మృతిపురాణజ్ఞైః కాశీపుర నివాసిభిః । సర్వలోకోపకారాయ క్రియతే జాతినిర్ణయః॥ సామాన్యతః ప్రజాద్వివిధాః । విశ్వకర్మబ్రహ్మనిర్మితాః కశ్యపబ్రహ్మనిర్మితాశ్చ, యద్యపి । బ్రాహ్మణోస్యముఖమాసీదిత్యాదినావిరాడంగత్వం ప్రతీయతే। తథాపి ఆకాశాద్వాయురిత్యాదివత్ పరంపరయాతజ్జన్యత్వం బోధ్యం । ఆద్యాః పంచవిధాద్వితీయాశ్చతుర్విధాః । తత్రముఖతః సృష్టా బ్రాహ్మణా వేదాయజ్ఞాశ్చ ఇతరే బాహ్వాదిసృష్టాః । తైశ్చవృత్తికర్మణి ప్రతిప్రార్థ్యమానశ్చతుర్ముఖః యజనాదిత్రీణి కర్తవ్యానియాజనాదిత్రీణి । ప్రజాపాలన కృషివాణిజ్య సేవాదీనిచజీవనోపయోగికాని దదౌ।తత్రాద్యావైశ్వకర్మాణాః యజనాదిత్రయంకర్తవ్యత్వేనప్రజాపాలనాదికంవృత్త్యుపయోగిత్వేనస్వీచక్రుః । కాశ్యపేషు మధ్యే బ్రాహ్మణాయజనాదిత్రయం కర్తవ్యత్వేన యాజనాదిత్రయంజీవనోపయోగిత్వేనఏవంక్షత్రియవైశ్యయోరాద్యత్రయంకర్తవ్యత్వేన ప్రజాపాలనాదికం వృత్త్యుపయోగిత్వేన శూద్రాస్తుసేవాముభయార్థత్వేనవబ్రుః । తతః పరస్పరం కలహాయమానాః బ్రాహ్మణవృత్త్యంతరం పరికల్ప్య పాలనాత్యాజితావైశ్వకర్మాణాఇతిస్థితిః । అంబష్ఠాదయస్తు అనులోమప్రతిలోమ జా అనంతావేదితవ్యాః ॥ అయంచార్థః స్కాందాగ్నేయాదిపురాణేషు మను యాజ్ఞవల్క్యాదిస్మృతిషుశ్రుతావపి ప్రసిద్ధః ॥ తథాహిస్కాందే స్కందమైత్రేయ సంవాదే కల్పాదౌ । బ్రహ్మక్షత్రియ

విట్ఛూద్రపంచాలానాం ప్రభంజసాం । సోఽతసాం సర్వజంతూనాం సృష్టింవదజగ
త్ప్రభో। ఇతిమైత్రేయప్రశ్నే శ్రీస్కందః । విష్ణుకర్ణమూలోద్భూతతత్సంహృతమధు
కైటభమేదోమజ్జాత్మికాం మేదినీం విష్ణ్వాజ్ఞయా బ్రాహ్మణాః ఆద్యాప్రజామానసాశ్చ
సానగాది ఋషీంస్తథేత్యాదినా విశ్వకర్మాది సృష్టిముక్త్వా । మేదోరూపత్వాదస్పృశ్యా
మేదినీతి నారదాదిభిః ప్రార్థితాత్ "విశ్వకర్మం స్త్వమద్యైవబ్రాహ్మణాన్ ముఖతః
సృజే"త్యాదినా బ్రాహ్మణసృష్టిముక్త్వా॥ భూమావాగత్య తేసర్వే విశ్వకర్మప్రసాదతః ।
పవిత్రీం మేదినీం కర్తుంచక్రుస్తేదుష్కరంతపః । తపస్సామర్థ్యతః సర్వేస్వర్ణాకారాశ్చ
మేదినీం । పవిత్రాం కృతవంతోఽహిబ్రాహ్మణాః సఫలక్రియాః । తాన్దృష్ట్వాథముదం
ప్రాపవిశ్వకర్మాజగత్ప్రభుః । బ్రాహ్మణైస్సహ తేషాం సనామధేయం దదౌతదా ।
యతః స్వర్ణకృతాభూమిః స్వర్ణకారాభవిష్యథ । పునర్దదావరంతేషాం రాజ్యం వేదా
దికం తథేత్యాదినా తేభ్యోవరదానముక్త్వా॥ తతస్తేబ్రాహ్మణాః సర్వేరాజానోభూమి
మండలే । రాజ్యంతపఃప్రకుర్వాణా బ్రాహ్మయజ్ఞ భయాన్వితాః । ఇత్యాదినా
తేషాం యజ్ఞపాలనాది కర్మచోక్త్వా । కదాచిత్ కశ్యపోఽధీమాన్ భూమిం దృష్ట్వాస
భార్యయా। పుష్కరాఖ్య మహాక్షేత్రేస్థానం కృత్వాసహాగ్నికః। వేదీకరణయోగ్యాయ
మృత్ ఖండం నచదృష్టవాన్ । ఇత్యాదినాకశ్యపస్య మృదలాభముక్త్వా । తత్రగత్వా
నమస్కృత్యబ్రహ్మాణం బ్రహ్మవాదినమిత్యాదినామృల్లాభం। గంగా యమున యోర్మ
ధ్యేమృత్స్నా వేదిః ప్రకల్పితేత్యాదినామేదిన్యామృద్భావముక్త్వా। తతస్తే వైశ్వకర్మా
ణామృణ్మయాంచ సుహీమిమాం । స్వర్ణకారేణరహితాం దృష్ట్వాచింతాకులాస్త
దేత్యాదినాన్యోన్య కలహం వైశ్వకర్మాణ నిర్గమనంచోక్త్వా । వేదాశ్చముఖత స్తస్య
బ్రాహ్మణాశ్చాభవన్పురా । బాహుతఃక్షత్రియాజాతా ఊరోర్వైశ్యాస్తథైవచ ।
పాదాచ్ఛూద్రా అజాయంత వర్ణాఏవం క్రమేణహీత్యాదినాకశ్యపాత్సర్వం వర్ణసృష్టి
ముక్త్వా। స్వకీయాగమనందృష్ట్వా క్రోధతామ్రాక్షమాసనః। హాహాకారో మహానాసీ
దృషిదేవాదిమండలే। ఋషిదేవాదయస్సర్వే బ్రహ్మవిష్ణు పురోగమాః। కశ్యపంచపుర
స్కృత్య స్తుత్వాతం వేదవాక్యగైః । విశ్వకర్మా మనసేత్యాది వైదికస్తుతించోక్త్వా ।
తతోఽబ్రహ్మణావిశ్వకర్మ బ్రాహ్మణానాం, యుష్మత్స్థితిర్భూమండలే స్యాద్భవంతో
బ్రహ్మవల్లభా ఇత్యాదినా భూమండలనివాస వృత్త్యర్థం కటకముకుటాది నిర్మాణ
కౌశల్యలాభమ్ । కృతేచభవతాంసర్వం బ్రాహ్మణ్యం పాల్యతేసదా । త్రేతాయాం
పంచకర్మాణి ద్వాపరేతు చతుష్టయం । కలౌత్రీణ్యేవకర్మాణి పాల్యంతే ధాతులో
భతః । కరణేయది నిష్ఠాచేత్ సర్వత్రాస్తి నసంశయః॥ ఇత్యాదినా యజనాద్యధికార
లాభాదికంచ బహుధా ప్రపేచితవాన్॥ అగ్నిపురాణేప్యయమేవార్థఆఖ్యాయికాంతరేణ

ప్రతిపాదితః।తథాహి, అగ్నిః కదాచిత్ శంఖదైత్యో భూత్సింధుపుత్రో మహాబలఇత్యాది నాశంఖదైత్యోత్పత్తిం మహాన్ హింస్రో మహాగర్వీలోకాన్ జిత్వాబలాత్స్వయం। సస ర్వాన్ ల్లోకపాలాంశ్చ బ్రహ్మాదిసహితాన్ ఋషీన్ । ఇత్యాదినాతస్యలోకపాలాది జయమ్ ॥ తేభ్యోవేదాన్సువర్ణంచ గృహీత్వాథయయౌజల మిత్యాది నాతత్కృత వేదాద్యపహరణం । స్థితవాన్తత్రదైత్యేశస్తతో శ్రీకమిదంబభావిత్యాది తత్కృత జగత్పీడాం। తతోహం దైత్యరాజంతం హత్వేత్యాదినాస్వేన తత్సంహారం। సువర్ణం బ్రాహ్మణాన్పునః సంస్కృతాన్పంచ పంచభ్యో జిహ్వాభ్యః సప్తజిహ్వకః।సృష్ట్వా తేభ్యో వరం దేయం సువర్ణం రాజ్యసమ్పదం । దత్తాఽభివాంఛితాన్కామాదీ నిత్యాదినా తేభ్యోవరదానముక్త్వా॥ అథతేబ్రాహ్మణాః పంచవేదవేదాంతపారగా ఇత్యాదినాతేషాం వేదాధ్యయన యజ్ఞానుష్ఠానాదికం ప్రోక్తవాన్ ఏవం సూతసంహితాయామపి। హిరణ్య గర్భోభగవాన్ బ్రహ్మవిశ్వజగత్పతిః । ఆస్థాయపరమాం మూర్తిం తస్మిన్ పద్మే సముద్బభౌ । తస్మిన్ వేదావిదాం శ్రేష్ఠాబ్రహ్మణః పరమేష్ఠినః । మహాదేవాజ్ఞయా పూర్వవాసనా సహితాముఖాత్॥ బ్రాహ్మణా బ్రాహ్మణస్త్రీభిః సహజాతా స్తపోధనా ఇత్యాదినాతదుత్పత్త్యాదికం ప్రపంచితం॥ ఏవం మితాక్షరాయామపిబ్రహ్మక్షత్రియవిట్ శూద్రావర్ణాస్త్వాద్యాస్త్రయోద్విజాః । నిషేకాదిశ్మశానాంతం తేషాం వై మంత్రతః క్రియా ఇత్యాదినాప్రతిపాదితం॥ ఇత్థం మానవే ధర్మశాస్త్రేపి చ ముఖబాహూరుపజ్జానాం పృథక్కర్మాణ్యకల్పయత్ । అధ్యాపనం చాధ్యయనం యజనం యాజనం తథా । దానం ప్రతిగ్రహంచైవ బ్రాహ్మణానా మకల్పయత్ । అధీయీరంస్త్రయోవర్ణాః స్వకర్మస్థాద్విజాతయః । ప్రబ్రూయాద్బ్రాహ్మణస్త్వేషాం నేతరావితినిశ్చితం । సర్వే షాం బ్రాహ్మణోవిద్యాద్వృత్త్యుపాయాన్యథావిధి । ప్రబ్రూయాదితరేభ్యశ్చ స్వయం చైవతథాభవేత్ । వైశేష్యాత్ప్రకృతిశ్రైష్ఠ్యాన్నియమస్యచ ధారణాత్ । సంస్కా రస్య విశేషాచ్చవర్ణానాం బ్రాహ్మణఃప్రభు, రిత్యాదినాప్రకటీకృతం ॥ సాక్షాత్కాశ్యపి వహ్నివక్త్రజననాదాత్మాస్యతో విప్రవత్ । షట్కర్మస్వపితస్య హేమకృతినః కర్మ త్రయేయోగ్యతా। అస్త్యేవశ్రుతితః స్మృతేరనుభవాత్సాక్ష్యాదిసత్త్వాదితి। శ్రీకాశీపుర సూరిసాక్ష్యసహితం పత్రం కృతం ప్రత్నవత్ ॥ ౧ ॥ పౌరాణాద్వచనాన్మహాజనమతా చ్ఛ్రీశంకరార్యాజ్ఞయా । ప్రాక్పత్రాదనుభూతితోఽఖిల జనఖ్యాతేః శ్రుతేఃపాఠతః । యాగాద్యాచరణం హిరణ్యకృతినామస్తిద్విజానామితి । శ్రీకాశీపురసూరిసాక్ష్యసహి తం పత్రం కృతం ప్రత్నవత్ ॥ ౨ ॥

(ఉక్తార్థేపండితానాం సమ్మతాని)

సమ్మతోఽయమర్థః గోస్వామిజీవనస్య శ్రీకాశీనాధశర్మణః. సమ్మతోఽయమర్థః సమ్మతోఽయమర్థః. అనంతభట్టస్య సమ్మతోఽయమర్థః యజ్ఞేశ్వరశాస్త్రిణః శేష హరిరామపంతానాం సమ్మతోఽయమర్థః సమ్మతోఽయమర్థః అనంతశాస్త్రిణః వెఙ్కటరామశాస్త్రిణః సమ్మతోఽయ మర్థః సమ్మతోఽయమర్థః ముకుందశాస్త్రిణః సమ్మతోఽయమర్థః మహాదేవ పండితస్య సమ్మతోఽయమర్థః రామబ్రహ్మ శాస్త్రిణః సమ్మతోఽయమర్థః భూమానందస్వామినః సమ్మతోఽయమర్థః గుసా ఆనందఘనశర్మణఃసమ్మతోఽయమర్థః జయకృష్ణశాస్త్రిణః సమ్మతోఽయమర్థః పౌరాణికరఘునాధభట్టస్య సమ్మతోఽయమర్థః భాస్కరనృసింహశాస్త్రిణః సమ్మతోఽయ మర్థః పౌరాణికరాజేశ్వరభట్టస్య సమ్మతోఽయమర్థః కోండూక్షేత్రిణః సమ్మతోఽయమర్థః శ్రీ వేఙ్కటశాస్త్రిణః సమ్మతోఽయమర్థః రాంజనకరోపనామక భైరవభట్టస్య సమ్మతోఽయమర్థః సదాశివశాస్త్రిణః సమ్మతోఽయమర్థః సదాశివస్య సమ్మతోఽయమర్థః గణేశభట్టస్య.

సిద్ధాద్రిశరదితేనశ్రావణశుక్ల ద్వితీయాయాం విద్వత్సమ్మతిపత్రమ్ ప్రాగ్వత్సాక్ష్యసంయుతం రచితం॥

ఈశాస్యశ్రుతిశంభుమూర్తి ధరణీసంవ్యాంకవర్షేంశకే । శ్రీమద్విక్రమభూమిపస్య సకల శ్రీకాశివిద్వద్వరైః। యజ్ఞాద్యాచరణం సువర్ణకృతినా మస్తిద్విజానామితి। స్కందాగ్నేయ పురాణవాక్యనశతః పత్రం కృతం ప్రత్నవత్॥

---

శ్రీక్షేత్రకాశీవిద్వజ్జన సమ్మతిపత్రము. తెలుఁగు తాత్పర్యము.

వేదశాస్త్ర పురాణవిదులగు కాశీపురవిద్వన్మహాజనులచే లోకోపకారముగ జాతి వ్యవస్థచేయఁబడుచున్నది. ప్రజాసామాన్యము, విశ్వకర్మబ్రాహ్మణ నిర్మితమని కశ్యప బ్రహ్మనిర్మితమని ద్వివిధము. విచారింప బ్రాహ్మణులు విరాట్పురుషుని ముఖముగా నిరూపింపఁబడియు నాకసమునుండి గాలి గాలినుండి నిప్పునుంబోలె ఋషిపరంపరగా బ్రాహ్మణజాతి దెలియంబడుచుండె. విశ్వకర్మ నిర్మిత మైదువిధములు. కశ్యపనిర్మితము నాల్గువిధములు. వేదములు బ్రాహ్మణులు ముఖమందుఁబుట్టిరి. క్షత్రియ వైశ్య

శూద్రులు బాహూర్వురుపాదములం బుట్టిరి. వీరెల్లరు వృత్తివిషయమై వివదించుకొని బ్రహ్మానుమతిని విశ్వకర్మబ్రాహ్మణులు యజనాదిత్రయము విధ్యుక్తముగను ప్రజాపాలనాదికము వృత్త్యుపయోగముగను, కాశ్యపబ్రాహ్మణులు యజనాదిత్రయము కర్తవ్యముగను యాజనాదిత్రయము జీవనోపాధిగను, క్షత్రియ వైశ్యులు యజనాదిత్రియము గర్తవ్యముగను ప్రజాపాలనకృష్యాదికముల వృత్త్యుపాధిగను, శూద్రులుభయార్థము సేవావృత్తిగను సమ్మతించిరి. తర్వాత నొండొరులు కలహించుకొనినవారలై వేరొకవృత్తిగను గల్పించుకొని విశ్వకర్మబ్రాహ్మణులు ప్రజాపాలనము వదలిపెట్టిరి. అనులోమ ప్రతిలోమ సంజాతులగు నంబష్టాదులు, స్కాందాగ్నేయాది పురాణములయందు మను యాజ్ఞవల్క్య స్మృతులయందుఁ బ్రసిద్ధము. స్కాందమున నీ చరాచర విశిష్టప్రపంచసృష్టి యెట్టులయ్యెనని మైత్రేయు డడుగ స్కందుఁడనియె. విష్ణుకర్ణమూలోత్పన్నులగు మధుకైటభులు లోకంబుఁ జీకాకుగావింప వారల నారాయణుండు వధించుసమయమునఁ దదీయమేదోమజ్జాసిక్తయగు మేదిని యస్పృశ్యగాఁగ విష్ణ్వాజ్ఞను నారదాదులచే వర్జింపఁబడిన విశ్వకర్మచే సృష్టింపఁబడిన సానగాది బ్రాహ్మణులు భూమిని పవిత్రవతింజేయ దుష్కరతపంబొనర్చి యావిశ్వకర్మ పరమేశ్వరుని యనుగ్రహ విశేషమువలన భూమిని పూతవతిగను స్వర్ణాకృతిగనుజేయ నద్దేవుండుమెచ్చి ధరణిని స్వర్ణవర్ణనుజేసినకారణంబున స్వర్ణకారులుగండని వరంబిచ్చి రాజ్యపాలనంబును నొసంగెను. తదనంతరంబు బ్రాహ్మణ క్షత్రియాదులు మైత్రిగలిగి యజ్ఞక్రియారాజ్యపాలనంబుఁ జేయుచుండిరి. ధీమంతుఁడగు కశ్యపుఁ డొకనాఁడు భూలోకమును జూడఁగోరి భార్యాసమేతుఁడై పుష్కరమహాక్షేత్రమున విడిసి యగ్నిహోత్ర మొనర్చుటకు మృణ్మయప్రదేశంబుగానక ప్రార్థించిన బ్రహ్మ గంగాయమునా మధ్యప్రదేశంబున మృత్తికావేదిక గల్పించి వసుంధరను మృణ్మయాకారనుజేయ వైశ్వకర్మలు ద్వేషించి నిర్గమించిరి. అత్తఱిఁ గశ్యపుండు బ్రాహ్మణాదుల సృష్టింప దీనినంతయుఁ దిలకించి విశ్వకర్మ క్రోధతామ్రదృష్టిపరంపరలు నిగుడింపఁ బ్రలయకాల పర్జన్యగర్జాకల్పంబగు నొక్క-కోలాహలంబుజనింప బ్రహ్మవిష్ణ్వాదులు గశ్యపుని బురస్కరించుకొని, విశ్వకర్మామనసాయద్విహాయయను వేదవాక్యస్తుతులచేనుతింప శాంతిఁ జెంది యమ్మహాత్మునియాజ్ఞావిధిని చతుర్ముఖుండు విశ్వకర్మబ్రాహ్మణులారా! మీరు భూవలయంబున బ్రాహ్మణోత్తములరై జీవనోపాధికై కటక ముకుటాది నిర్మాణకలా చాతుర్యంబుఁ బొంది కృతయుగమందు షట్కర్మలు త్రేతయందు నైదుకర్మలను ద్వాపరమందు నాల్గుకర్మలు, ధాతులోభమున కలియందు మూఁడుకర్మలు కర్మాచరణ సామర్థ్యమున్న యెడ షట్కర్మలు నాచరింపుఁడనియె. అగ్నిపురాణమందును షట్కర్మా

ధికారము వేరొకవిధముగ శ్రుతిప్రతిపాదింపఁబడెను. సింధుపుత్రుఁడు శంఖదైత్యుఁడు బలసంపన్నుఁడై సమస్తభువనంబుల జయించి పవిత్రములగు వేదసువర్ణంబుల నపహరించి జలధికరుగని శ్రీకంబై లోకంబులెల్ల వ్యాకులతంబరగె. సకలలోకపితామహుండగుపితామహుండు జగత్పీడాకరుండగు శంఖదైత్యునిఁబరిమార్చి వేదసువర్ణంబులంగైకొని సంస్కరించి వేదవేదాంతపారగులగు సానగాదిబ్రాహ్మణపంచకమునకు సమర్పించి యజ్ఞాదిక్రియాచరణపరాయణులై ప్రవర్తింపుఁడని యంతర్ధానుండయ్యె. ఈవిషయము సూతసంహితామితాక్షరులయందు విస్తరింపఁబడియె. మనుస్మృతియందు ముఖబాహూరుపాదోద్భవులగు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకు వేరువేరుకర్మలు కల్పింపఁబడెను. బ్రాహ్మణులకు షట్కర్మలు, క్షత్రియ వైశ్యులకు త్రికర్మలు విధింపఁబడెను. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు ద్విజాతులుగాన వేదములు బఠింపనచ్చుఁగాని బ్రాహ్మణుఁడె చెప్పవలెఁగాని యితరులు చెప్పఁగూడదు. విశిష్టప్రకృతిశ్రేష్ట్యముచేతను నియమధారణముచేతను సంస్కారవిశేషముచేతను క్షత్రియాదులకంటె బ్రాహ్మణుఁడు శ్రేష్ఠుఁడు. కాశ్యపవహ్నిముఖోద్భవులగు బ్రాహ్మణులకుఁబోలె విశ్వకర్మబ్రాహ్మణులగు స్వర్ణకారాదులకు వేదాధ్యయనాధికారము మహాజన విఖ్యాతివలనను శ్రీశంకరాచార్యానుమతివలనను వేదవేదాంగ ప్రమాణవచనములవలనను కాశీపురపూర్వపండిత సమ్మతిపత్రమువలనను సంపూర్ణముగఁ గలదని మాయంగీకారపత్రము లిఖించి ప్రకటింపఁబడినది.

## శ్రీకాశీక్షేత్రస్థ పండితుల శాస్త్రార్థపత్రము.

శాస్త్రార్థఃత్ర లిఖ్యతె॥ తద్యథాతలకోంకణాది దక్షిణదేశే సకలశిల్పశాస్త్రాద్యభిజ్ఞ సకలవేదపురాణప్రసిద్ధేన లబ్ధవరేణ ద్విజోత్తమేన బ్రహ్మనిర్మితేన విశ్వకర్మణా నిర్మితా దైవజ్ఞసుజ్ఞకాః సువర్ణకారాః శిల్పినః సంతిబహవః । తేషా ముపనయనాది సర్వేసంస్కారాః సర్వాణి కర్మాణిచజాయంతఇతి ప్రసిద్ధమేతత్ । తేషాం శ్రాద్ధేచరుపాయసాదినా పిండదానం భవతి; తథాచభవిష్యే,

"గృహపాకాత్సముద్ధృత్యచరుణాపాయసేనవా ।
పిండదానం ప్రకుర్వీతత్వాప్త్ర శ్రాద్ధేకృతేసతీతి॥"

అత్రకాశ్యాంకరహోపనామకః శ్రీధరభట్టచనలకరోపనామకబాబూజోశీచదక్షిణదేశాత్సమాగతౌ స్తస్స్యచరుపాయసాదినా పిండదానంభవతి । తత్రకాశీస్థపండితైః

సర్వైః సకలశాస్త్ర ధర్మ శాస్త్రాదిద్యభిజ్ఞైరేవం శాస్త్రార్థో నిర్ణీతో యతః పూర్వోక్త భవిష్య వచనా చ్చరుపాయసాదినా పిండప్రదానం ధర్మతోనిర్ణీతమత్రసందేహో నాస్తి.

లిఖితమిదం ధర్మాధికారీ శ్యామభట్టపండితేన భవతీతి విజయదశమ్యాం సంవత్ ౧౭౮౧ శకే ౧౬౪౬ సమస్తపండితానుమతం పత్రం శంకరభట్టాత్మజశ్యామ భట్టేనలిఖితమ్॥

అత్రసంమ్మతాని.

సమ్మతోయమర్థః భట్టగోపీనాథస్య.
సమ్మతోయమర్థః శేష కేశవసంఖ్యావను.
సమ్మతోయమర్థః కేశవభట్టకాళే.
సమ్మతోయమర్థః పాయగుండోప
నామకగణేశభట్టస్య.
సమ్మతోయమర్థఃసగరకరయాదవభట్టస్య.
సమ్మతోయమర్థః పన్నగగోవిందభట్టస్య.
సమ్మతం అబేకర్ భాయిాభట్టస్య.
పత్రార్థే సమ్మతం సుందరభట్టరామఫర.
పత్రార్థే సమ్మతం దులుసుందరభట్టస్య.
పత్రార్థే సమ్మతం పద్మనాధభట్టసుతస్య
సదాశివభట్టఉపాధ్యాయే.
సమ్మతోయమర్థః గోపీనాధభట్టస్య
గాడగీళ.
సమ్మతోయమర్థః భారద్వాజనీలకంఠస్య.

పత్రార్థేసమ్మతం మానీమహాదేవభట్టస్య.
పత్రార్థేసమ్మతం దీక్షితోపనామజయ
రామభట్టస్య.
పత్రార్థేసమ్మతం విశ్వనాథణట్టటిళకస్య.
పత్రార్థేసమ్మతం మోడకశంకరభట్టస్య.
సమ్మతం సదాశివభట్టవిద్వాంస
సమ్మతం భారద్వాజవైద్యనాధభట్టస్య.
సమ్మతం దావారకేశవభట్టస్య.
సమ్మతం పౌరాణికసదాశివభట్టస్య.
సమ్మతం గోవిందభట్టవఝే.
పత్రార్థేసమ్మతం భాస్కరభట్టఖరే.
సమ్మతో జోగళేకరమహాదేవభట్టస్య.
పత్రార్థేసమ్మతం. దామోదరదేవస్య.
పత్రార్థేసమ్మతం శివరామభట్టభావయే.

కాశీక్షేత్రమందు కొంకణాది దక్షిణదేశమునందలి విశ్వకర్మ బ్రహ్మవంశ్యులై దైవజ్ఞనామముచే విరాజిల్లు శిల్పవర్యులు పిండదానవిషయమునఁ జర్చగలిగినప్పుడు "గృహసాకాత్సముద్ధృత్యచరుణాపాయసేనవా।పిండదానం ప్రకుర్వీత ప్రాప్తేశ్రాద్ధేకృతే సతి" అని భవిష్యపురాణోక్తిచేఁ జరుపాయసపిండదానము యథాశాస్త్రీయముగాఁ జేయవలెనని నిర్ధారణమొనర్చి పైన నుదహరించినవారలు సమ్మతులు వ్రాసియిచ్చిరి.

ఇట్టిశాసనములు పెక్కులుకలవు వానినన్నిటిని బ్రకటించుట గ్రంథవిస్తర భీతిచేఁ బ్రస్తుతము విరమింపఁబడియె.

## ఆంధ్రదేశ విజయనగర సంస్థానాస్థాన విద్వజ్జన నిర్ణీతసమ్మతి.

క్రీస్తుశకము ౧౮౭౬ సంవత్సరమునకు సరియగు ధాతుసంవత్సర వైశాఖ శుక్ల ద్వితీయా గురువాసరమున శ్రీవిజయనగర మహారాజులవారి సన్నిధానమున సమస్త వేద శాస్త్ర సంపద్ధారులగు శ్రీకనుపర్తి బసవాచార్యులగారిచేఁ జర్చింపఁబడిన రథకారాధికరణ విచారమునఁ దదాస్థానవిద్వాంసులగు నలుబదితొమ్మండుగురు పండితులచే సమ్మతి యొసఁగఁబడినది. ఈచర్చనంతయు రథకారాధికరణ విచారమనుపేరిట నొకగ్రంథము ముద్రితమైయున్నది. ఇందు రథకారులకు బ్రాహ్మత్వస్థాపనమొనర్చి సంకీర్ణత్వమును బూర్ణముగా నిరసింపఁబడినది. ఈపండితులలో నొక్కొకరొక్కొక్క విషయమును నిర్ణయించిరి. ఈచర్చయంతయు నాగ్రంథమును జూచినఁ దెలియఁబడును.

### ఆధునిక పండితాభిప్రాయము.

రథకారబ్రాహ్మణ విషయికమును గూర్చి శ్రీమాన్ ధన్నవాడ రాఘవాచార్యులవారీక్రిందివిధమునఁ దమ యభిప్రాయము నిచ్చియున్నారు.

శ్రీరస్తు॥ శ్రీహయగ్రీవాయనమః॥ నన్విదానీం వసంతే బ్రాహ్మణఆదధీత, గ్రీష్మేరాజన్యః శరదివైశ్యః వర్షాసు రథకారోగ్నీ నాదధీత, ఇతిశ్రుత్యా రథకారస్య ఆధానార్హత్వం జ్ఞాయతే. అన్యత్రచత్వారోవర్ణాః బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాః ఇత్యత్రతస్యానులోమవర్ణేష్వాధానానర్హేష్వ శ్రవణే నేతచ్ఛ్రుత్యోః పరస్పర విరోధాత్ రథకారాణాం కస్మిన్ వర్ణేఽం తర్భావఇతిచేత్ ॥ఉచ్యతే॥ వాజపేయాదౌ బ్రాహ్మణానామేవ తత్తచ్ఛ్రుతి వాక్యానుసారేణ రథకారనిర్వహణ నియమనాద్బ్రాహ్మణానామేవ రథకారసంజ్ఞా। అతఏవానులోమవర్ణేషు రథకారాణాం పృథగనూపాదానం । తథైపసిద్ధాంతకౌముద్యామపి, కుర్వాది భ్యోణ్యః ఇతి సూత్రవృత్తౌ కౌరవ్యాదివావదూకాంత రథకారపదఘటితగణపాఠే బ్రాహ్మణవాచకత్వాత్ ణ్యప్రత్యయో విహితః । కౌరవ్యపదస్య క్షత్రియవాచకత్వ భ్రమనివృత్త్యర్థమేవ కౌరవ్యాః బ్రాహ్మణా ఇతివ్యాఖ్యాతం । అన్యేషాం సిద్ధమేవ బ్రాహ్మణవాచకత్వ మిత్యభిప్రాయః॥ తథైవాన్యత్ర స్వరప్రక్రియాయాం, శిల్పినిచాకృఞః, సంజ్ఞాయాంచ, ఇతిసూత్రార్థవిచారే సంజ్ఞారూపస్యాపి కృఞ్ పరకత్వాభావ ఏవాద్యుదాత్తత్వం । కృఞ్ పరకత్వాదేవ రథకారశబ్దస్యాంత్యో దాత్తత్వం సంజ్ఞారూపత్వంతు సిద్ధమితి జ్ఞాపనాయైవ । రథకారోనామ బ్రాహ్మణ ఇత్యుక్తం । బ్రాహ్మణత్వ రూప జాత్యవచ్ఛిన్న ఇత్యర్థః । వ్యక్తిమాత్రస్య తాదృశసంజ్ఞాభావాత్॥ నచతర్హి వసంతే బ్రాహ్మణఆదధీతే

త్యనేనైవ రథకారస్యాపి వసంతకాలావచ్ఛిన్నాధాన బోధనమసంగతమితి వాచ్యమ్ । బ్రాహ్మణానామేవ రథకార్యనిర్వహణవృత్తిముపష్టభ్యభిన్నకాలాధానబోధనమాత్రేణ బ్రాహ్మణ్య వ్యతిరేకాభావాత్ । యథాచోపాకర్మ ప్రకరణే । బహ్వృచాశ్శ్రవణే కుర్యుః హస్తేసామగాయినః ఇత్యాదిభిః సామగాయినాం హస్తర్క్షాద్యధికరణోపాకర్మబోధనమాత్రేణ నబ్రాహ్మణాన్యత్వం । ననుయాజ్ఞవల్క్యస్మృతౌ। మాహిష్యేణ కరణ్యాంతు రథకారః ప్రజాయతే।ఇత్యాదినా రథకారస్య సంకీర్ణజాతిబోధనాత్కథమయం బ్రాహ్మణః। ప్రాగుక్తప్రమాణైః రథకార బ్రాహ్మణస్యసిద్ధావప్యనేన సంకీర్ణ జాతిరప్యంగీకార్యైవ। తథాచఇదానీం తనానాం బ్రాహ్మణజాతీయత్వ మిత్యత్రనియమకాభావ ఇతిచేన్న। ఇదానీం తనానాం విశ్వకర్మవంశ్యత్వ ప్రయోజ్యగోత్రసూత్రనియమితోపనయనాదిభి ర్బ్రాహ్మణ స్యానుభవసిద్ధత్వాదిదానీం వర్తమానాస్సర్వేపి రథకారాః బ్రాహ్మణాఏవ । యేచ ఈదృశనియమ వ్యతిరేకేణ దురాచారావలంబినస్స్యుః తేచసంకీర్ణజాతయోభవేయుః। ఏతేషాంచ రథకారబ్రాహ్మణానాం మతత్రయాంతర్గతతత్తన్మతాచార వైశిష్ట్యంతన్నియమితేతర బ్రాహ్మణ బాంధవ్యాదికమపి లౌకికవైదికయోరివ సంప్రదాయ నియమితమిత్యన్యత్ర విస్తరః॥

ఇతిశ్రీ ధన్నవాడ రాఘవాచార్యస్య ప్రొద్దుటూరు పత్తననివాసినః కన్యకాపరమేశ్వరీ సంస్కృతపాఠశాలా ప్రధానోపాధ్యాయ స్యాభిప్రాయః॥

తా॥ ఓయీ! ఇప్పుడు బ్రాహ్మణుఁడు వసంతర్తువునందును, రాజన్యుఁడు గ్రీష్మర్తువునందును, వైశ్యుఁడు శరదృతువునందును, రథకారుఁడు వర్షర్తువునందును నగ్నులనుంచవలెనను శ్రుతివలన రథకారున కాధానాధికారము తెలుపఁబడుచున్నది. మఱియొకచో బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రులని వర్ణములు నాలుగు, వారిలోఁ ద్వైవర్ణికులకుమాత్రమె యాధానాధికారము చెప్పఁబడుచు ననులోమవర్ణములకాధానాధికారము చెప్పఁబడకపోవుటచేఁ బూర్వవాక్యములకుఁ బరస్పరవిరోధము గలుగుటవలనరథకారులేవర్ణమునఁ జేరినవారలు?అనినిశ్చితముగావలసివచ్చినయెడఁజెప్పఁబడుచున్నది.వాజపేయాదియజ్ఞములయందుబ్రాహ్మణులేయాయాశ్రుతివాక్యములకనుసరణముగా రథకార కార్యమునందు నియమితులగుటచే బ్రాహ్మణులకే రథకారనామము గలుగుచున్నది. ఇందువలననే యనులోమజాతులయందు రథకారులు జేర్పఁబడక వేఱు జేయఁబడిరి. అట్లే సిద్ధాంతకౌముదియందును, "కుర్వాదిభ్యోణ్యః"అనుసూత్ర వృత్తియందుఁ గౌరవ్యశబ్దము మొదలుకొని వావదూక్యాంత శబ్దములలోఁ జెప్పఁబడిన రథకారాది శబ్దములకు బ్రాహ్మణవాచకత్వము చెప్పబడుటవలనఁ బై రథకారాది శబ్దములకు ణ్యప్రత్యయము విధింపఁబడెను. కౌరవ్య పదమునకు క్షత్రియత్వభ్రమ

నివృత్తి కొఱకే, కౌరవ్యులు బ్రాహ్మణులని వ్యాఖ్యానము చేయఁబడినది. కావునఁ గౌరవ్యేతరులకు బ్రాహ్మణత్వము స్పష్టమే. ఆకౌముదియందు మఱియొకచోట స్వర ప్రక్రియలో "శిల్పినిచాకృఞః సంజ్ఞాయాంచ" అని సూత్రవిమర్శన సమయమునందు సంజ్ఞా రూపమునకును, కృఞ్ పరకత్వము లేనపుడే యాద్యుదాత్తత్వమగును. కృఞ్ పరకత్వమగుటవలన రథకారశబ్దమున కంతోద్యాత్తమగును. సంజ్ఞారూపము సిద్ధమే యని జ్ఞాపకముఁజేయుట కొఱకే రథకారుఁడన బ్రాహ్మణుఁడని చెప్పఁబడెను. వ్యక్తి మాత్రమున నటువంటి సంజ్ఞ లేకపోవుటచే జాతియందు బ్రాహ్మణుఁడని నిర్ధారణఁ జేయఁబడినది. అట్లయిన బ్రాహ్మణులకు రథకార నిర్వహణవృత్తిని నిలిపి భిన్నకాలమున నాధానబోధ గలుగుటచే బ్రాహ్మణత్వమునకు వ్యతిరేకభావములేదు. గనుక, వసంతమునందు బ్రాహ్మణుఁ డాధానమును జేయవలెననుటచేతనే రథకారునకును, వసంతకాలమునందే యాధానముఁగూడదని చెప్పవలదు. అదియెట్లన ఉపాకర్మ ప్రకరణమునందు ఋగ్వేదులు శ్రవణ నక్షత్రమునఁ జేయవలెను; సామవేదులు హస్త నక్షత్రమున జేయవలెనని చెప్పుటచే, సామవేదులకు హస్త నక్షత్రమునఁ జెప్పినంతమాత్రమున శూద్రులుగాక బ్రాహ్మణులగుటయె యిందుల కుదాహరణము. ఓయీ! యాజ్ఞవల్క్యస్మృతియందు మాహిష్యునిచేఁ గరణిస్త్రీయందు రథకారుఁడు పుట్టుచున్నాఁడు. అని యనుటచే రథకారునకు సంకీర్ణజాతి గల్గుచున్నదిగదా! యెట్లీరథకారుఁడు బ్రాహ్మణుఁ డగునంటివేని, పూర్వోక్తప్రమాణములచే రథకారబ్రాహ్మణునకు బ్రాహ్మణత్వసిద్ధి సిద్ధమే కాని, ఈస్మృతివలన సంకీర్ణ సంకరజాతి మఱియొకటి యున్నదని యంగీకరింపవలసినదియే యగును. అట్లయినచో, ఇప్పటివారలకు బ్రాహ్మణజాతిత్వము లేదని తలఁచవలదు. ఇప్పటి రథకారులగు విశ్వకర్మ వంశీయులకుఁ జెప్పఁబడిన గోత్ర సూత్రములచేతను, ఉపనయనాది కర్మములచేతను బ్రాహ్మణత్వసిద్ధి సిద్ధమగుచున్నది. కాన నిపుడుండు రథకారులందఱును బ్రాహ్మణులేయగుట స్పష్టము. ఏరథకారు లీనియమమునకు వ్యతిరేకముగా దురాచార నిమగ్నులో వారు సంకీర్ణసంకరజాతీయులైనఁ గావచ్చును. ఈరథకార బ్రాహ్మణులకు మతత్రయాంతర్గత విశిష్టాచారధర్మములును, వానిచే నియమింపఁబడిన బ్రాహ్మణ బాంధవ్యములును లౌకికవైదికులయందునువలె సాంప్రదాయస్థితి గల్గుచున్నది. ఈవిషయము విశేషించి వ్రాయుట యధికమగును.

ఇది ప్రొద్దుటూరు పట్టణ నివాసులును, గన్యకాపరమేశ్వరీ సంస్కృత పాఠశాలా ప్రధానోపాధ్యాయులును నగు శ్రీమాన్ ధన్నవాడ రాఘవాచార్యులవారి యభిప్రాయము. ది. 10-12-1933.

## ప్రభుత్వపుఁ దీర్మానములు.

### 1. చిత్తూరుజిల్లా తీర్పు.

క్రీ. శ. 1814వ సంవత్సరము పండితమార్గసహాయాచార్యులు మొదలగు తొమ్మండ్రు గురు వాదులు, పంచాంగం గుండయ్య మున్నగు నార్వురు ప్రతివాదులు, ఈయుభయులకు విస్తారముగా వివాదముజరిగి తీర్మానము కాఁబడిన తేది వివరము.

ఫిర్యాదు నెం $\frac{254}{\text{ది } 20\text{-}7\text{-}1817}$ రు. స్వకుల పౌరోహిత్యమునకు హక్కును గూర్చిన దావాదులు వేదములు మున్నగు గ్రంథముల ప్రమాణమువలన శ్రేష్ఠమైన బ్రాహ్మణులై యున్నారు. కనుక స్వకులపౌరోహిత్యమునుగూర్చి యభ్యంతరమేమి యుండదు. అని వాదుల కనుకూలముగఁ దీర్మానింపఁబడినది. ప్రతివాదులు అప్పీలు చేసిరి. నెం $\frac{205}{\text{ది } 15\text{-}12\text{-}1818}$ రు కోర్టువారు మొదటి తీర్మానమునే స్థిరపఱచిరి—

### చెన్నపట్టణము హైకోర్టు క్రిమినల్ రూలింగు.

2. 1885 వ సం॥ 78 వ నెంబరు . క్యాలెండరు 152 వ పుట చూడుము.

చెన్నపట్టణము శ్రీమహారాణిగారి న్యాయస్థానమందు 1885 సం॥ నెం 421, 422 ర్లు.

విశ్వబ్రాహ్మణులు ఏపవిత్రమైన హిందూదేవాలయ గర్భములోనికైనను వెళ్ళుటకు, పూజించుటకు, రుద్రాభిషేకము చేయుటకు హక్కుకలదు.

### 3. అసిస్టెంటు మేజస్ట్రేటుకోర్టునం దిచ్చిన తీర్పు.

మచిలీపట్టణము (కృష్ణాజిల్లా) 29 మే 1894. 1894 సం॥ పు కేసునంబరు 8.

శివకోటి వీరభద్రుఁడు అను విశ్వబ్రాహ్మణుఁడు మహాశివరాత్రి దినమున కాశీవిశ్వేశ్వర దేవాలయమునఁ బ్రవేశించి లింగాభిషేకము చేయుటచే లింగము అపవిత్రము కాబడినదని ఫిర్యాదు తేఁబడుటచే నది క్రిమినల్ ప్రొసీజరుకోడు 258 సెక్షను ప్రకారము కొట్టివేయఁబడినది.

### 4. కృష్ణాజిల్లా, జిల్లామేజస్ట్రేటుచే నియ్యఁబడిన తీర్పు.

విశ్వబ్రాహ్మణులను 'అభిషేకము' చేయనియ్యవచ్చును. ఈనమూనాయే కృష్ణాజిల్లా, జిల్లామేజస్ట్రేటుచే 1894 సం॥ జులై 6వ తారీఖున దృఢపరుపఁబడినది.

5. గుంటూరు, అడిషనల్ డిస్ట్రిక్టుమునసబుకోర్టులో మ.రా.శ్రీ. సి. రంగనాయకులు నాయుడుగారు బి. ఏ., బి. యల్., అడిషనల్ డిస్ట్రిక్టు మునసబు.

శనివారము, 1912 సం॥ మార్చి 30

అసలు దావా నెం. 26రు 1911 సం॥

ప్రతివాదులగు విశ్వబ్రాహ్మణులు దాఖలుచేసిన గార్గేయాగమము ననుసరించి విగ్రహము చేయుటమొదలు ప్రతిష్ఠాంతమువఱకుఁ బ్రతివాదుల కధికారము గలిగి యుండుటచేతను, ఏదేవునియొక్క దేవాలయము వారుప్రతిష్ఠచేయుటచే నపవిత్రము కాకపోవుటచేతను, హిందువు లందఱితరఫున నొక్కఁడే స్వంతముగా దావావేసి ఖర్చులడుగుటచేతను, విశ్వబ్రాహ్మణులు ప్రతిష్ఠించినందున నపవిత్రతకల్గినదని రుజువు పఱచకపోవుటచేతను వాదికి వ్యతిరేకముగా దీర్మానించి కర్చులతోఁ డ్రోసివేయఁ బడెను.

6. వివిధములైన న్యాయస్థానములందు ఇయ్యఁబడిన తీర్పులు.

1. 1840 క్రీ. వె. నందారు మదాసుహైకోర్టు తీర్పు.
2. 1840 క్రీ. వె. సేలంకోర్టు నెం 1862 ,,
3. 1856 క్రీ. వె. తిరుచినాపల్లి కోర్టు ,,
4. 1857 నె 141 సేలం అదాలతుకోర్టు ,,
5. 1861 క్రీ. వె. నందారు మదాసుహైకోర్టు ,,
6 1861 క్రీ. వె. డిశెంబరు 2 తారీఖ్ను సేలంకోర్టు ,,
7. 1866 సి. సి. నెం. 583 గుంటూరు డిస్ట్రిక్టు మునసబు ,,
8. 1866 నవంబరు 12 తేదీ కృష్ణాజిల్లా ,,
9. 1866 సి. సి. నెం. 220 బెజవాడ డిస్ట్రిక్టు మునసబు ,,
10. 1866 క్రీ. వె నవంబరు 30వ తేదీ నెం 1933 ప్రభుత్వపు బ్రిధానకార్య దర్శిక పంపిన తీర్పు.
11. 1869 క్రీ. వె. డిశెంబరు 18వ తేదీ నెం 1935 కృష్ణాజిల్లా మేజస్ట్రేటుకు పోలీసు ఇన్స్పెక్టరు జనరల్ పంపిన నమూనా (order)
12. 1881 క్రీ. వె. చిత్తల్దుర్గలో మార్చి 8 తేదీ డెప్యూటీ కమీషనరగు అబ్దుల్ కాదర్గారిచే బాలాజీ మృగాచార్య దరఖాస్తుమీద నిచ్చిన తీర్పు.
13. 1885 క్యాలండరు కేసు నెం 78 విశాఖపట్టణం డిస్ట్రిక్టు మేజిస్ట్రేటగు టర్నరుగారిచే నియ్యఁబడిన తీర్పు.

14. 1891 జి. యస్. నెం కోయంబత్తూరుజిల్లా సత్యమంగలం డిస్ట్రిక్టు మునసబుచే నియ్యఁబడిన తీర్పు.

15. 1891 సి. సి. నెం 394 కొల్లెగాల్ ఫస్టుక్లాసు అసిస్టెంటు మేజిస్ట్రేటు.

16. 1892 O. S. నెం. 185 కోయంబుత్తూరుజిల్లా తీర్పు.

17. 1892 O. S. నెం. 48 కొల్లెగాల్ జిల్లా మునసబుతీర్పు.

18. 1893 డిశెంబరు 7 తేదీ ఆనరబుల్ జస్టిస్ డి. ముత్తుస్వామిఅయ్యరు కె. సి. ఐ. ఇ, ఆనరబుల్ జస్టిస్ జానత్ గారితీర్పు.

19. 1894 సి. సి. నెం. 521 కృష్ణాజిల్లా డిస్ట్రిక్ట్ మేజిస్ట్రేటగు జె. యర్. అట్కిన్సన్ గారితీర్పు.

20. 1894 ఆక్టింగ్ డిస్ట్రిక్టు మేజిస్ట్రేటగు రోజర్ గారితీర్పు.

21. 1894 సం॥ జె. యర్. అట్కిన్సన్ గారు పోలీసునకు పంపిన సమాచారము.

22. 1894 సం॥ పోలీసుచే కృష్ణా డిస్ట్రిక్టు మేజస్ట్రేటునకు పంపిన రిపోర్టు.

23. 1894–95 సి సి. నెం. 17 చెన్నపట్నము తాలూక, మైసూరుజిల్లా సెకండుక్లాసు మేజిస్ట్రేటు తీర్పు.

—విశ్వకర్మవంశీయులగు జాంగిడాబ్రాహ్మణుల నిందించినందులకు శిక్షింపఁబడుట—

1928 వ సం॥ క్రిమినల్ కేసు నెం. 120/2 ఢిల్లి ఫస్టుక్లాసు ఆనరరీమేజిస్ట్రేటు అగు ఆర్. యస్. యల్. గోపాల్‌దాసు బి. ఎ. గారి తీర్పు.

ఫిర్యాది:—గంగాసాహె కుమారుఁడగు దీనదయాల్ శర్మ, కార్యదర్శి, జాంగిడా బ్రాహ్మణ మహాసభ ఢిల్లీ.

ముద్దాయి:—హనుమాన్ దత్తజోషి.

'మార్వారి బ్రాహ్మణ' సంపాదకుఁడు, ప్రకాశకుఁడు, కలకత్తా.

ఋషియగు ఆంగీరుని పుత్రికకుమారుఁడగు విశ్వకర్మయొక్క సంతతివారమని జాంగిడలు చెప్పుదురు. ఈయిద్దఱును బ్రాహ్మణులేయని ప్రతివాదిసాక్షులచే అంగీకరింపఁబడినది. పరాశరుఁడు వ్యాసుఁడు బ్రాహ్మణులయిన విధముననే బ్రాహ్మణునకు, బ్రాహ్మణేతరస్త్రీకిని జన్మించినబిడ్డ, తల్లి హీనజాతిస్త్రీ అయినను, బ్రాహ్మణజాతికి జెందియుండును. అందుచే ఖేటీలు విశ్వకర్మకు మఱియొకజాతి స్త్రీకిని పుట్టినవారైనను బ్రాహ్మణులే. ప్రతివాది సాక్షులు జేటీ అనిచెప్పిన పంచాల బ్రాహ్మణులను అయిదు కులములలో నొకఁడు.

మహాభారతములో జంగల్ దేశమను ప్రదేశమున్నది. బ్రాహ్మణులలో వివిధములైన శాఖానామములు వారివారి జన్మస్థానములనుబట్టి ఏర్పడ్డవని ప్రతివాదిసాక్షులే ఒప్పుకొనిరి. అందుచే జంగల్ దేశములోని బ్రాహ్మణులను జంగల్ బ్రాహ్మణులనుట సమంజసమైనది. భితాసీ వాస్తవ్యుడైన పండిత సీతారామ్ 'ల' అనునది 'డ' గా మారినను దానిననుసరించి 'జంగల్' అను మాటను'జంగిడ్'అని మార్చవచ్చుననెను. ఈయభిప్రాయమునే పండిత పరశురామశాస్త్రి 'బ్రాహ్మణవంశేతి నృత్తమ్' అను తనగ్రంథములో సూచించియున్నాడు. హిందూదేశములోని 46 గురు గొప్ప పండితులచే జాంగిడులు బ్రాహ్మణులని ఒప్పుకొనుచు దస్కత్తులుచేసిన పత్రము ప్రతివాదిచే మోసపూరితమైనదని ఎదుర్కొనఁబడెను. ప్రతివాదిచే నిది మోసమని నిరూపింపఁబడలేదు. దస్కత్తులుచేసిన పండితులలో నొకరగు వామ్‌చరణ్ భట్టాచార్యులు ఆపత్రము చదివియు తన మనస్సును దానిలోని విషయమునందు లగ్నపరచక యితర పండితులు దస్కత్తులుచేసిరని తానుగూడ దస్కత్తుజేసితినని కాశీలో విచారణ చేయ వాఙ్మూలమిచ్చెను. దీనివల్ల ఆపత్రము మోసముతో తేఁబడినది కాదని అర్థమగుచున్నది. కాశీలో దస్కత్తుదారులమీద ఏదైన మోసముచేయఁబడినదానిని కనుగొనుటకు ఒకసంఘము నిర్మింపఁబడినది. కాశీలో 8 మంది దస్కత్తుదారులున్నప్పటికి ఒక్కరును నిర్ధారణపరచుటకు ముందుకురాలేదు.

మఱియు నీపత్రముయొక్క ఉద్దేశమునే బలపరచుచున్న, దాదాపు 450 సం॥ క్రిందటిది, భాలోల్‌లోఫి కాలమునాఁటిదైన మరియొకశాసనము ఇందులోని భారతధర్మమహామండల అనుపేరుగల కాశీలోని పండితబృందముచే జాంగిడులు ఉత్తమకులము వారమనియు, జాంగిడవంశములో 'సతి' (సహగమనము) వాడుకగానుండెననియు తెలుపఁబడియున్నది. 'సతి' (సహగమనము)శూద్రులలోలేదు. అందుచే జాంగిడులు నిజముగా ఉత్తమకులజులనియు, ద్విజాతులలో నొకరనియుఁ దెలియుచున్నది. సుమారు 40 సం॥ క్రిందటి వ్రాఁతపత్రములలో (P.W.C. & P.W.E.) జాంగిడ బ్రాహ్మణుఁడని చెప్పబడినది. 40 సం॥ క్రిందటకూడ జాంగిడులు బ్రాహ్మణులమని వాదించియున్నట్లుకనఁబడును. మరియు బికనీరు సంస్థానములో నియ్యఁబడిన తీర్పొకటి కలదు. జాంగిడులు వృత్తిచే ఖేటీలని పిలువఁబడిరి. కాని వారు బ్రాహ్మణులేయనియు, బ్రాహ్మణులకియ్యఁబడినసమత్వమునే వీరికికూడయియ్యబడెననియు ఆతీర్పునందు విశదమగును. కాశీ విశ్వవిద్యాలయమునకు ప్రిన్సిపాలును, గొప్ప సంస్కృతపండితుడును నాలుగు వేదములను అనువదించిన టి. హెచ్ గ్రిఫిత్ అధర్వవేదములోని 'అంగిరసి జాంగిడ', అను సమాసమును 'అంగిర! నీవు జాంగిడవ'ని అనువదించెను. జాంగిడ

అంగిర ఋషియొక్క మరియొక పేరని తెల్లమగును. మరియు అంగిరఋషి సంతతి మారుపేరు 'జాంగిడ' పెట్టుకొని యుండురనుట మిక్కిలి వాస్తవమైయుండును

నేను అందుచే జాంగిడ బ్రాహ్మణజాతి అని నమ్ముచున్నాను. ఈజాతి కొంత కాలము మరువఁబడియుండవచ్చును. వారి వృత్తినిబట్టి జనులు వారిని ఖేటీలని పిలువ నారంభించియుందురు. ఖేటీ అను పదము వృత్తిని సూచించును కాని కులమును సూచించదు.

ఈకేసును తీర్మానించుటకు జాంగిడులు బ్రాహ్మణులా, అనునది అవసరమైనది కాదని అదివరకే చూపియున్నాను. ఇప్పుడు ముఖ్యాంశమేమనఁగా ముద్దాయి తన వ్యాసములలో చూపినవాదములు న్యాయసమ్మతములా అనునది. అట్టివ్రాఁత ప్రజోప యోగమునకో లేక ఇతర బ్రాహ్మణుల ఉపయోగమునకో ప్రతివాదియే నిరూపించ వలసియున్నది. బ్రాహ్మణులలో అంతశ్శాఖా వివాహములు గావించు నలవాటు లేదు. కకు అయినచో ఒకబ్రాహ్మణుఁడు మరియొక బ్రాహ్మణునిచే పచనముచేయఁ బడిన పదార్థమును తీసికొనఁడు. ప్రతివాది సాక్షులు జాంగిడులచే వండబడిన 'పక్కి' అన్నమును తిందుమని ఒప్పుకొనిరి. అప్పుడు జాంగిడులు బ్రాహ్మణులేకారని ప్రచు రించుటలో నేమి న్యాయసమ్మతమున్నది? ద్వేషభావముతో, జాంగిడులను, వాదిని జాంగిడ 'మహాసభ' ఢిల్లీని ప్రజాదృష్టిలో నీచముగా కనపర్చుటకు సమకట్టిన, పెక్కు సార్లు ప్రచురించిన ప్రతివాదియొక్క యీవాదమువల్ల బ్రాహ్మణజాతి యేలాభమును పొందును? 'శూద్ర' అను పదమును వ్యాసములలో అసూయాభావముతో నుప యోగింపఁబడ్డది. ఇది న్యాయముకాదు. ప్రతివాదికి రు 200-0-0 లు జరిమానా గాని లేక రెండుమాసములు శిక్ష గాని విధించఁబడినది.

---

శ్లో॥ విశ్వకర్మబ్రాహ్మణానాం । వంశాగమకృతావితి
ఖ్యాతశ్శాసనకాండోఽయం । సంగృహీతో యథోచితమ్॥

---

గ్రంథాంత ప్రార్థనము.

శ్లో॥ శ్రీవిశ్వబ్రాహ్మణాభిఖ్య వంశదుగ్ధపయోనిధౌ
సానగశ్శైర్గోత్రభరా వర్ధిష్ణువంశవీచికా॥

జాతస్తస్యాం భద్రశర్మా భద్రకీర్తిర్మహాతపాః
సవేదాఖిలవిజ్ఞాన సారస్వత విశారదః॥

తస్యాత్మజాతః ప్రథమః శ్రీశైలాచార్యసత్తమః
వీరాంబయా ధర్మపత్న్యా గార్హస్థ్యంసోఽనయద్ర్వతీ॥
తయోస్సంతానఫలిత మాసీత్సుబ్బార్యధీమణిః
సగానవిద్యావిభవో భగవద్భక్తిభాజనః॥
లక్ష్మీదేవ్యాం ససుషువే పుత్రౌ కోటీశ్వరాహ్వయౌ
తయోర్జ్యేష్ఠస్సకోటీశో వైదికాచారకర్మఠః॥
వాస్తుశాస్త్రక్రియాభిజ్ఞో విజ్ఞానాంబుధిపారగః
భద్రాంబికాప్రాణనాథ స్సఏవ జనకోమమ॥
యోవీరబ్రహ్మపాదాబ్జ మిళిందాయతమానసః
శ్రౌతస్మార్తవిధానజ్ఞ స్సత్కావ్యరచనాచణః॥
వేదశాస్త్రపురాణాది ష్వతివిశ్వాసభావనః
సనిరంజనశాస్త్రీతి కథితోఽహం విచక్షణైః॥
కృత్వావిమర్శనం సాధ్యాన్ వేదశాస్త్రాదికాన్ బహూన్
పూర్వసూరికృతాన్ గ్రంథా ననుసృత్య మహత్తరాన్॥
విశ్వకర్మబ్రాహ్మణానాం వంశాగమకృతిః ప్రియా
ఇత్థంమయాసమాప్తాఽఽసీ దుదాహరణపూర్వకమ్॥
శ్రీముఖేఫాల్గునాసాంతే కైరిస్తవేఽబ్ధ్యగ్నికైందవే
అభేదదృష్ట్యా సంవీక్ష్య సారమాకృష్య సర్వతః॥
గుణానేవానుగృహ్ణంతు పండితాః పారదర్శినః॥

మంగళము.

శ్లో॥ మంగళం దత్తవిశ్వైక శర్మణే విశ్వకర్మణే
మన్వాది పంచధాతృభ్యో విశ్వకృద్భ్యోఽస్తు మంగళమ్॥
ఋషిభ్యో సానగాదిభ్య ఋభుభ్యశ్చ సుమంగళమ్
వారితేంద్రానుతాపాయ విశ్వరూపాయ మంగళమ్॥
విశ్వకర్మబ్రాహ్మణేభ్య స్సర్వేభ్యో మంగళం మహత్
అశేషభారతీయాభ్యః ప్రజాభ్యో భవ్యమంగళమ్॥

సంత్వాసించామియజుషా ప్రజామాయుర్ధనంచ.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

విశ్వకర్మబ్రాహ్మణ వంశాగమము.

సంపూర్ణము.

---

# తప్పొప్పుల పట్టిక.



| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧ | 23 | పటూాణ | సుపటూాన్ |
| ౫ | 15 | ఇచ్చ | ఇచ్ఛ |
| ౬ | 18 | యేవిశ్వ | యోవిశ్వ |
| ౮ | 9 | సమ్వగ్ఞాతం | సమ్యగ్జ్ఞాతం |
| ౧౨ | 25 | దిశాంమ్పతి | దిశామ్పతి |
| ౧౩ | 13 | చోలనాది | చాలనాది |
| ౧౫ | 25 | క్లిప్తో | క్లృప్తో |
| ౧౬ | 6 | క్లుప్తః | క్లృప్తః |
| ౧౮ | 4 | హ సింద్రి | హ సీంద్రి |
| ౨౩ | 27 | అభిషేచ | అభిషిషేచ |
| ౨౭ | 18 | యజ్షే | యజ్ఞే |
| ౨౮ | 11 | బు గ్వారు | బుర్వగ్వారు |
| ,, | 25 | ద్ల | ద్లి |
| ౩౦ | 14 | మహత్మనః | మహాత్మనః |
| ౩౧ | 3 | పతీహ్యాసీ | పతిర్వ్యాసీ |
| ,, | 13 | జజే | జజ్ఞే |
| ౩౫ | 15 | బఃడినవి | బడినవి |
| ౩౮ | 12 | మరిచ్యాది | మరీచ్యాది |
| ౪౨ | 27 | యుత్సత్తి | యుత్పత్తి |
| ౪౩ | 23 | రహస్త్రై | రహస్తై |
| ౪౪ | 12 | బ్రజాపతేః | ప్రజాపతేః |
| ౪౫ | 13 | వైశాఘ | వైశాఖ |
| ౫౧ | 29 | జగత్కార | జగత్కర్త |
| ౫౨ | 20 | సరంపర | పరంపర |
| ,, | 24 | రక్ష్యే | వక్ష్యే |
| ౫౪ | 5 | మహాత్మ్య | మాహాత్మ్య |
| ౫౮ | 18 | నిబ్బృతి | నిర్వృతి |
| ౫౯ | 14 | నిబుబుతి | నిర్వృతి |
| ౬౦ | 11 | మండ | మండప |
| ౬౧ | 20 | నంట్లుది | నందిట్లు |
| ౬౨ | 23 | పీదీ | పీధీ |

| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౬౩ | 16 | మాహాల్త్మ్యము | మాహాత్మ్యము |
| ౬౭ | 27 | కృసింప | కృశింప |
| ౭౩ | 10 | జ్గానం | జ్ఞానం |
| ౯౮ | 24 | ప్రసహన్ | ప్రహసన్ |
| ౧౦౪ | 7 | మశ్వాం | మశ్వా |
| ౧౦౭ | 9 | దాగ | దాగలి |
| ౧౧౧ | 27 | పాప | పాద |
| ౧౧౨ | 9 | మేదశ్చే | మేదశ్చై |
| ,, | 24 | తిష్ఠతి | తిష్ఠంతి |
| ౧౧౪ | 20 | చ్చాదనా | చ్ఛాదనా |
| ౧౧౫ | 2 | అట్లు | అట్లు |
| ౧౧౬ | 19 | నక్ష | నక్షత్ర |
| ౧౧౭ | 10 | సంపస్నాం | సంపన్నాం |
| ౧౨౧ | 14 | నిష్ట | నిష్టక |
| ౧౨౬ | 24 | సహస్త్ర | సహస్రి |
| ౧౨౯ | 6 | రాధాతో | రాగతో |
| ౧౩౫ | 18 | వ్రిజ | వ్రజ |
| ౧౩౮ | 13 | వతంసముడు | వతంసము |
| ౧౪౨ | 1 | యజా | యజ్ఞా |
| ౧౪౩ | 2 | భవంతైవ | భవంత్యైవ |
| ౧౪౫ | 12 | దీనా | ధీనా |
| ౧౪౭ | 3 | అట్టి | అట్లు |
| ౧౬౬ | 18 | నారాశంసి | నారాశంస |
| ౧౭౮ | 26 | సస్కారము | సంస్కారము |
| ౧౮౩ | 18 | శిల్బ | శిల్ప |
| ౧౮౪ | 29 | న్మత్ర | న్మంత్రి |
| ,, | | మేకస్యా | మేకయా |
| ౧౮౯ | 20 | శిల్పిదాః | శిల్పిందాః |
| ౧౯౧ | 8 | పత్యం | పత్యంచ |
| ౧౯౮ | 10 | స్సందర్శ | న్సందర్శ |
| ౨౦౦ | 8 | లోయా | లోనా |

| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౨౦౬ | 5 | యదార | యథార |
| ౨౦౭ | 6 | బృహాన్పతి | బృహాస్పతి |
| ౨౦౯ | 2 | మొసగుఁ | మొసఁగు |
| ౨౧౭ | 20 | ధర్వ్యాణు | ధర్వాణు |
| ౨౧౯ | 13 | చందస్సు | ఛందస్సు |
| ౨౩౪ | 22 | జ్యోతిష | జ్యౌతిష |
| ౨౩౯ | 15 | ఆప నంబ | ఆప సంబ |
| ౨౫౩ | 25 | తంతువాయం | తంతువాయః |
| ౨౫౪ | 1 | కృమిః | క్రిమిః |
| ౨౫౬ | 7 | అస్తోత్రము | ఆస్తోత్రము |
| ,, | 22 | మహో | మహా |
| ౨౬౫ | 15 | సతుష్ట | సంతుష్ట |
| ౨౬౯ | 10 | మిత | మితి |
| ౨౭౦ | 11 | పవిత్రి | పవిత్ర |
| ,, | 27 | కదర్యాజాములు | కదర్యాదులు |
| ,, | 30 | పర్యా | పర్యాయము |
| ౨౯౨ | 4 | విశ్మ | విశ్వ |
| ౨౯౨ | 19 | బ్రహ్మణ | బ్రాహ్మణ |
| ౨౯౩ | 4 | అధర్వణ | ఆధర్వణ |
| ,, | 6 | ధర్వణః | ధర్వణాః |
| ౨౯౫ | 6 | వైశ్య | వైశ్వ |
| ౨౯౬ | 23 | సమిధా | సమిదా |
| ౩౧౯ | 6 | శమిభిః | శమీభిః |
| ౩౨౫ | 6 | బురోదాశ | బురోడాశ |
| , | 16 | వశ్య | వంశ్య |
| ,, | 26 | స్సుచితాః | స్సుతాః |
| ౩౨౭ | 7 | విద్విధ | ద్వివిధ |
| ౩౨౯ | 29 | గల్పిచింన | గల్పించిన |
| ౩౩౧ | 11 | సత్య | సత్వ |

☞ కొన్ని యెడల 'థ, ధ' లను 'ఠ ట' ఒత్తులును, పరుషసరళములును వ్యత్యస ములైనవి. ఇంకను గొన్ని తప్పులు గలవు. చదు వరులు తెలిసికొనఁ బ్రార్థితులు.



రామకృష్ణ ప్రింటింగు వర్క్సు, తెనాలి.

పలయువారు:—

విశ్వకర్మబ్రాహ్మణవంశాగమ

కార్యాలయము,

దుగ్గిరాల.

(గుంటూరు జిల్లా)

అని వ్రాయవలెను.